40

# నారాయణభట్టు

చారిత్రక నవల

కవి సమ్రాట్
నోరి నరసింహ శాస్త్రి

జయంతి పబ్లికేషన్సు
కారల్‌మార్క్సు రోడ్. విజయవాడ-2

# NARAYANA BHATTU

By

NORI NARASIMHA SASTRY

JAYANTI PUBLICATIONS
Vijayawada-520 002.

Edition :
OCTOBER 1986

PRICE :
Rs. 22-00

SRI ANNAPURNA PRINTING PRESS
Vijayawada-2.

* ఒక ఎడిషను—కాలపరిమితి అక్టోబరు 1989 వరకు.

"హారీతగోత్రీ హరిమూర్తి రాపస్తంబద్విజశ్రేష్ఠవిధు ర్వినీతః."

"యః సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషా సు
కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన."

"కవీన్ మనీషాలవదుర్విదగ్ధాన్ మనోహరాభి ర్నిజసూక్తిభిర్యః
కుర్వన్నగర్వాన్ పటుభి ర్బిభర్తి కవీభవజ్రాంకుశనామ సార్థమ్."

"పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు, నా
రాయణునట్లు, వామనధరామరవంశవిభూషణుండు, నా
రాయణభట్టు, వాఙ్మయధురంధరుఁడున్, దన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్."

నన్నయభట్టు

# పీ ఠి క

అనాదిగా ఈ పవిత్రభూమిలో భారతధర్మము పాదుకొనియున్నది. దాని నెన్నియో కాలవాయువులు పెకలింప యత్నించినవి. అయినను నేటికి నది నిశ్చలముగా నిలిచియున్నది. అది ఇతరుల కంట బడకుండ ఏదో గుహాగహ్వరములలో అజ్ఞాతముగా మాటువడియుండి ప్రాణరక్ష గావించు కొన్న నిరుపయోగవృక్షము కాదు. పర్వతశిఖరముపై ఆత్మబలముచే నిర్భయముగా నిలిచి ప్రతికూలవాతములను ప్రతిఘటించి తన దివ్యవాసనలు దూరభూములకు వెదజల్లిన అమరతరువు!

ఆ కల్పకమునకు దోహద మొనర్చిన మహానుభావులు మనకు నిత్యస్మరణీయులు. అట్టివారి చరిత్ర లెన్నిమారులు విన్నను విసువు పుట్టింపవు. చరిత్రరచనపరమావధి యట్టి పుణ్యపురుషుల గుణాను కీర్తనమే. ఆ యాశయముతోడనే శ్రీమద్రామాయణ మహాభారతములును, పురాణములును పూర్వకవులు రచించినారు.

ఇప్పటికి 900 సంవత్సరముల క్రిందట తెలుగుదేశములో రాజమహేంద్రపురములో అట్లు స్మరింపదగిన ముప్వురు పవిత్ర మూర్తులు వెలసిరి. నారాయణభట్టు, నన్నయభట్టు, రాజరాజనరేంద్రుడు— 'కలికాలజదోషతుషారసంహతిని దుప్పగ జోపిన' తేజోమూర్తులు వారు! వారు మార్గదర్శకులుగా నుండుటచేతనే ఆంధ్రవాణికి ఇతర దేశభాషలకు లేని విశిష్టప్రభావ మేర్పడినది. ఆంధ్రభాషాసంస్కృతుల విశిష్టత సంపూర్ణముగా గ్రహించినప్పుడే నేటి స్వతంత్రభారతము స్వరూపమును పొందగలదు.

మహాభారతాంధ్రీకరణము ఒక్క ఆంధ్రుల చరిత్రలోనే కాక, భారతీయచరిత్రలోనే ప్రధానఘట్టము. దూరమున ఒకానొక విదేశరాజు భరత భూమిని కొల్లగొట్టుటకు వచ్చియుండెను. మధ్యదేశము దాక్షిణాత్యులతో చెలిమిచేసి అఖండభారతమును నిర్మింప యత్నించినది. మహాభారతము

అఖండభారతమును చిత్రించెను. మహాభారతమువలెనే భారతధర్మముకూడ విశ్వజనీనము. అది మనస్సులో నుంచుకొని బహుకాలము మననచేయగా ఈ నవల భాసించినది. ఇందలి సుగుణములన్నియు ఆ ముర్వురు మహనీయుల కథాస్మరణచే కలిగినవి. ఇందలి దోషము లన్నియు నా శక్తి లోపముచే చొచ్చినవి.

నాకు సాధ్యమయినంతవరకు ఆ కాలపు చరిత్ర సంపాదించితిని. అందులో కృషిచేసిన పలువుర వ్యాసములు చదివితిని. ముఖ్యముగా ఆంధ్రుల చరిత్రయు, రాజరాజనరేంద్రపట్టాభిషేక సంచికయు నామూలాగ్రముగ పఠించితిని. ఆంధ్రభారత రచననాటి ఉజ్జ్వలచరిత్ర ఈ నవలలో చిత్రింప నెంచితిని. ప్రధానపాత్రలే కాక పలువురు ఇతర పాత్రలుకూడ ఆ కాలములో నిశ్చయముగా నున్నవారే. ఆనాటి చరిత్ర భాసించునంత వరకుమాత్రము ఇది సత్యదూరము కా దని నా విశ్వాసము.

ఆంధ్ర వారపత్రికలో ఇది ప్రథమమున ప్రచురింపబడిననాటినుండి పలువురు పండితులును, సహృదయులును దీనిపై చూపుచు వచ్చిన యాదరమునకు నేను కృతజ్ఞుడను. నందమపూడి శాసనకాలమే ఈ కథాకాలము. అది విజయనామ సంవత్సరము. 901 సంవత్సరములైనది. ఆ దినముల పంచాంగము గుణించి యిచ్చిన మా మిత్రులు దైవజ్ఞసార్వభౌమ, వేదార్థ ప్రవీణ బ్రహ్మశ్రీ చివుకుల వేంకటరమణ శాస్త్రిగారికి నా నమస్కృతులు.

ఇక ఆంధ్రపత్రికాధిపులగు శ్రీ శివలెంక శంభుప్రసాద్‌గారు ముందు ఆంధ్రవారపత్రికయందును, తర్వాత పుస్తకరూపమునను దీనిని వారే ప్రకటించిరి. నాకును వారికిని గలిగిన మైత్రికి నారాయణభట్టు చిహ్నమై వెలసినది. వారికెంతయు నేను కృతజ్ఞుడను.

ఈ నవలను ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, భారతి, త్రిలింగ, కిన్నెర, జాగృతి, హిందూ— ఇత్యాది ప్రసిద్ధపత్రిక లన్నియు ఆదరముతో సమీక్ష చేసినవి. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు, శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు, శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, శ్రీ మోటుపల్లి రామా

సుజరావు నాయుడుగారు, శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు– ఇత్యాదులగు పెద్దలు ఎందరో సదభిప్రాయము లొసంగి ఆదరించినారు. తెలుగు భాషా సమితివారు 1950లో ఉత్తమనవల కిచ్చిన బహూకృతి దీనికి ప్రసాదించినారు. ఆంధ్ర, మదరాసు, హైదరాబాదు, ఉత్కళ విశ్వకళాపరిషత్తులు దీనిని పాఠ్యగ్రంథముగా నిర్ణయించి అభిమానము చూపినవి.

ఈ నవలను సంక్షిప్తమొనర్చి ఈయగా ది ఓరియంటు పబ్లిషింగు కంపెనీ తెనాలి ప్రొప్రయిటరు శ్రీ ములుగు సుబ్రహ్మణ్యశర్మగారు ప్రకటించిరి. అది ప్రస్తుతము ఆంధ్ర, మదరాసు, హైదరాబాదులలో స్కూలు ఫైనలు విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడి పఠింపబడుచున్నది. అది చదివినవారు ఈ సంపూర్ణగ్రంథమును చదువ నుత్సహింతురని నా విశ్వాసము.

ఇందరి ఆదరాభిమానము లుండుటచే రెండవ ముద్రణము చేయవలసివచ్చినది. దీనియం దభిమానము చూపిన పెద్దలకును, పత్రికలకును, సంస్థలకును, పాఠకులకును కృతజ్ఞుడను.

భారత ధర్మాభిమానులగు సహృదయులకు పరస్పరము తెలిసికొనుటకు ఈ నారాయణభట్టు ఏ మాత్రము సహాయ మొనర్చినను నేను కృతార్థుడను!

రేపల్లె
16–12–54

నోరి నరసింహశాస్త్రి

# నారాయణభట్టు

ఆనాడు రాజమహేంద్రపురము మహాకోలాహలముగా నుండెను. విద్యార్థులకు ఆటవిడుపు. సామాన్యోద్యోగులకు సెలవు. క్రీడాకుశలురకు తమ నేర్పు ప్రదర్శించుటకు సమయము. ఈక్రీడావినోదము లీ విధముగా వారము దినములు నడచును. ఇప్పటి కైదు సంవత్సరముల క్రిందట రాజ రాజనరేంద్రుడు నిజప్రతాపముచే వేంగీరాజ్యముమీద దండెత్తివచ్చిన కర్ణాటకసైన్యములను పారదోలెను. మరియు నప్పుడే కర్ణాటకుల మిత్రమై వచ్చిన తన సవతి సోదరుడగు విజయాదిత్యుని కేవలవాత్సల్యముచే తన వశ మొనర్చుకొనెను ఈ విజయద్వంద్వజ్ఞాపకార్థము ఏటేట నిట్టి ఉత్సవములు చైత్రశుద్ధ దశమినుండి జరుగుచుండెను. ఈ విజయనామ సంవత్సర నిజచైత్రమాసమున మరింత వైభవముతో జరుపుట కాయత్త పరచిరి.

ఈ ఉత్సవములు తిలకించుటకు వేంగీరాజ్యము నాలుగుమూలల నుండియే కాక యుత్తర భాగములనుండియు రాజపుత్రులును, వీరులును, సంపన్నులును విచ్చేసిరి. వారి విడుదలకై రాజమహేంద్రపురములోని మందిరములు చాలక పురము వెలుపల ధవళగిరి వరకు ననేక పటకుటీరములు నిర్మించిరి. సమర్థులగు శిల్పులా భాగమును రమ్యముగను వాసయోగ్యముగను కల్పించిరి.

చుట్టుప్రక్కల జనపదములనుండి నగరమునకు మూగిన జనసమూహము అసంఖ్యాకముగా నున్నది. ఆ పట్టణములో రథగజాశ్వాదులు స్వేచ్ఛగా విహరించు విశాలమైన రాజమార్గమే, ఈనాడు జనులతో క్రిక్కిరిసి యందు మనుష్యులు నడచుటగూడ కష్టసాధ్యముగా నున్నది.

కాని ఎట్లో ఒకచోట నవకాశము చేసికొని ఐంద్రజాలికు డొకడు తన విద్యా మహిమ చూపుచుండెను. అతడప్పుడే ఒక మామిడిటెంక నాటి వెంటనే మొక్క మొలిపించి, మరియొక త్రుటిలో పెంచి, పరక్షణములో

కాయలుకాయించి, అందరకు కాయలు పంచసాగెను. ఆ కాయలు రుచి చూడగా నవి కొందరికి తీయగను, కొందరికి పుల్లగను, మరికొందరకు చేదుగను ఉన్నవి. వారి స్వభావములనుబట్టి రుచి మారునని ప్రేక్షకులకు నిరూపించి యతడు వినోదము కలిగించుచుండెను.

మహారాజు నంగరక్షకులలో నొకడగు రాజమయ్య అటుపోవుచు అది చూచి,ఏమని విచారించి ఒక మామిడిముక్క రుచిచూచెను. అదిః టిక చేదుగా ఉండగా ముఖము చిట్లించి ఉమిసి మారుమాటాడక తలవంచు కొని వెడలిపోయెను. అతడు దూరము పోవు వరకు నూరకుండి ఇంద్ర జాలికుడు రాజమయ్యను అనుకరించుచు ముఖము అసహ్యముగా చిట్లించి అందర నవ్వించెను.

మరియొక ప్రదేశములో దొమ్మరులు డోలువేయుచు గడఎక్కి చిత్రచిత్రములగు మొగ్గలు వేసి చూపర కాశ్చర్యము కలిగించుచుండిరి. నవయౌవనము తొణికెసలాడుచున్న ఒకానొక దొమ్మరి పడుచు చూచు చూపులతోను పలుకు పలుకులతోడను చేరినవారి మనస్సులను మొగ్గలు వేయించుచుండెను.

నాగరా జొకడు గంతులుచేయుచు బుద్ధజాతక కథ గాథగా పాడుచు చెప్పుచుండెను. అది వినుటకు పేదలందరు త్రోపులాడుకొనుచుండిరి.

ఇంకొకయెడ పండితవేషముతో సుఖాసీనుడై ఒకానొకడు నాథపురాణము కొంత వచనముగా, కొంత పాటగా, కొంత పద్యముగా చెప్పుచుండెను. అది వినుటకు మిక్కిలి ఇంపుగా నుండెను.

అశేషజనమును హేళనచేయుచు పగటి భాగవతులు పలు వేషములతో పట్టణమన్నిదిక్కుల సంచరించుచుండిరి. వారిలో నొకడు రాజమయ్యను చూచి సమీపించి "నీదెంత చక్కని ముఖమయ్యా!"అని స్తోత్రము చేయనారంభించెను. స్వభావసిద్ధముగా వికృతమైన చూపులుగల యా యంగరక్షకుడు మరింత వికృతముగా నాతనివంక తేరిచూచి క్రీడాద్వీపము వైపునకు శీఘ్రగతి నేగెను.

ఆ పట్టణములో నన్ని వినోదములు జరుగుచున్నను, ఒక్క ప్రక్క మున్నెన్నడు కని విని యెరుగని గొప్ప సంత సాగుచున్నను, ఆ బాలగోపాలమైన జనములో అధిక సంఖ్యాకులు క్రీడాద్వీపమును గోదావరిలంతకే ఉత్కంఠతో బోవుచుండిరి. ఆ ద్వీపము ధవళగిరి కెదురుగా గోదావరిలో పట్టణసమీపములో నున్నది. ఆ మధ్యనున్న గోదావరిపాయ అంత పెద్దదికాదు. ధనవంతులు, రాజబంధువులు, రాజోద్యోగులు నెవరి నావలమీద వారు ఆ పాయ తరించుచుండిరి. ఆ నావలు మనోజ్ఞమైన పెద్ద హంసలవలె గోదావరి నిండి కన్నులపండువుగా నుండెను. పేదలు మాత్రము నావలతో తాత్కాలికముగా కట్టిన వారధిమీద పాదచారులై యా ద్వీపము చేరుచుండిరి. రాజయ్యయు నట్లే వెళ్ళుచుండెను. ఎవరో ఒక నూతన పురుషుడతనిని ఛాయవలె అనుగమించుచుండెను. కాని యది యాతడు క్రీడా ద్వీపము చేరిన పిమ్మటగాని గమనించలేదు. అప్పుడు వెనుదిరిగి చూడగా నా ఛాయా పురుషుడు జనములో కలసి యదృశ్యుడయ్యెను.

ఈ ద్వీపమును ఈ ఉత్సవకాలములో తప్ప ఇతరవేళల ప్రత్యేకానుమతి లేనిది ఎవ్వరును ప్రవేశింపరాదు ఇచ్చటనే రాజపురుషులు, భటులు రణవిద్య నభ్యసింతురు. నానావిధ శస్త్రప్రయోగమందు చూడనగును. ఖడ్గయుద్ధములు, బాణ ప్రయోగములు, శక్తిశూలకుంతపాతములు ప్రవర్తిల్లును. మల్లయుద్ధములు జరుగును. పురాణకాలమునుండి కూడ ఆంధ్రమల్లులే అగ్రగణ్యులై భరతభూమికి మల్లాచార్యులు. వారిని జయించు నాశతో అటు పాంచాలమునుండియు నిటు కేరళము నుండియు మల్లులు వచ్చిరి. అశ్వారోహణచాతుర్యము గజవిద్యా ప్రదర్శనము కానవచ్చును. మధ్య మధ్య సామాన్యజన వినోదార్థము పొట్టేళ్లను, కోళ్లను, దేగలను గూడ పోట్లాడింతురు.

ఈ క్రీడా ప్రదర్శనమునకు అర్ధచంద్రాకారముగ రమ్యమైన రంగస్థలమొకటి నిర్మించిరి. దానిని అనేక వర్ణములు కల ధ్వజసమూహముతో నలంకరించిరి. ఒక్కొక్క సామంతకులమునకు ఒక్కొక్క విధమైన

ధ్వజముండెను. అట్లే ఒక్కొక్క శ్రేణికి ఒక్కొక్క ధ్వజము. కాని అన్ని ధ్వజములకంటె నున్నతమై కాంతిమంతమై ఇతర ధ్వజప్రభలు తమలో జీర్ణము చేసికొనుచు చాళుక్యరాజుల వరాహధ్వజములు ఎగురుచుండెను.

ఆ రంగస్థలములో జరుగు క్రీడలన్నియు నన్ని జాతులవారలును విశదముగా చూచుట కనువుగా సిద్ధపరచిరి. శ్రేణికి శ్రేణికి బాధ రాకుండా, ఎవరి కుల ధర్మములకును ఆటంకము రాకుండ స్థానములు ప్రత్యేకముగా నుండెను. అంతటను రాజభటులు ప్రజలయందు ఆదరగౌరవములు చూపుచు రాజశాసనములు పాలించుచుండిరి.

ఒక ప్రక్కను రాజబంధువులకును, ఉన్నతోద్యోగులకును పీఠములు వేరుగా చిన్న తిప్పమీద వేసిరి. ప్రధానస్థానములో రాజరాజనరేంద్రునికి నవరత్న ఖచ్చితమైన సింహాసన ముండెను. ఆ యాసనముల ప్రక్కనే రాణివాస స్త్రీలకు అంతఃపురమర్యాదలకు లోపము లేకుండ క్రీడావలోకనమునకు ఏర్పాట్లు చేసిరి.

రాజరాజు నావ ఆవలియొడ్డున బయలుదేరిన దనువార్త జనసమూహమునందంతటను ఒక్కసారి మందమారుతమువలె ప్రసరించెను. వెంటనే చేరినవారి దృష్టులన్నియు రాజనావపైపు మరలెను. మంగళారవములు మిన్నుముట్టెను.

రాజనావ మయూరాకృ కలది. అందు మధ్యభాగములో దేదీప్యమానమైన మందిర మున్నది. అందులో రాజరాజనరేంద్రుడు కేవలవీరావతారుడై విలాసముగా నిషణ్ణుడయ్యెను. ఆతని దక్షిణపార్శ్వమున యువరాజు రాజేంద్ర దేవుడును వామపార్శ్వమున సవతితమ్ముడగు విజయాదిత్యుడును నుండిరి. నావికులు మనోజ్ఞ వర్ణములుగల కొలలు వేయుచుండగా ఆ నావ మంజుల నాదముతో జలతరంగములపై నృత్యముచేయుచున్నట్లు ముందుకు నడచుచు పింఛము విప్పి నటించుచు క్రేంకారముచేయు నీలకంఠము ననుకరించుచుండెను. రాజరాజు నాసనముపై నున్న ఛత్రమును ఆరు శిరస్సులతో నిపుణముగా శిల్పి రచించెను. అందున్న రాజరాజనరేం

ద్రుడు సాక్షాత్తుగా కుమారస్వామివలె కనుపట్టుచు కవీశ్వరులకు "కుమార విద్యాధరుడీ యుత్తమ చాళుక్య" డనిపించుచుండెను. ఆ నావ కూపక స్తంభము మీద నెత్తియున్న వరాహధ్వజము కుమారస్వామి ధరించు శక్తివలె తన శోభలు దశదిశా వ్యాప్తము చేయుచుండెను.

రాజనావకు ముందు బల్లకూర్పు చేసిన చిన్న నావ ఒకటి దారి చూపుచుండెను. అందులో ముఖమందిర భాగమున నర్తకి యొకతె మహారాజుకు అభిముఖమై శ్రీ మహాభారతములోని "కుమారాస్త్రవిద్యా ప్రదర్శన"ఘట్టము అభినయించు చున్నది. ఆ నావ రాజనావకు దారితీయుచు వెనుక వెనుకకు నడచుచుండెను.

రాజనావ నిర్ణీత ప్రదేశము చేరగానే కుమారునియు, తమ్మునియు కైదండలతో రాజనీపితో రాజరాజు నిలుచుండెను. నర్తనము చేయుచున్న నర్తకి నాట్యము పరిసమాప్తిచేసి వెలిగించిన కర్పూరహారతి అందుకొని ఇతరకన్యకలను గూడి మంగళహారతి పాడి రాజరాజు ముఖమునెదుట త్రివారము విలాసలాస్యముతో పరిభ్రమింపజేసి కన్నుల కద్ది వంగి ప్రక్కకు తొలగినది.

సభాసదులు .నిలుచుండిరి. బిరుదావళులన్నియు పెద్దయెలుంగున ఘోషించుచు వంది కైవారము చేసినాడు. మాగధుడు చాళుక్య రాజుల పవిత్రవంశ చరిత్రను—

"శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో:
నాభీపంకరుహా ద్బభూవ జగత స్స్రష్టా స్వయంభూ స్తతః
జజ్ఞే మానససూను రత్రి రితి య స్తస్మా న్మునే రత్రితః
సోమో వంశకర స్సుధాంశు రుదితః శ్రీ కంఠచూడామణిః"

ఇత్యాదిగా ప్రారంభించి గానము చేసినాడు. రాజరాజు గజగమనముతో సింహాసనము సమీపించెను. అంతట నాతడు రాజగురువులగు నన్నయభట్టారకులకు ముందు నమస్కరించెను. ఆ పిమ్మట విద్వాంసులగు చీదమార్య పంపన భట్టాచార్యులకును, విద్వత్కవులగు భీమనభట్ట, చెట్టనభట్ట, ముట్టనభట్ట, మల్లనాదులకును, ఆశీర్వచనార్థము చేరిన వేదవిదు

లగు విప్రబృందమునకును, వృద్ధామాత్యదండనాథులగు వజ్జియప్రెగ్గడకు నృపకామదండనాధునకును, భక్తిపూర్వకముగా అంజలియొగ్గెను. అంతట నాతడు సింహపీఠము స్పృశించి దానికి నమస్కరించి పెద్దలందరియనుమతితో సింహాసనారూఢు డయ్యెను. ఈ "రాజకులైక భూషణుడు, సర్వలోకాశ్రయు డాదిరాజనిభు డత్యకళంక చరిత్ర సంపదన్"అనుచు సభాసదులందరు నాసనము లలంకరించిరి.

అంతట సభాపతులగు నన్నయభట్టారకుల యనుజ్ఞ తీసికొని యంతకుమున్నే సిద్ధపరచియున్న మంటపముమీద రాజపురోహితుడు శ్రీమహాగణాధిపతి పూజ జరిపెను. పురోహితుడు ప్రణవపూర్వకముగా—

"దేవీం వాచ మజనయంత దేవా స్తాం విశ్వరూపాః పశవో వదంతి।
సానో మం ద్రేష మూర్జం దుహానా ధేను ర్వా గస్మా నుపసుష్టుతైతు"

స్వచ్ఛమైన స్వరముతో ఉచ్చరింపగానే నన్నయభట్టారకుల దేహము ఆనందముతో పులకరించెను. పూజావసానమున శ్రీ మహాగణాధిపతి ప్రసాదము రాజరాజు మొదలుగా యువరాజాదు లందరు శిరసా గ్రహించినారు.

ఆ పిమ్మట భూసురుల పుణ్యాహవాచనము కర్ణపర్వముగా జరిగినది.

ఒక్కసారిగా మంగళకరమగు పంచతూర్యారవములు మిన్నుముట్ట బోరు కలగినవి. ఆ శబ్ద ముపశమింపగానే పార్శ్వవర్తియైన రాజదూత యొకడు విశదగంభీరమైన కంఠముతో నానాటి కార్యక్రమమును ప్రకటించెను. "ఈ ఉదయము అశ్వశిక్షణ ప్రదర్శనము, సాయంత్రము విద్యాగోష్ఠి. ఇప్పుడు వెంటనే అశ్వశిక్ష ప్రారంభించుము!"

వెంటనే యశ్వారూఢులగు రాజకుమారులు పలువురు వెనుకభాగమునుండి వచ్చి ఒకరితర్వాత నొకరు సింహాసనము నెదుట తమ

శిరస్సులతోపాటు తామెక్కిన హయశిరస్సులు వంచి అభివందనము చేసి రంగముమీదికి గుఱ్ఱములు దాటించినారు.

అవియును అనేకవర్ణములు కల ఉత్తమజాతివి. వానిపై మెరయుచున్న క్షౌమాంబరములు కలవు. ఆశ్వికులును ఆయా యశ్వవర్ణములకును పటములకును అనుకూలించు చిత్రవర్ణములు గల వస్త్రములు ధరించిరి. ఆ రంగస్థలముమీద శత సంఖ్యాకులగు నా వీరులొక్కసారిగా ప్రత్యక్షము కాగానే చూపరదేహములు గగొర్పాడిచెను. అట్లా మహాజన సమూహము ఆనందపారవశ్యముతో క్షణ కాలము నిశ్శబ్దమైనది.

రాజకుమారులు బృందములుగా కూడియు ప్రత్యేకముగను చిత్రగతుల నా యశ్వముల నడిపించిరి, పంచారములు ప్రదర్శించిరి. యుద్ధక్రీడల వీరోత్సాహమును నాగరక క్రీడల విలాసమును ఆ అశ్వికు లెరుగుదురు. అశ్వారూఢులై శూలకుంతాది ప్రయోగములును కందుక క్రీడలను బహువిధముల జూపిరి. వారిలో పెక్కురు చాళుక్య రాజకుమారులు, కొందరు చోళరాజపుత్రులను! కదంబులు గాంగులు పల్లవులును ఉన్నత పదవులు గల సామంతులు దండనాథులును కలరు.

కాని వారందరలో నాగరకులను విశేషముగా నాకర్షించినదికుమార సప్తకము. విజయాదిత్యుడు, విమలాదిత్యుడు, విక్రమాదిత్యుడు, విష్ణువర్ధనుడు, మల్లప్ప, కాముడు, రాజమార్తాండుడు—అను పేర్లు గల ఏడుగురు సోదరులు వారు. వారిపితామహుడు బేటవిజయాదిత్యుడు వేంగీరాజ్య సింహాసన మెక్కెను. అతడు రాజ్యపాలనము చేసినది పదునైదు దినములే యైనను ఆ స్వల్ప కాలములోనే దీనులకు మత విద్యాసంస్థలకు లెక్కలేనన్ని దానములు చేసెను. ఆ దానముల స్మృతి ప్రజలలోనున్నది. మరియు ఈ రాజకుమారుల తండ్రియగు సత్యాశ్రయుడుకూడ శస్త్రజీవియై యనేక దేశములు సంచరించి గజనీ మహమ్మదును జయించిన అనంగపాలునికి బహుకాలము తోడునీడగానుండి విక్రమముచూపి వార్ధకములో కుమారసప్తకముతో రాజరాజుకొలువు చేరి కుమారుల నాతని కప్పగించి నిశ్చింతుడై స్వర్గస్థుడయ్యెను. సత్యాశ్రయుని ఉపదేశముచలననే రాజ

రాజనరేంద్రుడు ముందు ముందు అశ్వదళములు వృద్ధిచేసికొనవలెనని తెలిసికొని యాప్రయత్నములో నుండెను. తండ్రిగతించిన దాదియా కుమారులను రాజరాజు మన్ననలందుచు మిక్కిలి వితరణగలవారై యందరకు నాదరగౌరవపాత్రులై మెలగుచుండిరి.

ఇట్లు కొంత ప్రదర్శనమైనపిమ్మట మహారాజానుమతి నంది యువరాజు రాజేంద్రదేవుడును, విజయాదిత్యుని కుమారుడు శక్తివర్మయు రంగభూమిలో ప్రవేశించిరి. దానితో జనముల కోలాహలము పట్టశక్యము కాకపోయెను. ఆ సంతోషఘోష గోదావరిఘోషను మ్రింగివేసెను.

రాజేంద్రదేవుడు, ముఖమున కళ్యాణచిహ్నమొకటి దక్క మరి యెక్కడను మచ్చలేని పాలరంగుగల ఆజానేయ మెక్కెను. దానిపై నున్న పటవస్త్రము నీల పంచలుగల హరిద్రావర్ణము కలది. అతడు ధరించిన పట్టువస్త్రములు జరీజిలుగు చేసిన దాడిమీకుసుమప్రభ కలవి. అతని శిరస్త్రాణముపై వరాహలాంఛనము స్ఫుటముగా మధ్యభాగమునను దానిక్రింద పద్మమును, ఇరుప్రక్కల దీప స్తంభములును, ఆపై వింజామరలును శంఖమును, అన్నిటిపై నడుమగా నంకుశమును, దానిపైని అష్టమీచంద్ర రేఖయు చిత్రవర్ణములతో చిత్రించియుండెను. అతని మెడలో యౌవరాజ్యపదవికి చిహ్నమగు వజ్రకంఠిక సూర్యకాంతులు ప్రతి ఫలింపజేయుచు వ్రేలుచుండెను.

శక్తివర్మయశ్వము రక్తవర్ణముకలిగి ముఖమునమాత్రము పద్మాకారము కల తెల్లని మచ్చయున్నది. దాని పైవస్త్రము తెల్లనిదై ధగధగలాడుచుండెను. అతడు ధరించినవి ఆకుపచ్చని చీనాంబరములు.

ఆ రాజకుమారు లిద్దరును ఒకరికొకరు తీసిపోని ఎరుపుతో కలిసిన బంగారువంటి దేహచ్ఛాయకలవారు. ఇద్దరి మూర్తులును సుందరమైనవి.

అందులో శక్తివర్మ తెలుగుదేశములో పుట్టి తెలుగుదేశములో పెరిగినవాడు. అతనితల్లి కళింగరాజపుత్రిక. అతనిలో తెలుగుదనము మూర్తీభవించినది.

యువరాజట్లుకాదు. అతనికి రెండుతరములనుండియు మాతృపక్ష

మున అవిచ్ఛిన్నముగా చోళసంబంధమున్నది. అతని పితామహి కుందవ మహాదేవి సింహళముపై విజయయాత్ర చేసిన రాజరాజచోళ చక్రవర్తి కుమార్తె. తల్లిఅమ్మంగదేవి గంగానదీతీరమువరకు దిగ్విజయముచేసిన గంగైకొండ రాజేంద్రచోళుని ముద్దుకూతురు. ఆ చక్రవర్తినామమే ఇతనికి పెట్టిరి. ఇతడు జన్మించినదియు మాతామహుని యింటనే.అతని నామకరణకాలమున సాముద్రికులు ఉపలక్షించి నిర్వచించిన సార్వభౌమ యోగ్య శుభలక్షణములవలన ఈ రాజేంద్రుడు మాతామహునికి విశేష ప్రీతిపాత్రుడై చోళరాజ్యముననే చోళరాజపుత్రుల సాహచర్యముతోడనే విద్యాభ్యాసము చేయుచుండెను. తల్లిదండ్రుల దర్శనమునకు నియమిత కాలముల మాత్ర మీతడు రాజ్మహేంద్రవరము వచ్చుచుండును. మరియు నీతని ధర్మపత్నియు చోళరాజపుత్రిక. ఇన్నిటివల్ల యువరాజు ముఖభంగిలో తీరులో కదలికలో దాక్షిణాత్యలక్షణములు అభివ్యక్తమగుచుండెను. అతడు మాట్లాడు తెలుగుభాషలోగూడ దాక్షిణాత్యులయాస సూక్ష్మముగా గోచరించుచుండెను.

తెలుగుజనసమూహము వా రిద్దరలో శక్తివర్మపై పక్షపాతముతో తిలకించుచుండుటలో వింతలేదు.

అశ్వపరిశ్రమలోగూడ వారిద్దరలో నొక భేదము స్పష్టపడుచుండెను. శక్తివర్మ గుర్రముపై విలాసప్రాయముగా కూర్చుండి ప్రావీణ్యము చూపుచుండును. ఎంతయసాధ్యకార్యము నిర్వర్తించినను అతని ముఖమున చిరునవ్వు వదలక తాండవమాడును. అది యాతని యాత్మవిశ్వాసమును చూపరకు విశదపరచును. ఒకానొక పరిశ్రమలో నతడు విఫలుడైనను, దాటించుటలో గుర్రము కాలికి పొద చిక్కుకున్నను; నీటిగుంటపైనుండి గంతు వేయించుటలో నీరుచింది వస్త్రములు తడిసినను, అది పరిగణింపక సఫలుడైన వానివలెనే ముందుకుపోవును. అట్టియెడల తద్జ్ఞులకు తప్ప ఇతరుల కా లోపము తెలియరాదు. మరియు నాతని యంగములలో యౌవనము నిండి లావణ్యముతో ప్రకాశించుచుండెను.

రాజేంద్రదేవు డట్లుకాదు. అతడు శక్తివర్మకంటె కొంచెము చిన్న. నవయౌవన మింకను నిండలేదు. యౌవనము పూర్తిగా విరియుటకు ముందు యువకులలో సర్వసామాన్యముగా ద్యోతమగు నసంపుష్టి యతని యంగములలో ద్యోతమగుచున్నది. ఎనిమిది హస్తములు దుమికించుటకు అనవసరముగా పది హస్తములు దుమికించును విఫలుడైన దానిలో సఫలు డగువరకు నది మరల మరల ప్రయత్నించును. అత డశ్వ పరిశ్రమలో శక్తివర్మ కేమాత్రము తీసిపోకపోయినను, శక్తివర్మ ఉత్తీర్ణు నివలెను, యువరాజు ఇంకను అభ్యసింపవలసినవాని వలెను గోచరించును.

ఇంతలో మెరుపు మెరసినట్లు సింధుదేశీయు డొకడు చక్కగా నలంకరించిన అశ్వరాజమొకటి తెచ్చి క్రీడారంగమున వదలినాడు. దాని ముఖముపై సువర్ణపట్ట మొండు ప్రేలుచుండెను. "ఇది అధిరోహించి స్వారి చేయగలవారి దీ యశ్వరాజము" అని యర్థముకల యపభ్రంశ ప్రాకృతగాథ దానిపై లిఖించియున్నది.

ఈ క్రమభంగమునకు వృద్ధామాత్యుడగు వజ్జియప్రెగ్గడ ముఖము చిట్లించెను. ఆత డెట్టి సూచనయు చేయకముందే రాజరాజనరేంద్రు డుత్సాహముతో నీ యనుకొనని క్రొత్త వినోదమున కనుమతించెను.

రాజదూత రాజానుజ్ఞ ప్రకటింపగానే ఒక్కుమ్మడిగా అన్ని వైపుల నుండియు రాజకుమారులు, వీరులు, అశ్వశిక్షకులు నేను నే నని ఉత్సాహాతిశయముతో రంగస్థలముపై కురికురి. అట్లు ప్రేక్షకులలోనుండి వచ్చినవారిలో వికృత ముఖముతో నున్న రాజమయ్య ప్రత్యేకముగా నందరకు లక్షింపనయ్యెను.

దండనాథులలో జననాథుడు, ముప్పరాజు, ఒడ్డవాడిచోడయ, వీరంగొట్టన చోడన, వీరంగొట్టన సూరయ, జంతురువాటి సూరన, రాపర్తి బేతయ, నరుదునాంటి వీరచోడండు ముందుకువచ్చిరి. రాజకుమారు లెందరో ముందుకు వచ్చిరి. కాని వారితో యువరాజు రాజేంద్రదేవుడు కూడ ముందుకు వచ్చెను. అది చూడగానే దండనాథులందరు యువరాజు నొద్దకు వచ్చి వంగి నమస్కరించి క్రీడలోనుండి తొలగి వెనుకను

వచ్చిరి. రాజు సంగరక్షకులలో నొకడై యా దినమున సేవావిరతి నొందిన రాజమయ్యయు నట్లే వందన మొనర్చి సగౌరవముగా వెనుకకు పోయెను. ఆతడు తొలగుట చూచి జనసమూహమంతయు పరిహాసముగ్గా కేకలు వేసెను. అత డది గమనింపనివానివలె నిశ్చలముగా నొకప్రక్క కొదిగి వినయవిధేయుడై నిలుచుండెను.

ఇట్లు యువరాజుతో పోటీచేయుట కిష్టము లేక విరమించినవారు కాక మిగిలిన వారిని భటులు రాజాజ్ఞచే రెండు బారులుగా నిలువబెట్టిరి. అందు సామాన్య జనులొకవైపునకు రాజపుత్రులు రెండవ వైపునను నుండిరి. ముందు సామాన్యజనులు ఒకరి వెంట నొకరు వచ్చుట కనుజ్ఞ యైనది.

మొదట వచ్చుచున్నవాని అడుగులసడి వినబడినంతనే, అంత వరకు శాంత్యవతారమువలె నున్న యా సింధురము మెరపు మెరసినట్లా తనికి విముఖమై వెనుక కాళ్ళతో నాతని దూరముగా తన్నివేసెను. రెండవ వాడు మెలకువతో సమీపింపగా మెడ విదిలించి ప్రక్కకు పడవేసెను. ఇంకొకని కెదురువచ్చి క్రుమ్మివేసినది. ఈ విధముగా నెందరినో అశ్వకు శలుర మనుకొనినవారిని పరిపరివిధముల నది పరాభవించెను. అంతటితో నా ప్రయత్నించు సామాన్యజనము సన్నగిల్లినది. చూడవచ్చిన జనము పలువిధముల నుచ్చైస్స్వనముతో కేకలు వేయజొచ్చెను. రాజపుత్రులే మిగిలిపోయిరి. వారికంతట ప్రయత్నించుట కనుజ్ఞయైనది.

ముందు మేఘగిరినాథుడను నాగరాజు వచ్చెను. ఇతనికి మేల్పకం దర్పుడు, మలయభాస్కరుడు నను బిరుదములుండెను. పూర్వమితడు రాజరాజనరేంద్రునితో విరోధించిన సమయమున, విజయాదిత్యునికి సహాయముచేసి పరాక్రమము చూపి కొంపులుం గను గ్రామము బహు మానముగా బడసెను. విజయాదిత్యునితో రాజరాజనరేంద్రునికి సంధి యైన పిమ్మట, కారుణ్యమువలన నతని దండింపక సోదరు డిచ్చిన గ్రామము—

"స్వదత్తాం పరదాత్తాం వా యో హరేత వసుంధరామ్,
షష్టి ర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః"

అను వేదవ్యాస శాసనమువలన గౌరవముతో అతనినే జీవికగా ననుభవింప నిచ్చెను. అతని పూర్వవిక్రమము జను లెరుగుదురు గనుక అతడు రంగముమీదికి వచ్చినంతనే ప్రేక్షకజన ముత్సాహము చూపెను.

ఆ నాగరాజు భక్తితో బౌద్ధుల త్రిశరణములు బిగ్గరగా స్మరించి చాకచక్యముతో నా గుర్రము కళ్ళెము పట్టుకొనెను. ఒక్కసారిగా సంతోష పారవశ్యముతో జనము కేకలువేసెను. కాని ఆ సంతోషము చిరకాలముం డలేదు. అశ్వారోహణము చేయబోవుచున్న యాతని నది దూరముగా పడవేసెను. జనుల కేకలు హేళనగా మారిపోయినవి. ఆ పిమ్మట నా సైంధవము తనను సమీపింపనీయకుండ చిందులు త్రొక్క నారంభించెను. పాప మాతడు సిగ్గుతో ప్రక్కకు తొలగిపోక తప్పినది కాదు.

ఆ పిమ్మట జినదేవుల స్మరణచేయుచు కళింగమునుండి యరుదెంచిన కదంబ రాజపుత్రుడు అశ్వము కళ్ళెము పట్టుకొని పైకెక్కుట కనేక విధముల ప్రయత్నించెను. అతడు రాజరాజుషష్ఠకు డగు కళింగ రాజరాజుకు రాజబంధువైనందున నతని చాకచక్యమునకు మహారాజును అంతఃపురములో మహారాణి అమ్మంగదేవియు ఆనందించిరి. కాని ఎన్నిమారు లతడు దాని నధిరోహింప బూనినను సాధ్యపడలేదు. అత నిది కాయవారు దేహము. వ్యాయామసహమైన శరీర మైనందున నతడు బహుకాలము పెనగులాడెను. కాని తుద కలసి విరమించెను.

అట్లు ప్రయత్నించువా రలసిపోవలసినదే కాని ఆ తురంగమున కలుపు కనిపింపలేదు. దాని చురుకుదనము క్షణక్షణ మెక్కువగుచుండెను. అది చూసి నిరాశతో కొందరు రాజపుత్రులు ఆ ప్రయత్నము సంక్షేపించు కొనిరి.

సత్యాశ్రయుని కుమారసప్తకములో, మల్లప్ప అవలీలగా వొక్క త్రుటిలో నా యశ్వ మారోహించెను. రాజును రాజబంధువులును దండ

నాథులును జనసమూహమును దాని కతని శ్లాఘించుచుండిరి. ఆజయ ఘోష ఇటునుండి అటు ఒక్కసారిగా ప్రసరించి, గోదావరి దాటి, ధవళ గిరిసానువుల జేరి భీషణముగా ప్రతిధ్వనించెను.

శాంతమగు నా గోదావరీ గర్భములో నా ప్రతిధ్వని ఇంకను ఉప శమింపకుండగనే అంతటను హాహాకారములు చెలరేగినవి. మల్లప్ప స్థూలకాయుడు. అకస్మాత్తుగా నతడు బంతివలె నాకాశములోని కెగిరి నేలమీద విగతజీవునివలె పడిపోయెను. వెంటనే రాజభటులు వైద్యులు గుమికూడిరి. "అపాయము లేదు, మూర్ఛ!" అని వారు చేతులెత్తి కేకలు వేసిన మీదట ఆ కోలాహలము ఇంచుక శాంతించెను. మల్లప్పకు శైత్యోపచారములు చేయు మిషతో నాతని సోదరులారుగురును అశ్వారో హణ ప్రయత్నము చాలించిరి. వారితోబాటు శక్తివర్మయు మల్లప్ప స్థితి విచారించుట కక్కడికి చేరుకొనెను.

ఇక యువరాజరాజేంద్ర దేవుడొక్కడే మిగిలిపోయెను. అతడు మాత్రము దీక్ష వదలలేదు. ఆ అశ్వమువెంట వచ్చిన సింధుదేశీయుడు, "వెంగీరాజ్యములో ఈ అశ్వము నెక్కగలవారు లేనట్లేనా?" అని అడుగు చున్నట్లు నలువైపుల అహంభావపు చిరునవ్వుతో తిలకించుచుండెను. యువరాజు ఆ సింధుదేశీయుని తీవ్ర దృక్కులతో తపింపజేయుచు నా గుర్రముపై పునకు నిశ్చలముగా నడుగులు వేయుచుండెను.

ఆతని ఠీవి చూచి మాతృదేవత అమ్మంగదేవి దేహ మానంద ముతో పొంగి కన్నులు చెమరించెను. పితామహియగు కుందవాదేవికి, ఏమగునో యని భయము కలిగెను. పితృవ్య విజయాదిత్యుని దేవేరియగు మేడమ మహాదేవి తన పుత్రుడు తొలగినందున తలవంచుకొని ప్రక్కకు చూడసాగెను. శక్తివర్మ భార్య—వీర రాజేంద్రుడను చోళరాజపుత్రుని పుత్రిక—యౌవనసహజమైన సిగ్గువంటి సిగ్గుచూపెను. యువరాజు ప్రత్ని యగుమధురాంతకి పరకేసరి రాజేంద్రుడనుచోళచక్రవర్తిసోదరుని పుత్రిక. ఆమె నిజభర్త వీరావతారమును చూచి మురిసిపోవుచుండెను. అది చూచిన అమ్మంగదేవి ఆనంద మినుమడించెను. అంతఃపుర జన మట్లుం డెను. ఇక నిట రాజసభలో విజయాదిత్యు డన్నగారివంక "ఇత ని కిది

సాధ్యమా?" అను నర్థము వచ్చునట్లు తిలకించెను. రాజరాజు పార్వతీ పతిపద ధ్యానము చేయుచు నన్నయభట్టారకునివంక చూచెను. నన్నయ భట్టారకుని పెదవులపై భద్రవాక్కు నృత్యము చేయగా ఆశీర్వాదదృష్టితో యువరాజును ఏకాగ్రముగా విలోకించుచు మధ్యమధ్య ఆ అశ్వరాజము నాదరదృష్టితో పూజించెను. ప్రేక్షక సమూహము మాత్రము "ఈసాహస మే"మని కేకలు వేయసాగెను. ఆ అగౌరవము భరింపలేక రాజమయ్య అట్టి జనులను నిశ్శబ్దముగా నుండమని వారింపసాగెను. యువరాజు అశ్వమును సమీపించినకొలదియు జనముల సందడి పట్ట శక్యము గాక పోవుచుండెను.

ఇంతలో పుణ్యాహవాచన మొనర్చిన బ్రాహ్మణసమూహములో నుండి బ్రాహ్మణుడొకడు తొందరపడుచు న_త్తిమాటలతో "రా రాజపుత్రా ఆ ఆగు"మనుచు యువరాజుముందుకు వచ్చెను. అతని దేహము చెమటలు కారుచుండెను. రాజేంద్రి దేవుడు నివ్వెరపడి క్షణకాల మాగెను.

"ఏమి టీ క్రీడాభంగము, స్వామీ?" అని వజ్జియ ప్రెగ్గడ యా బ్రాహ్మణుని ప్రశ్నించెను.

"ఆ ఆగు గుర్రము, నానా నాది!"

ఆ బ్రాహ్మణుని మాటలకు ఒక్కసారిగా రాజబంధువులలో అంతి పురజనములో నవ్వు జనించెను.

"నిజము! వీ వీడు దొ దొంగ!"అని ఆ బ్రాహ్మణు డా సింధు దేశీయుని నిర్భయముగా నిర్దేశించెను. ఆ సైంధవు డేలనో స్తబ్ధుడై తుదకు కంపింపసాగెను.

వజ్జియ ప్రెగ్గడ ఆ బ్రాహ్మణునివంకను, ఆ సైంధవునివంకను, ఆ సైంధవము వంకను తుష్టితో తిలకించెను.

"ఇంత సేపు మీ రెక్కడ నుంటిరి, స్వామీ?"అని ప్రెగ్గడస్వరము వినవచ్చెను. అది విన్న వా రందరును నవ్విరి.

"ని ని నిద్రపోవుచుంటిని"అని తడవుకొనకుండగా ఆ బ్రాహ్మ

ణుడు ప్రత్యుత్తర మిచ్చెను. అంత నిర్భయముగా నసత్యమాడుచున్నాడని జనములు బొట్టలుబ్బ నవ్విరి.

యువరా జింతలో మరల నశ్వమువంకకు అడుగులు వేయసాగెను. వజ్జియ శాంతగంభీరస్వరముతో రాజేంద్రదేవుని సంబోధించెను:

"రాజపుత్రా, మనము బ్రాహ్మణద్రవ్య మాశింపరాదు; ఆ అశ్వ మీ బ్రాహ్మణునిదట. దాని నతని నెక్కి పోనిమ్ము!"

అది నిజమో .పరిహాసమో ఎరుగలేక యువరాజేమి చేయను దోచక కదలక యున్నచోట నిలిచిపోయెను.

ఈ మారు వజ్జియ కంఠధ్వని బిగ్గరగా ధ్వనించెను: "యువరాజా, ఈ బ్రాహ్మణుడు ఆ గుర్రము తనది యనుచున్నాడు. దాని యజమాని నిర్ధారణకానిది, ముఖపట్టమువల్ల స్వత్వము సంక్రమింపనేరదు. ప్రస్తుత మీ ప్రయత్నము నుండి విరమించుట వృద్ధసమ్మతము।"

రాజరాజనరేంద్రుడు వజ్జియవంక ఆదరదృష్టి పరపెను కుందవా దేవి నిట్టూర్పు పుచ్చెను కూడిన జనసమూహము కేకలుమాత్ర మనుక్షణ మతిశయింపసాగెను. విధిలేక రాజేంద్రదేవుడు అడుగులు లెక్కపెట్టుకొనుచు వీరాట్టహాసముతో నావలకు వెడలిపోయెను.

వజ్జియ: ఈ ముఖపట్ట మెవరు కట్టినా రీ యశ్వమునకు?

బ్రాహ్మణుడు : ఏ పట్టవేమిటి ప్రెగ్గడా?

వజ్జియ గుర్రము ముఖమువంక వ్రేలితో నిర్దేశించెను. బ్రాహ్మణుడటుపైపు చూచి కోపావేశముతో నా గుర్రమును సమీపించెను. అతని రౌద్రాకారము చూచినానే ఆ వాజి గడగడలాడెను. క్షణకాలములో ఆ ముఖ పట్టము నా విప్రుడు హుంకారధ్వనిపూర్వకముగా లాగి దూరముగా బారవేసెను. అట్లు చేయుచు, "నా గుర్రము ని నితరులకు దానముచేయు దొ దొంగను బంధింపవలె।"నని సింహనాదము చేసెను.

వజ్జియ : స్వామీ, ఆ గుర్రము మీదని ఋజువు చేయుటకు దాని నెక్కి మీరిటు దయచేయుడు. ఆ పైని మహారాజులకు మనవిచేసి ఆ సింధుతస్కరుని తగురీతిగా దండింతుము.

ఆ మాటలకు సైంధవుడు వెకిలి నవ్వు నవ్వెను. ప్రెగ్గడ చమత్కార మందర కానందము కలిగించెను.

ఆ బ్రాహ్మణు డేమాత్రము సంకోచింపక తత్తరపడుచు నుత్తరీయము నడుముకు బిగించి వంకరనడకతో నా యశ్వమును సమీపించెను. ముఖ పట్టము పార వేసిన దాది ఆ యశ్వము బడలినవానివలె నిస్సారమై కనిపించెను. ఆ విప్రుడు దరిచేరగానే యా యశ్వము కనుల వెంట నీరు వచ్చినట్లుకూడ నయ్యెను.

"తల్లీ, రా, భయపడకు!" అనుచు నా బ్రాహ్మణుడు దక్షిణకరముతో దాని ముఖము మృదువుగా నిమిరెను, తక్షణమే అది తన ప్రభువును బహుకాలమునకు ప్రాపించినట్లు సాధుభావము పొంది కదలక నిలిచెను. ఆ బ్రాహ్మణుడు దాని ప్రక్కకు పోయి నిలిచి ఆలింగనము చేసి కొని క్రొత్తగా అశ్వారోహణము చేయు వానివలె ఎట్లో పైకెగబ్రాకి కూర్చుండెను. పెద్ద బంతివలె ఆకాశములోని కతదెగిరిపోవు వినోదము చూడవలెనని వ్యగ్రులైన జనమున కాశాభంగమయ్యెను. అట్లగుటకు మారుగా ఆ అశ్వరాజము రాజఠీవితో నడువసాగినది. అశ్వికుడు మాత్ర మిటునటు లొరుగుచు దానిని తోలుటకు చప్పట్లు కొట్టుచు వచ్చెను. ఈ విధముగా నాతడు రాజరాజనరేంద్రుని ఆసనముముందుకు వచ్చి గుర్రము శిరస్సు వంచునట్లు చేసెను. ఆ పిమ్మట నాతడు వజ్జియవద్దకు వచ్చి, "ప్రె ప్రెగ్గడా, మీ ప్రతిజ్ఞ పాలింపవలె"నసెను.

"మా ప్రతిజ్ఞ యేమిటి?"

"ఆ గుర్రపు దొ దొంగను శిక్షింపవలె!"

వజ్జియ రాజరాజువంక చూచుచు; "బ్రాహ్మణోత్తమా, నీ పేరేమి?" అని ప్రశ్నించెను.

"న న న నన్ని, నా పే పే రేండుకు?"

కూడిన జనసమూహములో "నన్ని-నన్ని-నన్ని" అను కేకలు భూన భోంతరము నిండిపోయెను.

వజ్జియ ప్రెగ్గడ సమీపమునకు చేరిన రాజమయ్యవంక చూచి

సంజ్ఞ చేసినంతనే అతఁడా సింధుదేశీయుని నిశ్చలముగా బంధించి తీసి కొనిపోయెను. విద్రోహినని యూఁదువేయు కేకలు ఆలకించువారుకూడ లేకపోయిరి.

క్రీడా ప్రదర్శనములకు విశ్రాంతి సూచించు మధ్యాహ్న ఘంటా రవములు వినరాగానే జనులు నన్ని చర్యను పొగడుచు విచ్చిపోయిరి. ఆ సైంధవుఁడా వట్టములో నేదో ఆవేశనయంత్రము వేసెననియు, మంత్ర కోవిదుఁడగు నా బ్రాహ్మణుఁడు దానిని విప్పి ప్రకృతి నొందఁజేసె ననియు జనవాదము ప్రబలిపోయెను.

పంచతూర్యరవపురస్సరముగా రాజరాజును రాజబంధువులును సామంత దండ నాథులును ఎవరి విశ్రాంతిస్థానములకు వారు వెడలి పోయిరి.

# 3

ఆ సాయంత్రము క్రీడాద్వీపములో శస్త్రప్రదర్శనము లేదు. నానా దేశాగతులైన మల్లురు తమ మల్లయుద్ధప్రావీణ్యము చూపసాగిరి. ఈ వినోదము సామాన్య భటులను జనులను ఎక్కువ ఆకర్షించెను. వారు తమ కభిమానపాత్రులగు మల్లుర గెలుపోటములపై పందెములొడ్డుచు విశేషధనము గెలుచుచు నోడుచునుండిరి. మల్లయుద్ధరసికుఁడగు రాజ మయ్య ఈ వినోదము చూచుటకే ఆనాఁడు సెలవు తీసికొనియుండెను.

ఇక్కడ మల్లయుద్ధములు జరుగుచున్న సమయముననే రాజరాజు, "సకల భువనలక్ష్మీ విలాసనివాసం బయిన రమ్యహర్మ్యతలంబున" విద్యా గోష్ఠికి కొలువుతీరెను.

ఆ సభలో దివ్యజ్యోతులవలె వెలుగుచున్న పండితమండలి మధ్య మున, అగ్నిహోత్రునివలె నన్నయభట్టారకుఁడు [illegible] బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించుచుండెను.

అతనికి రమారమి ఏబదియేండ్లున్నను ముప్పదేండ్లు దాటనివాని

వలె కనపడుచుండెను. స్వచ్ఛమైన బంగారువర్ణము. దేహయష్టి దృఢమై, దీర్ఘమై, యారోగ్యముతో ప్రకాశించుచు,ఆయన పద్యములవలెనే బంగారు శలాకవలె నున్నది. క్రమాంతస్వాధ్యాయవేత్త. శ్రౌతస్మార్తవేది. అవిచ్ఛిన్నాగ్నిహోత్రి. అవిరళజప హోమతత్పరుడు. చండీనవార్ణమంత్ర సిద్ధుడు. శబ్దశాస్త్ర మతనికి కరతలామలకము. అఖిలపురాణేతిహాసము లాతని హృద్గతములు. ధర్మశాస్త్రములో నిధి. మృదు మధురమైన గంభీర వాక్కు కలవాడు. సంస్కృతాంధ్రములలో కవిత్వమాతని సొమ్ము.

వేదమంత్రములతో మహారాజును పండితు లాశీర్వదించిరి. ఆ పిమ్మట సంస్కృతశ్లోకములతో కొందరును, ప్రాకృతగాథలతో కొందరును, ఆంధ్రపద్యములతో మరికొందరును, పలువురు పలువిధముల నాశీస్సులు స్తోత్రములు కావించిరి.

భరతఖండమందలి ఉత్తమసభాస్థలముల ప్రశంస వచ్చినది. మాళవదేశ ప్రభువగు భోజరాజసభా ప్రశంస యందులో ప్రథమమయ్యెను. దానితో నా ప్రభువు రచించుచున్న చంపూరామయణ ప్రస్తావన యొకరు చేసిరి. అంతట చంపూకావ్యవైశిష్ట్యము సంగతి వివాదస్థాన మయ్యెను.

చంపూకావ్యములో గద్యము పద్యము మిశ్రమ మైనందున రెండిటి యందము కలిసి మనోజ్ఞముగా నుండునని చాలమంది కవులు పలికిరి. అట్టిది ప్రాకృతభాషలలో మాత్రముండి సంస్కృతభాషలో లేనిలోటు దీనితో తీరునని కొందరు పలికిరి.

చీదమార్యుడు గొప్ప మీమాంసకుడు. "కావ్యము కేవలము పద్యాత్మకమైన గావలెను, గద్యాత్మకమైన కావలెను. కాని ఉభయాత్మకమైన చంపువైనచో గద్యపద్యములు రెండును నీరసించు"నని చీదమార్యుడు సెలవిచ్చి "అది ఎగిరి యుండుటచేతనే కాళిదాసాదులు చంపూప్రబంధములు చేయలే"దనెను. అది ప్రత్యాఖ్యానము చేయుటకు కవులు కొందరు ప్రయత్నించిరి కాని సూక్ష్మబుద్ధికల చీదమార్యుని వాదము వొక్కరును చక్కగా ఖండింపలేకపోయిరి.

మితభాషియగు నన్నయభట్టారకుడు మాట్లాడలేదు.

అందరు మాటాడిన పిమ్మట భీమనభట్టు శ్రావ్యమైనకంఠముతో నీ శ్లోకము చదివెను.

"గద్యానుబంధరసమిశ్రితపద్యసూక్తిః
హృద్యా హి వాద్యకలయా కలితేవగీతిః
తస్మా ద్దధాతు కవిమార్గజుషాం సుఖాయ
చంపూప్రబంధరచనాం రసనా మదీయా."

ఈ శ్లోకము చదివి, భోజమత మిది యనెను. కవులందరు నానందించిరి. చీద మార్యుడు చిరునవ్వుతో "తర్కవాదము చేయని కవుల హృదయవాదమును ఖండింపను" అని పలికి వృద్ధుడగు భీమనభట్టును గౌరవవాక్కులతో పూజించి తన సరసత ద్యోతము చేసెను.

అంత లాటదేశకవి యగుసోడ్ఢలకవి ఉదయసుందరీకథయు, ఆదేశ ప్రభువగు వత్సరాజు సంగతియు నెవరో తెచ్చిరి. కాని రాజవైరులగు కుంతలచాళుక్యుల మిత్రులగు లాటప్రభువుల సంగతి యచ్చట మాటాడువారు లేక అది మధ్యలో తెగిపోయెను.

ఆ తర్వాత చేదిదేశకవి యగు కృష్ణమిశ్రుడు రచించుచున్న ప్రబోధ చంద్రోదయ మను నాటకమునుగూర్చి ఘూర్జరబ్రాహ్మణుడొకడు ప్రస్తావించెను గజనీ మహమ్మదు దండయాత్రల వలన కలిగిన అలజడివలన స్వదేశమున నిలువనీడలేక, ఆ బ్రాహ్మణుడును మరికొన్ని కుటుంబములవారును పారిపోయివచ్చి, విజయవాడ చేరిరి. అక్కడ యాత్రాగతుడై విడిసియున్న రాజరాజనరేంద్రుని మామగారగు గంగైకొండ రాజేంద్ర చోళచక్రవర్తిని వా రాశ్రయించిరి.

చోళచక్రవర్తి వారిని చోళమండలము రమ్మని కోరగా, దూరదేశమునుండి వచ్చియున్నందున నలసియుంటి మనియు, కృష్ణాతీరము సుఖముగా నున్నదనియు, ఆ ప్రాంతములోనే తమకు భూవసతి చూపమనియు వారు అర్థించిరి. వెంటనే చోళచక్రవర్తి తన యల్లుని యనుమతితో వారి కచ్చట భూవసతులు కల్పించెను. ఆ అగ్రహారమునకు అగ్రణి యగు నా బ్రాహ్మణుడు తరుచుగా రాజరాజు కొలువుకు వచ్చుచుండును.

ఆ ఘూర్జరాగ్రణి ప్రబోధచంద్రోదయము తాను వినినట్లును అందులో, జీవుడు మిథ్యాజ్ఞానము వదలి బ్రహ్మజ్ఞానము పొందు విధము మనోజ్ఞరూపకముగా చిత్రించెననియు, నందులో నాయకుడు ప్రబోధచంద్రుడనియు, ప్రతి నాయకుడు మహామోహు డనియు, విష్ణు భక్తి శాంతివైరాగ్యాదులును, కామదంభాహంకారాదులును పాత్రలనియు వివరించెను.

అది విని పావులూరి మల్లన, "అట్టిది వేదాంతగ్రంథ మగునేమో కాని కావ్యమగునా" అని సందేహము ప్రకటించెను.

చెట్టనభట్టును, ముట్టనభట్టును మల్లన అభిప్రాయముతో నేకీభవించుచు, నట్టి నాటకము మనోజ్ఞమైనను కాకున్నను, పండితు లాదరింప దగిన దని పక్షపాతము కనబరచిరి.

పూర్వోత్తర మీమాంసలలో నిధియగు చీదమార్యు డందుకొనెను.

"కావ్యము లన్నియు నందరకు నానందము కలిగింపగలవా? ఉత్తమాధికారుల కానందము కలిగించు కావ్యములే ఉత్తమములు. భర్తృహరి శృంగారశతకమే కొందర కానందము కలిగించును. మాబోంట్లకు వైరాగ్య శతకము రుచించును. మహాకవి కాళిదాసుని మేఘదూతము కొందర కిష్టము. మాకు రఘువంశ కావ్యాభిమానము. అదియును వ్యాసభట్టారకుల మహాభారతమువలె ఉత్తమాధికారులకు రుచింపదు. ఉపనిషదర్థమే నాటకరూపముగా చిత్రించినచో నంతకంటె నుదాత్తవస్తు వేముండును ఆ కవి మహానుభావుడై యుండవలెను."

ఆ సభలో చీదమార్యునికి ప్రత్యుత్తర మెవ్వరును చెప్పలేక పోయిరి. రాజరాజనరేంద్రు డా ఘూర్జర బ్రాహ్మణునితో, కృష్ణమిశ్రుని నాటకము వినుటకు కుతూహలము మున్నట్లు తెలిపెను. "శీఘ్రకాలములో నా పండితుని దేశదర్శనమునకు తీసికొనివత్తు"నని యాతడు పల్కెను.

ఆ సందర్భములో కాంచీపురనటులు ప్రదర్శింపనున్న రాజరాజేశ్వరనాటక ప్రశంస వచ్చినది. అంతకు పూర్వము పావులూరి మల్లన దక్షిణదేశము వెళ్ళినప్పుడు కాంచీనగరములో ఆ నాటక ప్రదర్శనము.

చూచినందున ఆ నాటక ప్రాశస్త్యమును, నటుల సామర్థ్యమును అభి నందించెను.

వృద్ధుడైన భీమనభట్టు ఆ నాటక కథావస్తు వేమని ప్రశ్నించెను.

మహానుభావు డగు రాజరాజ చోళచక్రవర్తి సింహళద్వీపము జయించిన వృత్తాంతము, రామాయణార్థపరముగా ఆ నాటకము రచించె నని మల్లన వివరించెను. రాజరాజనరేంద్రుడు తన మాతామహుని ప్రశస్తి సభాముఖమున విని మిక్కిలి ఆనందించెను.

అది కనిపెట్టి పావులూరి మల్లన, కర్ణాటభాషలో పంపమహాకవి రచించిన భారతప్రశంస చేసెను. అది విక్రమార్జునవిజయ మను పేరుతో మహాభారతకథా పరముగా నా కవి రచించెను. కర్ణాటక కవిరత్నత్రయ ములో నత డొకడు మరియు నాతని పూర్వులు ఈ వేంగిమండలములో నుండి వెళ్ళినవా రనియు, తన పూర్వులతో బంధుత్వ మున్నదను ప్రతీతి కదలదనియు, మల్లన చెప్పుచు పంప భారతమును పొగడజొచ్చెను. "సదా సేవ్యా సదా సేవ్యా పంపభారతసత్కథా" అని కర్ణాటకు లందురని చెప్ప విని సభ్యు లాదరగౌరవములతో ఆ కావ్యోత్కర్ష తెలిసికొన జొచ్చిరి.

అందులో నన్నయభట్టారకు డొకింతయు జోక్యము కలిగించు కోలేదు.

అంతలో నొక బ్రాహ్మణుని గొంతు విననయ్యెను. అందరు నవ్వుచు నటువైపు చూచిరి. "నన్ని, నన్ని, అని గుసగుసలు ప్రారంభ మయ్యెను.

నన్ని : అకకక కవిది మొదలే దేశము?

మల్లన : వేంగీమండలమే!

నన్ని : అయినచో నత డంతదూర మెందుకు పోవలసి వచ్చెను?

మల్లన : నాకు తెలియదు.

నన్ని : అత డా కావ్యములో, త తన ప్రభువును, అ అర్జును నితో, అ అ భేదాధ్యవసాయము, క కల్పించినాడు గదా!

మల్లన : అవును.

నన్ని : త తన ప్రభువగు, క కర్ణాటమండలేశ్వరుని వేంగిమండ లాధీశ్వరుడని వ వర్ణించినాడు గదా!

"దానికేమి?" అని మల్లన నీళ్ళు నమలసాగెను.

"పంప పూ పూర్వులు, రా రాజద్రోహులని ఇక్కడి ప్రభువులు దండింప నుండగా, పా పారిపోయి పశ్చిమభూములలో, వే వేంగిమండ లాధీశ్వరుల మని, ప్ర ప్రగల్భములు కొట్టుకొనువారి అండజేరి భట్టులవలె స్తోత్రపాఠముతో, బ్ర బ్రదికినవారని మీ రెరుగుదురా?"

సభలో సంభ్రమము ప్రారంభమయ్యెను. మల్లన ఇరుకులో పడు చుండెను.

"నా కా సంగతులు తెలియవు. నూరు సంవత్సరముల పైనాటి మాట!" అని యతడు తప్పించుకొనెను.

నత్తి నన్ని అంతటితో ఊరకొనలేదు.

"పంపభారతము వ్యాసభారతము ననుసరించునా?"

మల్లన : పెక్కుచోట్ల విరుద్ధకల్పన లున్నవి. కర్ణాటకులు వ్యాస భారతమునకు కావ్యరీత్యా పంప మెరుగులు దిద్దినాడని చెప్పుదురు.

ఆ మాట లా సభకు రుచింపలేదు. "హరి హరీ!" అని నన్ని చెవులు రెండును మూసికొనెను. నన్నయభట్టారకు డతనివంక అధికాదర ముతో వీక్షించి మల్లనవంక ఆశ్చర్యభావముతో చూచెను. కృష్ణద్వైపాయన వేదవ్యాసునికి మెరుగులు దిద్దగలవా డుండుట అతనికి ఊహింప నసాధ్య మయ్యెను.

రాజరాజనరేంద్రుడు దీర్ఘాలోచనలో నిమగ్నుడయ్యెను. ఆ సభలో నవ్యక్తముగ నుద్వేగము పూనెను.

భీమనభట్టు రాజసభను శాంతింపజేయ నెంచెను.

"రాజా, మన నన్నయభట్టారకుని రాజరాజ ప్రశస్తి కావ్యములోని

ప్రథమ పద్యము వినిపించుటకు నన్నయ నర్థింతును. నన్నయా, వినిపింప వోయి!"

రాజరాజు వినవలె నని యభీష్టము తెలిపెను.

నన్నయభట్టారకుని ముఖము కొంచెము సిగ్గుతో ఎఱ్ఱవారి వికసించెను. అంతట నిట్లు చదివెను :

"రాజకులైక భూషణుడు రాజమనోహరు డన్యరాజ తే
జోజయశాలిశౌర్యుడు, విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకు డపరాజితభూరిభుజాకృపాణ ధా
రాజలశాంతశాత్ర వపరాగుడు రాజమహేంద్రు డున్నతిన్."

నన్నయకంఠము మంద్రగంభీర మైనది. హృదయము నిండి పొంగి దిగ్దిగంతము లా కంఠము పూరించుచున్నట్లు విననయ్యెను. రమ్యమధుర మైన ఆ పద్యము విని యా రాజరాజాస్థానము ఆనందతన్మయ మయ్యెను. నన్నిన్ని కన్నులు చెమరించెను. రాజరాజు కృపాగౌరవదృష్టితో నన్నయను ముంచివేసెను.

"తెలుగు కవిత్వ మింత యొప్పునా!" అని చీదమార్యుడు శ్లాఘింపగా నన్నయ మురిసిపోయెను.

భూసు రాశీర్వాదములతో నా సభ సమాప్తమయ్యెను. సభాంతమున నన్నయ భట్టారకుడు నన్నిని కలిసికొనవలె నని ఉత్కంఠతో నన్ని దిక్కుల వెదకెను. కాని ఎవరిని విచారించినను, అతడెట్లు వెళ్ళెనో కూడ చెప్పువారు లేకపోయిరి.

## 4

శ్రీ ఉత్సవములతోపాటు గోదావరియొడ్డున బ్రహ్మాండమైన సంత సాగుచుండెను. అప్పటికి నాలుగైదు దినముల క్రిందటనే అది ప్రారంభమైనను, ఇప్పటికది సంపన్నమయ్యెను. కోట కుత్తరద్వారమునుండి కోటిలింగాల రేవువరకు అది వ్యాపించి మహావైభవముతో సాగుచున్నది.

ఆ సంతసుంకములు వసూలుచేయు నధికారము గు తదారులకీయక

వస్తువులనుగా కొని పోయెడివారు. ఇక శునకశ్రేణి చిత్రమైనది. అది ప్రధానముగా అడవిజాతుల వారి యధీనములో నుండెను. యాదవశ్రేణికి గొఱ్ఱెలు, మేకలు ననేకము వచ్చినవి. కాని గోవిక్రయము నిషిద్ధము. ధాన్యశ్రేణి సమస్తశ్రేణుల నతిశయించెను.

వర్తకము చాలభాగము పరివర్తనరూపముగా జరుగుచున్నది. కాని నిష్కము, సువర్ణము, ద్రమ్మము, పణము, హాగ — ఇత్యాది సంజ్ఞలు గల నాణెములుకూడ బహుప్రచారములో కలవు. హాగనుండి నిష్కమువరకు, నొకదానికంటె నొకటి నాలుగంతలు విలువగలది. సువర్ణములపై వరాహ ముద్రిక కలిగి వరహాలని వ్యవహారమున నుండెను. దానికే గద్యాణ మను మరియొక పేరుకూడ కలదు.

ఇంత పెద్ద సంతకుకూడిన మనుష్యుల నానావిధరూపములు వస్త్రములు నూహింపదగినవియే గాని వర్ణింప సాధ్యముకాదు. భరతఖండములో నానాభాగములవారే కాక పారశీకులు, అరబ్బులు, యవనులు, రోమకులు వచ్చిరి. సింహళులు, పవనద్వీప యవనద్వీప సువర్ణద్వీపాదుల వర్తకులు, శ్రీవిషయవాసులు ననేక నౌకలమీద చిత్రవిచిత్రపు సరుకులతో వచ్చిరి.

ఆ నాడు పారశీకుల నూనె విస్తారముగా నమ్మకమైనది. మూల్యము మిక్కిలి తగ్గించినందున ధనవంతులే కాక పేదవారుకూడ పొర్లబడి కొన సాగిరి. ఇట్లది నిరాఘాటముగా సాగిపోవుచుండగా మూడుజాములవేళ 'సుంకాధికరాపు' రాజభటులతో వచ్చి ఆ విక్రయము నిలుపుచేసెను. కొనుటకు కూచి అందని జనములో కల్లోలము ప్రారంభించెను. పారశీకులు తమ కన్యాయము జరిగినదని ఘోషించిరి. వారెంత యడిగినను ఆ యుద్యోగి కారణము చెప్పనందున మరింత అక్రమమని పించుచుండెను.

ఇంతలో రావర్తి బేతయ యను పేరుగల పై అధికారివచ్చి ఇతర వర్తకులను పిలిపించి వారియెదుట నా సరకు పట్టుకొని లెక్కప్రకారము రాజభటుల కప్పగించి ఆ పారశీకులను వారి ముఖ్యపరివారమును అందరను బంధింపజేసెను. అట్లు పట్టుకొనిన సరుకుపైద అధికారముద్ర

వేసి, యా బేహారులకుగూడ వారి ముద్రకూడ వేసికొనుట కనుజ్ఞ యిచ్చెను.

ఈ సంగతి సంత నలుమూలల వ్యాపించెను. ఈ అక్రమము సహింపలేక విదేశవర్తకు లందరును తమ వ్యాపారములు కట్టిపెట్టి అచ్చటికి వచ్చి విచారించిరి. ఐనను కారణము ఎవరికిని తెలియదయ్యెను. తైల శ్రేణీపతియగు ఖండకోటిని, గజశ్రేణీపతియగు కన్నరదేవుని రాజరాజుకీ అధికారుల దుర్నయము నివేదించుటకు వర్తకులందరు నియమించిరి.

ఇంతలో నొక రాజసేవకుడు వచ్చి, ఖండకోటికిని కన్నరదేవునికిని మరి ముగ్గురు శ్రేణీపతులకును లిఖితపత్రము లిచ్చెను. వారవి తత్తరముతో కరణములచే చదివించుకొనిరి. అందులో, ఆ మరునాడు రెండు జాములకు పారశీక వర్తకుల నేరము అముఖ్యాధికరణస్థానములో విచారింపబడుననియు, వా రప్పుడు మధ్యస్థులగు సభ్యులుగా నుండుటకు రావలసిన దనియు రాజాజ్ఞ యుండెను.

దానితో శ్రేణీపతు లందరు నిర్వాక్కులైరి. పారశీకుల దోష మేదియో ఉండవచ్చుననియు, విచారణ కానిది తొందరపడరా దనియు నిశ్చయించి, సంత సాగించుటకు బేహారుల కందరికి ననుజ్ఞ యిచ్చిరి.

కాని ఆనాటి కా సంత రాణింపలేదు.

# 5

అది చైత్రశుద్ధములో ఏకాదశిరాత్రి. చంద్రవంశమునకు మూలపురుషుడగు రేరాజు లోకమంతట చల్లని వెన్నెలలు చల్లుచుండెను. దానికి గోదావరిపైనుండి వీచుచున్న వసంతమందమలయానిలము తోడై క్రీడాద్వీపమున స్వర్గవాసనలు వాసింపజేయుచుండెను.

నాటకము చూచుటకు ఆరుబయట అందముగా చాపలు వేసిరి. అది వెనుక వెనుకకు పోయినకొలదియు నున్నతముగా నుండునట్లు 'సూత్రధార తనిక్కి' ఏర్పాటుచేసినందున ప్రేక్షకులందరు నాటక ప్రదర్శనము చూచుటకు వీలుగా నుండెను. దానికితోడు రంగస్థలము కొంచె

మున్నత ప్రదేశములో నున్నది. మహారాజు, రాజబంధువులు, నున్నతోద్యోగులు, అంతఃపురస్త్రీలు కూర్చుండుటకు నిర్ణీతమైన ప్రదేశమునకు మాత్రము చిత్రితవితాన మున్నది.

విశాలమైన రంగస్థలము నంతటిని కప్పుచు చాళుక్య రాజరాజ నరేంద్రుని యశశ్చంద్రికవలె ధౌతమైన యవనిక వ్రేలాడుచుండెను. రాజరాజనరేంద్రుడు వచ్చిన వెంటనే నాటక ప్రారంభమునకు అనుజ్ఞా సూచకమైన మనోజ్ఞఘంటానాదము చెవులపండువు చేసెను. వెంటనే జనముచేయుచున్న సందడియంతయు సద్దుమణగి నిశ్శబ్దమైనది.

దేదీప్యమానమైన దీప మొకటి రంగస్థలాంతర్భాగమున నిశ్చలమై మెరుపువలె తెరచాటునుండి చూడనయ్యెను. ఆ వెలుగు వెలిగించిన కాంతితోబాటు మేఘనినదగంభీరమైన నటుల కంఠసమ్మేళనముతో "జ్వాల మాలాకులం భాతి, విశ్వ స్యాయతనం మహత్" ఇత్యాదిగాగల వేద మంత్రముతో నాంది నిర్వర్తించిన పిమ్మట సూత్రధారుడు రంగస్థలము మీదను, ప్రేక్షకులమీదను పుష్కలముగా వాసంతకుసుమములతో పుష్ప వృష్టికురిపించినాడు. ఒక్కసారిగా ఆ సభ యంతయు నానందముతో జలదరించినది.

అట్లు మంత్రపుష్పవృష్టితో ప్రవేశించిన సూత్రధారునివెంట నటియు ప్రవేశించినది. వారు రాజరాజనరేంద్రుని సద్గుణములుప్రసంసించి నారు. ఈ విజయోత్సవములకు సమాగతులైన నానాదేశపండితులను, కవులను,ప్రభువులను, సహృదయులను రంజింపజేయగల నాటక మేదని నటి భయముతో ప్రశ్నించెను.

సూత్రధారుడు వెంటనే, అట్టిది 'రాజరాజేశ్వరనాటకమే' యనుచు మరియు నిట్లు వచించెను: "రాజరాజనరేంద్రుడు ఉభయకులపవిత్రుడు. ఇటు పితృవంశమగు చంద్రవంశమునను, అటు మాతృపక్షమగు సూర్య వంశమందును సమానగౌరవాభిమానములు, గలవాడు. ఈ మహానుభావుడు జన్మించినప్పుడు తల్లియగు కుందవమహాదేవియు తండ్రియగు సర్వ లోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన విమలాదిత్యదేవులును గుణగణములు గ్రహించి

మాతామహుల నామమే ఈ పరమమాహేశ్వరుని కుంచినారు. శ్రీరాజరాజ చోళదేవుడు కాందలూరు విలినములు జయించి అమర భుజంగ పాండ్యుని బంధించి, సింహళప్రభువగు మిళిందరాక్షసుని జయించి, సింహళరాజులు హరించిన మహేంద్రకిరీటము సంపాదించిన దిగ్విజయయాత్ర నాటక రూపముగా చిత్రింపమని తంజాపురనేతయు ఈ మహారాజుల శ్వశురులు నగు గంగైకొండ రాజేంద్రచోళచక్రవర్తులు తమ యాస్థానకవుల కాజ్ఞాపించినారు. ఈ నాటకముకంటె నింకొకటి యీ సభను రంజింపజేయ గలదా?

అందుపై నటి కొక సందేహ ముదయించినది. వైదికశ్రద్ధకు మూలకందమైన యీ వేంగీమండలములోను, అందును 'అత్యకలంక చరిత్ర సంపదలో ఆదిరాజనిభు'లైన ఈ చాళుక్య రాజరాజ పరమభట్టారకుల సభలో, కేవలమనుష్యకథ వస్తువుగాగల ఈ నాటకము రంజింప జేయునా?

"అయ్యో! చోళరాజరాజు కేవలము మానవమాత్రుడనుట ఎంత పొరపాటు!" అని వెంటనే సూత్రధారుడు పలికి మరియు నిట్లనెను: "ఈ నాటకము చూచినవారికి, లంకావిజయము చేసిన శ్రీరామచంద్రమూర్తి కథాప్రదర్శనము చూచిన పుణ్యముకూడ ఏకకాలములో ప్రాప్తించును. ఇది శ్రీరామవిజయమే! మొన్న శ్రీరామనవమినాడే ప్రదర్శింపవలసినది. శ్రీ రాజరాజులు నవరాత్ర దీక్షలో నున్నందున, ఈ ఏకాదశీపుణ్య వాసరమున ప్రదర్శించుచున్నాము. నిద్రపోకుండా చూచినవారికి జాగరణ పుణ్యముకూడ వచ్చును."

దానితో సభ మరింత జాగరితమయ్యెను. అంతట సూత్రధారుని కోరికమీద నటి మధురమైన కంఠస్వరముతో వసంతఋతువును వర్ణించుచు గానముచేసెను. ఆ వర్ణనము రాజరాజనరేంద్రునకు, వేంగీమండలమునకు, నాటకమునకు, వసంత ఋతువునకు గూడ సమముగా నన్వయించెను. ఆ పాట ముగిసిన వెంటనే హర్షనినాదములు సభాంగణ

మంతట వ్యాపించెను. ఆ రాత్రికటుపైన నాటక ప్రదర్శనము జయప్రదముగా కొనసాగుననుట కెట్టి యభ్యంతరము నుండదనిస్పష్టమయ్యెను.

నాటకమున నా రంకములు కలవు. నాట్యము, సంగీతము, నటుల ప్రదర్శనము, సమస్తము నానాడు అద్భుతముగా కుదిరియుండెను. నటులు సింహళ యాత్రాసన్నాహము ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులలో చేరిన వీర భటులకు వీరావేశము పెరిగిపోయెను. వారు రాజరాజనరేంద్రుని శత్రువుల మీదకి చోళసైన్యములతో కలసియు, వేరుగను దండెత్తి పోయిన గాథలు వారి స్మృతిపథములో ప్రసరించెను. వారప్పు డొనరించిన జయజయ నినాదాలు అనివార్యములై నాటక ప్రదర్శనము కొంతసేపాపవలసి వచ్చినది. కాని దానివల్ల రసభంగము కలుగలేదు. ప్రేక్షకభూమి యంతయురంగస్థలమను భ్రాంతి కలిగించి ఆసైత్రయాత్ర కన్నులు కట్టినట్లుచేసి అపూర్వశోభ చేకూర్చెను.

ఒక నర్తకి మధ్యమధ్యవచ్చి అద్భుతమైన చాతుర్యముతో నొకమారు వానర సేనాసన్నాహమును, ఒకమారు ప్రస్థానయాత్రయు, మరియొకమారు సేతుబంధమును, ఇంకొకమారు లంకానిరోధము, ఆ పిమ్మట లంకాదహనము—ఇత్యాది రామాయణ ఘట్టములు అభినయించుచు వచ్చెను ఆమె నృత్యము చేయుచుండగా కాళ్ళ గజ్జెలలోనుండి వానర కోట్లు పుట్టి ముందుకు చెంగులువేసి దాటుచున్నట్లు స్ఫురించెను. ఒకమారు తాండవనృత్యము చేయగా, లంకాపట్టణ దాహమునకు మహాగ్ని ప్రభవించి, నలుదిక్కుల ప్రసరించుచున్నట్లు భావము కల్పించెను.

ఈ విధముగా నృత్యము, ప్రదర్శనము ఒక దానితో నొకటి కలసిపోయి ఒకదాని అందమును ఒకటి వృద్ధిచేసెను. రాజరాజచోళుడు సింహళ యాత్రకు కూర్చిన నౌకల సంఖ్య స్వరూపము కన్నుల కట్టినట్లయ్యెను. వానిమీద సముద్ర తరణము సేతుబంధము తరణముగా తోచెను.

రాజరాజచోళునిచే పూర్వవిజితులైన చేరపాండ్యరాజులు, భాస్కర రవి వర్మయు అమరభుజంగుడును చేరి సింహళపతియగు మహిందునితో నేకమైరి. రాజరాజచోళుని సైన్యములు అప్పుడు యువరాజును, పిమ్మట

నిప్పటికి కొలది కాలము క్రిందటివరకు చక్రవర్తియు నగు రాజేంద్ర చోళుని నాయకత్వమున పాండ్యచోళములు జయించెను. అమరభుజంగుడు బంధితు డయ్యెను. ఈ జయములు జనస్థాన రాక్షసనాశనమును వాలివధ మును ననుకరించెను.

రాజరాజచోళుని సైన్యములు ఈలమండలము (సింహళము)పై దండెత్తి మహిందుని రాజధానియగు ననూరాధపురము భస్మము చేసెను. మహిందు డంత భీతుడై రోహణపర్వతములలోనికి పారిపోయెను. అంతట రాజరాజచోళుని సేనాపతులు ముమ్మడి చోళమండలము స్థాపించి దానికి "పోలాన్నారువ" రాజధాని చేసి మహిందుని సోదరడగు జననాధుని కచ్చట పట్టాభిషేకము చేసిరి. ఈ జయచిహ్నముగా నచ్చట రెండు రాజ రాజేశ్వరాలయములు శాశ్వతముగా నుండునట్లు ప్రతిష్ఠ చేయించిరి.

జననాధుడు రాజరాజుకు శరణాగతు డగుట విభీషణశరణాగతి యయ్యెను. జననాథ పట్టాభిషేకము విభీషణపట్టాభిషేక మనిపించెను. రాజరాజేశ్వరాలయ ప్రతిష్ట రామేశ్వరాలయ ప్రతిష్టగాతోచెను. మహిం దుని వలననుండి మహేంద్రదత్త కిరీటలక్ష్మి యానయనము సీతానయన మయ్యెను. మరియు విజయయాత్ర పూర్తిచేసి, సేనలు తంజాపురికి తిరిగి వచ్చి విజయయాత్రలో గెలిచి తెచ్చిన యశేష ధనముతో మహావైభవ ముగా నక్కడ రాజరాజేశ్వరాలయమును బృహదీశ్వరాలయ నిర్మాణ మును, విజయోత్సవములును గాంచుట రామపట్టాభిషేకమై కనుపట్టెను.

ఈ విధముగా నది రాజరాజేశ్వర నాటకమో, కేవల శ్రీరామ నాటకమో గుర్తించుటకు వీలులేనిదిగా పరిణమించెను. సూత్రధారుడు నాటక ప్రారంభములో చేసిన ప్రతిజ్ఞ నెరవేరినది. రాజరాజు కేవలము మనుష్యుడా! ఈ నాటకము చూచినవారికి శ్రీరామనాటకము చూచినవారికి కలుగు పుణ్యము లభించును.

భరతవాక్యమునకు పూర్వము ఆ నాటక కర్త స్వర్గతుడైనను అతని కుమారుడు జయంగొండారు—వేంగీ యువరాజు వయస్యుడు— ఆ సమయమున నక్కడనే యున్నందున తండ్రికి ప్రతినిధిగా నతని

రంగభూమిలో కూర్చుండబెట్టి, శైలూషు లందరు చందనతాంబూలాదుల బూజించిరి.

నాటకము భరతవాక్యముతో సమాప్తమయ్యెను. అందులో శ్రీ రాజరాజనరేంద్రునికి ఇతోధిక సంపత్తును, వేంగీమండలములో ధనధాన్య సంపత్తితోపాటు, రాజరాజుపోషణతో వాక్పటుత్వ సమృద్ధియు కలుగు గాత మని యాశీర్వదించిరి.

నన్నయభట్టారకుని చెవులలో ఆ భరతవాక్యములు అమృతస్రావ మువలె మాటి మాటికి చక్కలిగింతలు కలిగించెను. "నేను రచించిన ఇంద్ర విజయము, రాఘవాభ్యుదయము, చాముండికావిలాసము కాక మరేమి ఉద్గ్రంథము రచింపవలెను?" అను ప్రశ్న మాతని వేధింప సాగెను.

జనులు జయజయనినాదములతో లేచిరి. వారు రాజరాజు మాతా మహాలును, మామలును, వియ్యంకులును నగు చోళ చక్రవర్తుల ప్రతాప యోగ్యతా ప్రభావములు ప్రశంసించుచు వెడలిపోయిరి.

నాటకావసాన సమయమున దూరమున గోదావరిలో నార్తస్వర మొకటి అపశ్రుతివలె భయంకరమై వినవచ్చెను సంభ్రమముతో నర్తి నన్ని ప్రేక్షకులలో నుండి వెడలిపోయెను.

రాజభటులు ఆ ఆర్తస్వరము వచ్చిన దిక్కుకు పోయి చూచిరి. కాని ఇళ్ళకు చేరుచున్న ప్రేక్షకుల నావల తెడ్ల శబ్దములో నది యడగి పోయినందున నేమియూ చేయలేకపోయిరి.

# 6

పూర్వకాలమున మాళవదేశములో నర్మదాతీరమున మాంధాతపుర మనునొక పట్టణము కలదు.దాని నేలు రాజు పేరు రాజమహేంద్రుడు.అతని పెద్ద భార్య రత్నాంగి, చిన్న భార్య చిత్రాంగి. పట్టపుదేవి పుత్రుడగు సారంగధరుని జూచి చిత్రాంగి మోహించి తన కామ మాతని కెరిగించెను. సారంగధరుడు పరాఙ్ముఖుడు కాగా కోపముతో చిత్రాంగి ముసలి రాజుతో

సవతికొడుకు తన్ను బలాత్కరించుటకు ప్రయత్నించెనని చెప్పి నమ్మించెను. రాజు సారంగధరుని కాలుసేతులు నరుకమని కాలదుల కాజ్ఞాపింపగా వారు రాజాజ్ఞ పాలించిరి.

నవనాథులలో నొక డగు బౌద్ధసిద్ధు డొకా నొక డా దారిన బోవుచు అవశిష్టప్రాణుడైన సారంగధరుని జూచి జాలి కలిగి యతడు నిర్దోషియని తెలిసికొని మంత్రౌషధ మహిమచే నాతని గాయములకు చికిత్సచేసి ప్రాణములు కాపాడెను. పిమ్మట సారంగధరుడు విరక్తుడై త్రిశరణములతో ఉపసంపద స్వీకరించి బౌద్ధ సంఘములో కలిసిపోయెను. అతడు బౌద్ధ ధర్మప్రచారము చేయుచు దేశదేశములు తిరిగి కళింగము మీదుగా వేంగిమండలము వచ్చి గోదావరితీరమందున రాజమహేంద్ర పురమునకు ఉత్తరభాగమున శ్మశానవాటికకు సమీపముగా నున్న యొక మిట్ట మీద చిన్న విహారము నిర్మించుకొనెను. అత డక్కడ వజ్రయానములో మహాచీన మను తాంత్రికమార్గమున బహుకాల ముపాసన చేసెను చుట్టు ప్రక్కల పేదలకు భూతవైద్యము, విషచికిత్స, పశుచికిత్స, శస్త్రచికిత్స ఇత్యాదులు ఉచితముగా చేయుచు కొంతకాలమున కచ్చటనే సిద్ధిపొందెను. అతడు మహాసిద్ధుడనియు. సర్వజ్ఞు డనియు భక్తులును, బౌద్ధధర్మాభిమానులును సిద్ధసారంగుని దేహధాతు శేషములు భద్రపరచి చిన్న చైత్య మొకటి కట్టించిరి. క్రమక్రమముగా సిద్ధసారంగుని కీర్తిదశదిశల వ్యాపించెను. అతని పేరు చెప్పిననే బెణుకులు పశు రోగములు శాంతించు నని ప్రతీతి పుట్టినది, క్రమక్రమముగా నా చైత్యము చుట్టును గొప్ప సంఘారామ మొకటి యేర్పడెను. అనతికాలములో నచ్చట అవలోకితేశ్వర, తార, మంజుశ్రీ మొదలగు దేవతలకు చక్కని గంధకుటులు వెలసెను. అప్పటికే బౌద్ధధర్మము క్షయోన్ముఖమైనందున బౌద్ధాభిమాను లందరు నిట్టి సంఘారామములలో తమ శక్తులు కేంద్రీకరించిరి. ఈ విధముగ నా సంఘారామ మెందరో భిక్షులకు, భిక్షుణులకు నివాసస్థానమయ్యెను.

ఈ సంఘారామములో మహానిర్వాణతంత్రోక్తమైన "మహాసుఖ" మార్గమున పూజాదులు జరుగుచుండెను. మహాశంఖ మను పేరుతో

మనుష్యకపాలమొకటి వారు విధిగా పూజకుముందుసంస్కరించియుపయోగించెడివారు. అందు ప్రత్యక్షముగా మద్య ముంచి అభిమంత్రణము చేసి కులామృతముగా భావించి దేవతా పూజలలో నుపయోగించువారు. కాని అది ఉద్ధరించిన పాత్రలు సిద్ధకోటిలోని వారికేగాని సామాన్యులకు ప్రసాదించువారు కారు.

సంఘారామములో నొక్కపైపున విద్యాలయ మున్నది. ప్రస్తుత మచ్చటపెద్ద చదువులు చదువు విద్యార్థులు లేరు. కాని దానికి అనుబంధముగానున్న గ్రంథాలయము మాత్రము మిక్కిలి పెద్దది. అందులో అనేకాపూర్వగ్రంథ సంచయము కలదు.

మిగిలిన వెట్లున్నను ఆ సంఘారామమునకు సంబంధించిన వైద్యశాల వేంగీ మండలములో నెల్ల నుత్తమ మైనది. అందలి వైద్యులు బహుసమర్థులు. వారికి శస్త్రవైద్యములో కల నేర్పు అద్వితీయమని దేశాంతరములలోగూడా ప్రఖ్యాతి కలదు. చేతులు కాళ్లు తెగిపోయినను మరల నతికించగల సంధానకరణౌషధులు వారికి సిద్ధసారంగు డుపదేశించి పోయెనను ప్రతీతి యున్నది. దేశదేశములనుండి రోగులు వికలాంగులు చికిత్స కచ్చటికి వచ్చుచుండువారు. అందులో వైద్యమునకు ప్రతిఫలము పుచ్చుకొను నాచార మచ్చటలేదు. కాని వ్యాధి చికిత్స చేసికొనిపోవువారు, ఎవరి శక్త్యనుసారముగా వారు సంఘారామమునకు ధన మిచ్చిపోయెడివారు. అక్కడి ప్రధానవైద్యులును ఉపచారకులును సంఘారామములోని భిక్షులు, భిక్షులే యైనందున ఆ ధనమే సంఘారామమునకు ప్రధానాదాయముగా నుండెడిది. వేంగీప్రభువులుగూడా వార్షికముగానే గాక యుద్ధావ్యవసరములలో విశేషద్రవ్య మిచ్చుచు బంధువులకు అనుచరులకు వైద్యసహాయ్య మచ్చటనే ఎక్కువగా పొందుచుండెడివారు. క్రీడాప్రదర్శనములలో సైంధవముమీదినుండి అపాయ కరముగా క్రిందపడిన మల్లప్ప రాజకుమారుని ఈ చికిత్సాలయమునకే చేర్చిరి.

సంఘారామమునకు సంబంధించి ధర్మశాలకూడ ఒకటి కలదు.

అక్కడ జాతి కులభేదము లేకుండ నివాసమునకు భోజనమునకును వసతి కల్పింతురు. అందు గూడ ప్రతిఫల మడిగి పొందుటలేదు. నానాదేశాగతులయిన వర్తకులు యాత్రికులు నా ధర్మశాలయందే బసచేసి సంఘారామమునకు తమకు తోచిన బహూకృతి చేసి పోవుచుండువారు.

గోదావరిలంకలో రాజరాజేశ్వర నాటక ప్రదర్శనము జరుగుచున్న సమయములో నిక్కడ సారంగధరుని మెట్ట సంఘారామము మిక్కిలి సందడిగా నున్నది. ఆనాడు ఏకాదశి యైనందున భిక్షులు భిక్షుణులును భోజనము చేయక ఉపవసించి ఎవరి గదులలో వా రనుష్ఠానములు చేయుచుండిరి. రాత్రి పదిగంటలైనతర్వాత ఉపస్థానశాలలో నందరు సమావిష్టు లయ్యేదరు. అప్పుడు సంఘారామాధిపతి యగు జేతారి విశేష పూజా క్రమము సాగించి ధర్మశ్రవణము చేయును.

ఆ రాత్రి జాముప్రొద్దు పోయిన తర్వాత వైద్యశాలలో చికిత్స పొందుచున్న మల్లప్ప రాజకుమారుని జూచుటకు అశ్వవర్తకు డొకడు వచ్చెను. రోగియుపచారాదులకు నియమితయై యక్కడ సుజాత యున్నది. ఆమె ఉపాసకి. రాజకుమారునకు బలహీనముగా నున్నదని, అతని చూచుటకు ఎవ్వరిని రానీయవద్దని ప్రధాన వైద్యుడు శాసించినాడని యామె యా వర్తకుని వారించెను.

"అయ్యో! నాకు అవసరమైన పనియున్నదే!"

"మీపే రేమి?"

"చాక్రాయణసింధువు!"

"పాపము, వైద్యుల యాజ్ఞ యనుల్లంఘ్యమే."

"పోనీ, వైద్యునితో చెప్పి చూచెదరా?"

సరేనని సుజాత లోపలికివెళ్ళి ఆశ్చర్యపడుచు తిరిగివచ్చి దయ చేయవచ్చునని మల్లప్ప యొద్దకతని దీసికొని పోయెను.

చాక్రాయణసింధువు మల్లప్పకు గౌరవపురస్సరముగా నమస్కరించెను. మల్లప్ప చిరునవ్వులో నది స్వీకరించి కూర్చుండ సంజ్ఞచేసెను.

"రాజపుత్రా, మీ అశ్వశిక్ష అమోఘము. ఆ అశ్వముమీద నెక్కుంటే అసాధ్యము. దాని కొక దోషమున్నది."

మల్లప్ప : నీ వద్ద నెన్ని ఉత్తమాశ్వము లున్నవి?

చాక్రా : ఇప్పుడు నాలుగువందలు తెచ్చితినిగాని యందులో మీ బోంట్లు చూడదగినవి యాభై మాత్రమే ఉన్నవి. మీరు స్వస్థులైన వెంటనే చూచి పోవవేడెదను.

మల్ల : మా సోదరులతో కలసి యట్లే వచ్చెదను.

చాక్రా : మహారాజా, మీరు కోరినచో మూడువేల ఉత్తమాశ్వములు కోరినచోట నప్పగింపగలను.

మల్లప్ప విని యూరకుండెను.

చాక్రా : మా సింధుదేశము గజినీనుండి వచ్చిన మ్లేచ్ఛసైన్యముల వలన అల్లకల్లోలమైపోయినది. ఆ మహమ్మదీయు డెన్ని క్రూరకార్యములు చేసినను అతడు మాత్రము అశ్వహృదయ మెరిగినవాడు.

మల్లప్ప "అది నీ వెట్లెరుగుదువు?" అని వ్యగ్రుడై యడిగెను.

చాక్రా : అతడు నా చిన్నతనములో మాతండ్రికి కోరిన ధనమిచ్చి ఐదువేల ఉత్తమాశ్వములు విక్రయించుకొనెను.

మల్లప్ప : దేశశత్రువుల కెట్లు విక్రయించితిరి? మాతండ్రి గారా మ్లేచ్ఛుని సైన్యముల నెదిరించి యుద్ధముచేసిరి.

చాక్రా: వర్తకులము మేము. మా సరకుల విలువ తెలిసినవారికి విక్రయింతుము, మహారాజా!

మల్లప్ప: నీవు వచ్చిన తొందరపని ?

చక్రా : మిమ్ము దర్శనము చేయుటకే వచ్చినాను. మిమ్మును బాధించిన యశ్వమునే నత్తిబ్రాహ్మణు డొకడు తన మాయాబలమువల్ల ఎక్కినాడు, దేవా!

మల్లప్ప: ఆఁ! ఆఁ!

చాక్రా : అవును ప్రభూ! అంతేకాదు. ఆ గుర్రము తనదే యని, నా అశ్వశిక్షకుని చోరుడని చెప్పి రాజభటుల కప్పగించినాడు.

మల్లప్ప: చోరుడెట్లయ్యెను?

చాక్రా : వజ్జియప్రెగ్గడల బ్రాహ్మణాభిమానముతో మహారాజువలన

మా బోంట్లకు న్యాయము కలుగుటలేదు. ఆ యశ్వ శిక్షకుని బంధించుట వలన మా అశ్వములు కొన్ని అప్పటినుండి నీరు మేత వదలినవి.

"పాపము! నీ దేశములో సౌగతు లెక్కువా?"

"అవును, ప్రభూ! ఇక్కడమాత్రము మొన్న మొన్నటివరకు సౌగతధర్మమే బహుప్రచారములో లేదా? ఎంత ప్రజాభిమానము లేనిది. ఇటువంటి చైత్యము విహారము సంఘారామము వృద్ధియై యుండును? పూర్వము ప్రభువులు పుష్కలముగా దీనికి దానములు చేయువారు. శ్రీ బేటవిజయాదిత్యమహారాజులు చేసిన దానములే ప్రధానమైనవని శ్రీ జేతారినాథులు సెలవిచ్చినారు."

ఆ మాటలు విని మల్లప్ప తనతాత వేంగిదేశము పాలించిన పదిహేనుదినములు జ్ఞప్తికిరాగా ఒక్కనిమిషము కన్నులు మూసెను.

"నేను స్వస్థుడ నైనవెంటనే మీ యశ్వశిక్షకుని విడిపించు ప్రయత్నము చేసెదను."

"తమరు మా అశ్వములు దర్శించి పోవలెనుగూడ! అందులో నుత్తమోత్తమమైన దొకటి తమ లాయమునకు రేపే చేర్పించెదను, మహారాజా!"

ఇట్లనుచు నతడు వంగి వంగి నమస్కరించుచు సెలవు పుచ్చుకొనెను.

అంతట కళింగవర్తకు డొకడు వచ్చి మల్లప్పను దర్శించి మాటాడివెళ్ళెను. ఆ పిమ్మట సింహళవర్తకు లిరువురు వచ్చిరి. అంతలో యవద్వీపు డొకడు వచ్చెను. మరియు సువర్ణద్వీప వర్తకుడును, నెందరో వర్తకులు వచ్చిరి. అందరికి వైద్యుడసుమతి యిచ్చుచుండుట సుజాత కాశ్చర్య మయ్యెను.

ఇంతలో తారాదేవికి నిర్మించిన గంధకుటినుండి ఘంటానాదము వినవచ్చెను మంజుశ్రీ పుణ్యశాలనుండియు అవలోకితేశ్వర మైత్రేయ బోధిసత్త్వుల శాలల నుండియు వెంట వెంటనే వేరువేరుగా ఘంటానాదములు వినవచ్చెను. ఆ ఘంటలు విని యందరును పూజాదర్శనమునకు తీర్థప్రసాదస్వీకరణమునకు విహారప్రదేశమునకు బయలుదేరిరి.

మంజుశ్రీ బోధిసత్త్వుని పూజ, సువర్ణపుష్పములతో సువర్ణోప హారములతో జరిగెను. వర్తకులక్కడ మంత్రపుష్పములో నుంచిన సువర్ణ మపారమైనది.

అవలోకితేశ్వర బోధిసత్త్వుని పూజ, స్ఫటికస్వచ్ఛమైన పాత్రలతో స్ఫటికాక్షమాలాజపములతో జరిగినది.

మైత్రేయ బోధిసత్త్వుని పూజ, రజతపాత్రలతో రజతమంత్ర పుష్పాదికములతో జరిపిరి.

తారాదేవి పూజ, మహాశంఖములో జేతారి స్వయముగా నిర్వర్తిచెను.

నానాదేశాగతులై ఆ సంఘారామములో విడిసియున్న వర్తకు లందరు నా పూజలయొద్ద సమావిష్టులైరి. ఆవల పూజలు జరుగుచున్నంత సేపును, తమతమ దేశముల వృత్తాంతములు, రాజుల బలాబలములు, వేంగీరాజరాజు సామర్థ్యము, చోళచక్రవర్తుల గొప్పదనము, చోళ వేంగి భూములలో బ్రాహ్మణుల ప్రాబల్యము, కళింగరాజకళ్యాణ చాళుక్యుల మైత్రి, వింధ్యోత్తరభూములలో మ్లేచ్ఛుల యలజడి వారి సంభాషణలో తరుచుగా వచ్చెను. అందులో వేంగీరాష్ట్రములో భట్టిప్రోలు,ధనకటకము, ఘంటసాల, కొలనివీడులలో సంఘరామములు మాత్రము దీనివలె కొంత వృద్ధిగా నున్నవికాని మిగిలినవి శిథిలప్రాయ మగుచున్న వనియు, ఎప్పటికి మరల నవి యుద్ధారము కాగలవోయను తాపమును వెల్లడించుచు వచ్చిరి.

ఆయుధవర్తకుడొకడు, తాను తెచ్చిన ఆయుధ విశేషములను నూతన కవచ శిరస్త్రాణములను వర్ణింపసాగెను. సువర్ణద్వీపములో సువర్ణము రాసులుగా నున్నదనియు, అక్కడికి ఈ సంఘారామమువారు పోవుటకు ఏర్పరచుచున్న వలసలో కలిసివచ్చువారి యాదృష్టము ఊహాతీతమనియు అద్భుతముగా వర్ణించుచుండెను.

లోకాభిరామాయణము అనేక విధములుగా సాగుచున్నను,ఎందుకో గాని, మాటిమాటికి, రాజరాజుసైన్యవిశేషములు, దండనాథుల,సామంతుల,

అభిమానములు, సామర్థ్యములు ప్రస్తావవిషయము లయ్యెను. తరుచుగా వారుసత్యాశ్రయుని కుమారసప్తకము సద్గుణపుంజములు, దయాస్వభావము, రాజనీతియు పొగడజొచ్చిరి.

పూజాదికమైన పిమ్మట సంఘారామాధ్యక్షుడు జేతారినాథుని చుట్టును భిక్షువులును భిక్షుణులును విశాలమగు నుపస్థానశాలలో బోధివృక్షమునొద్ద సమావిష్టులైరి.

జేతారి ముందు సంఘములోనివారికి సంఘధర్మములు చెప్పి వారి చేత నవి యనిపించెను. ఇది యంతయు పాలీభాషలో దీర్ఘస్వరములతో జరిగెను. ఆ పిమ్మట సంఘారామమునకు భూరిదానము చేసిన శ్రీ బేట విజయాదిత్యుని దానశాసనములు చదివించి, జేతారి, ఆతని ధర్మబుద్ధి కొనియాడి వారి వంశమువారికి శుభము కలుగుగాక యని యాశీర్వదించెను. దానిని మిగిలిన శ్రమణశ్రావకులు తథాస్తు వచనములతో బలపరచిరి. ఆ పిమ్మట బోధివృక్షమునకు విశేషద్రవ్యములతో పూజచేసి యా ద్రవ్యములు సమావిష్టులైన వారందరకు పంచిపెట్టిరి. ఆ పంచిపెట్టిన వానిలో తీర్థము మిక్కిలి ఉద్దీపకముగాను ఘాటుగాను ఉండి, క్రొత్తవారికి కొంచెము మత్తు కలిగించెను. పూజావసానమున మరల శ్రీ బేటవిజయాదిత్యుల సంతతికి విజయాశీర్వాదము జరిగెను.

అంతవరకును దూరమున చిత్రవేషములు కల ఆరుగురు మనుష్యులు నిలుచుండిరి. వారికి పూజాతీర్థము ఎక్కువగా నీయగా వారది స్వీకరించి బిగ్గరగా జయజయ నినాదాలు చేయుచు వెడలిపోయిరి.

# 7

సుజాత ఈ సంఘారామమునకు వచ్చి ఇప్పటికి రమారమి ఐదేండ్లయినది. జేతారినాథుడు కళ్యాణకటక మొకమారు ధర్మప్రబోధనిమిత్తము వెళ్ళి వచ్చినప్పటినుండియు, నామె జేతారినాథునికి మహాభక్తురాలయ్యెను. మొదట మొదట దేవతాపూజలు జపముచేయుట అధికముగా చేయుచుండెడిది. కాని రానురాను ఆమెకు పూజాదులయందు అభినివేశము తగ్గిపోయెను. తదాది, వైద్యశాలలోని రోగులకు ఉపచారములు చేయుచే

పరమార్థముగా భావించి అందే నిమగ్నురాలయ్యెను. ఆమె హస్తస్పర్శ వల్లనే మాతృదేవతాప్రసాదమువలెనై ఎందరో రోగులకు వ్యాధు లుపశమించెనని ప్రతీతి ప్రబలినది. ఆమె వ్యాధిగ్రస్తుల కుపచారము లొనరించుటలో విశేష ప్రావీణ్యము సంపాదించెను. ఆమె పేదలు ధన వంతులు నను భేదములేక సర్వసమత్వముతో నుపచరించుచుండెడిది. కాన సర్వజనాదర భూమి యైనది.

ఉపస్థానశాలనుండి అందరవలెనే సుజాతయు తన గదికి వెళ్ళు చుండెను. ఇంతలో నామెకు మెల్లగా వెనుకనుండి 'సుజాతా' అని పిలుపు వినవచ్చెను. ఆ పిలు పాలకించి యామె నిలువబడెను.

"ఎవరది?"

"నిన్ను, జేతారినాథప్రభువులు, మహాప్రసాద స్వీకరణమునకు పిలువనంపినారు."

"ప్రభువులా?" అని సుజాత నిర్లక్ష్యముగా అనెను.

"అవును" అని వార్తాహరు డుత్తరమిచ్చెను.

"ఈ దినము నా మనస్సు వికలముగా నున్నది. మహాప్రసాదము మరియొకరి కనుగ్రహింపగోరితి నని చెప్పుము." ఇట్లని చెప్పుచు సుజాత సాగిపోవుచుండెను.

ఆ వార్తాహరు డంతటితో నూరుకొనక సుజాతను గదివరకు వెంబ డించెను. అతడు వచ్చుచున్నది చూచి యామె వారింపలేదు. అతడు సుజాత గదిలోనికి వెళ్ళెను.

అత డామెను మిక్కిలి గౌరవభావముతో పలుకరించుచుండెను. ఆమెయు వాత్సల్యముతో ప్రత్యుత్తర మొసంగుచుండెను.

"అమ్మా, నీ విచ్చటికి వచ్చి ఎంతకాలమైయినది?"

"ఐదేళ్ళు."

"మీ స్వగ్రామ మేది?"

"ఉపాసికలను గ్రామము ప్రశ్నింపరాదు?"

"అమ్మా, నీవు ఉపచర్య చేసినంతనే ఎట్టిరోగియు స్వస్థుడగునని

చెప్పునది నిజమని నాకు స్వానుభవమువలన తెలియును. ఆ మహత్త్వము నీ కెక్కడి నీరు త్రాగినందున వచ్చినదో తెలిసికొనగోరి అడిగాను."

"అడగ గూడ దంటినిగదా!"

"పైకి శాంతముగా కనపడు నీ మూర్తి వెనుకనుండి, తీవ్ర తాప మేదో పొడకట్టుచుండు టెందువల్ల, తల్లీ?"

"ఎప్పుడు లేనిది ఇటువంటి ప్రశ్నలు ఈనాడు వేయుచుంటి వెందు కోయి? జేతారి నాథుల ఆజ్ఞ నిర్వర్తింప బో, త్వరగా!"

"ఈ మహాప్రసాదస్వీకరణకు ఉపాసికల వద్దకు వార్తలు తీసు కొనిపోవుట నా కంత యిష్టముకాదు."

"అట్లనుట అపరాధమట సుమా!"

"అమ్మా, నీవెక్కడ జేతారిప్రభువుల శిష్యురాల వైతివి?"

"వారు కుంతలదేశ దిగ్విజయయాత్ర చేసినప్పుడు."

"నీది కల్యాణకటకమేనా?"

"ఆ ప్రశ్న అడగరాని దంటిని గాదూ?"

అతడింకను ఏదో యడగబోవుచుండెను. సుజాత కన్నులలోనుండి నీరు నిండి ఆమె వక్షస్థలముమీదికి జారసాగెను. అది చూచి అతనిప్రశ్న లతని కంఠములోనే స్తంభించిపోయెను, అతడే చెప్పసాగెను.

"ఎవరో ఇద్దరు పరమదుర్మార్గులు కల్యాణకటకమునుండి వచ్చి నారట. వారిలో ఒకరిని బంధించి తెచ్చుటకు యమభటషట్కము వెళ్ళి నది."

"కల్యాణకటకమునుండియా? ఆ ఇద్దరు పేర్లు తెలుసునా?"

"రెండవపేరు తెలియదు. కాని ఒకపేరు మాత్రము వినబడినది— పొన్న!"

ఆ మాటలు వినగానే సుజాత గుండె లాగినట్లయ్యెను. అది చూచి యతడిట్లనెను.

"మీది కల్యాణకటకమా తల్లీ, ఈ వార్తవల్ల అట్లయిపోతివి! ఆ దుష్టుల నెరుగుదువా?"

"అతని కేమైన అపాయము తలపెట్టుచుండిరా?"

"లేదు కాని నావలు—— ఈదుట—— గోదావరి—— లంకలు అను మాటలు వినబడినవి. అన్నియు నపాయసూచకములే!"

"నాయనా, నిన్ను నా కుమారునిగా జూచుచున్నాను. ఆ మనుష్యుని ప్రాణాపాయము లేకుండ కాపాడవలెను."

"మహాప్రభువుల చిత్తము. నే నేమి చేయగలను? ఐనను దుర్మార్గుని యెడల నీకంత అభిమాన మేమి తల్లీ!"

"మంచివాడవు కదూ, నాయనా! నీవు వెంటనే ఇక్కడినుండి వెళ్ళిపోయి అతని దెచ్చిన వార్త తెలియగానే చెప్పుము."

ఆ మాటలు విని వార్తాహారుడగు నా బాలకుడు బయలుదేరి వెళ్ళిపోయెను.

ఆ పిమ్మట సుజాతహృదయములో దుఃఖము ఆగక పొంగగా కుడకామె వెక్కి వెక్కి ఏడువసాగెను. ఆట్లామె ఎంత సేపు ఏడ్చుచుండెనో కాని సంఘారామ రహస్యద్వారము తెరచిన సవ్వడి విని ఉలిక్కిపడి వెలుపలికి వచ్చెను.

ఆమె చూడగా నా ద్వారమునుండి పెద్దదారువువలె నున్న యొకానొక మనుష్య శరీరమును యమభటపట్కము మోసికొని చప్పుడు లేకుండ సామాను కొట్టులో ప్రవేశించుచుండిరి. ఆ శరీరాకారము దూరమునుండి అస్తమించుచున్న వెన్నెల కాంతిలో చూడగానే ఆమెకు నాపాదమస్తకము విద్యుత్తాడిత మైనట్లు ఒక్కసారిగా నిశ్చేష్ట మయ్యెను.

ఆమెకు చైతన్యము వచ్చి తలయెత్తి చూచునరికి దిగులుగొన్న ముఖముతో వార్తాహారబాలకుడు నిలుచుండియుండెను.

"పొన్న బ్రతికియున్నాడా తండ్రీ?"

"తల్లీ, చెప్పలేను. కేవలము శవాకారముగా తోచినది."

## 8

చంద్రవంశజులగు చాళుక్య రాజులకు ప్రథమములో బాదామి రాజధాని. శాలివాహనశకము ఆరవ శతాబ్దములో హర్షవర్ధనుని దక్షిణ

భూములకు రానీయకుండ జయించిన వీరుడు రెండవ పులకేశి యను సత్యా
శ్రయపృథ్వీశ్వరవల్లభుడు. అతడు సముద్ర తీర మంటియున్న వేంగిమండ
లము జయించి తన తమ్ముడగు కుబ్జ విష్ణువర్ధనుని దాని కధిపతిని చేసెను.
అన్నగారి పిమ్మట కుబ్జ విష్ణువర్ధనుడు స్వతంత్రుడై వేంగి చాళుక్యవంశ
కర్త యయ్యెను. తదాది పశ్చిమమున కుంతల చాళుక్యులును తూర్పున
వేంగి చాళుక్యులును ప్రభువులుగా నుండిరి. ఈ రెండు వంశములకును
జ్ఞాతిశత్రుత్వము సహజముగా నుండెను.

కొంతకాలమునకు పశ్చిమచాళుక్యరాజ్యములో బౌద్ధజైన మతములు
వ్యాపించినవి. రాజులు బలహీనులు కాగా వారు బహుకాలము రాష్ట్రకూటు
లకు వశులైరి. మరల నిప్పటికి నూరు సంవత్సరముల క్రిందట స్వతం
త్రులై తమ దృష్టి తూర్పున వేంగిమండలముపైకి ప్రసరింపజేసిరి. అం
తట వారు వేంగి రాజ్యములో రాజ కుటుంబములలో జ్ఞాతికలహములు
ప్రేరేపించిరి. తుదకు విమలాదిత్యు డను చాళుక్యవల్లభుడు చోళచక్రవర్తి
యగు రాజరాజచోళుని కుమార్తెయగు కుందవ మహాదేవిని వివాహమాడి
బలవంతుడగు శ్వశురుని సహాయముతో వేంగిమండలములో తన రాజ్యము
స్థిరపరచుకొనెను. అతని కుమారునికి తన మామగారి నామమే "రాజ
రాజు" అని పెట్టి తన బావమరది యగు రాజేంద్రచోళుని కుమార్తెయగు
నమ్మంగ దేవిని కోడలుగా గ్రహించెను. విమలాదిత్యుని దూరదృష్టి వలన
చోళచక్రవర్తులతో కలిపి నిలుపుకున్న ఈ బాంధవ్యమే వేంగిరాజ్యము
కుంతల చాళుక్యులధాటికి అణగిపోకుండ నిలువద్రొక్కుకొనుటకు అవ
కాశము కలిగించెను.

రాజరాజనరేంద్రుని పట్టమహిషి అమ్మంగదేవి. రాజరాజ నరేం
ద్రుడు వేంగి సింహాసన మధిష్ఠించు నాటి కామె తండ్రియగు రాజేంద్ర
చోళుడే చోళ చక్రవర్తి యయ్యెను. తండ్రికి కుమార్తెమీదకంటె నామె
యం దెక్కువ యాదరము కలదు. ఆమె మిక్కిలి బుద్ధికుశలత కలది.
విద్యావతి. సంస్కృతములో చక్కని సాహిత్యము కలదు. ఆమె అభి
మానవిద్య రాజనీతి. శుక్రనీతి కామందకము. కౌటిల్యుని అర్థశాస్త్రము
నామె క్షుణ్ణముగా పఠించి సప్రయోగముగా గ్రహించెను. వేదవ్యాసకృత

మహాభారతము బహుమాన్యము. తన కుమారునికి ఆమెయే తన తండ్రి నామ ముంచునట్లుచేసి తండ్రికి ప్రియము కావించెను. ఆమె సోదరులతో రాజేంద్రదేవుని కుమార్తె మధురాంతకిని తన కుమారుడు వేంగీ యువ రాజగు రాజేంద్రదేవునికి భార్యగా వివాహము చేయించెను.

అమ్మంగదేవియందు రాజరాజనరేంద్రునకు గౌరవముతో కలిసిన ప్రేమ కలదు. ఆమె శీఘ్రకాలముననే వేంగీమండలమున నెక్కువ పలుకు బడి సంపాదించు కొనెను. అయినను ఆమె చోళచక్రవర్తుల మహావైభవ మెరిగిన దైనందున స్వల్పమైన వేంగీరాజ్య మామెకు పేదగా భాసించె డెది. ఆమెదృష్టి చోళరాజ్యమువైపు తరచుగా ప్రసరించుచుండ నోపును. తన కుమారుడు వేంగీయువరాజైనను మాతామహునివద్దనే తంజాపురము నను కాంచీపురముననుు తరుచుగా నుండనిచ్చెను; చోళరాజపుత్రులతోడనే అతని విద్యాధికము సాగింప నిచ్చెను; వేంగీప్రజల యభిమానము యువ రాజుకు కొంత తగ్గుటకుగూడ ననుమతించెను.

రాజమాత యగు కుందవమహాదేవికూడ చోళరాజ పుత్రికయైనను ఆమె చిరకాలము గోదావరీతీరవాసముచే తెలుగువారిలో కలిసిపోయెను. అమ్మంగదేవికి పుట్టింటి మీదను చోళదేశము చోళాచారములయందు పక్ష పాతము పోలేదు. తెలుగువారి పద్ధతులు ఆమెకు కొంత మోటుగా కని పించెడివి.

అంతఃపురమున ఎట్టి ఛిద్రములు లేకుండుట రాజ్యమున కెంత బలమోకూడనామె ఎరుంగును. రాజరాజనరేంద్రుని అంతఃపురములోని సామరస్యమునకు ప్రధానకారణము అమ్మంగదేవి సమర్థతయే.

రాజరాజ నాటకప్రదర్శనమైన మరునాడు ఉదయము, ఆమె తన మందిరములో స్వయముగా శ్రీ చక్రరాజార్చనము చేయుచుండెను. ఆ సమయమున నచ్చట వేదవేదాంగవిదులగు నాంధ్ర ద్రావిడ కర్ణాటక బ్రాహ్మణులు సమావిష్టులైరి. ఆ వచ్చినవారిలో నర్తి నన్నికూడ నొకడు. నన్నయభట్టారకుడు రాలేదు. పూజాంతమందు అమ్మంగదేవి యాబ్రాహ్మ ణులందరిని పరదేవతాబుద్ధితో పూజించి వారిచ్చు దీవన లందు కొనెను.

'నన్ని' కూడ నత్తిమాటలతో నామెను సంస్కృతవాక్యాన నాశీర్వదించెను. అమ్మంగదేవి ముఖమున చిరునవ్వు ప్రసరింపగానందరు నవ్విరి. కొందరు తమిళ భాషలో దీవించుచుండగా స్వతంత్రద్రావిడ ప్రబంధముతో 'నన్ని'కూడ దీవించెను. ఆంధ్రులు ఆంధ్రపద్యములు చెప్పగా నన్నికూడ తొందరపడుచు నాంధ్ర తరువోజ చెప్పెను. అంత టితో నక్కడివారికి వినోదముతోపాటు ఆశ్చర్య ముదయించెను. కర్ణాటకు లిద్ద రింతలో కన్నడపద్యములు చెప్పిరి. నన్ని నిరాఘాటముగా కన్నడ పద్యము చెప్పెను. అందరును సమాప్తి చేసిన తర్వాత పైశాచిక ప్రాకృతములో నొక గాథ చెప్పి తుదకు నన్ని యొక సంస్కృతశ్లోకముతో నాశీర్వాదము పూర్తిచేసెను. కూడిన బ్రాహ్మణుల వినోదమునకు మేర లేదు. అమ్మంగదేవి నన్ని చెప్పిన అన్ని భాషల పద్యముల యర్థములను కూర్చుకొనుచు విశేషధ్వని స్ఫురింపగా నాతని గౌరవదృష్టితో చూచెను.

బ్రాహ్మణు లందరికిని రాణి సెలవిచ్చినది కాని 'నన్ని'కి సెల వీయలేదు. ఐనను "నన్ని"వెళ్ళుచుండగా కంచుకి వారించెను. అంత వెను కకు వచ్చి తన్ను కంచుకి ప్రతిబంధించుచున్నదని రాణికి చెప్పికొనెను.

"మహాత్మా, మీతో మాకు కొంత ప్రసంగింపవలె నని కుతూహల మున్నదని మా కంచుకి గ్రహించియుండును!"

"అమ్మా, మ మహారాణితో నే నేమి మాట్లాడగలను?"

"స్వామీ, మీరు నత్తి విడిచి మాట్లాడవచ్చు నాతో!"

"అ అట్లు సెలవిత్తు వేమి, త తల్లీ?"

"వేదమంత్రోచ్చారణలో రాని నత్తి, మాతో ప్రసంగంలో నెందుకు?"

నన్ని మౌనము వహించి మహాదేవివంక గౌరవాదరములతో తిలకించెను.

"నీవు త్రిలోక రాజ్యలక్ష్మి వగుదువమ్మా!"

అమ్మంగదేవి : మీ దేశమేమి?"

నన్ని : మాబోటి బ్రాహ్మణులకు దేశమేమిటి? ఆసేతు హిమ

చల మధ్యవర్తులము. ఎక్కడ మా నిత్యనైమిత్తిక కర్మల కనుకూల ముగా నుండునో అదే మా దేశము.

దేవి : ఈ గోదావరీతీరము వేంగీమండలము మీకు అందుకు అనుకూలముగా లేవా?

నన్ని : అనుకూలముగా నుండునను నాశతోనే ఇక్కడికి వచ్చి నాను.

దేవి : వచ్చి ఎన్నాళ్ళయినది.

నన్ని : నాలుగు దినములు.

దేవి : మీ గోత్రము?

నన్ని : హారితస గోత్రము.

దేవి : హారీతులు మా చాళుక్యులకు పితృ సమానులు. మా వంశము వర్ధిల్లుటకు మీ గోత్రీకుడు విష్ణుభట్ట సోమాయాజులే మూలకార ణులు. మేము అందువల్లనేకదా విష్ణువర్ధనుల మైనది.

నన్ని : అవును తల్లీ! అయితే కుంతలదేశ చాళుక్యులు ఆ మాట మరచి పోయినారు.

అమ్మంగదేవి తన కర్థమైనట్లు తలయెత్తి చూచెను.

"గోదావరీ పవిత్రవారి త్రావుచున్న వేంగీచాళుక్యులు మరచి పోలేదు. అందుకు మా శాసనములే సాక్ష్యము."

ఇద్దరును కొంతసేపు నిశ్శబ్దముగా నుండిరి.

"మి మ్మెరిగినవా రిక్కడ నెవరైన నున్నారా?"

"చిన్నప్పుడు కాంచీపట్టణములో సహాధ్యాయు లొకరిద్ద రుండ వలె."

"మీ నామధేయము?"

"బ్రాహ్మణు లందరూ నారాయణస్వరూపులు కాదా!"

"మీ రెవరివద్ద దండనాథపదవిలో నుంటిరి?"

నన్ని మౌనముగా తలయెత్తి క్షమింపు మన్నట్లు సూచించెను.

"మీ కథావిషయములు మీకు సమ్మత మైనప్పుడే యెరిగింప వచ్చును. ఆ అశ్వములో దోష మేమి?"

"నా అశ్వములో దోషమా?—ఏమియు లేదు."

"మరి?"

"అశ్వములు తమ యజమానిస్పర్శ లేనిది కొన్ని సహింపవు."

"అట్టిది దుష్టాశ్వము కాదా?"

"తల్లీ, నీకు తెలియని దేమిటి? ఆ ముఖ పట్టము తీసి పారవేయుటే నాకు స్ఫురించిన చికిత్స. అది యువరాజు నశ్వములలో నుండదగినది."

"ఎంతమాట! మీకు దాని పోషణ భారముగా నున్నచో మాశాలలో న్యాసము చేయవచ్చును."

"అట్లే చేయుదును తల్లీ! ఆ అశ్వము మీ ప్రాంగణములో నున్నది"

అమ్మంగదేవి వెంటనే దాసిని పంపి యా యశ్వమును తన యశ్వశాలలో చేర్పించెను.

"మీరు మా కుమారుని గౌరవము కాపాడినారు. మీ యందు మాకు పితృపాదులయందువలె పూజ్యభావము కలిగినది. మీరు దానికి అనుగుణముగా ప్రవర్తింపవలె నని మా ఇచ్ఛ!"

"మహాప్రసాదము, తల్లి! నా రాక సార్థకమైనది."

"మీకు ఏ దెప్పుడు అవసరమైనను అన్నియు జరిగిపోవునట్లు సేవకుల కాజ్ఞాపింతును. గోదావరీతీరములో మీరు స్థిరనివాసము చేసికొనవలెనని మా యభీష్టము."

"ఈ గోదావరీ పవిత్ర తీరముననే శాంతముగా జీవితశేషము గడుపవలె నను. కుతూహలముతోడనే ఇక్కడికి వచ్చినాను. మహారాణుల అనుగ్రహ మున్నచాలును. రాజసేవకుల రక్షణ బాధ లేకుండ ప్రస్తుతము దయచేయించవలె, తల్లీ, ఇక సెలవా?"

అమ్మంగదేవి చిరునవ్వుతో మంచి దని యా నర్తి బ్రాహ్మణునికి సెలవిచ్చెను. వెంటనే యామె రాజమయ్యను పిలిపించి యా వెళ్ళిన బ్రాహ్మణుని రహస్యముగా ననుగమించుచు నతనికి నెవరివల్ల నెట్టియు పద్రవము రాకుండ కనిపెట్టుచుండవలెనని యాజ్ఞాపించెను.

మరికొంత సేపటి కామె వజ్జియప్రెగ్గడను పిలిపించుకొనెను. ఆమె

అంతఃపుర విషయములు రాజకీయములు అనేకము ప్రసంగించి, "నారాయణనాముడైన బ్రాహ్మణు డెవరివద్ద దండనాథుడుగా గాని, అమాత్యుడుగా గాని యున్నాడో ఎరుగుదురా?" అని ప్రశ్నించెను.

"అట్టివాడు త్రైలోక్యమల్ల దేవరవద్ద ప్రధానిగా నుండి, కొంత కాలము క్రిందట సకుటుంబముగా నా రాజ్యము విడిచి వెళ్ళినట్లు తెలియుచున్నది. అతడు ప్రస్తుతము వేంగీమండలములో నున్నట్లు తెలిసినది. కాని ఇంకనుగు ర్తింపబడలేదు."

"త్రైలోక్యమల్లదేవర నెందుకు వదలెనో?".

"మల్లదేవర జైనకాలాముఖ పక్షపాతము, నారాయణున కిష్టము లేనట్లు తెలియుచున్నది. వేదధర్మమునకు నీడలేని రాజ్యములో నివసింపనని ప్రతిజ్ఞ చేసినాడనియు నందురు. అందులో ఎంత నిజమున్నదో నిశ్చయముగా చెప్పలేము."

"ఆయన నెరిగినవా రెవరు నిక్కడ లేరా?"

"నా కుమారుడును, నన్నయ్యభట్టారకుడును నెరుగుదురనితెలియుచున్నది."

మరియు నితరవిషయములు మాట్లాడి సెలవిచ్చి వజ్జియప్రెగ్గడలను పంపివేసెను.

# 9

సంత జరుగుచున్న ప్రదేశమునకు సమీపముననే దానికి సంబంధించిన న్యాయస్థాన మున్నది. అక్కడ నేడు నూనె బేహారులగు పారశీకులమీది యభియోగము విచారణ కానున్నది. సంతకు వచ్చిన వర్తకులు పలువురు చూచుట కచ్చట చేరిరి.

ఈ అధికరణస్థానము తాత్కాలికముగా నా సంతలోని వివాదములు తీర్చుట కేర్పడినది. అట్టివానికి అముఖ్యన్యాయస్థానము లని పేరు. అట్టివానిలో రాజు స్వయముగా నెన్నడు ధర్మాధికారిగా నుండడు. రాజనియమితుడైన ప్రతినిధి ముద్రాధికారములతో న్యాయనిర్ణయము చేయును. అందువలన వానికి ముద్రిత న్యాయస్థానము లను సంజ్ఞకూడ కలదు.

ఆది తాత్కాలికముగా కట్టిన మందిరమైనను చూచుట కెంతయు ముచ్చటగా నుండెను. అక్కడ చేరినవారి కందరకు చల్లదనముకొరకు నీడగల వృక్షములు చుట్టు నుండెను. దాహము తీర్చుకొనుటకు నీటివసతి యున్నది.

రాజమహేంద్ర పురము వర్తకులలో విశేషసంపన్నుఁడగు గురునాథశ్రేష్ఠియందు ధర్మాధికారి. అతడు ధర్మాసనముపై ప్రాఙ్ముఖుడై కూర్చుండెను. అతని సమీపమున కుడివైపున ఉత్తరముఖుడై ప్రాడ్వివాకు డాసీను డయ్యెను. ప్రాడ్వివాకునికి దక్షిణమున నైదుగురు సభ్యులను ఉత్తరముఖముగనే కూర్చుండిరి. ఆ సభ్యులు క్రిందటి సాయంకాలము రాజశాసనము లందుకొనిన ఖండకోటి కన్నర దేవుడు ఇత్యాదులే.

ధర్మాధికారికి ఎడమవైపున లేఖకుడును ఎదురుగా గణకుడును నాసీనులైరి. విశాలమైన యా సభాస్థానములో విచారణ చూచుటకు వచ్చిన జనులందరు సుఖాసనములపై నుపవేశించిరి. అక్కడ సందడి లేకుండ సర్దుచు సాధ్యపాలుడు నూరు కళ్ళతో నంతటను కనిపెట్టుచుండెను.

ఆ మందిరములోపల కుడ్యములమీద దేవతలయు, స్వర్గములయు, నరకములయు చిత్రములు సజీవప్రతిమలవలె చిత్రించి యుండెను. ఈ స్థానములో నసత్యము చెప్పినవారికి నరకము తప్పదనియు, సత్యవాదులకు స్వర్గాది దివ్యలోకములు ప్రాప్తించు ననియు ప్రత్యక్షముగా నా చిత్రములు స్పష్టము చేయుచుండెను.

మరియు నా మందిరము పరిశుభ్రముగా నుండి సువాసన గల ధూపద్రవ్యములతో వాసించుచుండెను. పచ్చని ఆకులతోడను నానావర్ణములుగల పుష్పములతోడను అలంకృత మయ్యెను. ఒకప్రక్క నందులో నగ్నిహోత్ర మున్నది. దాని సమీపముననే జలకుంభ మొకటియు, నవధాన్యములును, నవరత్నములును, సువర్ణములును గలవు. అవి వర్ణాదిభేదములనుబట్టి బేధించు ప్రమాణద్రవ్యములు. ప్రాడ్వివాకుని సమీపమున నొక రమ్యమైన పేటికలో ధర్మశాస్త్రగ్రంథములున్నవి.

ముందానాడు పారశీకవర్తకులమీది యభియోగము విచారణ కానున్నది. అందులో నిన్నటి సాయంత్రము వర్తకులను బంధింప నియమించిన రావర్తి బేతయ 'సూచకుడు.' సూచకు డనగా, ప్రజాసామాన్యమునకు గాని, ప్రభువుకు గాని సంబంధించిన నేరములు పట్టుకొనుటకు రాజుచే నియమితుడైన యుద్యోగి. సూచకుని స్థానమునకు ఎదురుగా పారశీకు లైదుగురు నిలుచుండిరి. వారిముందు వారిచేత వారి పక్షమున వాదించుటకు నియోజితుడైన నియోగి యొక యాసనముపై కూర్చుండెను.

ఈ పారశీక వర్తకులమీద రెం డభియోగములు వచ్చినవని ముందుగా సూచకుడు తెలిపెను. ఆ మాటలు వినినంతనే పారశీకుల నియోగి యేదో చెప్పుటకు లేవబోయెను. ఇంతలో ప్రాడ్వివాకుడు సూచకునితో నిట్లనెను :

"ఒక్క విచారణలో రెండు నేరములు నిర్ణయించుటకు వీలులేదు. మీ రెండు అభియోగములలో ముందు మీరు అల్పమైన దనుకొనునది మీరే నిశ్చయించుకొని యదిమాత్రమే యిప్పు డీ వ్యవహారములో నివేదింపవలెను. రెండవదాని స్వభావ మిట్టిదని సూచించుటకుకూడ వీలులేదు. ఒకటి నిర్ణయము కానిది రెండవదాని సంగతి యెత్తుట అసంగతము. పరికీర్ణార్థము అంగీకరింపరు."

ప్రాడ్వివాకుని మాటలకు బేతయ తలయొగ్గి యిట్లు మనవి చేసెను:

"చిత్తము ! కాని ప్రథమాభియోగములో ప్రథమసాక్షి యెందుచేతనో రాలేదు. అతని కేదో ప్రమాదము సంభవించిన దని సందేహించుచున్నాను, అందువల్ల ద్వితీయాభియోగము ముందు నివేదన చేయుటకు తమ యనుజ్ఞ వేడుటకే ఆ విషయమును ప్రస్తావించితిని."

"అట్లు చేయుట న్యాయసమ్మతము కాదు. బంధితులైన ప్రతిపక్షులను సాక్షి రానందున విచారణ లేకుండ రాజబంధములో నుంప వీలు లేదు. మీ ప్రథమాభియోగము ప్రారంభింపవలసినది." ఇట్లు ప్రాడ్వివాకుడు నిష్కర్ష చేసెను.

8)

పారశీకుల నియోగి చెప్పుకొన దలచినది ప్రాడ్వివాకులే నిర్ణయించి నందున సంతుష్టుడై మాట్లాడక కూర్చుండెను. ప్రాడ్వివాకుల నిర్ణయము నకు సూచకుడు వినయముతో చిత్తమని తలయొగ్గి ప్రారంభించెను.

ముందు, సూచకుడు తన పేరు రావర్తి బేతయ యని చెప్పి, తండ్రి పేరు, కులము, గోత్రము, వయస్సు, గ్రామము, విషయము ఇత్యా దికము చెప్పెను. అతడు వైశ్యుడైనందున 'సాధ్యపాలు' డాతని చేత నవ ధాన్యములును సువర్ణమును ఉంచి వానిమీద 'ప్రమాణపూర్తిగా సర్వము నిజమే చెప్పెద'నని ప్రమాణము చేయించెను. ఆ పిమ్మట నతడు 'ప్రతిజ్ఞ' ప్రారంభించెను.

ఆ వర్తకులమీద మోపిన నేరము సంగ్రహముగా నిది: వారు తెచ్చిన నూనెలో సరిక్కిసరి నీళ్లో మరి ఇతర ద్రవపదార్థమో కలిపినారు. అందువల్ల నది నిరుపయోగమైనది. తక్కువమూల్యమున కమ్ముచున్నా మని కొనువారిని మోసపుచ్చి పనికిమాలిన సంకరవస్తు వమ్మినారు.

సూచకు డీ విధముగా నేరముస్వభావము చెప్పి, యది ఋజువు చేయనున్న సాక్షుల పేర్లిచ్చెను. వా రమ్ముచున్న నూనెకూడ రాజభటులు తెచ్చినారనియు విన్నవించెను.

అతడీ ప్రతిజ్ఞ చేయుచుండగా ప్రాడ్వివాకుని యనుజ్ఞప్రకారము లేఖకుడు అదియంతయు ముందొక ఫలకముమీదవ్రాసి ప్రాడ్వివాకునికి జూ పెను. ప్రాడ్వివాకుడది యందరి సమక్షమున బిగ్గరగా చదివి, యెవరి యా క్షేపణయు లేదని చెప్పినమీదట నది పత్రముమీదికెక్కించుటకు లేఖకుని నియోగించెను.

ఆ పిమ్మట ప్రాడ్వివాకుడు పారశీకవర్తకులను తమ యుత్తరము చెప్పవలసినదని కోరెను. వారి పక్షమున నియమితుడైన నియోగి లేచి ఆ వర్తకులకు ఆంధ్రభాష సరిగా రానందునవారి పక్షమున నుత్తరము చెప్పి వాదించుటకు తన కధికారపత్రమిచ్చినారనియు, తన కనుజ్ఞ యీయవలసి నదనియు వేడెను. ప్రాడ్వివాకుడందుకు అభ్యంతరముండదని చెప్పగా గురునాధశ్రేష్ఠి యా యధికారపత్రముపై నంగీకారముద్ర వేసెను.

సాధ్యపాలకు డా పారశీకవర్తకులచేత వారు వ్యాపారముచేయు

నూనె పట్టించి 'సత్యమే చెప్పుదు'మని ప్రమాణము చేయించెను. అంతట వారి నియోగి యుత్తరము ప్రారంభించెను. దాని సారాంశ మిది:

"ప్రతిపక్షులలో మొదటి యిద్దరు మాత్రమే యా సరుకు బేహారులు. మిగిలిన ముగ్గురు వారి సేవకులు. తమ యజమాను లమ్మమని నియమించిన వస్తువును నిర్ణయించిన ధరకు అమ్ముచుండిరి. వారి కా సరకులోని దోషములు తెలియవు. కనుక వారు ముగ్గురును నిర్దోషులు. వర్తకు లిద్దరును తాము తమ దేశములో సంపాదించిన వస్తువు, వచ్చినది వచ్చినట్లు అమ్మించుచున్నారు. దాని లోపాలోపములు ఎరుగరు. వారు ప్రయత్న పూర్వకముగా నూనెలో నీరుగాని, మరియొక ద్రవ్యముకాని కలుపలేదు. నూనె పరీక్ష చేయించవచ్చును. వారెవ్వరును దండార్హులు కారు."

ఈ యుత్తరముకూడ ప్రాడ్వివాకుని సూచనలలో ముందు ఫలకము మీద లేఖకుడు వ్రాసి, ప్రాడ్వివాకుడు అందరికి వినిపించి ఆమోదించిన మీదట లేఖకుడు పత్రముమీది కెక్కించెను.

అంతట సాక్షివిచారణ ప్రారంభించెను. ఒక్కొక్క సాక్షినే విచారించుటకు ముందుగానే ఆ సాక్షి దోషము లేమైన నున్నచో ప్రతికక్షి యవి నిరూపింప వలెను. అట్లు తృప్తికరముగా నిరూపించినచో నా సాక్షి వాఙ్మూలమును తీసికొనరు. సాక్షివిచారణ ప్రారంభించిన పిమ్మట సతని దోషములు ప్రతికక్షి చెప్పవీలులేదు. సాక్షుల విచారణ యంతయు ప్రాడ్వివాకుడే చేసెను. పైని వివరించిన విధముగానే లేఖకుడు దానిని ముందు ఫలకముమీద వ్రాసి ప్రాడ్వివాకుడు చదివిన పిమ్మట పత్రముమీది కెక్కించుచుండెను.

సాక్షు లందరు ఎవరి కులధర్మము ప్రకారము వారును, ఎవరి శ్రేణి ప్రకారము వారును వారివారికి పవిత్రమైన వస్తువుపట్టి, దానిమీద ప్రమాణము చేసిరి. బ్రాహ్మణులు అగ్నిమీదను, క్షత్రియులు ఖడ్గాద్యాయుధముల మీదను, వైశ్యులు ధాన్యము, బంగారముమీదను, శూద్రులు వారివారి వృత్తి సాధనలమీదను ప్రమాణము చేసిరి. మరియు ప్రాడ్వివాకుడు సత్యము చెప్పినవారికి పుణ్యలోకములు వచ్చుననియు, అసత్యము చెప్పినవారు

స్వయముగా నరకము పొందుటేకాక వారి తండ్రి తాతలనుగూడ పుణ్య లోకచ్యుతులను జేయుదు రనియు వివరించి హెచ్చరించుచు వచ్చెను.

సాక్షుల విచారణవలన వర్తకులు స్వయముగా అమ్మినదియు, అమ్మించినదియు స్వచ్ఛమైన నూనె కాదనియు, అది దీపము వెలిగించగనే వెలుగక చిటపట లాడసాగినదనియు, వారు మంచినూనె యని మోస పోయి విక్రయించుకొని రనియు వ్యక్తమయ్యెను. రాజభటులు పట్టుకొని వచ్చిన నూనెసిద్దెల పరీక్షయు వారి నేరమును స్థిరపరచెను. కాని సేవకులైన మూడవ, నాల్గవ, యైదవ ప్రతివక్షులు నూనె మిశ్రణము ఎరిగినట్లు సాక్ష్యము లేకపోయెను.

సూచకుడు మొదటి సాక్షియగు పొన్న యనువాడు, ఎందువల్లనో ఆ యుదయమునుండి కనపడలేదనియు, నతనిని విచారించినచో నా ముగ్గురి నేరముకూడ విస్పష్టమగు ననియు, నందుకు మరునాటి వరకైనను వ్యవధి కావలెననియు విన్నవించెను. సభ్యులందరు నందు కేక గ్రీవముగా నంగీకరించినచో ధర్మాధికారి యట్టి యవకాశ మీయవచ్చునని ప్రాడ్వి వాకుడు తెలియజెప్పెను.

గురునాథశ్రేష్ఠి సభ్యుల యభిప్రాయ మడిగెను. సభ్యులుగా నిర్ణీతులైన శ్రేణీ పతులందరును అనుభవశాలు రైనందున ఆ ముగ్గురుకూడ నిర్దోషులయి యుండుట యసంభవమని తలంచిరి. అందువలన మరునాడు మరల నధికరణ స్థానమునకు వారు రావలసినచో స్వకార్య భంగ మగును. ఐనను ధర్మదీక్షచే వచ్చుటకు ఏకగ్రీవముగా సమ్మతించిరి. అంతట గురు నాథశ్రేష్ఠి యా విచారణ మరునాడు పూర్తి కావింతునని చెప్పి యా ప్రతి వక్షులను మరునాడు తీసికొని రావలసిందని రాజభటుల కాజ్ఞాపించెను. వారిని పంపుటకు ముందు, వారికి రాజభటులు కావలసిన సౌకర్యములు చేయుచున్నదియు, లేనిదియు విచారించి, లోపములు జరిగినచో తనకు చెప్పికొనినచో సవరింతునని ధర్మాధికారి స్పష్టపరచెను.

ఆ పిమ్మట నింకను కొన్ని వ్యవహారము లానాడు విచారణ జరిగెను. కాని అందులో నెక్కువ భాగము సంప్రతిపత్తి— ఒప్పుదల— మీదనే జరిగిపోవు చుండెను, అందువలన విచారణలో నాలస్యము లేదు.

ముందు పూర్వపక్షి ప్రతిజ్ఞ వ్రాయుటకే ఎక్కువ ఆలస్యం పట్టును. ప్రతిపక్షి తన సంప్రతిపత్తి చెప్పగనే ధర్మాధికారి లేఖకునికి చెప్పి, జయపత్రము వ్రాయించి ముద్రిక వేసి పూర్వపక్షి కిప్పించు చుండెను. వ్యవహారములో నుభయపక్షములుకూడ నబద్ధ మాడుటకు వెరచుచున్నందున అన్ని వ్యవహారములును సుకరముగా తేలిపోవు చుండెను.

సూర్య సమయమునకు రెండు గడియలు ముందుగ న్యాయ స్థానము మూసివేసిరి.

# 10

ఆ పగలంతయు క్రీడాద్వీపములో వివిధ క్రీడలు జరిగెను. ఆ రాత్రి కట వినోద మేమియు లేదు. నన్నయభట్టారకుడు భోజనానంతరము ఇంటివద్ద పురాణ కాలక్షేపము చేయుచుండెను.

విద్యార్థి యొకడు శ్రావ్యమైన కంఠముతో వ్యాస మహాభారతము మూలము చదువుచుండెను. నన్నయభట్టారకుడు మధురవాక్కుతో మూల గ్రంథసారమును వినిపించుచుండెను.

అది మండువా లోగిలి. తూర్పు సింహద్వారము. విశాలమైన మధ్యభాగములో నన్నయ ప్రాఙ్ముఖుడై యుపవేశించియుండెను. పాఠకు డుత్తర ముఖముగా కూర్చుండెను. శ్రోత లెందరో స్త్రీలును, పురుషులును జేరి ఆలకించుచుండిరి. అందులో చాతుర్వర్ణ్యమువారు నున్నారు. మహాభారతము నన్నయ కభిమాన గ్రంథమైనందున అది నన్నయ ముఖము ననే వినవలె నని పండిత పామరులలో నొక ప్రసిద్ధి వ్యాపించి యుండెను. ఆ కాలక్షేప సమయములో నాయింటి మధ్యభాగమే కాక యింటి ముందున్న యరుగులుకూడ జనసమూహముతో నిండిపోయెను.

అప్పు డక్కడ చేరిన బ్రాహ్మణ పండితులలో ముఖ్యముగా నెన్న దగినవారు వృద్ధుడగు భీమనభట్టును, పావులూరి మల్లనయును; క్షత్రియులలో నెల్లూరినుండి వచ్చిన బిజ్జన; వైశ్యులలో సిరివిసెట్టి; చతుర్థ కులజులలో అద్దంకి గౌడగు నన వేమారెడ్డియు ముఖ్యులు. వారిలో బిజ్జన చోళ

కలహించిన పదముగ్గురు పల్లవుల నొక్కమారుగ జయించి, చోళ ప్రతిష్ఠ నిల్పిన వీరసింహుడు. సిరిపిసెట్టి వేంగీమండలములో ధాన్యవర్తకులలో నగ్రగణ్యుడు. అనవేమారెడ్డి యద్దంకి గ్రామాధికారి. బిజ్జనయు, వేమారెడ్డియు క్రీడలకే వచ్చియుండిరి. వారెప్పుడు రాజమహేంద్రపురము వచ్చినను నన్నయభట్టారకుని యింట మహాభారత పురాణ కాలక్షేపమునకు తప్పక వెళ్ళి శ్రద్ధగా వినుచుందురు.

ఆనాటి రాత్రి చదువుచున్న ఘట్టము అనుశాసనికపర్వము లోనిది. ఉమామహేశ్వర సంవాదములో శివుడు పార్వతికి రాజత్వమహిమ చెప్పి అహింసా స్వరూపము వివరించెను. అధిక తపస్సు చేసినవాడు తపః ఫలమువల్ల రాజై యఖిల జనములవలన మ్రొక్కులు పొందు నధికారము కలవా డగును. అతడు విజితేంద్రియుడై, ధర్మపరుడై, కామక్రోధములు లేక దండింపవలెను. చారదృష్టితో శత్రుకృత్యములు స్వదేశ పుర పరివార విధములు చూచుచుండవలెను.

ఇట్లు రాజత్వమహిమను విధులను వర్ణించి అహింసా స్వరూపము ప్రవచనము చేసెను. అందులో జైన, బౌద్ధుల యహింసాతత్త్వమును, వైదికధర్మప్రకారము అహింసా ధర్మస్వరూపమును ప్రత్యేకముగా వివరించెను.

జైనులు చీమను త్రొక్కినచో హింస వచ్చునని అడుగులు లెక్కపెట్టుకొనుచు కుంచెకోలతో నేల చిమ్ముకొనుచు వీథులవెంట నడిచెదరు. ముక్కునకు పేలిక యొకటి అడ్డము కట్టికొందురు. వడపోయనిది నీరు త్రావరు. దీపము వెలిగించినచో దానిమీద పురుగులు పడి చచ్చిపోవునని సూర్యాస్తమయమునకు పూర్వమే, దీపములు పెట్టకుండ సాయంత్ర భోజనములు ముగింతురు. యజ్ఞములు చేసినచో పశుహింస వచ్చునని యవి చేయరు. వారికి పిపీలికాదిక్షుద్ర జంతువులమీదనంత ప్రేమ: నల్లులకు తృప్తి కలిగించుటకు బలముగల మనుష్యులకు దక్షిణ లిచ్చి వారిని నల్లుల మంచముమీద పరుండజేసి నిద్రచేయింతురు. నిత్యము నిద్రకు ముందును, నిద్ర లేచిన వెను వెంటను, భోజనాంతమునను "బ్రహ్మాక్షయమ్" అను మంత్రము ముమ్మారు నియతముగా జపింతురు.

ఆ మాటలు విని శ్రోతలు విభ్రాంతపోయిరి. పావులూరి మల్లన ఏలనో తల ప్రక్కకు త్రిప్పుకొనెను.

అంతట బౌద్ధుల యహింసా నియమమునుగూర్చి ప్రసంగించెను. బౌద్ధ మతమునకు కలియుగములో ప్రథమాచార్యుడైన గౌతముడు మత్స్యభుక్కు. తుదకు మల్లులలో నొకానొక భక్తుడు పెట్టిన వరాహ మాంసము తిని, అందుపై నతిసారము కలిగిదానితో దేహయాత్ర చాలించెను. చాతుర్వర్ణము చేయు యజ్ఞయాగాదులు చాలింపమనుటకే వారి యహింసాధర్మబోధ! ప్రస్తుతము వారి యాచరణ విధానము మహాచీన తాంత్రికము—అనగా వారి పూజాదులలో మద్యము, భూచర, జలచర, ఖేచర మాంసాదులు నియతముగా కావలెను.

మహాభారతములో నిరూపించు నహింసా స్వరూపము విశిష్టమైనది. అది వేద ధర్మమునే అనువదించును. మనకు అహింస పరమ ధర్మము. అయితే, ఆచరణలో నది సర్వసామాన్యము కాదు. హింస లేనిది లోకయాత్ర సాగదు. దున్నినప్పుడు నాగేటిచాలుక్రింద అనేక ప్రాణులు ప్రాణములు విడుచును. అట్లే రోటియందును, తిరుగలిలో, పొయ్యిలో, జలానయనమందు ఎన్నియో పురుగులు చనిపోవును. దీపము వెలిగింపగా నెన్నియో జీవులు నశించును సంసారయాత్ర యీ సూనములు లేనిదె నడువదు. కాని ఆ ప్రాణులను మనము చంపవలెనను నహంకారముతో చంపినవిగావు. వానికి ఆయుస్సు తీరగా నట్లు పడి చని పోవును. చంపినవారు మేము చంపినా మనుకొనరు. అందువల్ల వారికా పాపము రాదు. పుణ్యపాపములకు బుద్ధి మూలము. ఏది ఎట్లున్నను పంచ సూనముల దోష ముపశమించుటకు పంచయజ్ఞములు గృహస్థులు చేయుచున్నారు. ఇవి గృహస్థుల యహింసా  ము.

సర్వకర్మ పరిత్యాగము చేసిన పరమహంసలకు అహింస పరమ ధర్మము. వారు సర్వభూతములకు అభయప్రతిజ్ఞ చేయుదురు. వారు నిప్పు వెలిగింపరాదు. చెట్టునుండి యూకైనను త్రుంచరాదు. కోసిన కాయనైనను తరుగరాదు. ఈ విధముగా అహింసాధర్మము ఆశ్రమ వ్యవస్థాక్రమ

ముగా విధించియున్నది. లోకయాత్రకు భంగములేని విధముగా గృహస్థులకు అహింస నియమితమై యున్నది.

ఈ విధముగా చెప్పుచుండగా శ్రోతలలో పలువుర కా ధర్మ సూక్ష్మము లాశ్చర్యజనకములై, మహాభారతమును పొగడజొచ్చిరి. నన్నయ సంతష్టుడై "వ్యాసరచిత మహాభారత మహిమ ఎన్నిమారు లుగ్గడించినను సంపూర్ణముగా చెప్పలేము. అది సాక్షాత్తుగా వేదతుల్యమైనది. ఒక్క వేదవ్యాసమహర్షికే అది నిర్మింప సాధ్య పడినది. భాషాంతరములలో వేదవ్యాసుని వాక్యసారమే లేశమో గ్రహించి, స్వతంత్రించి మార్పులుచేసి, మేమును భారతకర్తలమే, వ్యాసభారతమునకు మెరుగులు పెట్టినామని గర్వించు నవ్యక్తులుకూడ కలరట. అట్టి దుర్విదగ్ధులుందరని ఈ మధ్య రాజసభలో మన పావులూరి మల్లనార్యుడు చెప్పువరకు నే నూహింపలేనైతిని, మా కీ కోశము పరమదైవము!"అని పురాణకథనము పూర్తి గావించెను.

ఇంతలో భట్టారకుని ధర్మపత్ని అరుంధతి కర్పూరహారతి వెలిగించినది. భట్టారకుడు కోశపూజ గావించి—

'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతామ్, న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,

గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యమ్, లోకా స్సమస్తా స్సుఖినో భవంతు, అని స్వస్తి చెప్పెను.

"మనము కోరునది బ్రహ్మక్షయము కాదు; జైనక్షయముకూడ కాదు"అనుచు శ్రోతలు నవ్వుకొనసాగినారు. ప్రసాదస్వీకరణముచేసి వచ్చినవా రందరు నన్నయయొద్ద సెలవు తీసికొని వెళ్ళిరి.

వృద్ధుడగు భీమనభట్టుమాత్ర మాగిపోయెను.

"నన్నయభట్టారకా, నీకుచిన్నతనము పూర్తిగా పోలేదోయి!—" భీమన భట్టు ప్రారంభించెను.

"ఈ నా డెవరికైనను మనస్తాపము కలిగించినానా? జైనులుగాని బౌద్ధులుగాని యెవరైనా వచ్చిరా?"—నన్నయ చిరునవ్వుతో ననెను.

"నిన్నే మనందు నన్నయా? పావులూరి మల్లనముఖము నీవు చూడలేదా?"

"ఏమి? పాపమతని నే నే మనలేదే!"

"ఈనాటి పురాణ మంతయు మల్లనను అపహసించుచున్నట్లు తోచినది. శ్రోతలు పలువు రతని ముఖము చూచుట నీవుగమనింపలేదా?"

"లేదు. అతని దేమున్నది?"

"ఈ మధ్య మల్లన బెజవాడ వెళ్ళి, త్రికాలయోగ సిద్ధాంతదేవరల జైన వసతిలో దిగంబరునివద్ద మంత్ర స్వీకారము చేసివచ్చినది నీ వెరుగవా?"

నన్నయ నిర్ఘాంతపోయెను. "నాకీ లోకవార్తలు తెలియవు. నా నిత్య నైమిత్తికకర్మలతో పాఠములతో పఠనముతో ఇతర ప్రసంగములు రావు కాదా?—అయినను నేను బుద్ధిపూర్వకముగా చేసిన హింస కాదు కనుక నాకు పాపమంటదు."అని చిరునవ్వు నవ్వెను.

అంతట "నత్తిబ్రాహ్మణు డెవరో ఎరుగుదురా?"అని నన్నయ ప్రశ్నించెను

భీమనభట్టు : అతని విషయమున జాగరూకతతో నుండవలె!

నన్నయ నమ్మలేక, "ఎందువల్ల?"నని యడిగెను.

"ఆ బ్రాహ్మణుని నత్తి నిజమని నమ్మెదవా?"

నన్నయ : నత్తి లేనిచో నత్తిగా మాట్లాడుట ఏమి సౌఖ్యము?

భీమన : స్వస్తి చెప్పుటలో నట్టు ఉన్నదా?

నన్నయ : దాని కేమి? నేను ఒక ఘనపాఠిని ఎరుగుదును. ఆయన ఘన నిరర్గళముగా చెప్పగలడు. కాని పాపము సంధ్యా వందనము ప్రారంభించిన గాది అర్ఘ్యప్రదానము పూర్తియగు నప్పటికి చేసినదే చేసి జాము పట్టించును. ఏదో ప్రారబ్ధముచే నత్తి ప్రాప్తించును.

భీమన : దానికీ దీనికీసంబంధము లేదు. అంత నత్తి పనస చెప్పు నప్పుడొక చోటనైన రావద్దా-

నన్నయ : పెద్దలు మీకు ప్రతిదానియందు సందేహమే!

భీమన : కాదోయి, మొద లతడు బ్రాహ్మణు డని నమ్ముదువా?

నన్నయకు నవ్వు వచ్చి చెవులు మూసుకొనెను.

"మీరు ఎంత అనుమానించుచున్నను నాకు మాత్ర మాత డెవరో పూర్వజన్మలో నా పుత్రునివలె కనపడుచున్నాడు. అతని ముఖ మెప్పుడును చూచిన గుర్తులేదు. కాని అతని కంఠస్వర మేదో పూర్వపరిచిత మైన దానివలె తోచుచున్నది. పలకరింత మనుకున్న నందకున్నాడు."

"పూర్వపరిచితు డంత పారిపోవుట యెందుకు? అతని కెంత యశ్వకుశలత యున్నదో గమనించితివా? అతడు క్షత్రియుడని నాకు తోచుచున్నది. అతడెవరో గూఢచరుడు. మన రాజభటు లతని నను గమించి కనిపెట్టుచున్నారు."

ఆ మాటలకు నన్నయ నిర్ఘాంతపోయెను. "తపోనిష్ఠులైన బ్రాహ్మణులను గూడ రాజభటులు వెన్నంటుదురా, రాజరాజనరేంద్రుల రాజ్యములో?"

భీమన : నన్నయా, నీ వెంత లోకజ్ఞుడ వని ప్రతీతి యున్నను మా బోంట్లకు లోకానుభవ మెక్కువ. శ్రేయస్సు కోరు రాజు చారచక్షువై యుండవలె నని నేడేకదా పురాణ ప్రవచనము చేసితివి. నామాట విని ఆ నత్తివానిని నమ్మవద్దు. అతనికి దూరముగా నుండుట శ్రేయస్కరము:

ఇట్లాదరముతో నన్నయకు చెప్పి, భీమనభట్టు భారతము చదివిన విద్యార్థి కైదండతో స్వగృహమునకు బోయెను.

భీమన యనుభవముమీద నన్నయ కెంతయో గౌరవము కలదు. ఐనను నన్ని ఉత్తమబ్రాహ్మణుడు కాడని నమ్మలేకపోయెను. అతని ముఖములోని సౌమ్యత, మాటలో తేటదనము, వాక్కులో సంస్కృతి— అట్టివాడు గూఢచారి యగుటెట్లు? భీమనది సర్వదా అతిగా సందేహించు స్వభావము.

మల్లన దిగంబర శిష్యు డన్నది జ్ఞప్తికి వచ్చి, మనస్సు వట్టలేక యరుంధతితో "వింటివా? మల్లన, పాపము, బెజవాడలో దిగంబరునివద్ద

మంత్రదీక్ష పొందినాడట ! ఆ మహామాయ బుద్ధిమంతులనుకూడ బల వంతముగా మాయలో ముంచివేయు నట!" అనెను.

# 11

రాజమహేంద్రపుర మంతయు నాల్గవనాటి క్రీడా వినోదములు చూడవలె నని మహోత్సుకతతో నుండెను. సామాన్య కర్షకులును సం పన్నులును ఉన్నతోద్యోగులును సామంతదండనాధులును అందరు వస్త్రా లంకారభూషితులై శృంగారమూర్తులవలె క్రీడాద్వీపమునకు ప్రయాణ మగుచుండిరి. నగరమంతటను తూర్య వినాదములును, మంగళవాద్యము లును ఆనందపరవశులగు జనుల కోలాహలమును వినవచ్చుచుండెను.

కాని పాపము, పావులూరి మల్లన స్థితి మిక్కిలి విషాదకరముగా నుండెను. అతనిభార్య మాచమ్మ. ఆమెయే యా యింటి గృహలక్ష్మి. పెద్దలును చిన్నలును ఆమె సద్గుణసంపత్తిని కొనియాడనివారు లేరు. ప్రతిదినము నుషఃకాలమున లేచి భగవన్నామస్మరణము చేయుచు గృహ కృత్యములు చేసికొనుచుండు నామె యీ నాడు శయ్యనుండి లేవలేదు. ఆమె నిద్రపోవుచుండలేదు. కన్నులు రెప్పవాల్పక మిడిగ్రుడ్లతో తెరచి యుంచుకొన్నది. కాని యామె మేలుకొనియున్న జాడయులేదు. ఎవరు పలుకరించినను పలుకదు. సంజ్ఞనైన జేయదు. మూర్ఛయని తలంచుటకు దేహము బిగిసిలేదు. నాడి సౌమ్యముగా కొట్టుకొనుచున్నది. శరీరమున జ్వరములేదు. ఆమె తిరుగకున్న యా యిల్లు కాంతివిహీనమై కనుపట్టు చున్నది. మల్లన యేమియు దోచక నిర్విణ్ణుడై యొకమూల చాపమీద కూర్చుండెను.

మల్లన పుత్రుడగు సివ్వన వెళ్ళి వైద్యుని బిలచికొనివచ్చెను. అతడు జాగరూకతతో నాడి పరీక్షించి దేహమును పరీక్షించెను. తుదకు ఆ వ్యక్తికి కెట్టి రుగ్మతయు లేదని నిర్ధారణచేసి మందులనవసరమని చెప్పి వెడలిపోయెను.

ఇరుగుపొరుగుల నున్న యమ్మలక్కలు చేరి పరిపరి విధముల

వాపోజొచ్చిరి. వృద్ధస్త్రీ లెవరికి తోచిన వైద్యము వారు చెప్పిరి. జబ్బు లేకపోయినచో మాట్లాడకుండుటకు కారణమేమి? మరియొక వైద్యుని తీసికొని రావలెగాని యొక వైద్యుని మాటలు నమ్మి చికిత్స చేయకుండుట యవివేకము కాదా! కాని ఒకరు చెప్పు వైద్య మింకొకరు చెప్పరు. ఒకరు సూచించు వైద్యు డింకొకరికి పనికిరాడు.

పాపము, సిప్పన ఎందరో వైద్యులను పిలిపించెను. సామాన్యముగా నొక వైద్యుని మాటతో నింకొక వైద్యునిమాట కలియదు. కాని వింతగా మాచమ్మ రుగ్మత విషయమున వైద్యులందరికి నేకవాక్యత కుదిరెను. అందరు నొకేమాట. ఆమె శరీరములో నే మాత్రము జబ్బు లేదు మం దనవసరము. అయితే, ఎందుకు మాట్లాడదు? చెప్పలేము. కను లెందుకు మూయదు? చెప్పలేము. కాని యామె దేహములో నెట్టి రుగ్మతయు లేదని చెప్పగలము.

ఆ మాటల కక్కడ చేరినవారికి నవ్వురాక మానినది కాదు; కాని యప్పటి మాచమ్మ స్థితి చూచి వచ్చుచున్న నవ్వెల్లో లోలోపల ప్రయత్నపూర్వకముగా నాపుకొనజొచ్చిరి. చివర కది యేదియో ప్రయోగమో భూత చేష్టయో యని నిశ్చయించిరి.

అంతట సిప్పన యక్కడివారు సూచించిన భూతవైద్యులయొద్ద కెల్ల వెళ్ళి విభూతితీర్థములు తెచ్చెను. విభూతి యుపయోగింపదు. తీర్థము నోట మ్రింగుడు పడదు.

తుదకు మల్లన యింటిలో పరిచారకుడు మల్లనకు నమస్కరించి యిట్లు చెప్పెను: "బాబూ, దండము. సారంగధరుని సంఘారామములో ననేకులు భూతవైద్యు లున్నారు. నా భార్యకు వచ్చిన బాధ నొకసారి వారే చేతితో తీసివేసినట్లు నయము చేసినారు."

మల్లనకు సంఘారామమునకు పంపుట ఇష్టములేదు. అయినను పరిచారకుడు మరిమరి చెప్పుచుండగా సార్థముగా కుమారునివంక వీక్షించెను. కుమారు డా సేవకుని వెంట నిడుకొని సంఘారామమునకు బోయి జేతారినాథుని దర్శించి విషయము నివేదించెను. జేతారి యెంతయు జాలి

నొంది మంజుశ్రీ పూజకు డగు వజ్రకీర్తి యను శ్రమణుని పిలిచి మల్లనభార్యకు చికిత్స చేసి రమ్మని పంపెను.

వజ్రకీర్తి వెంటనే భిక్షాపాత్ర చేత బట్టుకొని సివ్వనతో బయలు దేరెను. సివ్వన తెచ్చిన శకటముకూడ నెక్కక యతడు కాల్నడకనే మల్లనయింటికి వచ్చెను. మల్లన యతనికి సగౌరవముగా నెదురుపోయి అభివందనముచేసి భిక్షావేళ యైనందున ముందు భిక్ష చేయించి యా పిమ్మట మాచమ్మ నాతనికి చూపెను.

శ్రమణుడు భిక్షాపాత్ర శుద్ధిచేయగా మిగిలి యంటుకొనియున్న యన్నకణ మొకటి తీసి నేలమీద మృత్తికతో కలిపి రంగరించి తన యంగుష్ఠముతో మాచమ్మ నొసట తిలకము పెట్టెను.

అంతవరకును నిశ్శబ్దముగా నున్న మాచమ్మ యా బొట్టు ముఖము నకు అంటిన క్షణమే నోరు విప్పి యిల్లెగిరిపోవునట్లు కెవ్వుమని కేక వేసెను. ఆ కేకకు మల్లన అదిరిపడి దిగంబరునివద్ద నుపదేశము పొందిన మంత్రము భయముతో స్మరింపనారంభించెను. సివ్వన కేమియు దోప కుండెను. కాని వారి సేవకుడు మాత్రము సంతుష్టుడై, "బాబూ, మా యింటగూడ సరిగా నింతే! ఒక్కక్షణములో మాచమ్మతల్లి లేచి యెప్పటి వలె మాట్లాడును" అనెను.

కాని సేవకు డనుకున్నంత శీఘ్రముగా మాచమ్మ స్వస్థురాలు కాలేదు. కొంతపొద్దామె యేమో కేకలు వేయును కొంతతడవు గొణుగు కొనును. ఆ గొణుగుడులో మధ్యమధ్య బౌద్ధగ్రంథము లప్పగించును. వజ్రకీర్తి నిశ్చలదృష్టితో మాచమ్మ కండ్లలోనికి చూచుచు నామెనొసట తన బొటనవ్రేలు తీయక మనస్సులో నేదియో కొంచెము పెదవులు కదల్చుచు జపించుచుండెను.

కొంతసేపటి కామె 'సిద్ధసారంగూ! సిద్ధసారంగూ! సిద్ధసారంగూ!' అని కేకలు పెట్టనారంభించెను.

ఆపై నామెకు సిద్ధసారంగుస్మరణ తప్ప వేరు మాటలు లేవు. ఒకసారి దీనముగా నేడ్చును. ఒకసారి పండ్లు బయటపెట్టి వికృతముగా నవ్వును. ఒకసారి బొబ్బలిడును. ఏమి చేసినను సారంగుస్మరణమే!

ఇంటిలో కల్లోల మతిశయించెను. ఇంతలో వీధియరుగుమీద జనులు కూడిన యలజడి యయ్యెను. వెంటనే యక్కడినుండి స్ఫుటమై గంభీరమై భయప్రదమైన కంఠముతో నీక్రింది పద్యము వినవయ్యెను:

"ఛీ! సారంగు బరేతరాణ్ణిలయసం సేవార్తపై శాచునిన్
ఓసీ, సిద్ధు డటందువా? యెఱుగవాకొక్క, దక్షవాటీశ హే
లాసంజాతవరుండు భీమకవి మల్లన్నాంగనా క్షోణివే
దాసీనుండయి వేచియుండ విదె, ధైర్యం బున్న నో రెత్తుమా!"

ఆ పద్యము విని యందరు వడకుచు నిర్వాక్కులైరి. ఆ పద్యార్థము తెలియని వారికిగూడ నా కంఠస్వరమే యేదియో చెప్పరాని భయ మావేశింపజేసెను. ఎవరును కదలలేకపోయిరి.

ఇంతవరకును మిక్కిలి వాచాలమైయున్న మాచమ్మ కంఠముకూడ స్తంభించెను. వజ్రకీర్తికి ముఖములో రోషము వ్యక్తమయ్యెను. చుట్టు నున్న వారికతనియందు దురభిప్రాయము కలిగినట్లు అతనికి తెలిసిపోయెను. అంతటితో నతఁడు రోష మినుమడించెను. అంతట నతడు రెండు చేతులు ముకుళించి యాకాశముపై కెత్తి నమస్కరించి కొంచెము సేపు మనస్సులో నేదియో గొణుగుచు మనన చేసికొనెను. అంతట మరల దక్షిణకరాంగుళి మాచమ్మ ఫాలమున కానించి యామె చెవిలో నేదిమో గొణుగుచు చెప్ప జొచ్చెను. అంతట వినువారికి అద్భుతము కలిగించుచు మాచమ్మ యందరు విననట్లీ పద్యము చదివెను.

విధవాపుత్ర, ప్రసిద్ధపూరుషుడవే విన్నాములే నీ కథా
వధి యెల్లం బెదరింపజూతు మము నెవ్వారింగ నెంతో, వృథా
వ్యథ నొందంగ ననాథశ్రేష్ఠియొకొ, అప్పా ల్మెకుక్క
బ్రాహ్మణ్యామో,
అధమా, వాడల వీధులం దిరుగు పోరా, యార్యబాహ్యుండవై!

కఠినవాక్కు ఎన్నడును వచ్చియెరుగని పవిత్రమగు మాచమ్మ నోట నా పద్యము మరింత కటువుగా నుండెను. మల్లన వినలేకచేతులతో చెవులు రెండును మూసికొనెను. అది విన్నవా రెవ్వరును నది సహింప లేకపోయిరి. అందరును ఇంద్రజాలములో చిక్కుకొనిన బొమ్మలవలె

నిశ్చేష్టులయి చూడసాగిరి. శ్రమణుడు మాత్రము సంతోషము విరిసిన ముఖముతో వెకిలినవ్వు చీకటులు వెదజల్లుచు కలయ జూచుచుండెను.

ఇంతలో బయటి అరుగుమీదనుండి ఒక్క హుంకారధ్వని విన వచ్చెను. అది సాక్షాత్తుగా ప్రళయోద్యతుడైన నందికేశ్వరుని రంకెవలెను, కాలభైరవుని గర్జన వలెను విన్నవారి గుండెలు పగిలించునట్లు తోచెను. శ్రమణుడే యాపాదమస్తకము ఉలిక్కిపడి సంచలించెను. మరల వాకిట వితర్దికవద్దనుండి వెనుకటికంటె గంభీరధ్వనితో నీ క్రింది పద్యము విన వచ్చెను.

"రంజితమయ్యె భీమకవి రాక్షసమూర్తి భవన్మదాంధ్యతా
శింజితవాక్శరాహతిని................."

పద్యమాగెను. మాచమ్మ వికృతముగా నవ్వెను. వాకిట గర్భ విచ్ఛేదకస్వరముతో "ఛింధి" అని పద్య మందుకోబడెను.

ఆ రెండక్షరములు విన్నప్పుడు మాచమ్మదేహములో చెప్పరాని బాధ కలదిగా కనుపట్టెను. విలవిల తన్నుకొన నారంభించెను. శ్రవణుని ముఖములో నవ్వు సంపూర్ణముగా నస్తమించెను. అతడు సంచలింప జొచ్చెను. వాకిట పద్యము సాగెను.

"ఛింధి! జగద్వితంబుకాదాకో,
లంజను లంజ యన్నది లంజల జేయును వంశ మంటః...."

పద్య మాగెను శ్రవణుని ముఖములో నెత్తురు లేదు. మరల పద్యము అందుకోబడెను.

"నీ గింజుడు చూతు నేడు___"

పద్య మాగెను. మాచమ్మ దేహము గింజుకొనసాగెను. కొంత సేప టికి మరల పద్యము వాకిట నందుకొనబడెను.

"....గిరికి లిడు...."

అక్కడి కాగగనే మాచమ్మ మంచముమీద బాధతో గిరగిర తిరిగి పోసాగెను. మరల పద్య మందుకోబడెను.

___"గీ యిడుమీ___"

దెబ్బతిన్న యేనుగువలె నామె గీపెట్టసాగెను. మరల పద్య మందు కోబడినది కాని, యీమాటు మరొకవిధముగా సాగెను.

"ఛడీ. ఫడీ!"

ఆ మాటకు మాచమ్మ బుసకొట్టుచు తొక్కత్రొక్కిన త్రాచువలె లేచి, పాప మా వజ్రకీర్తిని చెంపలు రెండును ఎడపెడ వాయింప సాగెను. ఇతరులు అడ్డుపెట్టు వ్యవధానముకూడ లేదు.

పద్యము పూర్తియైనను వాకిట 'ఛడీ, ఫడీ' ఉచ్చరింపబడు చుండెను. ఇచ్చటనెంద రడ్డినను ఆగక మాచమ్మ మహాకాళివలె వజ్ర కీర్తిమీదికి లంఘించి కొట్టసాగెను. మధ్య మధ్య అడ్డము వచ్చినవారికి గూడ నా మర్యాద జరుగుచుండెను.

ఇది చూచి మల్లన వజ్రకీర్తికి నమస్కరించి క్షమాపణ కోరుకొని తన కుమారుని, సేవకుని తోడిచ్చి ఎట్లో దొడ్డివాకిట పంపివేసెను. అతడు వెళ్ళినది తెలిసి కాబోలు వాకిట నున్న కవి ఆవేశ మాపుకొని మౌనము వహించెను. అంతట మాచమ్మ ఒక్కసారిగా నీరసించి తోటకూరకాడ వలె వ్రేలాడుచు మంచము మీద పడిపోయెను.

పావులూరి మలన యంతట భయభక్తులతో నాప్తులతో గలసి గృహాంగణమునకు బోయి యరుగుపై గూర్చున్న యా గంతుకునికి నమ స్కరించి భక్తిశ్రద్ధలతో నింటిలోనికి రమ్మని యాహ్వానించెను.

ఇంతవరకు మండుచున్న శ్మశానాగ్నివలె రూక్షవీక్షణమై యున్న యా యాగంతుకుని ముఖము మల్లన సపర్యలు చేసినంతనే అకస్మాత్తుగా మారిపోయెను. అతడు ఒక్కసారిగా వెన్నవలె కరిగి సాదరదృక్కులు ప్రసరించుచు మల్లనవెంట నింటిలోనికి వచ్చెను. అతనికి మాచమ్మను చూపుటకు గూడ భయపడి వేరొక ప్రక్కకు తీసికొనిపోయెను. అతనికి మాచమ్మనోటవచ్చిన కటువైన పద్యము బుద్ధిలో నున్నది. కాని యా యాగంతకుడు తానే యడిగి మాచమ్మయున్న ప్రదేశము తెలిసికొని యచ్చటికి వెళ్ళి యామె రెండుపాదములు పట్టుకొని భక్తి పురస్సరముగా నమస్కరించెను.

అప్పు డద్భుత మొకటి జరిగెను. మాచమ్మ యప్పుడే నిద్ర లేచు

చున్నదానివలె మూసిన కన్నులు విప్పి చూచెను. అందరు జను లక్కడ కూడియుండుట కాశ్చర్యపడుచు నంతమందిలో మంచముమీద పరుండి యున్నందుకు నేవగించుకున్నదానివలె సిగ్గుతో బెదిరి చూచుచు లేచి యింటిలోని కేగెను. ఆమె దేహము బలహీనమై కంఠధ్వని నీరసించుటే గాని యెట్టి మార్పును లేక యామె తన ప్రకృతి నొందినట్లు కనిపించెను.

అది కనులార చూచినవారి యాశ్చర్యమునకు మేర లేకపోయెను. కొందరు మాత్రమా బౌద్ధ శ్రమణుని యవస్థకు జాలినొందిరి కాని పెక్కు రాతని దూషింప సాగిరి. అతడే లక్ష్మీదేవివంటి మాచమ్మకేదో లేనిపోని శివము పూనించినాడని వా రభిప్రాయపడిరి. కాని యందరును ఏకగ్రీవముగా నాయాగంతుకుని వినయాతిశయముతో నుతించిరి. మరికొంద రతని ప్రభావము పొగడుటకును మాటలు రాకుండునంత పారవశ్యము నొందిరి.

ఆ అగంతుకుడు వేములవాడ భీమకవి. అతనివాక్కు విపరీతమైన యాడంబరము కలది. కాని దేహము దీర్ఘమైనదిగాని దృఢమైనదిగాని కాదు. అతడు మిక్కిలి పొట్టివాడు. బక్కచిక్కిన శరీరము. చాయ పొగ వారిన విప్పువలె కందినట్లుండును చర్మముమీద నూనె కారుచున్న ట్లేదో యసహ్యమైన మెరుగు కనపడుచుండెను. ముఖములో వర్చస్సు లేదు. ఎరుగని వా రతని జూచి ద్విజుడను కొనరు. భుజముపై యజ్ఞోపవీతము లేదు. కేవలము పదునారేండ్లు నిండని బాలుడు. దీనుని వలెను ఆతురుని వలెను కొంచె మున్మత్తునివలెను చూపట్టును. మిక్కిలి మితభాషి!

మల్లన యాతనికి చేసిన విందు సుష్ఠుగా కుడిచి కూర్చుండుటకు పరచిన చాపమీద వెన్నువాల్చి నిద్రింపసాగెను. అతనికి బడలికకలిగినదని యందరు దలంచిరి. అతని మహత్త్వము విని ప్రసంగించుట కెందరో వచ్చిరి కాని వా రందరు హతాశులై నిలిచిపోయిరి. ఆ సాయంత్రము వరకు రోగగ్రస్తులు పిశాచగ్రస్తులు నచ్చటి కెందరో తిరుణాల ప్రభలవలె మూగిరి. కాని వారి కాతని దర్శన మబ్బలేదు.

అంతటి సందడియందును చీకటి పడువరకుకూడ వేములవాడ భీమకవి యా చాపపై నిద్రించుచునేయుండెను.

క్రీడాద్వీపములో నేడు ధనుర్విద్యాపరీక్ష జరుగును. అనాదిగా భరతఖండ ములో ధనుర్విద్య కపారగౌరవము కలదు. అది ధనుర్వేదము. ధనుర్విద్యా కౌశలము వలననే భారతవీరు లజేయులై యుండిరి. ప్రజలకు ధనుఃప్రజ్ఞ దర్శించుట పర్వముగా నుండును.

యువరాజు రాజేంద్రదేవుడు ధనుర్విద్యాపారంగతు డని ప్రతీతి ముందుగా వ్యాపించెను. అతని దాక్షిణాత్యమిత్రులుకూడ తద్విద్యా ప్రవీ ణులను ప్రసిద్ధి కలదు. వా రందరుగూడ నేడు విద్యాపరీక్షకు అభ్యర్థులుగా నుందురను వార్త పురమున వ్యాపించినందున ప్రజల వ్యగ్రత యెక్కు వయ్యెను.

"దూరపుకొండలు నునుపు మన వేంగివీరుల నైపుణ్యమే అపా రము" అని కొందరనుచుండిరి. మరికొందరు చోళుల నేర్పు అద్వితీయ మని ముందుగా పొగడుచుండిరి. ఇట్లు ప్రేక్షక జనములో పరిపరి విధము లగు నభిమానములతో వాగ్వాదములు పెరిగి మధ్యమధ్య చేతులుకూడ కలియుట తటస్థించుచుండెను. రాజభటులు నవ్వుచు నట్టివారిని విడదీయు చుండిరి.

ఆనాడు వెనుకటివలెగాక రాజభటుల ప్రతిబంధము లెక్కువగ నుండెను. ప్రజలను నియమిత స్థానములు దాటి యెక్కు యడుగైన ముందుకు రానిచ్చుటలేదు. ధానుష్కుల బాణములు లక్ష్యము తప్పినచో ప్రేక్షకులమీద పడకుండుట కీ కఠిన శాసనములు పెట్టిరి.

నియమితుడైన యొకానొక రాష్ట్రకూట ప్రముఖుని యొద్దనుండి రాజముద్రిక గల యనుమతిపత్రిక లేనివారు ధనుస్సు నంబులు ధరించి రంగములోనికి రా వీలులేదు. అట్టివారు ప్రేక్షకులలో నుండుటకు మొదలే పనికిరాదు. అనుమతి పత్రికలు తమ కవచములపై స్పష్టముగా కనుపడు నట్లు ధరించియే యువరాజును అతని మిత్రులగు కరుణాకర తొండమాను డును జయగొండరును స్వయముగా విల్లునంబులు ధరించి వచ్చిరి. అట్లే శక్తివర్మయు కుమారసప్తకములో మల్లప్ప కాక మిగిలినవా రార్గురును

వచ్చిరి. వేంగీధానుష్కులలో ప్రసిద్ధులలో పేరొందదగినవారిలో నితరులు నెల్లూరు బిజ్జన, చంద్రాదిత్య దండనాథుడు, అద్దంకి అనవేమారెడ్డి.

ఆనాడు ప్రధాన పరీక్షాధికారిగా రాజరాజనరేంద్రుడే స్వయముగా నుండగలడని ముందు ప్రకటించిరి. జను లందరును రాజరాజును నిష్పాక్షికబుద్ధి యెరిగినవారు గనుక వేంగీవిద్యను మెచ్చుకొనునో చోళవిద్యను మెచ్చుకొనునో చూడవలె నని కుతూహలముతో వేచియుండిరి. ప్రభువు రాక కొరకు జనసమూహ మంతయు వ్యగ్రతతో నిరీక్షించుచుండెను.

రాజరాజు నియమితకాల మెన్నడు నతిక్రమింపడు. ఆవేళ సమీపించినది. ఐనను ఆవలిదరిని రాజనావ బయలుదేరిన జాడ పొడకట్టలేదు. జనములో నాశాభంగము చూపట్ట ప్రారంభించెను. ధానుష్కులు పరీక్షకు నిర్ణీతమైన రంగమునకు చేరుచున్నందున మరల జనము వారి వేడుకకు భంగ ముండదని సంతోషించుచుండిరి.

ఇక నొక యరగడియకు నిర్ణీతకాల మనగా వైతాళికుడు శంఖధ్వని చేసి యిట్లు వజ్జియ ప్రెగ్గడల ప్రకటన చదివెను.

"శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వరులు, త్రిభువనాంకుశ రాజకంఠీరవులు, పరగండభైరవులు, సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన శ్రీ రాజరాజపరమ బ్రహ్మణ్య నారాయణులు ఈనాడు కార్యాంతరవ్యగ్రులై ఈ పరీక్ష తిలకించుటకు వేంచేయ వీలులేక పరీక్షాభారము వారి దండనాథాగ్రణులగు శ్రీ నృపకామ దండనాథులయందు న్యాసము చేసినారు. కనుక శ్రీ నృపకామదండ నాథుల పరిష్కారము శ్రీముద్రాజ రాజమార్తాండుల పరిష్కారముగా భావింప వలసినదిగా అజ్ఞాపించుచున్నారు."

ఆ పిమ్మట నిర్ణీతసమయమునకు పరీక్ష ప్రారంభించెను.

ముందు దూరమున స్థిరమైన లక్ష్యమొకటి పెట్టి దానిని భేదింప నియమించిరి. ధానుష్కు లొకరితర్వాత నొకరువచ్చి యచ్చట నిర్ణీతులై నిలిచియున్న నైయోగికులకు తమ తమ నామాంకితబాణములు ముందు చూపి యా పిమ్మట నవి ప్రయోగించుచుండిరి.

అభ్యర్థుల విండ్లలో నెన్నియో భేదములు కలవు. అన్నిటిలో వేంగీధనుస్సులు పటిష్ఠములైనవి. పశ్చిమభూములవారివి అంతకంటె

కొంచెము సన్నముగను దీర్ఘముగను నుండెను. దాక్షిణాత్యుల విండ్లు మూడుముక్కలతికినవి కనుక చిత్రాకారము కలిగియుండెను. వానికి మూడువంకలున్నందున వారా ధనుస్సులు ప్రయోగించుచున్నప్పు డెల్లను ప్రేక్షకజనము 'త్రిభంగి'—'మువ్వంక'అని వినోదముగా కేకలు వేయ సాగిరి. ఒక్కొక్కమారు 'కుబ్జ'నామముకూడ ఉచ్చరించుచుండిరి. కాని దాక్షిణాత్యధనుస్సుల వంకర బాణప్రయోగమునకు సంక్రమింపలేదు. యువరాజుభాణము గాని జయంగొండరుబాణముకాని కరుణాకరుని బాణము కాని మరి ఇతర దాక్షిణాత్యుల బాణములు కాని యొక్కమారైనను లక్ష్యము తప్పిపోలేదు. అది చూచినకొలదియు జనులలో పరిహాసధ్వనులు పశమింపసాగెను.

పాశ్చాత్యుల బాణములు దాక్షిణాత్యుల వానివలె గావు. అవి తరచుగా లక్ష్యము తగులక పైనుండి దూరముపోవుట తటస్థించినది.

వేంగిరాజపుత్రుల బాణములుకూడ లక్ష్యము తప్పుటలేదు. కుమారసప్తకములో కాముని ధనుఃప్రయోగకౌశలమును సామంతులలో నెల్లూరి బిజ్జనదియు, దండనాథులలో చంద్రాదిత్యునిదియు, గ్రామాధికారులలో అద్దంకి అనవేమారెడ్డిదియు ధనుర్విద్య అతిశయముగా నుండెను. వారందరిదియు బహుదృఢముష్టి. వారి బాణములు తగిలినప్పు డెల్లను లక్ష్యముగా నుంచిన ఫలకము ఎగిరి దూరముగా పడి పోవుచుండెను. అది మరల సరి చేయులోపల నాలస్యమగుచో వేంగిప్రేక్షకులు వారి విద్యావిశేషమును పొలికేకలతో మెచ్చుకొనుట కవకాశము కలిగెను. వారిలో నెవ్వరు రంగస్థలము ముందుకు వచ్చినను జనులు జయజయ నినాదములు చేయ సాగిరి.

అంతట దూరపాత పరీక్ష ప్రారంభించెను. వేంగివిండ్లు దృఢమైనవి కాని నార తక్కువ. వానికి బాణములను దూరము పంపగల బిగువు లేదు. ఈ పరీక్షలో నా విండ్లు పూర్తిగా వెనుకబడిపోయెను. పాశ్చాత్యులయు దాక్షిణాత్యులయు బాణము లవలీలగా బహుదూరము పోవుచుండెను కాని వేంగివారి బాణములు ఎంత యాకర్ణాంతముగా తిగిచి వదలినను అంతదూర మనుగమింపలేకున్నవి. కామునిదియు చంద్రాదిత్య దండనా

ధునిదియు వింద్లు అట్లు బలవంతముగా లాగుటలో విరిగిపోవుట కూడ తటస్థించెను. అట్టియెడ మరియొక ధనస్సు తెచ్చుకో వలసి వచ్చెను. దూరపాత పరీక్ష కేవలము పాశ్చాత్యులకును దాక్షిణాత్యులకును గానే పరిణమించెను. వేంగీ ప్రేక్షకుల యుత్సాహము తగ్గిపోయినది.

ఆపై బాణలాఘవ పరీక్ష ప్రారంభమయినది. అందులో మరల కాముడును నెల్లూరు బిజ్జనయు తమ బాహులాఘవముల వలనధనస్సులలో లేని లాఘవము పూరించి మరల జనముల మెప్పునకు పాత్రులైరి. లాఘవ ప్రదర్శనములో దీర్ఘములగు పాశ్చాత్య ధనస్సులు నిరుపయోగము లయ్యెను. మరి యిక చోళ వీరుల చాపముల నుండి బాణము లప్రయత్న ముగా పుట్టి నలువంకల వెదజిమ్ముచున్నట్లు కన్పించెను. అందును యువ రాజుమిత్రుడు జయంగొండరు అందర నతిశయించెను.

ఇంతలో గొంత విరామ మేర్పడెను. నృప కామదండనాథుడు వజ్జియ ప్రెగ్గడలతో సంభాషించెను.

నృప : ఈ దాక్షిణాత్య ధనస్సు లద్భుతముగా నున్నవి. ఇవి వెంటనే తెప్పించి మన సైనికులచేత నభ్యాసము చేయించవలెను.

వజ్జియ : ఇప్పటికి సంవత్సరమునుండి నేనిది సూచించుచున్నాను. ఇక్కడి సామంతులకు దండనాథులకు నిది రుచించుట లేదు. ఆ ధన స్సులు మనవారి దృఢ హస్తముల క్రింద నాగ వందురు. ఏమి చేయవ లెనో తోపకున్నది.

నృప : మీకు నేను చెప్పవలెనా? దాక్షిణాత్య ధనుస్సాధనము చేయని వారిని కఠినముగా దండింపవలెను. ఆ ధనస్సులు ధరించిన సైన్య ములు మనసైన్యములను దరిచేరనీయక దూరమునుండియే మట్టుపెట్టును.

వజ్జియ నృపకాముని యభిప్రాయముతో నేకీభవించి సంతకు వచ్చిన దాక్షిణాత్య చాపము లన్నియు కొనిపించి యాయుధాగారమును చేర్పించి మరి యనేకము తెప్పించుట కుత్తరువు లిచ్చితి ననియు, వానిని పూర్వాచార పరాయణు లగు నీ మూర్ఖాంధ్రులచే వాడుకలో పెట్టిం చుట కష్టతరముగా నున్నదనియు పలికెను. నృపకాము డాతని నగ్గించెను.

ఇంతలో విరామ మైపోయినది. అప్పటికి చలలక్ష్యభేదనము అసాధ్యలక్ష్య బేధనము మాత్రము మిగిలిపోయెను.

చలలక్ష్యభేదనములో వేంగీధానుష్కులును, దాక్షిణాత్యులును సమానముగనే ప్రావీణ్యము చూపిరి. అందులో కాముడు, కరుణాకరుడు, జయంగొండరు ముగ్గురు నతిశయించిరి. యువరాజ రాజేంద్ర దేవుడు కూడ యెకమగా వారితో తులదూగెను.

అంతట నసాధ్యలక్ష్యభేదనము ప్రారంభ మయ్యెను. ఇందులో నన్నిటికంటె నైపుణ్య మెక్కువ కావలెను. ఒక వస్తువును చూచిపిమ్మట కన్నులకు గంతలు కట్టుకొని దానిని బేధింపవలెను. అద్దములో జూచిన ప్రతిబింబమునుబట్టి లక్ష్యము బేధింపవలెను. కనపడని వస్తువును శబ్దమునుబట్టి కొట్టుట శబ్దవేధ. ఇట్టివి మొదలుగ ననేక విధములగు నసాధ్య లక్ష్య బేధనము సాగుచుండెను. అన్నిటిలో కష్ట సాధ్యమగు నీ పరిశ్రమలో యువరాజ రాజేంద్ర దేవుడందర నతిశయించు చుండెను.

దీనితో నేటికి పరీక్ష యంతయు పూర్తియగును. ఇంతవరకు నెట్టి ప్రమాదమును లేక గడిచిపోయెను. ఈ యవసానసమయమున రాజభటుల జాగరూకత యించుక సడలెను. రంగభూమిలోకూడ నొక్కించుక క్రమభంగములు ప్రాప్తమయ్యెను. అట్టి వధికారులు సరిచేయ వలసి వచ్చుచుండెను.

ఆ తరుణమున నొక ప్రమాదము సంఘటిల్లెను. అప్పుడు యువరాజును కుమార సప్తకములోని యార్గురు రాజపుత్రులును మాత్రమే రంగస్థలములో బాణప్రయోగము చేయుచుండిరి. ముందు రెండు బాణములక్కడ చేరియున్న బ్రాహ్మణ సమూహము మీదికి బోయెను.

"రాజేంద్ర దేవా, మరల మరల బ్రాహ్మణులను గొట్టుచున్నావేమి?"

కాముడు ఈ మాట అనుచు బాణప్రయోగము చేయుచున్న యువరాజరాజేంద్రదేవుని చేయి చప్పున పట్టుకొనబోయి కదలించెను. దానితో లక్ష్యత తప్పి యువరాజ చాపవినిష్కృతమై యా బాణము బ్రాహ్మణ బృందము మీదికి తీవ్ర వేగముతో బోయెను.

వ్యవధానము లేకుండ నీ విధముగా మూడుబాణములు బ్రాహ్మణులమీదికి బోవుటయు, బ్రాహ్మణులం దొకడు బాణహతుడై పడిపోవుటయు తటస్థించెను. హాహాకారములు బయలుదేరినవి. మహాసముద్రమువలె లేచిన జనసమూహము నాపుట రాజభటుల కసాధ్యమయ్యెను.

ఈ బాణములు తప్పుటకు కారకులెవరు? కుమారసప్తకములో నార్గురును రాజేంద్ర దేవుని బాణములు మూడు లక్ష్యముతప్పి యట్లు బ్రాహ్మణులపైకి బోవుట తమ కన్నులార జూచితి మనిరి. యువరాజు తాము ప్రయోగించుచున్నప్పుడు కాముడు చేయి పట్టుకొని కదలించినందున లక్ష్యము తప్పిన బాణమొక్కటి తప్ప మిగిలిన వేవియు దనవి బ్రాహ్మణబృందము వంకగూత బోలేదని దృఢముగా వాదించెను. రాజపుత్రషట్కము అవి మూడును రాజేంద్రునివే యని వాదించిరి.

జాగరూకులై పరిశీలించుచున్న నృపకాముడును వజ్జియయు, మొదటి రెండు బాణములు యువరాజువి కావనియు చివరిబాణము మాత్రము కాముడు కదిలించి నందున యువరాజుదే యటుపోయె ననియు స్పష్టము చేసిరి.

కాము డంతట తీవ్రముగా వాదించెను. రాజేంద్రదేవుని ముఖము కోపముతో నెర్రవారి ప్రళయార్కబింబసదృశ మగుచుండెను. కరుణాకరుడు జయంగొండరు యువరాజు కిరుపార్శ్వముల జేరి యాతనిశాంతింప జేయుచుండిరి.

ఏది యెట్లున్నను యువరాజు ధనుస్సునుండివెడలిన చివరి బాణమే న త్తినన్ని దక్షిణబాహువులో గిగబడిపోయెను.

బ్రాహ్మణబృందములో పడిన మొదటి రెండుబాణములను రాజభటులు ఇంతలో నేరితెచ్చిరి. అవి రెండును జూడగా యువరాజనామాంకితములై యుండెను. మూడవ బాణము ఆ బ్రాహ్మణుని బాహువునుండి శస్త్రవైద్యుడుద్ధరించుచున్నాడని భటులు నివేదించిరి.

వజ్జియయు, నృపకాముడును ఒకరి ముఖము లొకరు చూచుకొనిరి.

జనసమూహములో యువరాజు బ్రహ్మహత్య చేసినాడని గుసగుసలు పెద్దవై పోయెను.

రాజేంద్రదేవునికి కోపము పెరిగిపోవుచుండెను.

ఇంతలో నృపకామదండనాధుడు పరీక్ష చాలింప నాజ్ఞాపించెను. మిక్కిలి వృద్ధుడైనను దృఢమైన కంఠముతో నాత డుత్తీర్ణుల నామములు వరుసగా ప్రకటించెను. అందులో అసాధ్య లక్ష్యభేదనములో యువరాజ రాజేంద్రదేవుడు అద్వితీయుడని స్పష్టము చేసెను.

పరీక్షాఫలితములు వినిపించిన పిమ్మట యువరాజభటులు తెచ్చిన బాణములు రెండును చేత నందుకొని వానిపై నున్న తన నామముచూచి తన కన్నుల నమ్మలేకపోయెను. "మోసము" అని పళ్ళుకొరుకుచు హూత్కారశబ్దము చేసెను. వజ్జియయు, నృపకాముడును, "యువరాజా, ఆ బాణములు నీవి కావు" అనిరి.

కాని జనసమూహము వేరుగా తలచెను. ఈ వృద్ధామాత్య దండ నాధులు యువరాజుపైది యభిమానముచే నీవిధముగా పక్షపాత వచనములు పలుకుచున్నారు. యువరాజు బ్రహ్మహత్యచేసెను—యువరాజే బ్రహ్మహత్య చేసెను—యువరాజేబ్రహ్మహత్యచేసెను. జనసమూహము కన్నులార చూచినది కాదనిన నమ్మగలదా?

ఆ జనవాక్యము నాలించుచు యువరాజు సిగ్గుతో తలవంచుకొని వజ్జియ, నృపకాములవెంట బ్రాహ్మణ సమూహమునొద్దకు వెళ్ళెను. బ్రహ్మఘ్నుని ముఖము చూడరా దని బ్రాహ్మణులు కొందరు తొలగిరి.

నన్నినన్ని బాహువునుండి రాజవైద్యుడు బాణము లాగి పొంగి వచ్చుచున్న రక్తప్రవాహము నాపి కట్టుకట్టెను. నన్నిదేహము మిక్కిలి నీరసించియుండెను. కాని యతడా బాధ నెంతయో అడచుకొని శాంతమగు ముఖముతో నుండెను. యువరాజరాజేంద్రదేవుడు నన్నికి భక్తిపూర్వకముగా నమస్కరించెను.

"నా బాణమే మీకు తగిలినది. కదలించినాడు; క్షమింపుడు."

నన్ని యాదరముతో యువరాజువంక జూచి, 'నీ తప్పు లేదు ఆయుష్మన్, నా ప్రారబ్ధమే సుమా!' అనెను.

నన్ని యంతకంతకు క్షీణించిపోవుచుండెను. ముఖము కళావిహీనమగు చుండెను. అతనిని వెంటనే సారంగధర మెట్ల సంఘారామములోని

వైద్యశాలకు బంపుటకు రాజోద్యోగులు అన్నియు నాయత్తపరచిరి. అందుకు శిబిక తెప్పించి మూర్ఛితుడైన వృద్ధబ్రాహ్మణుని అందు పరుండబెట్టిరి. ఆ శిబిక బయలుదేరెను.

"దీనిని మా యింటికి వెంటనే చేర్చి నా గృహవైద్యునిచేత నీ బ్రాహ్మణునికి చికిత్స చేయింపుడు!" అని వజ్జియ నైయోగికులకు జెప్పెను. అందుకు వారందరు నిర్ఘాంతపోయిరి. కాని వజ్జియప్రెగ్గడ యాజ్ఞలు పాలింపవలసినవే. వజ్జియయాజ్ఞలు ఆజ్ఞలవలె కనిపించవు; ఆజ్ఞాకంఠము ప్రయోగింపడు. అయినను ఇతరుల తీవ్రాజ్ఞలకంటె నెక్కువ శ్రద్ధగా అక్షరశః పాలింపవలెనని వా రంద రెరుగుదురు. కనుక అట్లే చేసిరి.

వజ్జియ కండ్లు మూసికొని కరుణాకరతొండమానుని బిలిచి యానాటి విద్యా ప్రదర్శనముసంగతులు సంభాషించెను. బ్రాహ్మణసమూహములో పడిన రెండు బాణములును నన్నిబాహువునుండి యుద్ధరించిన రక్తసిక్తమగు నా బాణమును తెప్పించి వేరుగా కోశములలో పెట్టించి తనముద్రిక వేసి ఇంటికి పంపవలసినదని రాష్ట్రకూటుల కాజ్ఞాపించెను.

రాజమహేంద్రపుర మంతటను యువరాజు బ్రహ్మహత్యచేసినాడని కల్లోలము ప్రాకిపోయెను. చోళరాజ్యమున పెరిగినవా రెంతకైనా సమర్థులే. వజ్జియయు నృపకాముడును హంతకునియెడ పక్షపాతము చూపుచుండుట దుర్భరముగా నున్నది. యువరాజనామాంకిత బాణములు ప్రత్యక్షముగా కనుపడుచుండగా కుమార షట్కము చూచినదికూడ నమ్మకపోవుటా? ఎంత సాహసము!

వజ్జియప్రెగ్గడమందిరమును గృహ మనుటకంటె చిన్నదుర్గ మనుట యుక్తతరము ప్రధానగృహము మూడంతస్తుల మేడ. కాని దానికి అనుబంధముగానున్న యితర గృహముల మధ్యనుండి బయటికి నది కనుపించదు. విశాలమైన యావరణముచుట్టును ఉన్నతమగు శిలాప్రాకారముకలదు. దానికి నలుదిక్కుల నాలుగు గోపురద్వారములే కాక

చిన్న ద్వారములను కొన్ని గలవు. అందులో కొన్నిటినుండి లోనికి బోవుటకే యనుజ్ఞకలదు. మరికొన్నిటినుండి బయటికి వచ్చుటకు మాత్రమే యనుజ్ఞ యిత్తురు.

వజ్జియ రాజకార్యములు ఎక్కువ భాగము ఆ గృహమునందుండియే నిర్వర్తించును. ఎందరో కరణములు పత్రికలు వ్రాయుచు నిరంతర మొక శాలలో నుందురు. మరియొక శాలలో రాజభటులు రాత్రింబవళు, జాగరూకులై యుండి యావరణ యంతయు రక్షించుచుందురు. ఒక గజము, కొన్ని యుత్తమాశ్వములు ననేకశిబికలు రెండు పల్యంకములు నచ్చట కలవు.

ఒకప్రక్క చక్కని లీలోద్యానమును దాని మధ్య నొక వాపికయు నున్నవి. మరియొక ప్రక్క నున్న గోష్ఠము బహుసుందరమైనది. అందులోని గోవులు అనేకములు. అవి అనేకజాతులవి. అందును కపిల వర్ణము గల యొకానొక ధేనువు జగన్మోహనముగా నుండి కామధేనువు అవతరించినట్లు కనుపట్టుచుండును. దాని పాలు వజ్జియ హవ్యకవ్యములకు మాత్రమే యుపయోగించును. వజ్జియకదియే తల్లి, అదియే ముద్దుల కూతురు. ఉదయమున లేచి వజ్జియ దానిని దర్శించును. సాయంత్రమింటికి వచ్చినంతనే గోష్ఠమునకు బోయి దానిని మరల దర్శించును. వజ్జియ ధర్మపత్నియే దానిని పోషణ చేయును; పాలు తీయును. దానికి వజ్జియయింట రాజభోగము దివ్యభోగము సాగుచుండెను ఇతరగోవుల క్షీరము గోపాలకులు తీసి ఉదయమునను సాయంత్రమునను చాతుర్వర్ణ్య ప్రజల కందరికి నాదరముతో పంచిపెట్టుదురు. కొందరు రోగులు, పసిపిల్లల తల్లులు, వజ్జియ ధర్మపత్ని సోమిదేవమ్మగారి చేతిమీదుగా ఆ పాలు కావలె నని యాచింతురు. ఆమె చేతిమీదుగా నిచ్చిన గోక్షీరము త్రాగించినచో పసిపిల్లల జాడ్యము లనేకము లుపశమించు నని పిల్లల తల్లులకు విశ్వాసము కలదు. అట్టివారు వచ్చినచో వజ్జియ సోమిదేవి వెంటనే వచ్చి యాదరముతో వారికి కావలసిన పా లందిచ్చి యా పిల్లల జాడ్యము తెలిసికొని విశేషానుభవమువలన నెరిగిన చికిత్సకూడ చెప్పును. మరియు నా

గోశాలలో రెండు వృషభరాజములు నందికేశ్వరుని స్మరణకు తెచ్చునవి కలవు.

వజ్జియమందిరములో అతిథిశాల యొక టున్నది. అందు బ్రాహ్మణు లెవరెప్పుడు వచ్చినను వారి కాతిథ్యమునకు లోపముండదు. ఎప్పుడు వచ్చితివి? ఎందుకు వచ్చితివి?— ఇట్టి ప్రశ్న లచ్చట నడుగరు. సర్వవిధముల వారి స్నాన సంధ్యాది కర్మలకును, భోజనమునకును, విశ్రాంతికిని సౌకర్యములు సేవకులు చేయుదురు. ఎందరు వచ్చినారను లెక్కలేదు. బ్రాహ్మణపూజవలన వజ్జియ తాను ధన్యుడైనట్లు భావించునుగాని ఇందర కాశ్రయ మిచ్చుచున్నానని తలపడు.

వజ్జియప్రెగ్గడ స్వయముగా నగ్నిష్టోమాదిక్రతువు లనేక మొనరించెను. సదా పురోడాశ పవిత్రవక్షుడు. తనవద్దకు వచ్చిన విద్వాంసులను, అందును ముఖ్యముగా వేదవేదాంగవిదులను, సోమయాజులను విశేషధన మిచ్చి సన్మానించును.

అత డా విధముగా నాదరించునది యొక్క బ్రాహ్మణులనే కాదు. ఆ యింటికి వచ్చు నర్థులు నానావిధములవారు. మన మెన్ని రకముల యాచకుల నెరుగుదుమో అందరు నచ్చటకు వచ్చుచుందురు. బౌద్ధశ్రమణులు, దిగంబర జైనులు, పెద్ద కుంకుమబొట్టులు పెట్టుకొనిన భూతవైద్యులు నక్కడ కనిపించుదురు. తంబురా పట్టుకొని పాటలు పాడుచు వచ్చు హరిదాసులు, హరదాసులు, కుంటివారు, గ్రుడ్డివారు, మూగ, చెవిటి, నత్తివారును వత్తురు. నెమిలికన్నులు ధరించి జేగంటలు కొట్టుకొని వచ్చు చెంచుదొరలు, త్రాచుపాము నాడించు నాగరాజులు, ముఖమంతట బొట్టుపెట్టు కోయదొరలు, అడవిదొరలు, బుడబుక్కలవారు, మానెగుడ్డలవారు, దొమ్మరులు, మందు లమ్మువారు, బుట్టలల్లువారు, భట్టులు, విప్రవినోదులు, పగటి భాగవతులు, జ్యోతిషకులు, శాకునికులు, సాముద్రికులు— అందరు నిరాఘాటముగా లోనికి వెళ్ళుదురు. వా రందరును తృప్తినొందిన ముఖములతో బయటికి వచ్చెదరు. కాని లోపలికి వెళ్ళిన వా రందరును మరల నదే విధముగా బయటికి వెళ్ళుదురో, మరి యెట్లు వెళ్ళుదురో మాత్రము పరీక్షించు నవకాశ మెవరికి నుండదు.

తూర్పున నున్న సింహద్వారమున నత్తినన్ని శిబికను లోపలి విశ్రాంతి భవనము లోనికి సేవకులు తీసికొని వెళ్ళిరి. ఆ ప్రక్కనే సమస్త సౌకర్యములు గల చిన్న వైద్యశాల యొకటున్నది. అందులో సమర్థులగు వైఖానస వైద్యులు, పరిచారకులు సిద్ధముగా నుండిరి. నత్తి నన్ని స్మృతి తప్పి యుండెను. వైద్యులు వెంటనే సుఖమైన పర్యంకముపై నతని బరుండబెట్టించి క్రీడాద్వీపములో బాణము లాగి కట్టుకట్టిన రాజ వైద్యుడు పంపిన పత్రము చదువుకొని యప్పు డవసరమైన నాడ్యాదిక పరీక్షలు, నుపచారములు చేసి యచ్చట నెట్టి సందడియు లేకుండునట్లు నియమించిరి. నన్ని వెంట వచ్చిన రాజభటు లాతనిని వైద్యుల కప్పగించి యక్కడ నున్న కరణమువలన వర్ణిత చిహ్నము లున్న యా బ్రాహ్మణు నచట చేర్చినట్లు పత్రము పొంది శిబికతో వెడలిపోయిరి.

ఆ సాయంకాలము వజ్జియ యింటికి వచ్చిన వెంటనే యథాప్రకారము గోష్ఠములో కపిలదర్శనమునకుగూడ బోక ముందుగా వైద్య శాలకు నన్నిని చూడబోయెను. నన్ని కింకను స్మృతి రాలేదు. వైద్యులను విచారింపగా, వారు నన్ని గాయము అంత పెద్దది కాదుకాని, విశేషము రక్తము స్రవించినందువలన దుక్కిలి నీరసించియుండె ననియు, ప్రాణా పాయ ముండ దని యూహించుచున్నా మనియు జెప్పిరి. ఆ బ్రాహ్మ ణునికి స్మృతివచ్చి, మాట్లాడుస్థితిలో నున్నయెడల నే వేళకైనను తనకు తెలుప బరచి, వజ్జియ గోష్ఠమునకు బోయి యా పిమ్మట యాచకులకు దానముచేయు నాభ్యంతర మందిరమున కేగెను.

వజ్జియ మహాధర్మాత్ముడని పేరుమ్రోగినవాడు గాన నాత రింటికి వచ్చు వేళకే అర్థు లెందరో వాకిట గుంపులు కూడియుండిరి. ఆ శాల లోనికి వజ్జియ వచ్చిన పిమ్మట ద్వారపాలకు లా యాచకుల నొక్క రొక్కరినే లోనికి వదల జొచ్చిరి. వాకిట నున్న వారిలో మేము ముందు, మేము ముందని లోనికి బోవుటకు పోరాట మారంభించెను. ఆ పోరాటము భటులు సద్దుచున్న యంతరము చూచియొక కొందరు తండముగా లోనికి త్రోసికొనిపోయిరి. అందులో నొక బౌద్ధశ్రమణుడుగూడ నుండెను.

అంత యాత్రముతో వచ్చినవార నందరిని చిరునవ్వుతోపాటు

గు ప్రదానముతో సత్కరించి వజ్జియు వడివడి బంపివేసెను. కాని యా శ్రమణుని వంకనైన జూడకపోయినందుకు నాతడు సౌగతదర్శనములు చింతించుచు నిలిచిపోయెను. మిగిలినవారి నందరిని బంపి, యానాటి కర్థి సంభావన పూర్తియయిన దని భటులకు దెలుపగా వారా ద్వారము బంధించిరి.

అంతట వజ్జియ శ్రమణుని వంక తిరిగి, యతనికి గూర్చుండ ననుజ్ఞ యిచ్చెను.

"త్రిశరణములు తిరిగి తిరిగి జపించుచున్నావు. నీసంఘ మెట్లున్న దేమి?" అని వజ్జియ ప్రశ్నించెను.

"మా సంఘస్థితి మిక్కిలి యపాయకరముగా నున్నది."

ఆ మాటలు విని వజ్జియు మిక్కిలి విచారము చూపి, యతనిని తన యింటనే భోజనముచేసి పిమ్మట సంఘస్థితి సవిస్తరముగా జెప్పినచో నా విషయము విచారించి, సరిచేయుటకు యత్నింతునని చెప్పి సంధ్యాదికృత్యములకు వెడలిపోయెను.

ఆ బౌద్ధశ్రమణుడు భిక్షచేసి విశ్రాంతుడైన పిమ్మట, లోపల వజ్జియవద్దనుండి రమ్మని సందేశము వచ్చెను. తాంబూలచర్వణము చేయుచు వజ్జియ యప్పు డేకాంతముగ నుండెను. వజ్జియ తాంబూలములోని కుంకుమ కస్తూరి కర్పూరముల వాసనలకు నచ్చట వెలిగించిన యగరుగంధము తోడై యా గది దివ్యగంధముతో వాసించుచుండెను. అప్పుడా శ్రమణుడు భిక్షు ధర్మము లన్నియూ మాని మహాప్రధానికి సామాన్యోద్యోగి చూపు వినయవిధేయతలతో నమస్కరించి నిలుచుండి మాటాడజొచ్చెను.

ఆ శ్రమణుడు ముఖ్యముగా సారంగధరుని మెట్టి సంఘారామము సంగతులెక్కువ ప్రస్తావించెను. మల్లప్ప సంఘారామములో చేరిననాటి నుండియు, ఏకాదశినాటిరాత్రి పూజాప్రసంగాదు లన్నియు బూసగ్రుచ్చినట్లాతడు వివరించెను ఆ రాత్రి యొగ్గురు మనుష్యు లెవరినో శవాకారముగా నున్న వానిని, బంధించి సామానుకొట్టులో వేసినా రనియు, నత డెవరో యెంత ప్రయత్నించినను తెలిసికొనజాలక పోయితిననియు తెలియ

జేసెను. "దెబ్బతినిన మరునాటికే మల్లప్ప రాజకుమారుడు స్వస్థుడయ్యెను గాని మిక్కిలి యపాయకరమైన స్థితిలో నున్నట్లు వైద్యులు తెలుపుచు నా పుత్రులను జూడనీయకున్నారు. కాని యశ్వవర్తకులు, నాయుధవర్తకులు ఇత్యాదు లెందరో సంఘారామములో విడిసియున్నవారు రాత్రు లాతని నిరాక్షేపముగా దర్శించుచున్నారు. మరియు కొన్ని దినముల వరకు నతడా సంఘారామములో రోగిననే యుండునట్లు తోచుచున్నది." ఇట్టివే యెన్నియేని విశేషము లాతడు ప్రెగ్గడ కెరిగించెను.

సైంధవులగు నశ్వవర్తకుల విషయ మే మని వజ్జియ ప్రశ్నించెను. "వారు నిజముగా సింధు దేశమువారు కారు. ధారావర్షుని చక్రకూటములో నివసించువారే అయినను వారి జాడలు మాత్రము కనిపెట్టుట కష్టసాధ్యముగ నున్నది" అనెను.

"మరియు సంఘారామములో నీ మధ్య తాంత్రికక్రియలు ఆచరించుట యెక్కువైనది. అవి సారంగధరుని చైత్యమునకు సమీపములో నున్న యావృత ప్రదేశములో జరుగుచున్నవి. అచ్చటికి వివిధ సమయములలో, నక్కలయు, కుక్కలయు, చిత్ర చిత్ర పక్షులయు శవములును శల్యములును చేర్చుచున్నారు. మనుష్య కపాలములు చేరుచున్నవి. మధ్యఘటము లందు దేవతా తృప్తికి పుష్కలముగా వినియోగించుచున్నారు. అవిసినూనె దీపములు వెలిగించుచున్నారు. మేక వెంట్రుకలు అయఃపాత్రికలు నుపయోగించుచున్నారు. గ్రంథాలయములోని శల్య తంత్రము ప్రతులు అనేకము వ్రాయించుచు ఆ క్రియల వినియోగము రహస్యముగా గ్రహించుచున్నారు.పట్టణములో భూతచేష్టలకు అక్కడి తంతులే కారణమని నా విశ్వాసము!" అనియు జెప్పెను.

వజ్జియ యా మాటలు విని, నిర్లక్ష్యస్వరముతో పట్టణములో భూతచేష్టల సంగతి యేమని ప్రశ్నించెను.

"పట్టణములో పలువుర యిండ్లలో నాకస్మికముగా చిత్రచిత్ర వ్యాధులు ప్రబలుచున్నవి. వానికి సంఘారామభిక్షువులు ప్రతిక్రియలు చేయుచు పేదలలో విశేషగౌరవము పొందుచున్నారు. మరియు చీనాదేశీ

యుడగు మహాసిద్ధుడు ఇప్పుడు కళింగములో నున్నాడట. అత దల్ప కాలములో విజయ యాత్రకు రాజమహేంద్ర పురము వచ్చునట."

"పట్టణములో ముఖ్యుల యిండ్లలో నీ భూతచేష్టలు ప్రాకినవా?"

"పావులూరి మల్లనార్యుల ధర్మపత్నికి భూతచేష్ట చికిత్సకు వజ్ర కీర్తి యను శ్రమణుడు వెళ్ళి దెబ్బలతో పొంగిపోయిన దవుడలతో వచ్చినాడు. ఆ విషయము శ్రమణులు గుసగుసలాడుకొనుచున్నారు. అక్కడ నేమి జరిగినదో తెలిసికొన సాధ్యము కాలేదు."

"ఆ సామానుకొట్టులో వేసిన మనుష్యు డెట్లున్నాడు? జీవించియున్నాడా?"

"ఆ రాత్రి గ్రుడ్డివెన్నెలలో దూరమునుండి కాని చూడ సాధ్యము కాలేదు. బహుస్థూలకాయుడు. కొట్టులోనుండి వినవచ్చుచున్న కేకలవలన నతడు జీవించియున్నట్లే యూహింతును."

ఇంతలో వజ్రియకు వైద్యులవద్దనుండి సందేశహరుడు వచ్చెను. శ్రమణునికి సెలవిచ్చి పంపి వజ్రియ బయలుదేరెను.

వజ్రియ కాలి యలికిడి వినినంతనే నత్తినన్ని కన్నులు విచ్చి యాతనివంక నాదర గౌరవములతో తిలకించెను. వజ్రియ నిశ్శబ్దముగా ప్రవేశించి యాతని ప్రక్కనున్న యాసనముపై నుపవేశించెను.

"సంధ్యావందనాదిక మైనదా?"

"మానసికముగా నిప్పుడే యైనది."

"నీ గాయముబాధ యెట్లున్నది?"

మీ దర్శనముచే నా బాధ తెలియుటలేదు. సంఘారామవైద్య శాలకు పంపిన నచ్చట సంధ్యావందనము సాధ్యమైయుండునా?"

వజ్రియ పెదవులపై చిరునవ్వువలె కొంచెము కనిపించెను. అతడు నవ్వు వృథా చేయడు.

"కొంచె మవసర విషయములు ప్రసంగించుట కోపికయున్నదా?"

"మీబోటి పెద్దల సన్నిధిలో లేని యోపికయు వచ్చును."

"నన్ను పూర్వ మెన్నడైన జూచిన స్మృతి యున్నదా?"

"ముప్పదేండ్లనాటి కాంచీపుర వృత్తాంత మేనా?"

"నా కుమారుడు నీ విషయము తరచుగా ప్రస్తావించుచుండును. ఈ ప్రచ్ఛన్న వేష మెందుకు వేసితివి, నారాయణా?"

నన్ని నారాయణుడు గాయమువంక నిర్దేశించి, "చూచితిరిగదా, మీ సమక్షములో జరిగినది! ఈ వేషము లేనిచో మీ దర్శనము సాధ్యపడి యుండదు."

"నీ భార్యాపుత్రిక లెక్కడ? సురక్షితులేనా?"

"వారి నొక సంవత్సరము క్రిందట రామేశ్వరయాత్రకు పంపి యుంటిని. దక్షిణయాత్రలు సేవించి భీమేశ్వర దర్శనార్థము వచ్చుచు నిప్పుడు మోటుపల్లి చేరి యుందురు. నా వార్తాహరుని కొరకు వచ్చుట నిరీక్షించుచుందురు."

"నిన్ను కొట్టినది రాజేంద్రదేవుడు కాదని యెరుగుదువా?"

"అతని వింటి బాణమే నన్ను గాయపరచినది."

"అంతకుముందు బ్రాహ్మణ్యములో పడిన బాణములు ఎవరు వేసినవి?"

"సందేహ మెందుకు? కామరాజపుత్రునివి! పాప మతనికి బ్రాహ్మణ భక్తి లేకపోలేదు. ఆ రెండును నా ఒక్కనివైపునకే వచ్చుచుండ రాజ భటుడొకడు నేత్రముతో నేర్పుగా వారించినాడు."

"మరి మూడవది?"

"కామరాజపుత్రుడు ధనుర్విద్యాపారీణుడు. రెండు పర్యాయము లును తన ప్రయత్నము విఫలము కాగా యువరాజును నేర్పుగా కదలించి సఫలీకృత మనోరథుడైనాడు. అతని కౌశల్యము మెచ్చుకొనదగినది. కాని విషబాణము నాకు తగులలేదు."

"ఆ రెండు బాణములును విషదిగ్ధము లనియే నాకు సంశయము కలదు. అవి పేటికలో పదిలము చేయించినాను. మరి నీశత్రువులు నిన్ను గుర్తించిన తరువాత నీకీ మారువేష మెందుకు?"

"నాకును నట్లే తోచుచున్నది."

"కామునికి నీమీద విరోధ మేమిటి?"

"నాకును స్పష్టపడుటలేదు. కాని, దూర మాలోచింపవలెను. నా పూర్వ ప్రభువు త్రైలోక్యమల్లదేవరలకు వారి రాజ్యము వదలి, నే నిచ్చటకు వచ్చుట సమ్మతము కాదు."

"నీ భార్యాపుత్రికలను మోటుపల్లినుండి సుఖముగా నిక్కడికి చేర్పింతును. నీవుమాత్ర మొక యాత్రకు శీఘ్రకాలములో సిద్ధముగా నుండుట క్షేమకరము."

"మీ యిష్టము వచ్చినట్లే! కాని నేను మూడేళ్ళనుండి యమాత్యవృత్తి వదలి విద్యావ్యాసంగములో నిమగ్నుడనై యున్నాను. జీవిత శేషము భగవద్ధ్యానముతో, కావ్యపఠన రచనములతో వెళ్ళబుచ్చవలె నను నాశయము కలదు."

"ఈ గోదావరీతీరముకంటె నందు కనుకూలించు ప్రదేశ మింకొకటి లేదు."

"ఆ యాశతోడనే యింతదూరము వచ్చితిని. క్షమింపుడు! అమాత్యవృత్తి వదలి కేవల బ్రాహ్మ్యమే ఆశ్రయింపవలె నని నిశ్చయించుకొంటిని."

"అందు కభ్యంతర ముండదు. శ్రీరామునకు విశ్వామిత్రునివలె నీవు వెంటనున్న జాలును."

"అంత పెద్దలతో నాకు పోలిక సిగ్గుగా నున్నది. విషయమేమిటి?"

"చక్రకూట మెరుగుదువా?"

"భ్రమరకూటముకూడ నెరుగుదును ప్రెగ్గడా!"

"ధారావర్షుని నెరుగుదువా?"

నన్ని చిరునవ్వు నవ్వెను. "మధురాంతకదేవుని, ఆతని పట్టమహిషి నాగలి మహాదేవినిగూడ నెరుగుదును. అచ్చటి రాజమాన్యు డగు మేడిపాత్రు డను బ్రాహ్మణుడు మీ కుమారునికిగూడ సహాధ్యాయుడు" అనెను.

"చక్ర కూట ప్రయాణమునకు ఎన్నాళ్ళలో సిద్ధము కాగలవు?"

"వారము దినములలో?"

"అంత తొందరలేదు. నీవు గాయము త్వరగా నయముచేసికొన వలెను."

"చిత్తము. కాని, నా యనుచరు డొకడు ఏకాదశి రాత్రి నుండి కనుబడుటలేదు. పారశీక తైలవర్తకులపై నభియోగములో వాడు ప్రథమ సాక్షి!"

"అతని పేరు పొన్నయా?"

"అవును."

"అతడు స్థూలాకాయుడా?"

"అవును.

"సంఘారామములో నతనికి నెవరైన నున్నారా?"

"ఏమో చెప్పను ప్రెగ్గడా! జేతారినాధు డాతని పరమశత్రువు."

"సుజాత ఎవరు?"

"ఆమె రెయగనుగాని పొన్నభార్య, భర్తను వదలి సంఘారామములో నుపాసికగా నున్నది."

"మంచిది. ఈ రాత్రి తెల్లవారువరకు పొన్న జీవించియున్నచో నతనిని భద్రపరుపగలను.

నారాయణభట్టును మరల మరల విశ్రాంతి తీసుకొనుమని యాదరముతో చెప్పి, మరియు 'తప్పనిసరియై పలుకరింపవలసి వచ్చినది. యువరాజుపై బ్రహ్మహత్య చేసినాడని యపనింద వచ్చినది. అది తొలగించుట యెట్లో తోచకున్నది" యనుచు నాదరముతో వజ్జియ నన్ని నారాయణుని దేహము స్పృశించి నిష్క్రమించెను. నారాయణుడును వెంటనే కన్నులు మూసికొని నిద్రించుచుండెనో, ఆలోచనానిమగ్నుడయ్యెనో తెలియకుండ నుండెను.

నన్ని నారాయణుడు బాణహతుడై వజ్జియ ప్రెగ్గడభవనములో చికిత్స పొందుచున్న నాటిరాత్రి రాజమహేంద్ర పురమునందుండియు,

పరిసరములనుండియు జనములు సారంగధరుని మెట్ట సంఘారామమునకు తండములు తండములుగా మూగుచుండిరి. గాథాప్రవణుఁ డని ప్రసిద్ధికల నాగరా జోకడు ఆ రాత్రి యక్కడ గాథ చెప్పునను వార్త యంతట ప్రాకిపోయెను. ఆ చేరెడి జనుల కోలాహలమున కవధి లేదు.

గాథాశ్రవణమున కచ్చటి కెన్ని వేలమంది కూడిరో లెక్కింప నలవికాదు. ఆ జనసమూహ మొక మహాప్రవాహము ననుకరించు చుండెను. ఆంధ్రవాణి యింకను 'ఉదాత్తరసాన్విత కావ్యనాటకక్రమము' నెరుఁగదు. తెలుగువారు 'గానట భీనచే చదివి గాథలు త్రవ్వుచుండిరి.' సంఘారామమధ్యమందలి యుపస్థానాంగణము బహువిశాలమైన దైనను అంత మహాజన మచ్చట పట్టదు. కాన సంఘారామ గోపురద్వారమునకు ముందున్న మైదానములో కూర్చుండబెట్టుటకు నిర్ణయించిరి. అచ్చట నెందరు జనులు వచ్చినను పట్టుదురు.

గాథ చెప్పువారు నిలుచుండుటకు గోపురద్వారముముందు దానికి సమీపములో నున్నతమగు వేదిక యొకటి సిద్ధముచేసిరి. దానికి రెండు ప్రక్కల పక్షములవలె వేదిక పెంచిరి. అందొక పక్షమున మున్నతాసన ములపై జేతారివిఘుడు, వజ్రకీర్తి ఇత్యాది బౌద్ధశ్రమణులు ఉపవిష్టులైరి. రెండవ పక్షమున నాసనములపై రాష్ట్రి బేతయ ఇత్యాది రాష్ట్రికూట ప్రముఖు లుండిరి. గోపుర ద్వారము నాచ్ఛాదించుచు బహుచిత్రవర్ణము లతో రమణీయముగా చిత్రించిన యవనిక యొకటి వ్రేలుచుండెను. అందు చిత్రించిన చిత్రములు మూడే. మధ్య విశాలమైన బోధిద్రుమము. దానికి దక్షిణమున ధర్మచక్రము, వామభాగమున బుద్బుదాకారముగల చైత్యము.

గాథ వినవచ్చిన మిగిలినవారందరును ఎవరికున్న యవకాశము కొలది ఎట్టి వివక్షయు లేకుండ నేలమీద కూర్చుండవలసినదే. వారిలో ధనవంతులు, పేదలు, అగ్రవర్ణులు, పంచములు, అటవికులు, మ్లేచ్ఛులు— అన్నివిధములవారు నుండిరి. గాథా శ్రవణ కాలములో దేశ జాతి వర్ణాది వ్యవస్థ లుండవు. కాని చేరిన వారిలో నెక్కువమంది పనిపాటుల వలన జీవించెడివారు—శిల్పులు, నేతపని చేయువారు, ఆయుధకారులు,

చిత్రకారులు, రథకారులు, ఖనకులు నెక్కువ. వీరభటులును నెందరో కలరు. చదరలు, చాపలు, గోనెలు తెచ్చి పలువురు వానిపై గూర్చుండిరి. కొందరు తమ పైయుత్తరీయములె పరచుకొని సుఖాసీనులైరి. ఎక్కువ భాగము నేలమీదనే కూర్చుండిరి.

స్త్రీలకు ప్రత్యేకస్థానము నియమితము కాకున్నను వారక్కడక్కడ గుంపులుగా గూర్చుండ, వారిచుట్టును కొంతస్థలము వదలి ఇతరులు కూర్చుండిరి.

కూడిన జన మొకరి నొకరు నెట్టుకొనుచు, నిలుచున్నవారిని కూర్చుండ మని వెనుకనున్నవారు కేకలు వేయుచునుండిరి. కొందరు ఉత్సాహవశమున కేకలు వేయుచుండిరి. మరి కొందరు ఈలలు వేయుచుండిరి. కొందరు ప్రక్కనున్న వారితో పోరాడుచుండిరి.

గాథ చెప్పుటకు నిర్ణీతమైన వేదికకు చుట్టును మనోహరమైన పిడులుకల కర దీపికలు పట్టుకొని నాగిను లెందరో పరివేష్టించి యుండిరి. వారి శిరోజములు నాగములవలె జడలుగా దీర్చి వానిపై పూసలపేరు లలంకరించుకొనిరి. శిరస్సుపై నాలుకలు తెరచుకొని పడగయెత్తిన పామువంటి యాభరణ మొకటి ప్రతి నాగినియు ధరించెను. దాని యగ్రమున నున్న మణిపై కరదీపికల వెలుగు ప్రతిఫలింపగా నది రెండవ కరదీపికవలె ప్రకాశించుచుండెను. వారు చెవులకు బరువైన తాటంకములు, మెడలో లావైన పూసల పేరులు, దండలకు మణిబంధములకు పెద్ద కంకణములు కాళ్ళకు స్థూలములగు మంజీరములు ధరించిరి. కటి ప్రదేశముపై ధరించిన చీరపై బిళ్ళల మొలనూలు బిగించి, దానిపై నుత్తరీయము న?ముకు చుట్టి మనోజ్ఞముగా ప్రేలగట్టిరి. ఆ నాగినులీ వేషములతో వేదికకు చుట్టునున్న నిమ్నభాగమున నిశ్చలముగా నిలిచి గండారపుబొమ్మల దలపించుచుండిరి.

వారి కరదీకలతో వేదిక సమగ్రముగా వెలుగుచు నశేషజనము నాకర్షించు చుండెను. జనులందరు నారుబయట వెన్నెలలో నుండిరి.

ఇంతలో సంఘారామమధ్యమునుండి మనోజ్ఞమగు ఘంటారావ మొకటి వినవచ్చి శ్రవణపర్వ మొనర్చెను. ఆ ఘంటాధ్వని పాతాళ

కుహరములో బుట్టి, మరల పాతాళ కుహరములో నుపశమించినట్లు సంఘారామములో నడగిపోయెను. ఆ శబ్దము నిశ్శేషముగా నడగిపోయిన యుత్తరక్షణముననే ముగ్గురు నాగరాజులు గజ్జె ఘలఘల లాడించుచు వెనుకప్రక్కనుండి వేదికమీదికి చెంగున నొక్కగంతు వేసి దూకిరి.

వారిలో ముఖ్యుడు మధ్య నుండెను. అతడు పడగలెత్తిన మూడు తలల నాగము నాకృతిగలిగి మణులతో ధగధగలాడు నుష్ణీష మొకటి ధరించెను. అతని చెవుల రవ్వలతాటంకములు కరదీపికలవెలుగులో మిల మిల మెరయుచుండెను. అతని మెడలో రత్నఖచితమైన బంగారు పట్టము వ్రేలాడుచుండెను. దండలకు కేయూరములు, మణిబంధములకు కంకణములు కలవు. మొలకు బంగారు మొలత్రాడు, కాళ్ళకు గలగలలాడుగజ్జెలు నుండెను. అతడు ధరించిన వస్త్రము పాముకుబుసముతో జేయబడినట్లున్నది. అది యతడు వీరభటులవలె వెనుకకు దోపి కట్టుకొనెను. అతని భుజములనుండి యుత్తరీయము చివరలు రెండును వ్రేలుచుండ రెండు తలలు గల నాగ మున్నట్లు తోపజేయుచుండెను. అతడు కుడిచేత మ్రోగించుటకు తంబురావంటి తీగల జంత్ర మున్నది. ఎడమచేతివ్రేళ్ళకు గలగలలాడు కంచు కడియములు కలవు.

మిగిలిన యిద్దరి నాగులవేషములుకూడ నతని వేషమునే అనుకరించుచున్నవి. కాని వారి తలలపై ఉష్ణీషమున నొంటిపడగపాములేకలవు. వారు ధరించిన భూషణములుకూడ నంత విలువగలవి కాని, కాంతిగలవి కాని కావు. చేతులలో వారి కిద్దరికిని గుమ్మటము లుండెను.

ఆ ముగ్గురును నాగలోకమునుండి పైకెగిరి వచ్చిన నాగరాజులే యనిపించుచుండిరి. వారు రాగానే ముందు వంగి, దక్షిణభాగమున నుపవిష్టులైన శ్రమణుల సమూహమునకు నమస్కరించిరి. ఆ పిమ్మట వామపక్షమునగల రాష్ట్రికూటప్రముఖులకును, ఆ తర్వాత నెదుట గూడిన మహాజనమునకును నమస్కరించిరి.

ఒకసారిగా జనములో ఘోష ప్రారంభించెను. వారిని చూచుటకును, వినుటకును వీలు చేసికొనుటకు చేయు సందడి యది!

ప్రధాననాగరాజు శిరస్సుపై కెత్తి ప్రార్థన ప్రారంభించినాడు.

ఒక్కసారి ఆ మహాజనసమూహమంతయు మంత్రముగ్ధమైనట్లు నిశ్శబ్ద మయ్యెను.

"ధర్మమె మూలము ధరిత్రి కంతకు, ధమ్మం శరణం గచ్ఛామి!
భూచక్రంబున బుద్ధులే బోద్ధలు, బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘమె బోధికి సమాశ్రయస్థలి, సంఘం శరణం గచ్ఛామి!"

ప్రక్కను గుమ్మటములు వేయుచు ఇద్దరు నందుకున్నారు. ఒక్కసారిగా సౌగతధర్మ మా సభ నావేశించి జలదరింపజేసినది.

"దేవానాం ప్రియదర్శిగాథలే దివ్యులు వింటారు:
నాగలోకమున నాగరాజు లా నాదమె వింటారు;
దేవానాం ప్రియదర్శి గాథ లవి తిమిరము బోద్రోలు:
తక్కిన గాథల తలంచరాదో ధర్మము వ్యథ నొందున్!

ధమ్మం శరణం గచ్ఛామి!
బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!

చండాశోకుని చండిమమండితపాండితి ముందు వినండీ!
ధర్మాశోకుని దయార్ద్రశీతల దానము నటుపై వినవో!
ధమ్మమె మూలము ధరిత్రి కంతకు—
ధమ్మం శరణం గచ్ఛామి!
బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!"

ప్రధాననాగరాజు నాగనాట్య మనుకరించుచు, గంతులువేయుచు, ముందుకు వెనుకకు మెలికెలు తిరుగుచు, ప్రక్కల కూగుచు, వంగుచు, లేచుచు లయానుకూలముగా చిందులు త్రొక్కుచు గాథ పాడుచుండెను. తక్కిన యిద్దరు నాగులు గుమ్మటములు వాయించుచు నతనితోపాటు వెంట తిరుగుచు వంత పాడుచుండిరి వా రొక్కొకసారి ప్రధాననాగరాజు కున్న మరి రెండు తలలవలెను, ఇంకొకసారి రెండు తోకలవలెను కనుపించుచుండిరి. "ధమ్మం శరణం గచ్ఛామి, బుద్ధం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి"— అని త్రిశరణములు వా రనుచున్నప్పు

డెల్లి నక్కడ సమావిష్టమైయున్న జనమంతయు నావేశముతో చప్పట్లు కొట్టి తాళము వేయుచు తామును ఆ త్రిశరణములు వంత పాడజొచ్చెను.

ఆ కథ కొంత పాట, కొంత వచనము. గాథ పాటవలెను, వచనము మృదంగ వాద్యమువలెను వినిపించుచు నశేషజనమును ముగ్ధులనుగా జేయుచుండెను.

ఆ నాగరాజుగొంతుకూడ సత్యాద్భుతమైనది అంత మహాజనములో చివరనున్న వారికిగూడ చెవులలో చెప్పినట్లాతని కంఠము స్పష్టముగా వినిపించుచుండెను. కంఠము గంభీరమధురమైనది. సముద్ర తరంగములవలె కథాసంవిధానము ఆ నాగుడు చెప్పుచుండగా జనము నానందములో ముంచివేయుచుండెను.

ఆ రాత్రి యాతడు చెప్పిన కథ జగద్విఖ్యాతమైన యశోకచక్రవర్తి గాథ. బిందుసారుడు మగధచక్రవర్తి. అతని భార్య సుభద్ర యను బ్రాహ్మణవనిత. ఆమె బహురూపలావణ్యవతి. అందర రాణులలో నామె ప్రియురాలు. కొంతకాలమున కామెకు అశోకుడు జన్మించెను. అశోకుడు వికృతాకారుడు. ఆ కుర్రవాడు పుట్టినపిమ్మట బిందుసారునికి సుభద్రమీద కూడ నసహ్యము కలిగినది. అతడు కుమారాశోకుని దగ్గరకు రానిచ్చువాడు కాడు. అవసానకాలములో నశోకుని దూరముగ నున్న తక్క శిలా నగరమునకు పంపివేసి, మరియొక రాణి కుమారుడగు సుషీముని యువరాజుగా నభిషేకించెను. అంత బిందుసారుడు పరలోకగతుడయ్యెను.

అశోకుడు రాజధానివార్తలు విని, ఆగ్రహోదగ్రుడైనాడు. వెంటనే ప్రచండ సైన్యములు కూర్చుకొని మగధరాజధానియగు పాటలీపుత్రమునకు వచ్చినాడు. ముందతడు సుషీముని వధించినాడు. ఆపైవరుసగా జ్ఞాతిశేషము లేకుండ తొంబదితొమ్మిదిమంది సోదరులను సకుటుంబ పరివారముగా హత్య చేయించినాడు. మగధరాజ్యములో అశోకుని జ్ఞాతి రక్తము ఏరులై ప్రవహించినది.

"అయ్యో, ఏమని యా కథ చెప్పుదు నాలకింపుడండీ!
రాజరక్తమున రంజితమయ్యెను రాష్ట్రపు నదులన్నీ!

అచ్చపు నీ రది యబ్బిక కరస్త్రై యల్లల్లాడిరి జనులు!
మార్గాలుల నరమాంసపురాసులు మార్గనిరోధము చేసెన్।
రాజాశోకుని రాక్షసచేష్టలు రాదు చెప్పనోరు!— అబ్బా!
ధమ్మం శరణం గచ్ఛామి।
బుద్ధం శరణం గచ్ఛామి।
సంఘం శరణం గచ్ఛామి!"

జనసమూహము చేతులతోడను కాళ్ళతోడను తాళమువేయుచు త్రిశరణము లందుకొనెను.

"నిష్కారుణముగా ఈ రీతిని శత్రుశేషము లేకుండ జేసి అశోకుడు తానే మగధరాజ్యమునకు పట్టాభిషిక్తు డయ్యెను. రాజగురువులైన రాధాగుప్తుడు— ఆ బ్రాహ్మణోత్తముడు— అప్పుడు ఏమి చేసెనంటే?—

"అత్యున్నత సింహాసనమందున అశోకు గూర్చోబెట్టెన్।
వేదవాదులౌ విప్రుల బృందము సాధువాదములు చేసెన్।
అమోఘమంత్రముల యాశీర్వచనం బన్నిదిక్కులను మ్రోసెన్
అఖిలసరిత్తుల నఖిలవార్ధులను అనీతంబౌ శుభవారిన్,
రాజరాజుగా నభిషేకించెను రాధాగుప్తు డశోకున్।"

రాష్ట్రికూటులు ముఖములు చిట్లించిరి. రాపర్తి బేతయ యొక్కక్షణము సంచలించి మరల ప్రయత్న పూర్వకముగా సంయమనము చేసికొనెను. అది యెవ్వడును గమనించువారు లేరు. నాగ రా జంతట నశోకుని దిగ్విజయయాత్ర లభివర్ణించెను.

"కాంభోజము, కాశ్మీరము, గాంధారము, పాంచాలము, సింధు దేశము, మాలవఘూర్జర మహారాష్ట్రములు, పుళిందదేశము వరుస వరుస జయించినాడు.

"అంగ వంగములు నాంధ్రమండలము అవలీలగనె జయించెన్
కళింగ మొక్కటే కండ్లెర్రనగా కానిపించి నిలిచెన్.
ధమ్మం శరణం గచ్ఛామి,
బుద్ధం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి!"

ఆ కళింగ ప్రభువు బల మెట్టిదంటే, అని యెత్తుకొని సేనా బలము అతిశయముగా వర్ణించినాడు. కాని కళింగపతి కంత సేనాబల మున్నను అంతకంటె నమూల్యమగు మరియొక బల మున్నది :

"ఆ రాష్ట్రంబున నమూల్యమైనది యందలి 'పురి' యను పురము
పురములలోపల పురి యనదగినది 'పురి' యొక్కటియే భువిలో
భువనావళిలో భూరికీర్తిగల బుద్ధాలయ మం దుండున్
తథాగతుని శ్రీ దంతధాతు వను ధననిక్షేపము కందు
జగన్నాథమని జగత్ప్రసిద్ధమై జగత్పూజ్య మయ్యెన్.

"ధమ్మం శరణం గచ్ఛామి,
బుద్ధం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి!"

అయితే మహాసైన్యముతో విర్రవీగుచున్న కళింగరాజు ఈ మహా ధనము మరచిపోయినాడు. గజబలము, అశ్వబలము, పదాతిబలము, మంత్రబలము, ఆయుధ బలము — ఇవి మాత్రమే నమ్ముకొని యా కళింగ రాజు అశోకచక్రవర్తి పంపిన రాయబారము తిరస్కరించినాడు. అందుపై చండాశోకుని దేహము మండిపోయినది. ప్రచండసైన్యము సన్నాహము చేసికొని కళింగముపై దండెత్తి వచ్చినాడు. ఆ సైన్య సంఖ్యాధిక్యము వివరించి వర్ణించినాడు. ఆ మహాసేన —

"పరిపరివిధముల బ్రాహ్మణబృందము స్వస్తివాచనము సలుపన్
అబ్ధిపొంగినటు లదర ధరాస్థలి యాత్ర సాగెనాడందు
పండిన పాపము పర్వెడురీతిని ప్రాకిపోయె నా దండు
కళింగభూమిలో గ్రామము లన్ని కాల్చివేసినారు.
కళింగభూమి సంఘారామములే గంగ కలిపినారు.
కళింగభూమిలో గల జనులందరు కత్తికి బలియైనారు.
శిశువులు బాలుర స్త్రీలను వృద్ధులు చెరలో గొనిపోబడిరి!
అహో! — అశోకసైన్యము లప్పుడు చేసిన అసురచేష్టలు చూచి,

అంబరంబు కను లట్టులె మోడిచి యశ్రుధారలే కురిసెన్।
అశోకుకృత్యము లరసి త్రిభువనం బయ్యో యని విలపించెన్!
బ్రాహ్మణబృందము 'బహుపరా' కనుచు పఠించెమంత్రములయ్యో।
ధమ్మం శరణం గచ్ఛామి,
బుద్ధం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి।"

"జనసమూహ మందుకొనెను. కలవరము ప్రారంభించెను. అచ్చట చేరిన బ్రాహ్మణులుకూడ కళింగస్థితికి జాలిపడుచు కన్నీరు కార్చిరి. సందడి తగ్గిన తర్వాత నాగరాజు మరల గాథ సాగించెను.

ఆ రీతిగా కళింగదేశమంతట సంఘారామములలో, చైత్యములలో విద్యాలయములలో, వైద్యశాలలలో, ధర్మసత్రములలో—అన్ని మూలల నున్న శ్రమణులు అసంఖ్యాకముగా అశోకుని ఘాతుకకృత్యముల కాహుతి యైనారు. హతశేషులు బంధితులైనారు, వారందరును రాజపుత్రిక కారవాకితోపాటు పాటలీపుత్ర మునకు పట్టుకొనిపోయినారు. కాని—

"తథాగతేచ్ఛలు తర్కింపగ నని తరమా నాకో మనకున్?
ఉండె నందులో నుపగుప్తుం డను నుత్తమ బౌద్ధగురుండు;
అభిదమ్మమ్మున నర్హతనీతిని అత డెరుంగనిది లేదు.
అశోకుసేవకు లాతని బెట్టిరి అవధి లేని బహుబాధల్.
ఆగ్రహ మందడు నందడు దైన్యం బన్ని బాధలం బడుచున్.
నిశ్చంచలముగ నిరతము త్రిశరణనినాద జపపరవశుడౌ।
"ధమ్మం శరణం గచ్ఛామి।
బుద్ధం శరణం గచ్ఛామి।
సంఘం శరణం గచ్ఛామి!"

జన ముత్సాహముతో నందుకొనెను. వారిలో పలువురు కన్నీరు ఏక ధారగా కార్చసాగిరి. కొందరికి గద్గదికతో నోట మాటలుకూడ వచ్చుటలేదు. నాగరాజు వారలచే మరలమరల త్రిశరణస్మరణ చేయించి వ్యవధాన మిచ్చి గాథ సాగించినాడు.

"ఆ ఉపగుప్తాచార్యులవారి సాన్నిధ్యబలమువల్లనే అశోకచక్ర

వర్తిహృదయము నెమ్మది నెమ్మదిగా పరిణామము పొందసాగినది. కళింగ యాత్రలో నతడు చేయించిన రాక్షసకృత్యములకు విచారపడ నారంభించినాడు. రాత్రింబవళ్ళు వదలని దుస్స్వప్నమువలె నతని కా ఘోరకృత్యములు కన్నులముందు ప్రత్యక్షము కాజొచ్చెను. ఆ కాలములో అశోక చక్రవర్తి సమస్తనరకయాతనలు మానసికముగా అనుభవించినాడు.

"కణకణలాడెడి కారు నిప్పులన్ కా లిడినట్టుల నుండున్;
ఆపాదముగ శిఖాంతము శూలం బారోపితమై తోచున్.
అసిపత్రంబుల నంగం బెల్లెడ నాహతమైనటు లుండున్;
తేళ్ళు జెఱ్ఱులును దేహము ప్రాకుచు తివిరి కుట్టినటు తోచున్.
పిశాచరూపములు పేర్చి దిక్కులను భీభత్సంబుగ నుండున్;
క్రిమికీటకముల కీర్ణంబై తిను క్రీడాన్నంబులు తోచున్.
రక్తము మాంసపు రాసులు మబ్బులు రాల్చుచున్నటుల నుండున్;
దుర్గంధావళి దుర్భరమై ముకు దూరినట్లుగా తోచున్.
శ్రుతికటువు లపశ్రుతి ఘోషంబులు చొచ్చినట్లు చెవు లుండున్;
అబ్బబ్బా! మన యరులకు గూడా నట్టి బాధ లవి వద్దు!"

అశోకుడు అది భరించలేక ఆస్థానములోనున్న బ్రాహ్మణపండితులను పిలిపించి దీనికి నివృత్తి చెప్పుడని ప్రార్థించినాడు. ఆ బ్రాహ్మణోత్తములంతా —

"శ్రవణాలంకృతశశ్వత్కుండలసదమల కాంతులు వెలుగన్
మృష్టాన్నంబులు మెసవిన బొజ్జలు మేని నిగనిగల గలియన్
కట్టిన పట్టులు కప్పిన శాల్వలు కదలుచుండ కళలన్
కరముల కాంచనకంకణావళుల ఘళంఘళారవ మెసగన్ —"

వారందరు దీర్ఘముగా నాలోచించి పూర్వము శ్రీరామచంద్రమూర్తి, ధర్మరాజు చేసినట్లు అశ్వమేథము చేయుటే యుపాయ మని యేకగ్రీవముగా నుపదేశించిరి. ఆ మాటలు విని ఆ అశోకమహారాజు ఆసనముమీదినుండి ఒక్కసారిగా త్రుళ్ళిపడినాడు.

'హింసానిర్వృతి హింస చేయునా? ఈ మృషలే వినజాలన్'
అని చెవులు రెండును గట్టిగా రెండు చేతులతో మూసికొని వారి

నందరిని ఆ సభలోనుండి రాజభటులచే తరుమగొట్టించినాడు. మఱుక్ష ణమే మహారాజగౌరవముతో ఆ మహాసాధ్వధాముడు ఉపగుప్తాచార్యు లను పిలిపించినాడు. ఆ మహాత్ముని పాదసేవచే బౌద్ధధర్మము సమగ్ర ముగా సరహస్యముగా తెలిసికొన్నాడు, జీవహింస రాజ్యమంతటను ఆపి వేయించినాడు. యజ్ఞములు ఒక్కసారిగా ఆగిపోయినవి. పిపీలికాదిన మస్తజీవరాశి ఆనందించినది. అంత బుద్ధభగవానుని పవిత్రాస్థులకొరకు రాజ్యమంతటను వెదకించినాడు. ఒకానొక వృద్ధభిక్షువు తాను యువకు డుగా నుండగా ఆచార్యుని నిర్వాణము నొందుచు కాననాంతమునకు తీసి కొనిపోయి యా ప్రదేశమునకు తన్ను వందనము చేయించినా డనువార్త తెలిపినాడు.

చక్రవర్తి యుపగుప్తాచార్యుల యనుజ్ఞ నొంది వెంటనే యా ప్రదే శము త్రవ్వించినాడు.

"నవరత్నాంకిత నానావనవనపద్మదీధితులు వెలగెన్
మందారాంగసుమధురగంధము లమందగతులగుచు సులసెన్
కిన్నరనృత్యము కింపురుషశ్రుతి కిలకిలారవము కెరలెన్."

యథావిధిగా ఆ చితాస్థుల నన్నిటిని పూజించి సముద్ధరించి తన రాజ్యమంతట దశలక్షచైత్యములు దివ్యరూపములతో నిర్మించి, యవి బుద్ధధాతుగర్భములుచేసి పదిలము చేసినాడు. అట్టివానిలో సీసారంగధరుని మెట్టలో నున్న దివ్యచైత్య మొకటి:

అట్టివే ధరణికోటలో, శ్రీశైలములో, భట్టిప్రోలులో, ఘంట సాలలో, విజయవాడలో, మంగళాద్రిలో, శోభనాద్రిలో, నాగార్జునుని కొండలో, కొలనిపాకలో నున్నవి. ఎక్కడ లేవు! ఈ ఆంధ్రమండలమే తథాగతుని ధాతు గర్భము!

తన రాజ్యములోననే కాదు. త్రివిష్టపము, చీనా, బ్రహ్మదేశము, సూర్యోదయరాజ్యము, మలయము, యవద్వీపము, సువర్ణద్వీపము, సింహళము, పారశీకము, బర్బరము — సమస్తభూమండలములో బౌద్ధ ధర్మము ప్రచారము చేయ భిక్షుల బంపినాడు.

అడవి మూకలు పుళిందులు నివసించుచుండిన యీ యాంధ్రమం

వల నా మహానుభావుని ధర్మబోధకుల యాశీఃప్రభావమువలననే పాడి పంటలతో వృద్ధిలోనికి వచ్చింది.

చండాశోకుడు ధర్మాశోకుడైనాడు. అది కేవల మా బుద్ధధర్మ ప్రభావము. అంతట నా ధర్మాశోకుడు—

“దేవానాం ప్రియదర్శి బిరుదుతో తేజరిల్లె భువనాళిన్!
ధరణీచక్రము ధర్మప్రభుడై దయతో పరిపాలించెన్.
ధరిత్రి యెల్లెడ ధర్మశాసనాల్ స్థాపించియుగా నిలిపెన్
తల్లికంటె బలు దయతో ప్రేమను ధాత్రిజనుల రక్షించెన్.
ధర్మము నిండెను దశదిక్కులలో ధమ్మం శరణం గచ్ఛామి!
బుద్ధపాదములె పూజలు చేసిరి బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘసేవకులె సమస్తజనమును సంఘం శరణం గచ్ఛామి!”

ధర్మాశోకుని కీర్తి నిండిపోయిన దీ భూలోకముననే కాదు, చతుర్దశ భువనములలోగూడ నిబిడీకృత మయ్యెను.

“అశోకకీర్తన లాలాపించిరి యక్ష గరుడ గంధర్వుల్
అశోకకథలే యాడిరి పాడిరి అప్సరసలు కింపురుషుల్.
ధమ్మం శరణం గచ్ఛామి!
బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!
నాగలోకమున నాగకన్యలు నాగరాజులెదురన్
అశోకగీత లాలాపించుచు నాడుచుండు రా కథలే!
ధర్మాశోకుని ధర్మపాలనము భగవద్గీత మయ్యెన్
ధమ్మమె మూలము ధరిత్రి కంతకు ధమ్మం శరణం గచ్ఛామి!
బుద్ధులె బోధలు భూచక్రంబున బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘమె బోధికి సమాశ్రయమ్మని సంఘం శరణం గచ్ఛామి!

కథ యద్భుతముగా పూర్తి యగుచున్నది. నాగిరాజు మంగళము చెప్పబోవుచున్నాడు. ఇంతలో సంఘారామములోనుండి ‘దొంగలు దొంగలు.’ అని పెద్ద కేకలు వినవచ్చెను. జనులందరు నొక్కసారిగా గందరగోళముగా సంఘారామము లోనికి పరుగెత్తసాగిరి. ఆ యలరి

పట్టిశక్యము కాక మంగళము సాగకుండానే నాగ గాథ పూర్తి చేయవలసి వచ్చెను.

జేతారినాథునివెంట భిక్షువులును, రాపర్తి బేతయనాయకునివెంట రాష్ట్రికూటులును సంఘారామములోనికి పరుగెత్తిరి. దొంగలు పలువురు సామాను కొట్టులో ప్రవేశించిరి. అమూల్యమగు రజత రత్న కాంచన వస్తువు లందే భద్రపరతురు.

పరీక్షింపగా నచ్చట బలిష్టమగు నొక ద్వారము చిత్రమార్గమున వేరు చేయబడియుండెను. భిక్షువులు చూచి పరిశీలించి యే వస్తువును బోలే దని చెప్పిరి. కాని వా రేదో పోయినదానికొరకు మిక్కిలి వ్యగ్రులై వెదకుచున్నట్లు బేతయ నాయకునికి స్పష్టమయ్యెను, అత దెంత యడిగి నను వా రేమియు లే దనిరి.

సూక్ష్మముగా నచ్చట పరిశీలించి యతడు రెండు వస్త్రములును, శిథిలమై యున్న యొక పీతవస్త్రమును, రెండు ఆయససాధనములును జూచి వానిని తన స్వాధీన పరచుకొని ముద్రిక వేసి రాజభటుల కప్ప గించెను.

జనులందరు నా దొంగల చిత్రచర్యల కాశ్చర్యపడిరి. పవిత్రులగు బౌద్ధశ్రమణుల ద్రవ్యము హరించుటకు ఆ దొంగలకుగూడ సాధ్యము కాకపోయియుండునని యా సంఘారామమాహాత్మ్యమును, నాగ గాథను పొగడుకొనుచు ప్రజలునెమ్మదిగా విచ్చిపోయిరి.

వేంగీరాజ్యమునకు విస్తారమగు విదేశవ్యాపారము కలదు. తూర్పుసముద్ర తీరమున దక్షిణమునుండి ఉత్తరమునకు వరుసగావిక్రమసింహపుర సమీప మందు కృష్ణాపట్టణము, కొత్తపట్టణం మోటుపల్లి వేలాపట్టణము, మోసల పట్టణము, విశాఖపట్టణము, భీమునిపట్టణము ముఖ్యమైనవి. ఇందులో విశాఖపట్టణము, భీమునిపట్టణము కాళింగులకును వేంగీప్రభువులకును సరిహద్దు సమీపమున నుండుటచే నా రెండు రాజ్యముల పోరాటములలో వృద్ధిగా లేవు. వేంగీరాష్ట్రమున కంతయు మోటుపల్లియే ప్రధానమగు

రేవుపట్టణము. ఇది చోళరాజుల నాగపట్టణము తోడను, ఉత్తరమున తామ్రలిప్తితోడను వర్తక సంపదయందు తులతూగుచు మహావైభవముతో నుండెను రాజరాజనరేంద్రుని కోశములో నారవపాలు మోటుపల్లి వర్తకము నుండియే వినిడుచుండును.

మోటుపల్లి పట్టణము రెండుభాగములుగా నుండెను. ఈ రెండు భాగముల మధ్యను విశాలమగు నొక ఉప్పుటేరు ప్రవహించుచు, రెండు భాగములకు దక్షిణముగా సముద్రములో కలియుచుండెను. ఆ యుప్పుటేటికి తూర్పున నుండు భాగమునకు వేలాపురి యనియు వాడరేవు అనియు సంజ్ఞలు కలవు దానికి పడమర నుండు భాగమే మోటుపల్లి.

మోటుపల్లి వాడరేవు సమున్నతప్రదేశములో నున్నది. సముద్రములో ప్రయాణము చేయుచు వేయిమంది యాత్రికులను తీసికొనిపోవు మహానావలు కూడ తీరమునకు మిక్కిలి సమీపమువరకు వచ్చి సురక్షితముగా నిలుచు నవకాశము కలదు. రాత్రి వేళల వచ్చు నావలు దారి తప్పక రేవుచేరునట్లు ఉపకరించుటకు తీరప్రదేశమున రెండు చివరలను సమున్నతములగు రెండు దీపస్తంభములు కలవు. ఆ స్తంభములే శత్రునావలు తీరము చేరుచున్న బరీక్షించుటకును ఉపకరించుచుండెను.

నావలు చేరు రేవున సరకులపై సుంకములు వసూలు చేయుటకు అధికారులు రాత్రిం బవళ్ళందు కా పుందురు. మరియు వివిధద్రవ్యముల మీద సుంకము పరిమితియు రేవు శాసనములును స్పష్టముగా నందరు తెలిసికొనుటకు అనువుగా చెక్కిన శిలాస్తంభములను ప్రతిష్ఠ చేసి యున్నవి.

వేలాపట్టణమువ్యాపారము భరతఖండమందలి ఇతరపట్టణములతో డనే కాదు; నిరంతరముగా చీనాదేశము, యవద్వీపము, సువర్ణద్వీపము, మలయద్వీపకల్పము, కదరము, శ్రీవిషయము, నక్కావరములనుండి రాకపోకలు కలవు. అప్పుడప్పుడు యవనులయు, రోమకులయు, పారశీకులయు నావలు వచ్చును. అందు విశేషముగా నుత్తమజాత్యశ్వములు వచ్చెడివి.

ఇంత విదేశవ్యాపారము కల వాడరేవులో స్థిరవసతులు కల్పించు

కొనిన దూర దేశీయులు కలరు. వారికి విశాలమగు భవనములు సరకులు నిలువ చేసికొనుట కచ్చట కలవు. బహుభాషలు మాటాడనేర్చిన చిత్ర చిత్ర జను లందు గాంచనగుదురు.

యవనుల వాడ యొకటి యం దెల్ల జనుల నాకర్షించునది. మహా శ్వేతవర్ణము గల యచ్చటి విలాసినుల శరీరములు నాగరకుల కన్నుల మిరుమిట్లు గొలుపుచుండెను.

ముత్యాల వర్తకులు, రత్నసువర్ణ వర్తకులు, సుగంధద్రవ్యము లమ్ము వారు, కంసరులు. వ్రడంగులు, పద్మసాలెలు, తాంబూలవిక్రేతలు. మాలాకారులు, బహుధాన్యవర్తకులు. నావికులు విశేషముగా వేలా పట్టణముననే నివసించుచుండిరి. కాని ఈ వేలాపట్టణము యథాసౌకర్యముగా పెరిగిపోవుచుండుటచే కొంత భాగము విశాలముగను మరికొంత భాగము కిక్కిరిసి యిరుకుగను ఉండి నియమితముగా లేదు. మరియు నొకచోట జైనవసతియు, నొకవంక చిన్న బౌద్ధసంఘారామమును, మరియొకచోట క్రైస్తవమఠమును, దాని సమీపముననే అరబ్బుల ప్రార్థనామందిరమును నం దున్నవి.

వేలా పట్టణమునందలి మాలిన్యము హరించుటకుమాత్రము సూత్రధారులు ఉప్పుటేరు ఉపయోగపడునట్లుగా నిర్మాణము కావించుటతో ....

ఉప్పుటేటికి పశ్చిమముగా నున్న మోటుపల్లి యట్లు కాదు. అది పురనిర్మాణ కౌశలముకల సూత్రధారులు, శిల్పులు నిర్మించినది. అందు మధ్యభాగములో నొక జలదుర్గము కలదు. అందు 'నావధ్యక్షుడు' నివసించును. అతడే వేంగీరాజ్యమున నున్న రేవుల కన్నిటికి ముఖ్యాధికారి. అతని యనుమతి లేనిదే సముద్రయానములే కాక నదీతరణమును చేయరాదు. రేవు రక్షణకు అతని యధీనమున నెన్నియో నావలు కలవు. సముద్రమునుండి శత్రువులు వచ్చినచో నెదిరించుటకు మహాసేన కలదు. నావధ్యక్షునికి మహామండలేశ్వరునితో సమానప్రతిపత్తికలదు.

ఈ దుర్గము లోపలను వెలుపలను సూర్యచంద్ర వీథులు మనోహరముగా తీర్చినట్లుండును. నియమితస్థలములలో. ఉద్యానవనములు,

వాపులు, కూపములు, తటాకములు కలవు. కేంద్రస్థానములలో కావుండు రాజభటుల మందిరము లున్నవి. పరిశుభ్రమగు వైద్యశాల లెన్నియో కలవు. ఈ వైద్యశాలలు రెండు విధములు. కొన్నిటిలో నరుల వ్యాధులకు చికిత్స చేయుదురు, మరికొన్ని 'సహదేవశాల'లను సంజ్ఞకల పశువైద్య శాలలు. వానిలో గజములకు, అశ్వములకు, గోవులకు, వృషభములకు దేవతాభావముతో పూజాపురస్సరముగా చికిత్సచేయు నాచారము కలదు.

ఇందలి వాడలుకూడ, కులభేదము ననుసరించియు, వృత్తి భేదము ననుసరించియు వేరు వేరుగ గలవు. దుర్గము చుట్టును అశ్వశాలలును, గజశాలలును ఉన్నవి. దుర్గద్వారములందు ఘటికాయంత్రములు కలవు. అందుండి నాళికుల కేకలు తరచు వినవచ్చుచుండెను. గోపురద్వారములందు వరాహలాంఛనములు కన్నుల పండువు చేయుచుండెను.

దుర్గమునకు సమీపమున మనోజ్ఞమగు శివాయతనమును విష్ణ్వాలయమును గలవు. శివాయతనము సముద్ర ముఖముగను, విష్ణ్వాలయము మోటుపల్లి దుర్గముఖముగను నుండి యా రెంటును సర్వవిధముల నా దుర్గమును పరిరక్ష చేయుచుండెను.

మోటుపల్లి రెండు భాగములకును మధ్య రెండు విశాలమగు వారధులు కలవు. అనేకస్థలములలో దాని నుత్తరించుటకు తరులును గలవు

మోటుపల్లిలో విశాలమగు రాజమార్గము లెన్నియో వున్నవి. ఒకదానివెంట నేగిన విక్రమసింహపురముమీదుగా దక్షిణమున కాంచీపురమునకు బోవచ్చును. మరియొక దానివెంట నమరావతి, శ్రీశైలము, కందనోలులమీదుగా పశ్చిమమున కల్యాణకటకము చేరవచ్చును. ఇంకొకదానివెంట ధనదుప్రోలు, భట్టిప్రోలు, వెల్లటూరు, శ్రీకాకుళము, వేంగీపురముల మీదుగా రాజమహేంద్రపురమునకు ఈశాన్యముగా నేగవచ్చును. సైన్యము లీ మార్గములనే తరుచుగా నడచుచున్నందున వీనికి దండుబాటలను పేరు వచ్చినది. సార్థవాహు లీ మార్గములమీదుగానే తమ సార్థములను తీసికొనిపోవుచుండిరి.

ఇంత మహావైభవముగల యా పట్టణములో యాత్రికుల సౌకర్య

మున కనేక ధర్మశాలలు కలవు. అందులో కొన్ని చాల పెద్దవి. కొన్ని చిన్నవి.

మోటుపల్లిలోగల యొకానొక చిన్న ధర్మశాలలో వారము దినములనుండి సువాసిని యొకతె తొమ్మిదేండ్ల వయస్సుగల కుమార్తెతో కలిసి విడిది చేసెను. ధర్మశాల చిన్నది. వ్యాపారస్థానములకు దూరమున బ్రాహ్మణవాటికలో నున్నది. శాంతముగా నుండదలచినవారి కది యెక్కువ యనువుగా నుండెను.

వారి పరిచర్యల కిరువురు సేవకులు కలరు. అక్కడికి వచ్చిన దాదిగా వా రిరువురు రాత్రింబవళ్ళు నా పట్టణము రెండు భాగముల మూలమూలల దిరుగుచుండిరి. కాని యా పట్టణములోని వినోదములు వారి నేమియు నాకర్షించుటలేదు. మహా నగరవాసమున కలవాటుపడినవారుగా కనిపించుచుండిరి తిరిగి తిరిగి నిరాశా దృక్కులతో వచ్చి యా సువాసినికి 'కనపడలే'దని మాత్రమే నివేదించుచుండిరి. ఎవరో?

వా రందరును కర్ణాటకదేశమున బహుకాలము నివసించిన తెలుగు వారివలే నుండిరి. వారి కట్టుబొట్టు ఇత్యాదికము కుంతలదేశమునే స్మృతికి దెచ్చుచుండెను. మాటలోకూడ కన్నడుల యాసకలదు. వారు సంపన్నులు గను కష్ట మెరుగనివారివలెను కనవడుచుండిరి. వారు ధరించు వస్త్రములు విలువ కలవిగాని యాభరణము లెక్కువ లేవు.

ఆ సువాసినిపేరు సోమిదేవి. కుమార్తెపేరు కుపమ. కుపమ మాటకారి. వారి దక్షిణయాత్రా విశేషములు మరల మరల నది తల్లి నడుగుచుండును. మా నాన్న నెప్పుడు చూచెద నని మధ్యమధ్య అడుగును తల్లి విచారము చూపగా మరల నింకొక విషయము ప్రస్తావించును.

వారు కన్యాకుమారిని దర్శించి, సేతుస్నానము చేసి, రామేశ్వరుని పూజించినారు. మధురలో మీనాక్షిని కొలిచి, తంజాపురములో రాజ రాజ బృహదీశ్వరుని సేవించి కంచిలో కామాక్షికి మ్రొక్కినారు. అంతట తిరుమలలో బాలత్రిపుర సుందరి నర్చించినారు. ఈ మధ్య విక్రమసింహపురములో శేషశాయిపదములవ్రాలినారు. అందుండి రాజమార్గమున రాక

కృష్ణాపట్టణమురేవుచేరి, నావమీద ప్రయాణము చేసి మోటుపల్లిలో దిగినారు.

శ్రీరామనవమినాడు మధ్యాహ్నము మోటుపల్లిలోవిష్ణ్వాలయములో నుత్సవము దర్శించుటకు సోమిదేవియు, కుపమయు, నందలములో నేగిరి. ఆ పిమ్మట శివాయతనము చేరి సంధ్యాసమయమువరకు నందే యుండి, ధర్మశాలకు తిరిగి వచ్చిరి. వారికి శ్రీకాకుళనాధుని, కనకదుర్గను, భీమేశ్వరుని సేవింపవలెనని యుత్కంఠ విశేషముగా ద్యోత మగు చుండెను. కుపమకు భీమేశ్వరుని నామస్మరణ ఆనందతన్మయత కలిగించు చుండెను.

ఏకాదశినాటి సాయంత్రముకూడ సేవకులు నిరాశాదృక్కులతో తిరిగి వచ్చిరి. కాని వారిలో నొకడు ఆ మరునా డుదయమే సార్థ మొకటి రాజమహేంద్రపురములో జరుగుచున్న సంతకు శీఘ్రప్రయాణమున నేగ నున్నట్లు నివేదించెను.

అది విని సోమిదేవి వెంటనే యా సార్థముతో తాము బయలు దేర నిశ్చయించెను. పరివారకులు సార్థవాహునికి తమ నామాదులు తెలిపి, యొక యందలమును, కంచర మొకటియు, రెండు గుఱ్ఱములును ప్రయాణమునకు సిద్ధముచేసిరి.

# 17

ఆమరునాడే ఉదయమున నా సార్థము ప్రయాణోన్ముఖమయ్యెను. అది మోటుపల్లిలోనే బయలుదేరుచున్నందున నల్పారంభముగా నుండెను.

ఇది సువర్ణద్వీపములనుండి సుగంధద్రవ్యములు తెచ్చిన వర్తకుల యాధిపత్యమున నడచుచుండెను. ఇట్టి సార్థములతో నావర్తకులతోపాటు తీర్థయాత్రికులను, ఉద్యోగాది కార్యాంతరములచే ప్రయాణములు చేయు వారును ప్రయాణము చేయుచుందురు. సార్థము నడచిపోవుచున్న పట్టణము ననుకరించుచుండును.

సార్థము సాగుచుండగా నది యొక సర్పాకారముననుండి, శిరస్సు నకును, పుచ్ఛమునకును యోజన ముండును. సార్థముఖమందలి వారు,

ఒక గ్రామము వదలిపోయిన మరునాడు చివరవా రా గ్రామము చేరుట సర్వసాధారణము. ఇట్లు కొన్నిదినములవరకు నిరంతరముగా నొకే సార్థ భాగములు వెళ్ళుచుండుటయు నున్నది.

ప్రతిసార్థమునకును సర్వాధికారి యొక డుండును. అతనిని సార్థ వాహుడందురు. అతడు ప్రయాణముచేయు ప్రదేశమును చుట్టుప్రక్కల పరిసరములను, జనులను, భాషలను బాగుగా నెరిగినవాడై యుండును. అతని స్వాధీనములో పలువురు భటు లుందురు. సార్థములోని వారిని స్వల్పపు నేరములకు శిక్షించుట కతని కధికారము కలదు. పెద్ద నేరములు జరిగినచో నట్టివారిని రాజభటుల కప్పగించును.

సార్థములో చేరినవా రందరును సార్థవాహునికి నియమితమైన సువర్ణముగాని, వర్తకులైనచో వారి సరకునుబట్టి భాగముగాని ఇచ్చుకొనవలెను. సార్థవాహుడు సార్థములోనివారి ప్రయాణమునకు అవసరమైన వసతులు కల్పించును. దారిలో యాత్రికులాగినచోట వారికి భోజనాదులకు అవసరమైన పదార్థములు దొరుకునట్లు సిద్ధముచేయించును. స్వల్పవ్యాధుల చికిత్సకు వైద్యు లుందురు. సార్థరక్షణకు భటుల నతడే నియమించును. విశేషధనము ప్రయాణసమయములో వెంట నుంచుకొనుట కష్టమని తలచినచో సార్థవాహున కది యప్పగించిన నవసరమైనప్పుడది వారల కిచ్చుచు సంరక్షించును. సార్థములోనివా రందరు తప్పిపోకుండ వచ్చుచున్నట్లు మధ్యమధ్య కొన్నిస్థానములలో సరిచూచుకొనుచుందురు. నిర్ణీతసౌకర్యములు సార్థవాహుడు కల్పింపనిచో సార్థవాహుడు రాజదండమునకు పాత్రుడగును. తీవ్రప్రమాదమునకు సార్థవాహునికి శూలారోపణము సామాన్య శిక్ష.

సార్థములవెంట భారములు చేర్చుటకు సేవకు లెందరో ఉందురు. అవసరమగుచుండు చిల్లర వస్తువులు విక్రయించుటకు వర్తకులుందురు. ఇంతే కాదు. యాత్రికుల వినోదార్థము ఎన్ని రకములవారు నందు చేరెడివారు. సార్థములోని సంపన్నుల ధనము సుఖముగా హరించుట కెందరేని చుట్టుప్రక్కల గ్రామముల నుండి చేరుచుందురు. చోరుల బాధ లేకుండుటకు సార్థవాహు డెన్నియేని భద్రకార్యములు చేయుచుండును.

అటి యీ సార్థముతో గలసి సోమిదేవియు, కుపనుయు వారి సేవకులతో మధ్యాహ్నమునకు చెరుకూరు చేరిరి. అది పెద్దగ్రామము. అందులో నిత్యాగ్నిహోత్రులై వేదవిదులగు బ్రాహ్మణుల వేయి గడప గలదు. వారిలో పలువురు అగ్నిష్టోమాదిగా మహాగ్నిచయనాంతక్రతువు లొనర్చినవారు. అప్పుడు ఆ గ్రామములోని సోమయాజి యొకడు అప్తోర్యామ మను మహాగ్నిచయనము చేయుచున్నా డని సోమిదేవికి తెలిసినది. ఆమె కర్ణాటదేశములో నున్నపుడు యజ్ఞములు చూచి యెరు గదు. దక్షిణయాత్రలు చేయుచున్నప్పటినుండియు, దారిలో నెన్నియో యజ్ఞకర్మలు కన్నులపండువుగా చూచినది. ఆమె పుట్టింటివారి కుటుం బములో మూడు తరముల క్రిందటి పురుషుడు అగ్నిష్టోమము చేసెను. అప్పటినుండి యీ కుటుంబములో సోమిదేవి పేరు వచ్చుచుండెను. ఆమె మెట్టిన యింటగూడ మూడవ పురుషుడు కంచెన సోమయాజి అగ్నిష్టోమము చేసినవాడు. ఆమెకు తన నామము సార్థకముచేసికొన వలె నను తీవ్రవాంఛ కలదు.

ఆమె యజ్ఞము సంగతి వినగానే కూతును దీసికొని యజ్ఞశాలను జూడనేగెను. అప్పుడే రుద్రదేవతాకమైన మంత్రములతో త్రిసహస్ర సంఖ్య కల ఇష్టకలు శ్యేనాకారముగా స్థాపించి, అహవనీయకుండము కల్పించుట పూర్తియైనది. వెంటనే రుద్రరూపముగా మహాగ్ని యక్కడ నావిర్భవించునట. ఆ రుద్రుడు క్రొ తగా జన్మించిన గోవత్స మువలె ఆకలితో నుండి భాగధేయము వెంటనే కావలె నని కోరునట. అవ్యవధానముగా అజాక్షీరముతో శతరుద్రీయముతో, ఆరు హోమములు చేయుదురు. అవి యన్నియు వంశము ధరించి యేకధారగా చేయవలెను. ముందధ్వర్యుడు మూడు హోమములు చేయును. ఆ పిమ్మట యజ మానియే మూడు హోమములు చేయును.

సోమిదేవి చూడబోవునప్పటికి సరిగా రుద్రావిర్భావ మయ్యెను. ఆమెకు దేహమానందముతో పులకరించెను. ఆమెకు పుత్రోత్పత్తికాలేదు. ఈ సోమయాజికి ఋత్విక్కులు రుద్రోత్పత్తి మంత్రములతో కల్పించిరే విచారింపగా నా యజమాని గోత్రముకూడ తమగోత్రమే— హారితస

గోత్రము। వెంటనే యామె మూడువందల యేబదివరహాలు యజ్ఞభిక్షగా దక్షిణార్థ మర్పించెను. ఆ పూట నామె కుమార్తెతో సేవకులతో యజ్ఞేశ్వర ప్రసాదమే భుజించెను.

తన పూర్వులు ఎన్నడో నివసించిన వేంగీరాజ్యములో మరల ప్రవేశించిన తర్వాత ప్రథమయజ్ఞశాలాదర్శనముననే రుద్రావిర్భావమగుట యామె కెంతయు శుభసూచన మని తోడకట్టినది. ఆ సాయంత్రమునకు వారు సురక్షితముగా ధనదుప్రోలు చేరిరి. అది వెలనాటికి ముఖ్యపట్టణము. అక్కడ రాజరాజసామంతమండ లేశ్వరుడగు నాఙ్యాదేవు డను వెలనాటి చోడుడు పాలించుచుండెను. అతడప్పుడు రాజమహేంద్రపట్టణమునకు రాజదర్శనార్థ మేగియున్నట్లు తెలియవచ్చెను.

ధనదుప్రోలులో అష్టోత్తర శతసంఖ్యాకములగు శివాయతనము లేక ప్రదేశమున గలవు. ఆ యాలయము లన్నిట నభిషేక మేకకాలము ననే జరుగును. పదకొండు మారులును పదునొకండు ద్రవ్యములతో నా యభిషేకము చేయుదురు. అభిషేక సమయమున నన్ని దేవాలయములోని తీర్థము కలిసి చిన్న సెలయేటి ప్రవాహము ననుకరించును. ద్రవ్యభేద మునుబట్టి యా సెలయేరు రూపభేదము నొందుచుండును. సోమిదేవి యా రాత్రి శివదర్శనము చేయుటకు బోవునప్పటికి నాలస్య మయ్యెను.ఆ యాల యముల మహావైభవము చూడగనే యామె, మరునాడుదయ మచ్చుటనే యుండి, రుద్రాభిషేకము చేయింప నెంచినది. ఆ సంగతి సార్థవాహ భటు లకు తెలియజేసినది.

మరునాడు చైత్రశుద్ధ త్రయోదశి.ఆ నా డామె విడిదినుండి దేవాల యమునకు బయలుదేరబోవుచుండగా, గంగిరెద్దు తీసికొని గంగిరెద్దులవా రెదురైరి వారు గంగిరెద్దను చిత్ర వర్ణములు గల గంతలతోడను పూసల పేరులతోడను చక్కగా నలంకరించిరి. వారును ఆకర్షించు రంగుల అంగీ లును, తల చీరలును ధరించిరి. వారు వీణము వేయుచు వినోదములు చేసి సోమిదేవిని, కుపమను మెప్పించిరి. సోమిదేవి వారికి పాత పట్టుచీర యిప్పింపగా దండములు పెట్టుచు వెళ్ళిపోయిరి.

అభిషేక సమయమున ధనదుప్రోలులోని దేవళముల వైభవము

ధనదుపురమునే స్మరణకు తెచ్చెను. అన్ని దేవాలయములనుగల దీప స్తంభముల వెండిమండల యాకారములు కువమదృష్టిని మిక్కిలి యాకర్షించెను.

వారు అభిషే కానంతరము భోజనాదిక మొనర్చి, అవీట కొంచెము సేపు విశ్రాంతి తీసికొని వెంటనే బయలు దేరిరి. శీఘ్రకాలములననే వారికి పొన్నపల్లి యగ్రహారము కన్నుల పండువయ్యెను అస్తమయమునకు గడియ ప్రొద్దు ఉండగనే వారు భట్టిప్రోలు చేరిరి.

భట్టిప్రోలు అంతకు పూర్వము మహాపట్టణమై యుండెను గాని, అందున్న సంఘారామముతో బాటు పట్టణమునకును జీర్ణదశ ప్రారంభించెను. ఆ సంఘారామమున మహాచైత్య మొకటియు, రెండు సామాన్య చైత్యములును గలవు. మహా చైత్యములో తథాగతుని దేహధాతువు పదిలముగా నున్నందున బౌద్ధుల కది పుణ్యక్షేత్రము. అందున్నది బుద్ధుని శల్యమని ప్రతీతి. ఆ ధాతుగర్భముచుట్టను పెద్ద సంఘారామము కలదు. ఆ యావరణ మంతయు బలపపు రాలపై చెక్కిన అద్భుత శిల్పములతో లోచనాకర్షకముగా నుండెను. సార్థము వెళ్ళు మార్గాలికి సమీపముననే యొక ప్రక్క నది యుండెను.

సార్థము మోటుపల్లిలో బయలుదేరునప్పు డంత పెద్దది కాదు. ధనదుప్రోలుకు చేరిన పిమ్మట నది విస్తారమయ్యెను. అచ్చటినుండియు భట్టిప్రోలు వరకును జనపదములతో సంకీర్ణమగు ప్రదేశమైనందున అడుగడునకు నూతన యాత్రికులు చేరుచుండిరి. సార్థము క్షణ క్షణ మీ రీతి పెరిగిపోవుచుండెను.

భట్టిప్రోలు సంఘారామము దర్శించుచుటకు సువర్ణద్వీపమునుండి మోటుపల్లి రేవున వచ్చిన బౌద్ధయాత్రికు లా సార్థములో పలువు రుండిరి. వారందరు భట్టిప్రోలులో నాగిపోయిరి. అంతకుముం దక్కడికి వచ్చి, తమ సేవలు పూర్తిచేసికొనిన భక్తులెందరో మరల నా సార్థములో చేరిరి.

భట్టిప్రోలుకు క్రోశము దూరములో వెల్లటూరున్నది. అక్కడ కృష్ణవేణీనది నా సార్థము తరింపవలెను. వెల్లటూరులో సార్థములోని మనుష్యు లందరును సరిగా వచ్చినదియు, లేనిదియు పరీక్షింతురు. ఆవలి

యొద్దకు చేరిన పిమ్మట శ్రీకాకుళ క్షేత్రములో మరల నొకమారట్టి పరీక్ష చేయుదురు.

వెల్లటూరులో నప్పు డొక వాజపేయము జరుగుచున్న దనియు మరునాడే అవభృథస్నానము జరుగు ననియు సోమిదేవికి తెలియవచ్చెను. ఆరాత్రియా వాజపేయమును దర్శించి, మరునాడు అవభృథోదకము శిరస్సునతానును కుమార్తెయు ధరించి పవిత్రత నొందవచ్చునని యువ్విళ్ళూరుచు సంస్కారామము వంకనైన జూడక యందలమును సాగనిమ్మని బోయీలకు చెప్పెను.

శరీరకష్టము చేయుచున్న యా బోయీలు విశ్రాంతి తీసికొననిది కదల లేకుండిరి. విశ్రాంతి యనగా, వారి భాషలో మద్యపానము. ఆ ప్రాంతమంతయు తాటిచెట్ల మయము. ఆ చుట్టుప్రక్కల తాటికల్లు రుచి తద్విదులలో పేరు మ్రోగిపోయినది. సోమిదేవి సేవకులు బోయీల నా సుర త్రాగకుండ జేయలేకపోయిరి.

ఇట్లు సోమిదేవి, కుపముల పల్లకిదింపి, బోయీలు విశ్రాంతి దీసికొనుచుండగా నా యుదయము సోమిదేవి విడిదియందు వినోదముచూపిన గంగిరెద్దుల జట్టు అచ్చట వినోదము చూపుచు కనిపించెను. అప్పు డా గంగిరెద్దుల నాయకుడు అన్నిటిలో పెద్ద గంగిరెద్దుపై సోమిదేవి యిచ్చిన పట్టువస్త్రము కప్పి యాడించు చుండెను. వా డా యందలమును చూచినంతనే ఒక్క పరుగున ఆ ఎద్దును అందలముముందుకు తీసికొనివచ్చి సోమిదేవికి మ్రొక్కించెను.

"అమ్మగారికీ దండంబెట్టూ బసవా, బగవా, బసవా!
పట్టు శాలువను కట్టి కులికెదవు బసవా, బసవా, బసవా!
ఆ పట్టుకోక ఈ అమ్మవారిదే బసవా, బసవా, బసవా!
ఈ పైపుల లే దింతటి వితరణ బసవా, బసవా, బసవా!
పులి నీ మెడ ఎట్లు పట్టెరా బసవా, బసవా, బసవా!"

వెంటనే ఆ గంగిరెద్దు హుమ్మని అ గంగిరెద్దు నాయకునిమీదికి రంకెలు వేయుచు దుమికి అతని మెడ పండ్లతో పట్టుకొని యాపే సోమి

దేవివద్దకు వానిని నడిపించుకొనివచ్చి చూపి మెడ వదిలెను. కుపమ భయపడ సాగెను, కాని సోమిదేవి చిరునవ్వుతో దాని ననునయించెను.

"కల్యాణములో కడియా లేవిర బసవా, బసవా, బసవా?"

ఆ గంగిరెద్దు తల వంచి తన కాలి కున్న వెండి కడియములు నిర్దేశించెను.

"మాన్యఖేటమున మాలిక లేవిర బసవా, బసవా, బసవా?"

అది తన శిరస్సునను కంఠమునను గల పూసల పేర్లు ఊగునట్లుగా తలపైకి క్రిందికి నాడించుచు చూపెను.

"పుట్టిల్లంటే పుట్టెడు వేడుక బసవా, బసవా, బసవా!
అమ్మగారి కిక నడ్డం రాకుర బసవా, బసవా, బసవా!
అమ్మగారి కొక దణ్ణం బెట్టర బసవా, బసవా, బసవా!"

ఈ విధముగా నాడించగా సోమిదేవి సంతోషించి యా గంగిరెద్దుపై మరియొక వస్త్రము కప్పించెను. ఇంతలో బోయీలు ద్విగుణీకృతోత్సాహముతో అందలము ఎత్తుకొని బయలుదేరిరి. సేవకులు అశ్వము లధిరోహించిరి. వారి కంచరమును సాగిపోవుచుండెను.

వెల్లటూరుకు సగము దూరము వారు పోయిరి. పైన చంద్రుడు చల్లని వెన్నెల కాయుచుండెను. దూరమున వెల్లటూరు దీపములును, యజ్ఞధూమమును కానవచ్చు చుండెను. ఆ ప్రదేశమున దట్టముగా చెట్లు కలవు. అందులో వనస్పతివలె ప్రకాశించుచు పురాతనమగు నొక వట వృక్షము కలదు. అక్కడ చిత్ర చిత్రమగు దొంగతనములు జరుగుచుండెడి వను ప్రతీతి యుండెడిది! అందువలన దానికి దొంగలమర్రియని యన్వర్థనామము వచ్చెను. రాత్రులు చీకటిపడిన పిమ్మట ఎక్కువ పదిలముగా నా దొంగల మర్రిని దాటెడివారు.

సోమిదేవియందల మచ్చటికి వచ్చునప్పటికి చీకటిపడింది. వెన్నెల యున్నను, మార్గమును కప్పివేసిన యా చెట్ల సందులనుండి చంద్రకాంతి కనిపింపకుండెను. కంచరము వెనుకపడిపోయెను. చిత్రముగా సార్థములోని జనమును ముందు వెనుకల గొంచె మెడ మైరి.

వారా మఱ్ఱిపద్దకు వచ్చునప్పటికి దొంగల మఱ్ఱిలోనుండి ఆకస్మిక ముగా పిశాచముల కేకలు విననయ్యెను. ఒక్కసారిగా నా మఱ్ఱి యూడలనుండి పిశాచముల తండము వికృతభయంకర వేషములతో క్రిందికి లంఘించి త్రుటికాలములో సందలమును చుట్టుముట్టెను. బోయీ లందరు భయభ్రాంతులై అందల మక్కడ పడవైచి ఎవరికి తోచిన త్రోవనువారు పారిపోయిరి, రెండు వైపులనున్న సేవకులిద్దరను ఆ పిశా చములుగదలతో మోదగా వారు గుఱ్ఱములనుండి పడిపోయిరి.

అది చూచి సోమిదేవియు, కుసుమయు మూర్ఛపోయిరి. వా రున్న యందలము నా పిశాచములు మోసికొనుచు శీఘ్రగమనముతో నెక్కడికో పోయెను.

సార్థములో వెనుక నున్నవారు కలిసికొనునప్పటికి అందలముజాడ లేదు. తలమీద తగిలిన దెబ్బలకు స్మృహతప్పి సేవకులిద్దరును పడియుం డిరి.సార్థరక్షకులు రాజోద్యోగులు అక్కడికి చేరి యా సేవకులను,సమస్త వస్తువులతో కంచరమును క్షేమముగా వెల్లటూరులో సురక్షితమగు విడిదికి చేర్పించిరి. వైద్యులు సేవకులకు చికిత్స చేయుచుండిరి. కాని వారి కా రాత్రి స్మృహరాలేదు.

నాడే రాజమహేంద్ర పురములో బాణహతుడై నన్ని నారాయణ భట్టు వజ్జియ మందిరములో చికిత్స పొందుచుండెను.

నన్ని నారాయణుడు బాణహతుడైన రాత్రి నీరసముగా నుండి బాగుగా నిద్రించెను. దృఢమైన యతని కాయము సుఖనిద్రతో మరునాటి యుదయమునకు కొంత వికసించెను. అతడు కన్నులు తెరచి చూచినంతనే సేవకుడు పొన్న వినయ ముగ్ధమైన ముఖముతో ప్రత్యక్షమయ్యెను.

ఒక్క క్షణకాలము తాను కలగనుచున్నానేమో యని సందేహించి చింతించి కన్నులు మూసెను. మరల కన్నులు తెరచినంతనే పొన్న కన్నీరు కార్చుచు నారాయణుని పాదములు స్పృశించి వందనమొనర్చెను. అతని భక్తికి, ప్రేమకు నారాయణుని హృదయము ద్రవించి, కన్ను

లార్ద్రితుయ్యెను. రవంత గద్గద స్వరముతో "పొన్నా!" అని మాత్ర మత డనగలిగెను. పొన్న దగ్గరగా నేడ్వసాగెను.

పొన్న దేహము అతిమాత్రముగా స్థూలమును, కర్కశమును ఐనది. అంత దేహమును బవస త్త్వములతో పొంగారుచుండెను. జగదేక మల్లుని విగ్రహమువలె కనుపడును. కాని యిప్పు డాతని దేహ మంతయు చిన్న చిన్న గాయములతో సందులేకుండెను. పలుతావుల పొంగియుం డెను. ఒక కన్ను ఎఱ్ఱవారి యుండెను.

"పొన్నా! నీవు ప్రాణములతో ఉన్నావు. చాలును" అని నారాయణ భట్టు నిట్టూర్చెను.

"స్వామి పాత సేవకుని ప్రాణము లెంత, బాబూ! మీ ప్రమాదము నా కెక్కువ బాధగా ఉన్నది."

"నాకు ప్రమాదము రాదు పొన్నా? కాని నీ వేమైతివి? ఎవరు నిన్ను ఇక్కడికి తెచ్చిరి? స్వప్నము కాదని నిశ్చయము కాలేదు!"

"మీకు స్వప్నము కాదు, ప్రభూ, నిజము. ఇన్ని గాయములతో నా దేహమెన్నడై నను చూచితిరా?"

నారా : లేదు. నిజమే.

పొన్న : ఈ దెబ్బలకు నాకు దిగులు లేదు. ఇన్ని దెబ్బలు కలిగిం చినవారిలో నొక్కరినికూడ తిరిగి యింత నొప్పింపలేకపోతిని వారిని గుర్తింపనుకూడ లేను.

నారా : ఏ మైనది?

పొన్న : పారశీకుల నూనె వచ్చిన సిద్దెలలో నూనె లే దని నాకు సందేహము కలిగి, యిప్పటికి రెండు రాత్రులనుండి యా పడవ లున్న ప్రదేశముల గోదావరిలో నీదుచు పరీక్షించుచుంటిని. నిశ్చయ మైనంతట రాజభటుల కా నూనె సిద్దెలలోని యాయుధము లన్నియు నప్పగింపవలె నని నా యుద్దేశము.

నారాయణుడు ఊఁకొట్టుచుండెను. పొన్న తన కథ సాగించెను:

"ఈదుచున్న నా తలమీద గురి చూచి ఎవరో తెడ్డు విసరిరి. అది వెన్నెలలో తప్పించుకొంటిని. కాని వీపుమీద పడినది. వెంట వెంటనే

దేహమంతయు తెడ్లతో దెబ్బలు తగిలినవి. అప్రయత్నముగాఅరచినాను. నాకు స్మృతి తప్పినది. లేచునప్పటికి విలువగల వస్తువులున్న కొట్టులో నుంటిని. నాకు దాహము కాని, ఆహారము కాని యిచ్చువారు కూడ లేక పోయిరి. ఆ పగలు గడచిపోయిన తర్వాత చీకటిపడిన కొంత సేపటికి, మంచినీరు, ఆహారము సోదణగండ్లలోనుండి ఎవరో ఉంచిరి. అనుమానించి చాలసేపవి ముట్టలేదు. దాహ మాపుకొనలేక తెగించి ముందు మంచినీరు త్రాగితిని. ఆ పిమ్మట నాహారము గ్రహించితిని. మరునాటి పగలంతయు నాకు దాహముకూడ నెవ్వరు నీయలేదు. బయట నంతయు సందడిగా నుండెను. నేను కేకలు వేసితిని. విన్నవారు లేరు. మరల చీకటిపడిన తర్వాత మంచినీరు పెట్టుచున్న హస్తము కనపడినది. ఆతురుడనై మంచినీరు త్రాగివేసితిని. ఆహస్తము అన్న మందించు చున్నది. ఆ చేయి గుర్తువచ్చినది—"

పొన్న ముఖభంగి యొక్కసారిగా వికృతమయ్యెను. నారాయణ భట్టు ద్విగుణీకృతాదరముతో "నీ వేమియు తొందర పడలేదుగదా!" అని యడిగెను. పొన్న సాగించెను.

"చేయి గుర్తుకు వచ్చినది. త్రాగిన నీ రొక్కమారుగా కడుపులో నుండి వికారము కలిగి వెళ్ళిపోయెను అన్నపాత్ర ఆ వేగముతో పగుల గొట్టితిని. ఆ చేయి విరిచి వేయుట కందుకొనబోతిని అందలేదు ప్రభూ, అందలేదు."

పొన్న కన్నులు తిరిగిపోయెను. అతని హృదయస్పందనము దూరమునుండి మేఘగర్జనమువలె విననగుచున్నది.

"స్వామీ, ఆచేయి తప్పించుకున్నది. మరొకమారు కనిపించినచో నది యదృశ్యమైయుండును. ఆరాత్రి నాకు కన్నుల నిద్దుర లేదు. అర్థ రాత్రము దాటిన దనుకొందును. ద్వారమునొద్ద విచిత్రమగు ధ్వని ప్రారంభించెను. ఎవరైనను లోపలికి వచ్చినచో వారిని ప్రాణములు తీయుటకు తెగించి సిద్ధపడితిని. కంతనుండి 'నారాయణదూతలము. అల్లరి చేయ వద్దు'అని వినిపించెను. వెంటనే నేను శాంతించితిని. ద్వారముమూల లూడిపోయెను. నన్ను నలుగురు మనుష్యులు తీసికొని చెట్లచాటునుండి దారి తీసి, పెద్దప్రాకారమును త్రాటి నిచ్చెనలమీద దాటించి మీ పాదసన్ని

ధికి జేర్చినారు. ఆ తొందరలో రక్షణకు మీ రిచ్చిన చిత్రవస్త్రము అక్కడ పోయినది. నన్ను నూనెవర్తకులమీద నభియోగములో సాక్షిగా రమ్మని వచ్చిన రాజాజ్ఞాపత్రమును, మరియొక పత్రమును పోయినవి."

ఇంతలో వజ్జియ ప్రెగ్గడ అక్కడికి వచ్చెను. నారాయణు డాతనికి నమస్కరించెను. పొన్న ప్రణామము చేసి ప్రక్కకు వొదిగి నిలుచుండెను.

"ఇతడేనా, నీ పరిచారకుడు?"

"అవును మీదయవల్ల."

వజ్జియ ప్రెగ్గడ సన్నిధానములో వైద్యుడు నారాయణుని బాహువు పైనున్న వైద్యబంధ మెడలించి పరీక్షించెను. కండగల యా బాహువంతయు పొంగియుండెను గాయము లోతుగా నున్నట్లున్నది. కాని వెడల్పుగా లేదు. వైద్యుడు పరీక్షించి, "గాయము శుభ్రముగా నున్నది. ఇంత యారోగ్యము కల వ్యక్తికి ప్రమాద ముండకూడదు. మూడు నాలుగు రోజులలో వాతము క్రమ్మని యెడల ఏ భయము నుండదు" అని వజ్జియకు నివేదించెను.

సోమయాజులగు బ్రాహ్మణులు వేచియున్నారని సేవకు డక్కడికి వచ్చి వజ్జియకు నివేదించెను. అది విననివానివలెనే యతడు సంభాషణ సాగించెను.

వజ్జియ కొంచెము పరిహాసమిశ్రితమైన ఆదరముతో పొన్న దృఢ కాయమును ఆపాదమస్తకము ఉపలక్షించి నారాయణభట్టును, 'ఇతడేనా పొన్న?' అని ప్రశ్నించెను.

నారాయణభట్టు, "అవును. అతనిని తిరిగి రప్పించుటతో నాకు గాయము సగము నయమైనది" అనెను.

వజ్జియ: పాప మితనికి దేహమంతట దెబ్బలు తగిలినట్లున్నవి. వైద్య మవసరము లేదా?

నారాయణభట్టు : కొంచె మతనికి స్వాస్థ్యము చేకూరిన తార్వాత మోటుపల్లి పంపవలెను. ముందిక్కడ నూనెవర్తకులమీద సాక్ష్యము చెప్పవలసియున్నాడు.

వజ్జియ : అవసరము లేదు. ఇతడు లేకుండగనే అది తీర్పు ఇచ్చి నారు. ఇతనితో మా కేమియు పనిలేదు, మోటుపల్లి పంపవచ్చును. ఎప్పుడు బయలు దేరగలవు?

"దేవర ఎప్పుడు సెలవిచ్చిన నప్పుడే. ఈనాడే బయలుదేరగలను. కాని—" అనుచు పొన్న నారాయణునివంక చూచెను. అట్టి స్థితిలో వదలి వెళ్ళుటా?

మరియొక సేవకుడు వచ్చి సోమయాజిబ్రాహ్మణులు దర్శనము కొరకు వేచియున్నారని వజ్జియకు నివేదించెను. అది విని సేవకునివంక వజ్జియ ప్రెగ్గడ క్రీగంటి ప్రసారము చేసెను. దానితో నా సేవకుడు గడగడలాడుచు వెడలిపోయెను. విద్వద్బ్రాహ్మణులు దర్శనమునకు వచ్చినచో శీఘ్రముగా ప్రెగ్గడలకు నివేదించుట ఆచారము. ఈనాడు వజ్జియ కది యిష్టము లేదని సేవకుడు గ్రహింపగలిగెను.

"పాప మితని నీ స్థితిలో మోటుపల్లి పంపుట చేతులారా ప్రాణములు తీయుటగును. మోటుపల్లిలో నీ భార్యాపుత్రికలను దుర్గమునజేర్చుట కాజ్ఞ దయచేసి వెళ్ళిపోయినవి. ఇతడు కొంచెము విశ్రాంతి తీసికొని బయలు దేరవచ్చును"

ఇట్లని, వజ్జియ పొన్నను, గోదావరిలో నతనిని పట్టుకొన్నవారి సంగతియు, నితరవిషయములును ప్రశ్నించి తెలిసికొనుచుండెను. అంత సేపును పొన్న స్వభావమును గూడ పరీక్షించుచుండెను. విని కొంతవడికి "ఇతడు బుద్ధిమంతునివలెనే కనపడుచున్నాడు; కాని యింత దేహ మున్నవాడు మన కంత యుపయోగింపడు." అని వజ్జియ పలికెను.

నారాయణభట్టు చిరునవ్వు నవ్వెను.

"నాకుమాత్ర మీతని దేహమే పలుమారు ప్రాణరక్ష చేసినది." అనెను.

వజ్జియ : నీ అవసరములు వేరు. నా అవసరములు వేరు. ఐనను ఇతనిని సంఘారామమునకు పంపిన నెట్లుండును?

నారాయణభట్టు : జేతారినాథులను హత్యచేయుటకైనచో నట్లే చేయవచ్చును.

వజ్జియ : అంత మాటా? శ్రమణులను మహామాత్యులు హత్య చేయింతురా? నీకు చిన్నతనము పోలేదు నారాయణా!

నారాయణ : క్షమింపుడు. జైతారినాధులు చేతి కందుబాటులో కనబడిన నన్నును మిమ్ములను ఇకడు లక్ష్యము చేయడు. భీముని చేతిలో కీచకునికైన గతి ప్రాప్తించును.

అవల సోమయాజి బ్రాహ్మణులు మరల సేవకుని వజ్జియ యొద్దకు పంప నెంచిరి కాని యెక్క సేవకుడును వెళ్ళుటకు సాహసింపలేదు. అంతట వారందరును ఉచ్చైస్స్వనముతో ఘనపాఠము సాగించినారు. ఆ ఉత్తమబహు వేదవిప్రులు ఏకగ్రీవముగా నా చేయు ఘనపాఠము ప్రెగ్గడమందిరమునను మందిరాంతరములను సింహగర్జనమువలె గంభీరమై ప్రతిధ్వనించెను. అందు కానందము పొందవలసిన వజ్జియ ప్రెగ్గడకు ఎందువలననో తీవ్రముగా కోపము కలిగినది. 'ఇప్పుడే వచ్చెద' నని చెప్పి శీఘ్రముగా వెడలి యా బ్రాహ్మణులకు దర్శన మిచ్చెను.

వజ్జియరాక కానందించి వారు ఘనపాఠము సాగించుచుండిరి. పనస పూర్తికాలేదు.

వజ్జియముఖమున చిరా కెక్కువయ్యెను. తాను కూర్చుండలేదు. వచ్చిన వారికి వందనము చేయలేదు. తన్ను నమస్కరించిన యా వేద విప్రులకు ప్రతినమస్కారమైన చేయలేదు. నిలుచున్న వారిని కూర్చుండ మనలేదు. పనస పూర్తి కానీయకుండగనే——

"త్వరలో మీరు వచ్చిన పని తెల్పుడు" అనెను.

పనస కొందరాపిరి, కొందరు తడబడిరి, మరికొందరు వడివడిగా పూర్తిచేసి ఆశీర్వదించిరి. వజ్జియ యేదియు లక్షింపక ప్రశ్నార్థక దృష్టితో వారల బరికించెను.

కాని అట్టి వజ్జియస్థితి వారి కాశ్చర్యము కలిగించెను స్వయముగా నగ్నిష్టోమాదికము చేసిన సోమయాజి యీ వజ్జియప్రెగ్గడ! యజ్ఞభిక్షకు వచ్చిన యిందరు విద్వద్విప్రులను అవమానించుటా? వారు విన్న వజ్జియ కీర్తికిది విరుద్ధము.

అందులో నొక వృద్ధవిప్రుడు సాహసించి యందరిలో నతివృద్ధు డగు సోమయాజిని వజ్జియకు చూపి, యా సోమయాజి గుణగణములను' విద్వత్తును, పూర్వము కావించిన యాగపరంపరయు వరుసగా వర్ణించి చెప్పెను.

వజ్జియ చిరాకుగా, "మీకు పనిలేదు. అగ్రహారములలో తోచక యాగములే తలపెట్టుచుందురు." అనెను.

ఆ బ్రాహ్మణుడు తెల్లవోయెను. అట్టి యజ్ఞనింద వజ్జియనోట వచ్చు నని అత డూహింపలేక పోయెను. మరల ధైర్యము తెచ్చుకొని ఇట్లనెను :

"ఈ సోమయాజి పౌండరీక మాచరింపదలచినాడు."

"అయితే?"

"యజ్ఞభిక్షకు మీ యొద్దకు ముందు వచ్చినాము. మీబోటివారు కరుణించినచో కృతార్థు డగును."

"ఎప్పుడు?"

"వైశాఖ శుద్ధములో."

"ఎక్కడ?"

"ఈ రాజమహేంద్రవరములోననే. మీ సన్నిధానముననే. కోటి లింగాల తీర్థములో."

"యజ్ఞభిక్ష చిల్లిగవ్వ యీయను. ఈ యజ్ఞములు చేయువారితో మాకు చాల బాధగా నున్నది. విసిగిపోయినాము. దయచేయుడు. నమస్కారము!" ఇట్లనుచు వజ్జియ వెడలిపోయెను.

బ్రాహ్మణసమూహము రాజరాజనరేంద్రుని పాలనలో నిట్టి యవజ్ఞ యెన్నడు పొందలేదు. వజ్జియ యింత తీవ్రవాక్కులు ఎన్నడు ప్రయోగించినది యెరుకలేదు.

వజ్జియకు పిచ్చి యెత్తినదా?— పాపము, వృద్ధాప్యములో కార్యావసరములలో నుండి చిరాకుగా నున్నట్లున్నాడు. మనము వర్జ్యసమయములో వచ్చినాము. ఒక్కొక్క వేళావిశేషము. బ్రహ్మహత్య చేసినవారిని వెనుక వేసికొని వచ్చుచున్న ఈ ప్రెగ్గడయొద్దకు యజ్ఞభిక్షకు మనము వచ్చుటే

పొరపాటు. ఇతడు బౌద్ధులలో కలిసిపోవుచున్నాడు. అవును— శ్రమణు లకు విరివిగా దానములు చేయుట నేను కళ్ళారా చూచినాను. వేదవిద్యకు బ్రాహ్మణులలో ఈ గతి వచ్చినది. కలిమహాత్మ్యము! మహారాజుతో చెప్పికొందము. అమ్మంగదేవికి నివేదించు కొందము. వజ్జియకు ఐశ్వర్య మదము!

పరిపరి విధముల వజ్జియ కావించిన యజ్ఞభంగమునకు ఆతని నిందించుచు బ్రాహ్మణబృందము దీనముగా, రోషముతో వెడలిపోయెను.

# 19

చైత్ర శుక్ల త్రయోదశినాడు రాజరాజనరేంద్రుడు దేవేరియగు అమ్మంగదేవితో కలసి అనంగవ్రతము మహోత్సవముగా జరుపుకొనెను. పూజావసానమునకు యువరాజు బాణము నత్తిబ్రాహ్మణుని వేధించె నను వార్త వారికి తెలియవచ్చెను. ఆ మరునాటి మధ్యాహ్నమే యతడు కొలువు తీరెను.

ముందు రాజదూతలు కొలువు ప్రకటించిరి.

"స్వస్తి, సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ రాజ పరమేశ్వర పరమభట్టారకులు పరమ మహేశ్వరులు పరమబ్రహ్మణ్యులు పరగండభైరవులు మహాసింహాసనాసీనులై మంత్రి పురోహిత సేనాపతి దండనాథ యువరాజ ప్రధాన సామంత మండలేశ్వరులతో కొలువు తీరి యున్నారు.

మాగధు లిద్దరు కైవారము చేయుచు నిట్లు చాళుక్య వంశకీర్తనము చేసిరి :

"శ్రీ ధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో:
నాభీపంకరుహా ద్బభూవ జగతః స్రష్టా స్వయంభూ స్తతః
జజ్ఞే మానససూను రత్రి రితి య స్తస్మా న్మునే రత్రితః
సోమో వంశకర స్సుధాంశు రుదితః శ్రీకంఠచూడామణిః

"తద్వంశ్యో విజయాదిత్యో నామ రాజా విజిగీషయా దక్షిణాపథం గత్వాత్రిలోచనపల్లవ మధిక్షిప్య దైవదుర్విహయా కాలవశా ల్లోకాంతర మగమత్. తస్మిన్ సంకులే తస్య మహాదేవీ గర్భభారాలసా ముడివేమునా మాగ్ర హార ముపగమ్య తద్వా స్తవ్యేన విష్ణుభట్టసోమయాజినా దుహితృ నిర్విశేష మభిరక్షితా సతీ నందనం విష్ణువర్ధన మసూత. సా తస్యచ కుమారస్య మానవ్యసగోత్ర హారీతీపుత్ర ద్విపక్ష గోత్రక్రమోచితాని కర్మాణి కారయిత్వా త మవర్ధయత్. సచ మాత్రా విదిత వృత్తాంత స్సన్ నిర్గత్య చళుక్యగిరౌ నందాం భగవతీం గౌరీ మారాధ్య, కుమార నారాయణ మాతృగణాంశ్చ సంతర్ప్య: శ్వేతాతకాతై ్రక శంఖ పంచమహాశబ్ద పాలి కేతన ప్రతిఢక్కా వరాహలాంఛన పింఛ కుంత సింహాసన మకరతోరణ కనకదండ గంగా యమునాదీని స్వకుల క్రమాగతాని నిక్షిప్తానీవ సామ్రా జ్యచిహ్నాని సమాసాద్య త్రిలోచనపల్లవం జిత్వా, తత్సుతా ముత్తమదానీ ముపయమ్య కదంబగం గాది భూమిపాన్నిర్జిత్య, సేతునర్మదా మధ్యస్థం సార్ధ సప్తలక్షం దక్షిణాపథం పాలయామాస.

శ్రీమతాం సకలభువనసంస్తూయమానమానవ్యసగోత్రాణాం హారీతీపు త్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణపరిపాలితానాం స్వామి మహాసేన పదానుధ్యాతానాం భగవన్నారాయణ ప్రసాదసమాసాదితవరవ రాహలాంఛనేక్షణక్షణవశీకృతారాతిమండలానాం అశ్వమేధావభృథస్నాన పవిత్రచాళుక్యానాం కులం అలంకరిష్ణోః సత్యాశ్రయవల్లభేంద్రస్యభ్రాతా కుబ్జవిష్ణువర్ధనః అష్టాదశవర్షాణి వేంగీదేశ మపాలయత్.

"బలా ద్గృహీత్వా బలితో ధరిత్రీంగీర్వాణశత్రో రివ శత్రువర్గాత్
శ్రీ శక్తివర్మా స సమా శ్చళుక్యనారాయణో ద్వాదశ రక్షతిస్మ.
తదను తదనుజన్మా రాజమార్తాండభూపో
విశదరుచి రరాతి ధ్వాంతవిధ్వంసదక్షః
స్మ వహతి భువ మబ్దాన్సప్త సప్తాశ్వతేజాః
సకలవసుమతీభృన్మస్తకన్యస్తపాదః".

ఈ విధముగా మాగధులు వంశానుకీర్తనము చేసినపిమ్మట వందు లిద్దరు కైవారములు చేయుచు నిట్లందుకొనిరి:

"లక్ష్మీభర్తృనిభస్య తస్య విమాలాత్యస్య చోడాన్వయ
క్షీరాంభోనిధి జన్మనః శ్రియ ఇవ శ్రీ రాజరాజాధిపః
దేవ్యా శ్చాజని రాజరాజదుహితుః కుందాంబికాయా స్సుతః
యః కందర్ప ఇవాపరః ప్రతివసన్ లోకత్రయే స్త్రీహృది.
బాల్యే భూషణ మభవ ద్రత్నమయీ యస్య కంఠికాకంఠే
గుణలుబ్ధయేవ మాలా ధరయా దత్తా పతింవరయా.
వేదాంభోధినిధిప్రమాణగణితే శాకాబ్దసంఖ్యే రవౌ
సింహస్థే బహులద్వితీయదివసే వారే గురోః శీతగో
యుక్తే చోత్తరభద్రయా ధృతివణిగ్లగ్నేయాం తు తత్ర క్షమామ్
త్రాతుం పట్ట మధత్త యో గుణనిధిః శ్రీ రాజరాజో నృపః
యస్యోత్తమాంగ మాబద్ధ మాభా త్పట్టేన భూయసా
భర్తుం విశ్వంభరాభారం జన్యై రారోపితం యథా.
సంరక్షితి క్షితితలం క్షపితారివర్గే మార్గేన యేన నయశాలిని మాన వేన
ప్రీతాః ప్రజానిజపవిత్రచరిత్రతోయైః ప్రక్షాలయంతి కలికాలకలం కపంకమ్."

"ససర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ రాజపరమేశ్వరః పరమభట్టారకః పరమమాహేశ్వరః పరమబ్రహ్మణ్యః శ్రీరాజరాజదేవో, ద్య మహాసింహాసన మలమకరోత్."

అంత భీమనభట్టును, ఆ పిమ్మట నాతని కుమారుడు చెట్టనభట్టును వారి యనంతరమున పావులూరి మల్లనార్యుడును రాజరాజప్రశస్తి పద్యములు చదివిరి.

నన్నయభట్టారకుని యనుమతితో పురోహితప్రముఖులు వేదాశీర్వచనము కావించిరి. అంతట మంత్రి సామంత దండనాధులకు వారు వారు తెచ్చిన కానుకలర్పించుట కనుజ్ఞయైనది.

ముందు వృద్ధామాత్యుడును, సోమయాజియు నగు వజ్జియప్రెగ్గడ ముత్యాలహార మొకటి యర్పింపగా రాజరాజు ఆసనమునుండి సగము లేచి వంగి కంఠములో ధరించెను. ఆ పిమ్మట నితరుల యుపహారములు

వారి మర్యాద క్రమమున నందుకొనెను. ఎవరి వరుస వచ్చినవేళను వారు లేచి, రాజరాజనరేంద్రుని సింహాసనము నొద్దకు పాదచారులై వచ్చి విశాలమగు పదపీఠమున కానుకలర్పించి, రాజరాజదేవునికి నమస్కరించి, వెనుకకు నడచి తమ యాసనములకు చేరుచుండిరి.

రావలసినవా రందరు వచ్చుచుండిరి. చక్రకోట్యమండలాధిపతి యగు ధారా వర్షమహారాజు రావలసిన సమయము వచ్చినది. అతడు రాలేదు. అతని ప్రతినిధియు రాలేదు.

ఈ అవినయమునకు సభ నిర్ఘాంతపోయెను. వజ్జియ ముఖమించుక చిట్లించెను. రాజరాజు రాజఠీవికి లోపము లేకుండ నిశ్చలుడై యుండెను. ఆ మండలేశ్వరుడు వచ్చి కానుక చెల్లించుట కెంతతడవు పట్టియుండునో అంతతడవు సభాకార్యక్రమ మాగిపోయెను. ఆ పిమ్మట నితరులు కానుకలర్పించిరి.

ఆ యుత్సవమైన వెంటనే రాజరాజు నిష్కంపమగు కంఠముతో విశదముగా నీ రీతిని ప్రకటించెను:

"మాకు నిన్నటి దినము ధనుర్విద్యాపరీక్షకు వచ్చుటకు అవకాశము లేక పోయినది. మూడు బాణములు బ్రాహ్మణబృందములో పడె ననియు, అందొకటి విద్వాంసుడగు విప్రుని బాహువున నపాయకరముగా తగిలిన దనియు తెలియ వచ్చినది.

"మా వంశము అనాదిగా ధర్మమందు బద్ధకంకణ మైనది. బ్రహ్మహత్య ప్రమాదజన్యమైనను నింద్యము. మూడు బాణములు ప్రమాదము వల్ల వరుసగా పోవునని మేము విశ్వసింపలేము. అది ఈ ధర్మాసనమందుండి నిర్ణయింపదలచినాము, జరిగినది. తెలిసినవారు సత్యము పలుకవలసినదని కోరుచున్నాము. ఈ సందర్భమున నపరాధి ఎవరైనను నిష్కంపముగా దండింపదలచినాము."

సభాసదుల కందరికి దేహములు రోమాంచ మొందెను. నిస్సందేహముగా యువరాజ రాజేంద్ర దేవు డిందులో దోషి. కుమారుని కఠినముగా శిక్షింప సిద్ధమైనా డీ మహారాజు. ఇక్ష్వాకు చక్రవర్తి కుమారుడగు శశాదుని శిక్షించెనట! మరల నరుణుడు సత్యవ్రతుడను పుత్రుని శిక్షించె

నందురు. కేవల మీ మహారాజు 'అత్యకలంక చరిత్రసంపద నాదిరాజని భుకు'సుమా! ఇట్లు తలంచుచు చకితమై ఆ సభ కొంతకాలము నిశ్శబ్ద మయ్యెను.

రాజరాజు వాక్కులు విని యువరాజు రాజేంద్రదేవుడు నిలువున నిర్భయముగా లేచి నిలుచుండెను. అతడు చువ్వవలె పొడుగుపాటి మనిషి. మహారాజునకును, మహాసభకును నమస్కరించి దక్షిణహస్తము ఒరలో నున్న ఖడ్గముకనకత్సరువుపై నుంచి నిష్కంపముగా నిట్లు పల్కెను:

"అసాధ్యలక్ష్యభేదనమున నేను విల్లు తిగిచి విడుచుచుండగా ప్రక్కనుండి కామరాజపుత్రుడు నన్ను కదిలించినాడు. దానివలన బాణము లక్ష్యము తప్పి ఆ బ్రాహ్మణునికి తగిలినది. నా పొరపాటు లేదు! కాని నా బాణము బ్రాహ్మణబాధ కలిగించినందుకు పరితపించుచున్నాను. అంతకుముందు విప్రశ్రేణిలో పడిన బాణములు నావికావు. అవి నా నామాంకితబాణము లనిరి. కాని నే నది నమ్మలేను. ఆ పరీక్షలో నా బాణ మొక్కటియు లక్ష్యము తప్పలేదు. ఇది నేను నా ఖడ్గము పట్టి ప్రమాణముచేసి చెప్పుచున్నాను. సత్యము!"

అట్లని గంభీరముగా దక్షిణహస్తము నాకాశముపై కెత్తెను.

అంతట రాజరాజు కామరాజపుత్రునివంక జూచెను అతడును నిష్కంపముగా లేచి రాజరాజునకును, సభకును నమస్కరించి కత్తి పట్టి ప్రమాణము చేయుచు నిట్లు వచించెను:

"ఈ మహాసభలో సత్యమే చెప్పవలసివచ్చినందుకు నాకు చింతగా నున్నది. అస్పష్టమైన యువరాజు మాటలు ప్రత్యాఖ్యానము చేయవలసి వచ్చినది. యువరాజు బాణములు రెండు లక్ష్యము తప్పి ప్రమాదవశమున బ్రహ్మణబృందములో పడినవి. మూడవ బాణముకూడ నామార్గముననే పోవనున్నట్లు నాకు తోచి సంభ్రమముతో 'రాజేంద్రదేవా, బ్రాహ్మణులను కొట్టుచున్నావే'మని యువరాజు చేయి పట్టుకొంటిని. అయినను ప్రయోజనము లేకపోయినది. అప్పటికి బాణము వదలియే యుండునని తలంతును గాని, ఒక క్షణము ముందైననై యుండవచ్చును. ఏమైనను

అది యువరాజు ప్రమాదమే కాని ఉద్దేశపూర్వకముగా చేసినది కానేరదు. అసాధ్యలక్ష్య భేదనములో యువరాజు నేర్పు అద్వితీయము."

కామరాజపుత్రుని వాక్కుల కెంతయు సభ హర్షించెను. అతని సోదరులైదుగురు నట్లే కాముని వాక్యములు ధ్రువపరచుచు, రాజేంద్ర దేవుని ప్రమాదమని నిర్వచించిరి. ఆ మహాసభ జలదరించెను.

అంతట కరుణాకరతొండమానుడును, జయంగొండరును ప్రమాణములు చేసి యిట్లు చెప్పిరి:

"ఆ సమయమున రంగమున బాణ ప్రయోగము చేయుచు న్నవారు రాజేంద్ర దేవయువరాజును, కామరాజపుత్రుడును, అతని సోదరులైదుగురు మాత్రమే. ఆ యేడ్వురలో ఎవరివో రెండు బాణములు ముందు బ్రాహ్మణశ్రేష్ఠుపై బడెను. యువరాజు బాణము లేవియు లక్ష్యము తప్పలేదు. కావున నా సోదరషట్కము బాణములే యైయుండునని అనుమానింతుము. చివరి బాణము విడుచు సమయమున సరిగా రాజపుత్రుడు యువరాజును కదలించెను. అట్లు కదలించుట సమయవిరోధము. అందువలననే యది యా విద్వాంసునకు తగిలినది."

ఈద్రావిడు లింత నిర్భయముగా మిత్రుని పక్షమున నసత్య మాడుచుండి రని సభవా రేవగించుకొనిరి. రాజరాజనరేంద్రు డా మాటలు ఆలకించియు నమ్మడాయెనని చూచువారి కవగత మయ్యెను.

అంతట రాజరాజు నృపకామదండనాథునివంక జూచి, "మీరు సత్యసంధులని జగద్విదితము. వృద్ధులు, పూజ్యులు, మా ప్రియపుత్రునికి సంబంధించిన దని ఏ మాత్రము సంకోచింపక ఈ సభకు సత్యమంతయు చెప్పవలెనని మా కోరిక. మీరు మాకు ప్రతినిధులుగా పరీక్షాధికారులుగా నధికృతు లైనందున మీ వాక్యములు అప్రతిహతములు! అనెను.

నృపకామదండనాథుడు లేచినంతనే సభయంతయు నతని వాక్యములు వినవ్యగ్రమయ్యెను. అతని ధర్మదీక్ష యందరెరుగుదురు. ఎన్నియో రణరంగములలో విమలాదిత్యునకును, రాజరాజునకును విజయములు

సమకూర్చిన మహాయోధ మరియు విద్యచేతను వయస్సుచేతను వృద్ధుడు అత డిట్లు చెప్పెను :

"ఇది యొక సంకటమగు ఘట్టమే కాని సంకోచమున కేమియు నవకాశములేదు. అసాధ్యలక్ష్యభేదనము యువరాజు చేయుచుండగా శ్రద్ధగా నే నాతని బరీక్షించుచుంటిని. చివరకు కాముని చేయి తగిలి తప్పిపోయి, బ్రాహ్మణబాహువు బేధించిన బాణమ తప్ప అంతకు ముందు యువరాజు వదలిన బాణము లేవియు లక్ష్యము తప్ప లేదని నేను దృఢముగా చెప్ప గలను. కాని యాబ్రాహ్మణశ్రేణిలో పడిన బాణము లెవరివో మాత్రము నేను చూడలేదు. అక్కడ కాపున్న రక్షకభటులు చెప్పవచ్చునేమో।"

దండనాధుడు యువరాజుమీది యభిమానముతో నట్లు చెప్పుచుండ వచ్చును. కాని చెప్పలేము. ఇందులో నేదో విశేష ముండవచ్చును ఇట్లని సభలో కొంచము సందేహము ప్రారంభించెను. బ్రాహ్మణశ్రేణివద్ద కాపున్న భటులను పిలిపింపగా, మిగిలినవారు తమ కేమియు తెలియ దని చెప్పిరి కాని రాజమయ్య మాత్రమిట్లు చెప్పెను:

"నేనా నత్తిబ్రాహ్మణుడున్న చోటికి సమీపమున నుంటిని. కామ రాజపుత్రుల బాణప్రయోగకౌశలము నన్ను ఆకర్షించినది. కావున ముఖ్య ముగా నేను వారినే పరీక్షించుచుంటిని. చిత్రముగా వారు వదలిన బాణ ములు రెండును వరుసగా నా బ్రాహ్మణునిమీదికి వచ్చెను. అవి నాదండ ముతో వారించితిని. ఆ బ్రాహ్మణునికి తగిలిన బాణ మెవరు విడిచినదో చెప్పలేను. ఇదిగో నాదండముతో బాణములు కొట్టగా కలిగిన గుర్తులు।" అని యాతడు కర్రపై బాణపు చారలు చూపెను.

ఆ అంగరక్షకుని మాటలకు కాముడును, సోదరులును తెల్లవోయిరి. సభ కంతటికి నాశ్చర్యమును సందేహమును ఇనుమడించెను.

ఆ బ్రాహ్మణునికి తగిలిన బాణమును బ్రాహ్మణబృందములోనికి పోయిన బాణములును పెట్టిన కోశము వజ్జియ ప్రెగ్గడ ముద్ర గలది సభాస్థానమునకు తెప్పించిరి. రాజరాజు నన్ని రక్తముతో మరకలైన బాణమును కళ్ళ కద్దుకొని పరీక్షించెను. అది యువరాజ నామాంకితము.

మిగిలినరెండు బాణములుగూడ యువరాజ నామాకింతములే!

రాజరాజు ముఖము, అసహ్యముతో గలిసిన కోపము ప్రస్ఫుటమై వికృతమయ్యెను. మాటాడక యా బాణములు చూడుమని నిర్దేశించుచు యువరాజుచేతికిచ్చెను. యువరాజు సగౌరవముగా లేచి వాని నందుకొని పరీక్షించుచుండెను. కరుణాకర తొండమానుడును పరీక్షించెను. ఆ మూడిటిపై యువరాజునామము చూచి ఆ యిద్దరు నివ్వెరపోయిరి.

అంతలో జయంగొండరు లేచి యా బాణములు ఒక్కక్షణకాలము పరీక్షించెదను చోళచక్రవర్తులయొద్ద నాతని కుటుంబమువారనాదిగాఆస్థాన కవులుగా నుండిరి. అతని తండ్రియే రాజరాజేశ్వర నాటకము వ్రాసినది! ఆస్థాన కవులకుండు వ్యవహారదక్షత యాతనికి వంశానుక్రమమున వచ్చినది. అతడు చూచుచున్న క్షణముననే ప్రభువు కిట్లు నివేదించెను!

"ఈ రక్తసిక్తమైన బాణము యువరాజుది. ఇది ఒకటిగా కనుపడుచున్నను రెండుముక్కలతో చేసినది. ఈరెండు బాణములువేరు;ఇవిఒక్క ముక్కతో దాని ననుకరించుచు చేసినవి. నావి కాని, కరుణాకరునివి కాని, యువరాజువి కాని బాణము లన్నియు రెండు ముక్క లతికించి చేసినవే. మా పైపున బాణము లట్లే చేయుదురు. ఈ పైపుల నొక్క ముక్కతో చేయుదురు. సూక్ష్మముగా పరిశీలించిన నిది తమకు విశదపడును."

రాజేంద్రదేవుడు జయంగొండరువంక నాదర దృష్టులు ప్రసరింపజేసెను. మరియు జయంగొండ రిట్లు మనవి చేసెను:

"మరియు నొక మనవి కలదు. ఈ రెండు బాణములును తమ రందరు పరీక్షించుటలో నెంతయు నపాయము తప్పినది. ఈ రెండు బాణముల చివరలు విషదిగ్ధములనిగూడ నా విశ్వాసము."

వెంటనే రాజరాజానుమతిలో రాజజాంగలికుడు లేచి పరీక్షించి యా రెండు బాణముల కొనలను విషలక్షణము లున్నవని వచించి యొక శునకమును తెప్పించి అందులో నొకదానితో దానిని సూక్ష్మముగా పొడిచెను. ఆ కుక్క శీఘ్రకాలమున పడిపోయి తన్నుకొనసాగెను. జాంగలి

కుడు వెంటనే దానికి విషచికిత్స చేసి బాగుచేసి రాజసభకు బాణములు విషదిగ్ధము లని ప్రకటించెను.

సభ యంతయు విభ్రాంతపోయెను. యువరాజుమీద దోష మారోపించుట కెవరో యీ కుట్ర చేసి రని యనుమానము ప్రబలమయ్యెను. కాని పాప మా బ్రాహ్మణుని విషబాణముతో కొట్టుట కెవరి కేమి విరోధ మున్నది?

రాజాజ్ఞచే రాజభటులు పోయి యువరాజు, కరుణాకరుడు, జయంగొండరు బాణములను కామరాజాది సోదరషట్కము బాణములను వారి నివాసములనుండి తెచ్చిరి. అవి అన్నియు పరీక్షింపగా జయంగొండరు వాక్యములు స్థిరపడెను. విషవైద్యు డా రెండు బాణములను కొన తగులని రీతిని పట్టుకొని ఛేదించి యవి యొంటి ముక్కతో చేసినవే యని నిరూపించెను.

ప్రేక్షకులై యా సమీపమున నున్న బ్రాహ్మణులను విచారింపగా వారు రెండు బాణములు అటు లాగా రాజమయ్య వారించుటయు, మూడవది నత్తిబ్రాహ్మణుని భుజములో దిగబడినదియు చెప్పిరే కాని ఎవరి బాణములో ఒక్కరును చెప్పలేకపోయిరి.

బాణహతుడైన బ్రాహ్మణుడు నీరసస్థితిలో నున్నందున సభకు రాలే డని వజ్జియ నివేదించెను. రాజరాజనరేంద్రు డీ విధముగా శాసించెను.

“మా కీ దినమున మిక్కిలి సంతాపము కలుగుచున్నది. యువరాజు కేవలము మా యుపరదేహము. కామరాజపుత్రుడు సన్నిహితుడు ఆప్తుడు నగు ఆత్మబంధువు. వీ రిద్దరిలో దోషి యెవరో నిర్ధారణ చేయవలసివచ్చినది. కాని దండమునకు మోమోటము లేదు. బాణహతుడైన బ్రాహ్మణుడు సభకు రాగలిగిన స్థితిలో నున్న వెంటనే పిలిపించి దోషము నిర్ధారణ చేయగలము. ఇది తేలువరకును యువరాజు కాని, కామరాజపుత్రుడు గాని యెట్టి యాయుధ ప్రదర్శనములలో పాల్గొనరాదు.”

కఠిన మగు నా శాసనమునకు సభ్యులందరు రాజరాజును శ్లాఘించిరి. ఈ విషయము తేలునంతవరకు తాముకూడ ప్రదర్శనములలో పాల్గొనమని కణాకరుడును, జయంగొండరును మనవి చేసికొనిరి. కామరాజు సోదరులును అదేవిధముగ విన్నవించిరి. సభ ముగిసెను.

యువరాజు ప్రమాదమా? కాముని దుర్మార్గమా? కొందరు యువరాజే దోషియనుకొనిరి. కొందరు కామరాజు దోషి యనిరి: అందరును రాజరాజు నిష్పాక్షిక బుద్ధిని కొనియాడసాగిరి.

చక్రకోట్యమహామండలేశ్వరు డగు ధారావర్షుని యవినయ మందరును మరచినట్లు కనపడిరి. కాని వజ్జియమనస్సునను రాజరాజుమనస్సునను అది కావించిన యలజడి మరి యొకటి చేయలేదు.

గురునాథశ్రేష్ఠి రాజమహేంద్రపుర కిరాటులలో నెల్ల సంపన్నుడు. అతని పూర్వులు విదేశములతో ఓడవ్యాపారము చేసి విశేషధన మార్జించిరి. రాజ రాజ నరేంద్రుని పెదతండ్రి శక్తివర్మ రాజ్యమునకు రాక ముందు ఇరువది యేడేండ్లు వేంగిదేశము అరాజకముగా నుండెను. ఎక్కడ బలముగలవా డక్కడ ప్రభుత్వము నెరపి బీదలను దోచుకొనెను. సంఘబలములేని పలువురు తూర్పు సముద్రమునందు సువర్ణ ద్వీపములకును, యవద్వీపమునకును, మలయదేశము నకును, శ్రీ విషయము నకును వలసబోయిరి. పలువు రొక్కమారు వలసపోవలసినందున నావలు దొరకవయ్యెను. ఉన్న నావలన్నిటికి రాబడి హెచ్చెను. గురునాథశ్రేష్ఠి తండ్రి యా విధముగా కోటీశ్వరు డైపోయెను. వారి నావలు యానసహములు. వారి భటులు విశ్వాసపాత్రులు. వారి వ్యాపారములో మోసము లేదు.

గురునాథశ్రేష్ఠికి గృహయాజమన్యము సంక్రమించునప్పటికి దేశములో రాజశాసనము సమర్థమై శాంతి నెలకొనెను. వలసలు తగ్గిపోయెను. వారి లాభములుచూచి పలువురు క్రొత్తనావలు కట్టి వ్యాపారము సాగిం

చిరి. అంతట గురునాథశ్రేష్ఠి నెమ్మది నెమ్మదిగా ఓడవ్యాపారము తగ్గించెను. విదేశములతో తెగని వ్యాపారమునకుమాత్ర మవసరమగు నావ లుంచుకొని పూర్వార్జితవిత్తము భద్రపరచు కొనుచు, దానిని వృద్ధికి ఋణము లిచ్చి పెంపు చేసికొనుచుండెను.

వంశక్రమాగతమైన మర్యాద యత డీ వృత్తిలోగూడ సంపాదించెను. అతడిచ్చు ఋణములపై కోరువృద్ధి స్వల్పమగు కాలికవృద్ధియే కాని చక్రవృద్ధియు, కారిత వృద్ధియు నెన్నడు కోరడు. ఎదురు లెక్కలు కోరినవారికి వ్రాయించి ఇప్పించును. అట్టి లెక్క లున్నను లేకున్నను అతని లెక్కలలో పొరపాటు రాదను ప్రసిద్ధి కలదు. అతనివద్ద ఋణము పుచ్చుకొనుటకు అధమర్ణులుగా ధనవంతులును పేదలును వచ్చుచుందురు. అంతియ కాదు. పలువు రాతనివద్ద ధనము దాచబెట్టుదురు. కొన్ని వర్తక సంఘములును, గ్రామసంఘములును, అతనివద్ద ధనము దాచుకొనుటయు, ఋణము తీసికొనుటయు గలదు.

ఈ వ్యాపారమునకు రాజమహేంద్రపురములో నాతనికి పెద్ద భవనము కలదు. అది ప్రత్యేకముగా బలిష్ఠముగా కట్టినది. దాని రక్షణ నిమిత్తము సాయుధులై పలువురు రక్షకభటులు కాపుందురు. పత్రములు, లెక్కలు వ్రాయుట కతనివద్ద కరణములు లనేకులు కలరు. వారు పలువురు జైనులు. వా రేనాటి లెక్కలానాడు శ్రేష్ఠి కప్పగింపవలెను. అవి పరిమాచుటలో గురునాథుని కద్భుత ప్రజ్ఞ కలదు.

గురునాథశ్రేష్ఠి అగ్రతకు చిహ్నముగా రాజరాజనరేంద్రుడు ఛత్ర చామరములు గౌరవలాంఛనములుగా ప్రసాదించెను. ధాన్యశ్రేణీపతియగు సిరివిసెట్టికి రాజమర్యాదలో రెండవ స్థానమే కలదు. తరచుగా వర్తక వ్యవహారములలో గురునాథశ్రేష్ఠినే యధికరణికునిగా రాజరాజు నియమించువాడు. తీర్పు లిచ్చుటలో కూడ నాతడు బహుసమర్థుడు. పారశీక వర్తకుల నేరము విచారించి ప్రధాన వర్తకులను శిక్షించి సేవకులు ముగ్గురిని ఇతడు వదలివేసెను.

ఈనాడు పదివేల గద్యాణములు ఋణము కావలెనని కోరుచు

కుమారనప్తకములో చిన్నవాడగు రాజమార్తాండుని యెద్దనుండి వార్తాహరుడు వచ్చెను.

పూర్వము కుమారనప్తకము గురునాథశ్రేష్ఠియొద్ద నెన్నడోగాని ఋణమడుగువారు కారు చైత్రమాసాదిగా మిగిలిన సోదరులారుగురును చెరియొక పదివేల గద్యాణములను ఋణము తీసికొని వెళ్ళియుండిరి. వారందరు రాజరాజు సమీప బంధువులు. వారందరయెడ రాజరాజుకు వాత్సల్యము కలదు. మరియు వారు జనసామాన్యమున కందుబాటులో నుండి లోకాదరము గడించిరి వారికి రాజాస్థానములో గౌరవము కలదు. వారి జీవికలకు అనేక గ్రామములు కలవు. వారి కుటుంబమునకు అరువది వేల గద్యాణములు ఋణము పెట్టుటలో భయమేమి?

వీ రిన్ని గద్యాణములతో ఏమి వ్యాపారము చేయుచున్నారు?

క్రిందటి దినమున రాజరాజుమహాసభలో గురునాథశ్రేష్ఠియు నుండెను. బ్రాహ్మణహత్యాకారకునిగూర్చిన విచారణ వినియుండెను. కాముడు యువరాజుమీద నేరము మోపుటకు ప్రయత్నించుచున్నను అది నిలుచునట్లు లేదు. హత్యకు యువరాజు కారకుడైన ప్రమాదజనితము. కామరాజపుత్రుడు కారకుడైన ప్రమాదమన వీలులేదు. అది విని యింటికి వచ్చిన వెంటనే కుమారనప్తకములో నెవరైన ఋణము కోరినచో తనకు తెలుపనిది పత్రములు పూర్తిచేయవలదని అగ్రకరణమునకు తెలిపెను.

అందువలన రాజమార్తాండుని వార్తాహరుని, కరణములు గురునాథశ్రేష్ఠి యొద్దకు బంపిరి.

అతని జూచి గురునాథుడు సందేహించెను. ఈ స్వల్పవ్యవధానమున నీ సోదరులందరకు నింత ధన మెందుకు కావలసివచ్చినది? అరువదివేల గద్యాణములకు భయము లేనిచో నిక ఈ పదివేల గద్యాణములకు భయమా?

రాజమార్తాండుని పత్రిక తెచ్చిన సేవకుడు గురునాథశ్రేష్ఠికి నమస్కరించి పత్రము చేతి కందిచ్చి నిలుచుండియే యుండెను. శ్రేష్ఠి మరల పత్రము చదువుకొనెను.

అరువదివేల గద్యాణములు పోవుచున్నచో మరి పదివేలుకూడ నెందుకు పోగొట్టుకొన వలెను? ఒక్క క్షణ మాలోచించెను.

"ఈ సాయంత్రము రాజకుమారుల దర్శనమునకు వచ్చెదనని రాజమార్తాండ ప్రభువులతో నివేదింపుము"అని శ్రేష్ఠి తల యెత్తక పత్రమువంక జూచుచునే సేవకునితో చెప్పెను తన ప్రభువు కోరికకు ఎదురుమాట పచ్చుట ఎరుగని వాడైనందున నా సేవకుడు శ్రేష్ఠి సాహసమున కాశ్చర్యపడుచు వెడలిపోయెను.

వెంటనే గురునాధుడు శకటము సిద్ధము చేయించికొనెను. రాజానుగ్రహ దత్తమగు ఛత్ర చామరములు పట్టించుకొని ఠీవితో దానిపై నధిరోహించి బయలుదేరెను. అతడు మిత్రులగు శ్రేష్ఠులను దర్శించి యెన్నియో వ్యవహారములు వారితో ముచ్చటించెను. సందర్భవశమున తెచ్చిన ప్రసంగమువలన కుమారసప్తకము చైత్రమాసాదిగా ననేక లక్షల గద్యాణములు ఋణము చేసినట్లు అతడు తెలిసికొనెను. వారు చేసిన యప్పు లొక్కరివద్ద కాదు. వారిలో కొందరు ఆ రాజపుత్రులకు ఋణమిచ్చినందుకు సగర్వులై యుండి చెప్పికొనిరి. ఒకరి సంగతి మరి యొకరికి తెలియదు.

గురునాథశ్రేష్ఠికి ఒక్కసారిగా అధైర్యము తోచెను. అరువదివేల గద్యాణములు పోవుట యతనికి కొరత గాదు. కాని యింత ఋణము వా రెందుకు చేయుచున్నారు? వారి కేదేని దురుద్దేశమున్న,దానికి సహాయభూతుడైన తనకు మాత్రము ప్రమాదము కాదా?

ఇప్పు డేమి చేయవలెను? ఇతర వర్తకులచేత ఋణము లడిగింప జేయుదునా? నేను పెట్టిన ఋణము తిరిగి యిమ్మని యడుగుదునా? రహస్యముగా ప్రభువులకిది నివేదింతునా? బలవంతులతో విరోధము పనికి రాదు. ఈ సందర్భమున అల్లరి చేసికొనక మౌనము వహించుటే కార్యము. ఏది యెట్లున్నను, ఇకపై నాతడు కుమార సప్తకమునకు ఋణమీయగూడ దని నిశ్చయించెను. ఇతర వార్ధుషికులును కాముని వ్యవహారము తేలనిది క్రొత్త యప్పులు వారి కీయరు.

ఈ విధముగా తలపోయుచు గురునాథశ్రేష్ఠి మాటయిచ్చిన ప్రకారము ఆ సాయంత్రము రాజమార్తాండుని దర్శింప నేగెను. ద్వారపాలకులు దర్శనమున కప్పుడు అనుజ్ఞ లేదని గురునాథశ్రేష్ఠిని పంపివేసిరి.

# 21

గురునాథశ్రేష్ఠికి సామాన్యముగా కోపము రాదు. వచ్చినను అది బయటికి వ్యక్తము కాదు.

రాజమార్తాండుడు రాజబంధువు, రాజమాన్యుడు. అయినను గురునాథశ్రేష్ఠి శ్రేష్ఠులలో అగ్రగణ్యుడు, సమానులలో నుత్తముడు. రాజమార్తాండుడే అర్థమర్థుడై తన్ను ఋణము యాచించినాడు. అట్టివాని యొద్దకు దర్శనమునకు పోగా వీలు కలిగింపలేదు. రాజమార్తాండుని దర్శింపవలసిన అవసరమేమియు గురునాథ శ్రేష్ఠికిలేదు.

శ్రేష్ఠి ఇంటికి వచ్చిన వెంటనే కుమారసప్తకమున కున్న గ్రామముల విలువయంతయు లెక్కకట్టెను. ఎంత హీనముగా లెక్క వేసినను అవి పది లక్షల గద్యాణముల విలువ కలవి. అది చూచుకొని వెంటనే మిత్రులగు వర్తకులను గలసికొని, కుమార సప్తకము చేసిన ఋణములు ఐదు లక్షల గద్యాణములు కొనివేసి పత్రములన్నియు తీసికొని పదిలపరిచెను.

ఆ మరునాడుదయముననే శీఘ్రముగా కరణములను పిలిపించి, కుమారసప్తకము ఋణపత్రములిచ్చి, ఎవరి లెక్క వారిది వేరువేరుగా తేల్పించి, రావలసిన మొత్తములు ఆ సాయంత్రము మూడు జాముల లోపుగా చెల్లింపవలసినదని కోరుచు పత్రములు వ్రాయించి రాజకుమారులకు పంపెను. వారేడ్వురవల్ల రావలసిన మొత్తము ఐదు లక్షల యిరువదివేల గద్యాణముల మూలధనమును, అందుపై కాలికవృద్ధి నాలుగువేల నాలుగు వందల గద్యాణములును అయ్యెను. మల్లప్ప యింకను సంఘా

రామములో చికిత్స నొందుచున్నందున అతనికి సంఘారామమునకును, మిగిలిన యార్వురకు వారి మందిరములకును పత్రములు పోయెను.

చికిత్సాలయములో నున్న మల్లప్ప పత్రము వెంటనే పుచ్చుకొనెను. కాని మిగిలిన యార్గురును గురునాథుడు పంపిన క్షమాపణపత్రములని తలచి వార్తాహరులకు దర్శన మీయలేదు. వార్తాహరు లా మాట గురునాథశ్రేష్టికి నివేదించిరి. అతను వెంటనే వారిని మరల పంపుచు, నీమారు దర్శన మీయనిచో వారి ద్వార బంధములకు పత్రములు కట్టి రండని యాజ్ఞాపించెను. వార్తాహరులు గజగజలాడుచు బయలుదేరిరి.

ఈ వ్యవధానములో మల్లప్ప పత్రమందుకొని వెంటనే సోదరులకా వార్తనంపెను. అది తెలిసికొని రాజపుత్రు లందరు తెల్లవోయిరి.

శ్రేష్టివార్తాహరులు భయపడుచు రాజపుత్రుల మందిరద్వారములు సమీపించిరి. కాని వా రీమారు ద్వారముల నిల్చినదే వ్యవధిగా లోపల నుండి రమ్మని యనుజ్ఞలు వచ్చెను రాజపుత్రులు ఆదరములో నా పత్రములు పుచ్చుకొని ముట్టినట్లు పత్రములు వ్రాయించియిచ్చి పంపివేసిరి. వారి కన్నులు వారు నమ్మలేకపోయిరి.

వార్తాహరులను పంపివేసిన ఉత్తరక్షణముననే రాజపుత్రు లార్గురును రాజమార్తాండుని భవనమున సమావిష్టులై క్రిందటి దినము జరిగినదంతయు తెలిసికొనిరి.

ఇప్పుడు వా రేమి చేయవలెను?

ఇంత స్వల్ప వ్యవధానములో నింత ధనము పుట్టు టెట్లు? మల్లప్పకు నూతన పరిచితులైన విదేశవర్తకులు వారి సరకులిచ్చుట నమ్మి ధన మొడుచుకొని పోవునంతవరకే కాని తమపై వేరభిమాన మున్నవారు కారు. అపైని వా రిప్పటికే యట్టి వారివద్ద తీసికొన్న వస్తువులకు చాల ధనము ఈయవలిసియున్నారు. మరికొంత ఋణము తెచ్చిన గాని వారి బాధ తీరదు.

గురునాథునికి ప్రతిస్పర్ధి కదా సిరివిసెట్టి! అతని నడిగిన నీయడా? అతడు పూర్వమిత్రుడు కాడు. ఇంత యవ్యవధానముగా నడిగిన నతడు

అనుమానింపడా? సంగతి సందర్భము లాలోచించుకొనుటకు కాలయాపనము చేయును. లాభములేక పోగా ననవసరముగా తమ ఋణము వెల్లడి యౌను.

వెంటనే ఋణము తీర్చనిచో గురునాథశ్రేష్ఠి అధికరణస్థానమునకు వెంటనే మనల రప్పించును. మన కంతకంటె నవమాన ముండబోదు. అవమానమే కాదు. ఇంత ఋణ మెందుకు చేసిరా యని ప్రశ్నలు పుట్టును. అందుపై నపనిందలు పెరుగును. అది కాక కామరాజుపుత్రునిపై రాజసభలో తీవ్రనింద విచారణ యగుచున్నది. శ్రేష్ఠిని మంచి చేసికొనుటయే బుద్ధి!

వారంతట గురునాథశ్రేష్ఠిని ఒకమారు వచ్చి పోవలసిన దని గౌరవముగా సేవకునిచే వార్తనంపిరి. దానికి గురునాథశ్రేష్ఠి ద్విగుణీకృతగౌరవముతో తాను కార్యాంతరవ్యగ్రుడై రాజాలనందుకు చింత తెల్పుచు క్షమింపుడని వేడుచు ప్రత్యుత్తర మంపెను.

రాజకుమారులు మండిపడిపోయిరి. కామరాజకుమారుడు స్వయముగా పోయి యాశ్రేష్ఠిని పొడిచివేసి వచ్చెద నని త్రాచుపామువలె లేచెను. రాజమార్తాండుడు అతని నాపి, దీని కంతటికి కారకుడు తానైనందున శ్రేష్ఠిని నరకివేయు గౌరవము తనకే కావలెనని వాదించి ఖడ్గము నొరనుండి తీసెను. కాని తక్కిన నలుగురు సోదరులు వారి నుభయులను శాంతపరచిరి.

ప్రతాపము చూపవలసిన సమయ మింకను రాలేదు. ఈ శ్రేష్ఠిమీది కోపముతో తొందరపడి చేయరాని సాహసకార్యము చేసినచో తలపెట్టిన ప్రయత్నము లన్నియు భగ్నమగును. ఈ యవినయమునకు గురునాథ శ్రేష్ఠి యుత్తరవాదియగు సమయము రాగలదు. అంతవరకు నోర్పు వహింపవలెను.

ఇంతియ కాదు. గురునాథుడు ధనవంతుడు. అతని ద్రవ్యముతో నెంతయేని పని గలదు. అతని తాతలనాటినుండి మన పితామహులకు మైత్రి కలదు. కేవలము పూర్వమైత్రి స్మరణవలన నతడు లొంగును.

కర్ణాటకప్రభువులు మన పితామహులకిచ్చిన వజ్రకంఠిక యమూల్య మైనది. అది శ్రేష్ఠివద్ద నుంచి ముందుకావలసిన ధనమును తీసికొందము. ఇట్టి యుపాయముతో నీ కష్టసమయమున మరియొక బలవన్మిత్రుని సాధింపవచ్చును.

ఇట్లుపదేశించి రాజమార్తాండునే గురునాధునితో సంప్రదించుటకు బంపిరి.

## 22

రాజమార్తాండుడు వచ్చునని గురునాథశ్రేష్ఠి ముందుగనేయూహించెను, కనుక అతనిని గౌరవించుటకు తగిన రీతిగా నాసనాదులు సిద్ధము చేయించి యుంచెను.

రాజపుత్రుడు వచ్చుచున్నాడని తెలిసినంతనే శ్రేష్ఠి ఎదురుబోయి, వినయముతో నమస్కరించి ఆహ్వానించి యున్నతాసనమున గూర్చుండబెట్టి తాను నిలుచుండెను. రాజమార్తాండుడు కూర్చుండుమని కోరినంత వరకు అట్లే న్రమతతో నతడు నిలువబడియే యుండెను.

"నేను క్షంతవ్యుడను. రాజకుమారులు ఆజ్ఞాపించినను నేను రాలేకపోతిని. ద్వీపాంతరములతో వ్యాపార మింకను తెగిపోలేదు. ఆ తొందర వలన ఊపిరి సలుపుట లేదు. అయ్యో, మీకే శ్రమ యిచ్చితినే!" అని గురునాధుడు ప్రారంభించెను.

అనాడా మాటలు అతివినయముగా తోచుచున్నను శ్రేష్ఠి స్వభావసిద్ధముగనే యట్లు మాట్లాడువాడు. రాజమార్తాండుడు లోపల పొంగుచున్న రోషమును దిగమ్రింగుకొనెను.

రాజ : మేము వచ్చిన పని నీకు తెలియును గదా!

గురు : పైక మంతయు దెచ్చితిరా, రాజపుత్రా! మీకు శ్రమ

ఇచ్చినందుకు విచారపడుచున్నాను. అత్యవసరముగా, మెడమీద కత్తివలె పనిపడి వ్రాయవలసి వచ్చినది. మీరు అడిగినదే వ్యవధానముగా ఈ స్వల్ప ధనము ఇచ్చివేయగల రని ధైర్యముతో మీకే వ్రాయించితిని, మహారాజులు!

రాజమార్తాండుడు మాట్లాడుట కవకాశము దొరకుట లేదు. ఏమి మాట్లాడుటకును పాలుపోక అతడు మౌనము వహించెను.

"రాజపుత్రా, సందేహించుచున్నారేమి?" గురునాథుడే ప్రశ్నించెను.

రాజ : శ్రేష్ఠి, మీకును మాకును మైత్రి వంశపారంపర్యముగా వచ్చినది గాని యినాటిదా?

గురు : ప్రభూ, దాని కిప్పు డేమి భంగము వాటిల్లినది?

"భంగము కాక మరి యిది యేమిటి?" అనుచు రాజపుత్రుడు శ్రేష్ఠి పంపిన పత్రములు చూపెను.

గురు : అందులో నే మున్నది? నాకు యవద్వీపములో చెల్లింపవలసిన అవసరము కలిగి మీకు ఉత్తరములు పంపినాను. ఆ నౌక మోసల పట్టణములో వారము దినములలో బయలుదేరనున్నది.

రాజ : గురునాథా! రాజపుత్రులమగు మాకు వక్రవాక్యములురావు. మేము లోకుల కియ్యవలసిన ఋణములన్నియు నొక్క పర్యాయము నీవు ఋణదాతల వద్దనుండి వ్రాయించుకొని మమ్ము గడియలమీద నా ధనమంతయు కట్టమనడము స్నేహధర్మమేనా?

గురు : అయ్యో, మహారాజా, అట్లనెద రేమి? మీరు సర్వసమర్థులు! నాకు ధన మవసరమై ఈ యూరివర్తకులను వారు నా కీయవలసిన ధన మడుగ గా తమ యొద్ద సిద్ధముగా లేనందున, కావలెనన్న మీ సోదరుల ఋణపత్రము లిచ్చెదమని యిచ్చిరి. మీసామర్థ్య మెరిగినవాడను గనుక మీ పత్రములు చేతనున్న, నంత ధనమును చేతిలో నున్నట్లే భావించి నా యవసరమునుబట్టి వాని నంగీకరించితిని. ఇంతే నిజము! ఇందులో స్నేహవిరుద్ధమైన దేదియు లేదు, నమ్ముడు!

రాజ : అంతధనము సిద్ధముగా గడియలమీద తీసికొని రాగలిగిన వారము మీబోంట్లవద్ద ఋణము పుచ్చుకొందుమా?

చప్పున శ్రేష్ఠి యా మాట కడ్డువచ్చి! "అంత మాటా, ప్రభూ!" అనెను.

రాజ : శ్రేష్ఠీ! నేను కోరున దొకటే. పూర్వమైత్రి పాటించి నీవు మా ప్రతిష్ఠను కాపాడవలె!

శ్రేష్ఠి వినయముతో నమస్కరించుచు మధ్యమధ్య నాగుచు "పూర్వమైత్రి—మరచిపోయినది—మీరుకాని—నేను కాదుకదా, రాజపుత్రా!" అనెను.

రాజ : ఆ విషయము మనము మరచిపోదము. అయిపోయినదానికి ప్రతీకారము జరిగినది, చాలును. మీ తాతలు బేట విజయాదిత్యుల కెంత యంగగా నున్నదియు వినలేదా? ఇప్పుడుగూడ మీకును మాకును మైత్రి ఉభయులకు శ్రేయస్కరము!

గురునాథశ్రేష్ఠి మాటాడలేదు. అతని వైఖరిలో ననుక్షణము కలుగుచున్న మార్పును సూక్ష్మముగా రాజమార్తాండుడు గమనించు చుండెను. శ్రేష్ఠి యాలోచించుచునే యుండెను. రాజమార్తాండుడు గమనించుచునే యుండెను. తుదకు శ్రేష్ఠి ప్రసన్నభావము నొందెను.

"రాజపుత్రా! క్షత్రియులు శీఘ్రక్రోధు లని ప్రతీతి. నా అవినయము మీరు మన్నించినట్లు క్షత్రియోచితవిధముగా జెప్పినగాని వీనికి ధైర్యము కలుగదు."

శ్రేష్ఠిమాటలు విని, వెంటనే రాజమార్తాండుడు తన కుడిచేయి యొరలో నున్న ఖడ్గముపిడిపై నుంచి ఎడమచేయి పైకెత్తి గంభీరముగా నిట్లు వచించెను :

"గురునాథశ్రేష్ఠి! నీవును మేమును మన తాతలకాలమునుండి యున్నట్లే మరల నీ క్షణమునుండియు మిత్రులము!"

శ్రేష్ఠికి దేహము జలదరించెను. గ్రీష్మానంతరము వర్షాగమమున

కాలపురుషునికివలె నాతని మనస్సును ఒక్కసారి ద్రవించెను. రాజనీతి శ్రేష్ఠినీతిని జయించినది!

"పూర్వస్మృతులతో నాకు నోట మాటలు రాకున్నందుకు క్షంతవ్యుడను, రాజపుత్రా!" అని గద్గదికతో గురునాథుడు పల్కెను.

రాజమార్తాండుడు దీని కుచితమగు సమయము వచ్చినదని అంతవరకు కనుపడకుండ కంఠమున వ్రేలుచున్న వజ్రకంఠిక పైకి దీసి గురునాథశ్రేష్ఠి చేతికిచ్చెను. కుల క్రమాగతమైన వేడుకతో శ్రేష్ఠి యా కంఠికలోని వజ్రమును పరీక్షింపసాగెను.

ఆ కంఠికలో నున్న వజ్ర మొక్కొక్కటియు నొక్కొక్క రాజ్యము విలువ చేయునని గురునాథుకు గ్రహించెను. ఇట్టి వజ్రములున్న రాజపుత్రుల యైశ్వర్యము ముందు కోటీశ్వరుని సంపత్తు ఎందుకు పనికి వచ్చును! వానిని పరీక్షించుచున్న కొలదియు శ్రేష్ఠిబుద్ధి వానియందు గాఢముగా లగ్నమయ్యెను. ఆత్మానుసంధానము చేయు యోగివలె నిశ్చలుడై యాత దక్కడనున్న రాజమార్తాండునే ముహూర్తకాలము మరచిపోయెను.

"మా పితామహులకు కుంతలేశ్వరులు వేంగీమహామండలేశ్వర పదవి యనుగ్రహించుచు వారు స్వహస్తములతో మా తాతల నలంకరించిన వజ్రహారమిది. వేంగీప్రభువుల కులక్రమాగతమైన కంఠిక యిదియే."

రాజమార్తాండు డీ విధముగా మాటాడుచుండ నాధ్వనికి కలలో నుండి ఉలిక్కిపడి లేచువాని విధముగా తలయెత్తి గురునాథశ్రేష్ఠి "చిత్తము" అనుచు నా కంఠిక రాజపుత్రుని కందింపబోయెను.

రాజమార్తాండు డది తీసికొనక యిట్లనెను :

"మేము నీ కింత ఋణము చెల్లింపవలసియున్నాము. రాజపుత్రులము మేము. మా దేహములు ప్రతిక్షణము నపాయములో నుండును. మా వృద్ధిక్షయముల వలన మా మిత్రులకు నష్టము కలిగింపరాదు. ఈ

కంఠిక నీ యొద్దనే ఉంచుకొని, మాకు కావలసిన ధనసహాయము చేయ వలె నని మా సోదరుల అభీప్సితము!'

శ్రేష్ఠి యా మాటలకు భయకంపితు డయ్యెను. ఈ సంభాషణము ప్రారంభింపకమున్నె తమమాట లెవ్వరు వినువారు లేకుండ కట్టుదిట్ట ములు చేసి యేకాంతమున నున్నను చకితుడై దశదిశలు విలోకించెను.

"రాజపుత్రా! నాపై నింత భారము వేయవద్దు. ఈ కంఠిక మా బోంట్ల గృహములలో నుండదగదు. మీయొద్దనే యుంచుకొనుడు" అనుచు శ్రేష్ఠి కంఠిక యీయబోయెను.

కాని రాజమార్తాండు డది తీసికొన నిరాకరించెను. "మా ఋణ విమోచన మైనపుడే యిది మరల తీసికొందుము. మరి మ మ్మిపుడు తీసి కొమ్మనుట స్నేహలోపముగా గణింతుము" అనెను.

గురునాథశ్రేష్ఠి మరి మాటాడలేకపోయెను బలవంతులతో వైరము మంచిది కాదు. అందరతో మంచిగా నుండుట వ్యాపారధర్మము!

"రాజపుత్రా! అట్లయిన మాట్లాడను. మీరు చేసిన ఈ ఋణముల సంగతి నాకు తప్ప ఇతరులకు తెలియదు. ఇక ముందుకూడ నట్లే యుండును. మీ రింకను ఇతరుల కీయవలసిన ఋణము లున్నవా?"

రాజపుత్రుని ముఖము ఆనందముతో నొక్కసారి వికసించెను. "ప్రస్తుతము ఐదు లక్షల వరహాలు చాలును" అనెను.

"రేపు మీ కవి చేరునట్లు చేయుదును."

ఉభయులు నంతట సాదరవచనము లాడుకొనిరి. రాజమార్తాండుడు కృతార్థుడై వెడలిపోయెను.

ఆ యపరాహ్ణమున మూడు జాముల లోపుననే కుమారసప్తకము ఋణము తీరిపోయినట్లు గురునాథశ్రేష్ఠి లెక్కలలో కరణములచే వ్రాయించెను. ఆ ఋణమంతయు నతని ధర్మపత్ని లెక్కకు మార్చబడి నట్లు అతని కరణములకుగూడ తెలియవలసిన యవసరము లేదు. ఆ లెక్కలనుండియే మరునాడు రాజమార్తాండుని మందిరమునకు స్వయ ముగా నేగి గురునాథశ్రేష్ఠి ఐదు లక్షల వరహాలును ఇచ్చెను.

# 23

ప్రావులూరి మల్లన భార్యకు గ్రహబాధ నివృత్తియైనప్పటి నుండియు వేములవాడ భీమకవి యతని యింటనే యుండెను. వాకిటినుండి యావేశముతో నతడు చెప్పిన రెండు పద్యముల శక్తి మల్లన కద్భుతముగా గనుపట్టెను. ఇంత శక్తి గల కవి దీర్ఘ కావ్యములు చెప్పిన నవి యెంత రాణించునోగదా యని మల్లన యాతని కవిత్వము వినవలె నని కుతూహలము కలవా డయ్యెను. ఎన్నిమారులు వినిపింపమని కోరినను చిత్రముగా భీమకవి వినిపింపడు. సరసులు వినిపింపగోరినదే వ్యవధానముగ తాము వ్రాసిన పద్యము లన్నియు వినిపించు కవిజనప్రకృతికి నిది విరుద్ధముగా నుండెను.

మరియు మల్లన యాతనితో సారస్వతగోష్ఠి చేయవలెనని యెంతయు బ్రయత్నించెను. సంస్కృత కవుల కావ్యముల భాగములు వినిపించి మల్లన మెచ్చుకొనుచుండగా భీమకవి యేమియు మాట్లాడడు. అతనికి సంస్కృతభాషలో నెక్కువ పరిచితి యున్నట్లు తోపలేదు. తెలుగులో కూడ కవిత్వ మితని స్వాధీనములో లేదని మల్లన తుదకు నిశ్చయించెను. ఆవేశము పూనినవారు ఒకప్పుడు శాస్త్ర గ్రంథములు అప్పగించునట్లు ఇతడు కవిత్వము చెప్పును. ఆ చెప్పిన పద్యమును ఆవేశము అడగిన పిమ్మట నతనికి స్మృతిలో నుండునో ఉండదోకూడ మల్లనకు సంశయాస్పద మయ్యెను.

కాని భీమన యొకమారు నన్నయభట్టారకుల దర్శింప బోదమని యడుగును. మరియొక తరుణమున రాజరాజుకొలువు చూపింపగోరును. కాని యెట్లు? ఇతనికి నలుగురిలో సక్రమముగా మాట్లాడుటయైన దెలియదు. చూచుటకు అనాకర్షకముగ నుండుటయేగాక అసహ్యముకూడ కలిగించును. ఒక విధముగా నాసనశుద్ధిగా కూర్చుండనైన లేదు. ఇట్టివానిని రాజసభకు తీసికొనిపోయిన దనకు మర్యాద దక్కునా? ఈ భయముతో

నెప్పటి కప్పు డేదో సాకు చెప్పి మల్లన తప్పించుకొనుచుండెను.

అయినను, భీమనమహత్త్వమును కన్నులార చూచినవా డగుటను, భార్యకు పిశాచచేష్ట చికిత్స చేసినవా డగుటను అతనియందు విశేషాదరమును, భక్తియు, భయమును గలదు. ఏమి చేయుటకును దోచక యుపాయ మాలోచించుచు ముందు నన్నయభట్టారకుని యొద్దకు దీసికొనిపోయి జరిగినది తెలిపి యా పిమ్మట కర్తవ్య మాలోచింత మని నిశ్చయించెను.

అట్లీనాడే నన్నయయొద్దకు భీమకవిని తీసికొని వెళ్ళెద నని చెప్పెను. కాని ఉదయముననే దాని కొక యంతరాయము కలిగెను. జాము ప్రొద్దెక్కిన వేళను ఒకానొక పండితుడు శిష్యునిచే కొన్ని గ్రంథములు మోయించుకొనుచు మల్లన ఇల్లెక్కడ నని అడిగి తెలిసికొనుచు పావులూరి వారి ఇంటికి వచ్చెను.

ఆ పండితుడు ఎఱ్ఱని దేహచ్ఛాయ కలవాడు. నాసిక దీర్ఘమై దూరాలోచన కలవాడని సూచించుచుండెను. అతని కన్నులలో నొక తేజస్సు వ్యక్తమగు చుండెను. చెవులకు అలంకారములుగా మకరకుండలముల ననుకరించు భూషణము లున్నవి. చేతులకు సింహతలాటములు కలవు. దేహముపై మనోహరమగు కాశ్మీర శాలువ కప్పుకొని యుండెను. ఆ వ్యక్తిని చూచినంతనే పూజ్యభావము కలుగుచున్నది.

శిష్యుడు లోపలికి వచ్చి మల్లనార్యు నడిగి, అదియే పావులూరి మల్లనార్యుల యిల్లని గురునకు నివేదించెను. వెంటనే యా పండితుడు లోపలికి వచ్చి "మల్ల నార్యులు తమరేనా?"అని యడిగి నిశ్చయించుకొనెను. మల్లన యా పండితుని వెంటనే యాదరముతో సుఖాసనాసీనుని గావించెను.

"నన్ను అధర్వణాచార్యు లందురు. కుంతలదేశ భాగములనుండి వచ్చు చున్నాము. విజయవాడలో నడుంబివసతిలో గొప్ప విజయసభ చేసినాము. వేంగీ పట్టణములో పండితసన్మానము పొందియున్నాము. రాజరాజుల కీర్తి విని ప్రభువుల దర్శనము చేసి, పండితసన్మానము పొందు నిచ్ఛతో నిక్కడికి వచ్చినాము. మును పెన్నడు నీ పట్టణ మెరు

గము. నడుంబివసతిలో త్రికాలయోగ సిద్ధాంతదేవర శ్రీ పరిచయ పత్రిక వ్రాయించి దయచేసినారు. అందుకు మీ దర్శనమునకే మేండు వచ్చితిమి" అని యా పండితుడు చెప్పెను. అధర్వణాచార్యుల నామము ప్రసిద్ధి మల్లన కంతకుమున్న విదితము.

ఆ పరిచయ పత్రికను గౌరవ పురస్సరముగ మల్లన యందుకొని రెండు కన్నుల కద్దుకొనెను. మల్లనకు సిద్ధమంత్ర ముపదేశించిన స్వగురులిఖిత మా పత్రము. అది చూచినపిమ్మట ద్విగుణీకృతాదరముతో మల్లన యధర్వణాచార్యులకు నమస్కరించి పాద్య మిప్పించి "ఈ పట్టణములో నున్నంతకాలము మాయింటనే యతిథిగా నుండవలెను మీప్రయాణ సామాగ్రి యెచ్చట నున్నది?" అని ప్రశ్నించెను.

"అవి ధర్మశాలలో నుంచి వచ్చితిమి."

"నే నుండగా మీరు ధర్మశాలలో నుండుట యుచితము కాదు. వెంటనే ఇక్కడికి తెప్పించెదను."

"మేము మా శిష్యునిచే స్వహస్తపాకము చేయించికొందుము. అది మీ యింట ననుకూలముగా నుండకపోవచ్చునని ధర్మశాలలో నుంచి వచ్చితిమి. మీకంత శ్రమ యక్కరలేదు. మీయాదరము, నభిమానము మా యందున్న జాలును."

"మీకు స్వహస్తమున కైనను మా యింట నవకాశము కలదు. అతిధుల కెట్టి నియమము లున్నను వానిని పాటించి గౌరవించుట గృహస్థ ధర్మము. మీ రిక్కడే యుండవలెను."

ఇట్లు చెప్పి యధర్వణు నొప్పించి, విద్యార్థికి తోడుగా సేవకుని బంపి, ధర్మశాలలో నుండి వచ్చిన సామాగ్రి నంతయు దెప్పింప బంచెను.

వారు కుశల ప్రశ్నాదికములు గావించుకొనునంతలో నింటిలో నుండి వేములవాడ భీమకవి యచ్చటికి వచ్చెను. వెంటనే మల్లన వారి నిద్దర కన్యోన్య మెరుక చేసెను.

ఇతడు కేవలము మంత్ర సిద్ధుడు. ఇతని మహిమ యపారము. అద్భుతమైన కవిత్వము ఆవేశపూరితుడై చెప్పగల మహానుభావుడు, వేముల

వాడ భీమకవి!- వీరు మహావిద్వాంసులు, కవులు, అథర్వణా చార్యులు!"

వెంటనే భీమకవి యథర్వణునికి భక్తిపురస్సరముగా వందనము చేసి, "మహాత్మా, నా కా వేములవాడ భీమేశ్వరస్వామి ప్రసాదమే కాని వేరుగా మంత్రసిద్ధి యేమియు లేదు." అని చెప్పెను.

ఆనాడు మధ్యాహ్నము భోజనానంతరమున విశ్రాంతి తీసికొనిన తరువాత మల్లనకును, అథర్వణునకును రాజరాజనరేంద్రుని విజ్ఞతయు, నక్కడి యాస్థానములోని పండితులయు, కవులయు ప్రస్తావన జరిగెను. ముందీ రాజరాజసభలో తన విద్యావైదుష్యము ప్రదర్శించి సమ్మానము పొంది, చోళచక్రవర్తుల దర్శనముకూడ జేసి కృతార్థత పొందవలె నని తన యాశయమయినట్లు అథర్వణాచార్యులు తెలిపెను.

మల్లన యచ్చటి విద్వాంసులను వర్ణించుచు చీదమార్య డొక్కడు ఎట్టి మోమోటములును లేని మహా మీమాంసకుడనియు, నతనికి రాజ సభలో విశేష గౌరవము కలదనియు చెప్పెను. కవులలో నవిరళజపహో మతత్పరుడగు నన్నయ భట్టారకుని ప్రశంసించెను. అంతట మరియు నిట్లు పలికెను:

"రాజరాజనరేంద్రుడు కవిపండితాభిమాని; సరసుడు. ఐనను మీరు చోళచక్రవర్తుల సమ్మాన మభిలషించునెడల మీరు పట్టమహిషి యమ్మంగ మహాదేవిని దర్శించుట మంచిది. ఆమె విదుషీమణి!"

అథర్వ : రాజమాత కుందవమహాదేవికి ప్రత్యేకముగా బెజవాడ మఠమునుండి యొక ప్రశంసాపూర్వక పరిచయపత్రము పొంది తెచ్చి నాను. ఆ పత్రసాహాయ్యమున అమ్మంగమహాదేవి దర్శనముకూడ శీఘ్ర ముగా లభింపగల దనుకొందును.

మల్లన : కుందవమహాదేవి వృద్ధురాలు; పూర్వకాలపు మనిషి. ఆమెకు ఆశ్రితులందరియందు నభిమానమే. కాని అమ్మంగదేవి యనుగ్ర హము సంపాదింప గలిగిన వా రదృష్టవంతులు."

అథర్వ : ఆమె కెట్టివారియం దభిమానము?

మల్లన : అది యంత సులభముగా నిర్వచింపలేము. ఆమెకు విద్వాంసు లందరయందు సామాన్యముగ ననుగ్రహము కలుగును; గాని యామె విశేషానుగ్రహమునకు కేవలము విద్వత్తుచాలదు. మనుష్యుల యంతరంగములు, స్వభావములు గ్రహించుటలో నామెకు దివ్యదృష్టివంటి దేదో కలదని తోచును.

అధర్వ : అనగా ?

మల్లన : అది యంతకంటె వివరించుట కష్టము. ఈ మధ్య ఒక చిత్రమైన వ్యక్తి ఇక్కడికి వచ్చినాడు. అతనిది నటనయో నిజమో తెలియదు కాని నర్తిగా మాట్లాడును. మొదట నతని జూచినప్పుడు మే మెవరమును పండితు డనుకొనలేదు. కాని తర్వాత చూడగా నతనికి రాని భాష యున్నట్లులేదు. అనేక భాషలలో ననర్గళముగా కవిత్వము చెప్పునట. అతని ముఖము చూచినప్పటి నుండియు అమ్మంగమహాదేవికి అతనిపై ననుగ్రహ ముదయించి యతని సర్వవిధముల రక్షించు చున్నది.

అధర్వ : అతని పేరు నారాయణభట్టు కాదుగదా!

మల్లన : పేరు తెలియదు "నన్ని" యని పరిహాసనామ మాతనికి రూఢియయినది.

అధర్వ : అత డెట్లుండును?

మల్లన : దృఢకాయుడు చామనచాయగల దేహము. అశ్వవిద్యలో గూడ నిష్ణాతు డని తోచును. మంత్రప్రయోగదక్షు డనిపించుచున్నది. కర్ణాటక సాహిత్యములో నిధి. కవుల పూర్వచరిత్రలుకూడ నత డెరిగినట్లు తోచును.

అధర్వ : మీకు సందేహ మెందుకు? అతడు తప్పక నారాయణ భట్టే! అతడిక్కడికి వచ్చి గౌరవము పొందుచున్నాడా,—ఆ మనీషాలవ దుర్విదగ్ధుడు?

అధర్వణాచార్యుల కంఠములో నొక యంతర్భీతి మల్లనకు స్పష్టపడెను అందుపై నతని కాశ్చర్యము కలిగినది.

మల్లన : పాప మతని కీమధ్య ధనుర్విద్యాప్రదర్శనములో బాణము తగిలి గాయపడినాడు.

అధర్వ : అత డెప్పుడు నంతే. స్వభావసిద్ధముగా నూరుకొనడు. అతని కెక్కడైన జూచినను శత్రువుచే. త్రైలోక్యమల్లదేవర ప్రధానిగా నుండగా నతడు జైనపండితులను పెట్టిన బాధలు చెప్పనలవికాదు. దైవ కృపవలన తుదకతనికే యక్కడ నుద్యోగముచేయుటయసాధ్యమై దేశము నుండి పారిపోయినాడు. అత డిప్పు డిక్కడికి చేరినాడా?

మల్లన : మీ యూహ సత్యమే కావచ్చు. మా కతని పుట్టుపూర్వో త్తరములు తెలియవు. మీరన్న మాటలు సత్యమే. మొదటిమారు నలుగుర కతని దెలియుటకు కారణము సింధుదేశీయుడు తెచ్చిన యశ్వము తనదని యతనిపై నక్రమముగా చౌర్య నింద మోపుటే. తర్వాత నాలుగైదు దిన ములలో బాణహతుడైనాడు.

అధర్వ : అవును అతడే! సందేహ మెందుకు? మనకు సమ్మా నము చేయుట యతని కిష్టముకాదు.

మల్లన : అతనికి పంపమహాకవి 'విక్రమార్జునవిజయమే' సమ్మ తము కాకపోయినది.

అధర్వ అచ్చటకూడ నది వ్యాసభారతమునకు విరుద్ధమని దూషించువాడు. మా కది శ్రవణకంటకముగా నుండెడిది. ఇచ్చటగూడ ప్రారంభించినాడా?

మల్లన : నేను రాజసభలో విద్యాగోష్ఠిలో పంపమహాకవి విక్ర మార్జున విజయము ప్రస్తావించి వ్యాసుని కథనమునకు గూడ మెరుగు పెట్టినా డనుచుంటిని. ఆ యవకాశము పురస్కరించుకొని నన్ను అతడు యక్షప్రశ్నలు వేసి ఇరుకులో పెట్టెను.

అధ్వర్వ : చెప్పితినిగదా, అత డెప్పుడు నంతే!

ఆ సంభాషణ తుదకు నన్నయభట్టారకుని వంకకు ప్రసరించెను. "నన్నయ స్వయముగా సరసుడు, సహృదయుడు. మర్మముగాని మాత్స ర్యముగాని లేనివాడు. స్వయముగా నుత్తమకవి. ఉత్తమ కావ్యములను హృదయపూర్వకముగా శ్లాఘించును." అని మల్లన పొగడెను.

అధర్వణాచార్యులు నన్నయభట్టారకుని దర్శింప నువ్విళ్ళూర సాగెను. మరునాడు శిష్యుని బంపగా నన్నయ యింటియొద్ద లేడని వార్త వచ్చినది.

# 24

పూర్వకాలమునుండి భరతభూమికిని చీనాకును విశేషసంబంధ ముండెడిది. రెండు దేశములకును భూమార్గమునను జలమార్గమునను రాక పోకలు తరచుగా జరుగుచుండెను. చోళచక్రవర్తుల రాయబారులు చీనాలో నను, చీనారాయబారులు చోళదేశమునను ఉండిరి.

భరతదేశమునకు వచ్చిన చీనాయాత్రికులు పలువురు కలరు. వారిక్కడ చూచిన విషయములు తమదృష్టితో చూచి జీర్ణించుకొనక యాత్రికులకు సహజమగు నతిశయోక్తులతో నాత్మశ్లాఘలతో చీనాభాషలో ననేక గ్రంథములు వ్రాసిరి. ఫాహియాను సముద్రమార్గమున వెళ్ళినవాడు. హ్యూనుత్సాంగు హిమాలయములోని కనుమలనుండి వచ్చి యట్లే తిరిగి వెళ్ళెను.

ఈ చీనాయాత్రికులు పలువిధములవారు—కొందరు కేవలము జ్ఞాన తృష్ణతో వచ్చిన విద్యార్థులు. కొందరు కాలొకచోట నిలువక దేశాటనము చేయువారు. కొందరు చారులు. పలువురు తమ కారాధ్యుడగు బుద్ధభగవానుని పాదస్పర్శచే పవిత్రమైన పుణ్యక్షేత్రములు దర్శించి పూజింప వచ్చిన యాత్రికులు. మరికొందరు మతప్రచారకులు. కొందరు వర్తకులు.

అల్పసంఖ్యాకులు సభావిజయకాంక్షతో భరతఖండము పర్యటనము చేసినవారును కలరు. వారు బౌద్ధక్షేత్రములకును విశ్వవిద్యాలయములకును మాత్రముపోయి విశేషగౌరవమునను జయపత్రములను బొంది భరతపండితవిజయము చేసినా మని స్వదేశమున ప్రగల్భములు కొట్టుకొనుచు నచ్చట గౌరవభాజను లగుచుండువారు.

భరతభూమికి ప్రధానముగ పశ్చిమోత్తరమార్గములను ప్రాచ్యోత్తరమార్గము ననుబట్టియు, కొద్దిగా సముద్ర మార్గమునుండియు విదేశీయులు పలువురు దండయాత్రలవలనను, వర్తకమువలనను, దారిద్ర్య

కారణమునను, జానిపతనమువలనను మరి యనేక కారణములవలనను ఈ దేశమునకు వచ్చి, ఇందే నిలిచిపోయి స్థిరనివాసములు కల్పించు కొనుట తటస్థించెను. అట్టి జాతులలో హిమాలయప్రాంతమున బౌద్ధమత ముద్భవించి విశేషముగా నట్టి జాతులందే వ్యాపించెను.

బౌద్ధమతములో చాతుర్వర్ణ్యవ్యవస్థ లేదు. విదేశములనుండి వచ్చి నిలిచిన వారికి చాతుర్వర్ణ్యములో స్థానము దొరకదు. విదేశములనుండి వచ్చి నిలిచిపోయిన వారిలో బౌద్ధమతము క్రమక్రముగా వ్యాపించినది. ఆర్యధర్మము చాతుర్వర్ణ్యమునకే వర్తించును. బౌద్ధధర్మము సమస్తమానవ జాతికి వర్తించు ధర్మమని ప్రచారము సాగెను విజాతీయులలో పుట్టిన ఈ ధర్మము విజాతీయుల పోషణతో పెరిగి వారుబలవంతులైనతావులనెల్ల వృద్ధినొందెను. ఆర్యధర్మాభిమానము విజృంభించినపుడెల్ల, బౌద్ధాను యాయులు విజాతీయులను గలసి దేశోపద్రవములకు దారితీయుచు బౌద్ధ మను నామ మున్నను లేకున్నను ఆర్యేతధర్మములకు సహాయభూతు లగు చుండిరి.

కామలోభాదులచే కులభ్రష్టులై యార్యసంఘములలో నిలువ నీడలేని పలువురు భారతీయులుకూడ బౌద్ధమునే శరణుజొచ్చుచుండిరి. అట్టివారిలో విద్వాంసులైన వారుగూడ గొంద రుండెడివారు. వారు ఆర్యధర్మమును తారుమారు చేసి ప్రవచనము చేయుచు బౌద్ధధర్మమునకు వైదికాభాసను కల్పించి ఆర్యధర్మానుయాయులగు సామాన్యప్రజలనుగూడ ప్రచారము వలన బౌద్ధులనుగా జేయుచుండిరి.

బౌద్ధధర్మమునకు ఆ పేరుతో ఆర్యధర్మమునకు స్పర్ధగా నిలిచి ప్రతిఘటింపగల శక్తి నిశ్శేష మగుచుండెను. అందులోగూడ పూర్వ మున్న వ్యవస్థలు లేకుండబోయినవి. సంఘబలము వలన నా మతము వృద్ధియైనది. కాని యిప్పు డా సంఘము చీలికలై పోయినది. దానితో దాని బలము క్షీణించినది. శిథిలములై పాడయిపోవుచున్న సంఘారామముల నాశ్రయించుకొని నిలువయున్న సమస్త శక్తులను కూడగట్టుకొని విజృం భించి భారతధర్మమును ప్రతిఘటించుటకు అది మరియొకమారు ప్రయ త్నించుచుండెను. అందుకు సింహళము నుండియు, యవద్వీపము, మల

యము, సువర్ణద్వీపము, నక్కవరములనుండియు వచ్చిపోవుచుండిన వర్తకులు అవసరమైన యాయుధాది పరికరములు విక్రయించి సహాయభూతులగు చుండిరి.

ఈ సమయములో చైత్రబహుళములో చీనాదేశమునుండి మహాపండితుడొకడు కళింగదేశముగుండ వేంగీమండలము చొచ్చి, రాజమహేంద్రపురముచేరి సారంగధరుని మెట్ట సంఘారామములో విడిసెను.

అతడు రాకముందే యతని కీర్తి దేశ మంతటను మ్రోగిపోయెను. నంత స్సమయములో జనసమూహము లెల్ల అతని మహత్త్వమునే చెప్పుకొన జొచ్చిరి.

వేంగీమండలములో నతడు అడుగిడినప్పటినుండియు దారిపొడుగునను అతని దర్శించుటకు మూగుచున్న జనులతో క్రిక్కిరిసిపోవుచుండెను. అతని దర్శనము చేసిన మాత్రముననే ధన్యుల మగుదుమని దూరభాగములనుండికూడ ప్రజలు తండోప తండములుగా వచ్చుచుండిరి. అతడు నడచిపోయిన పిమ్మట నచ్చటిధూళి కొందరు శిరస్సుల దాల్చుచుండిరి. కొందరా ధూళిని సగౌరవముగా పదిలపరచి తమవెంట నిండ్లకు తీసికొనిపోవుచుండిరి. అపై నతని పాదములు క్రిందపెట్టుటకే యవకాశము లేకుండ జనసమూహము అతని యడుగులకు మడుగు లొత్తసాగెను.

ఆ యాత్రికుడు చీనాదేశములో నెల్ల మహాసంపన్నకుటుంబములో జన్మించినవాడట! కాని యాసంపద నంతయు నతడు తృణీకరించి పూర్వము శాక్యగౌతముడు రాజ్యము వదలినట్లే వదలివేసి, త్రిశరణములతో నుపసంపద స్వీకరించెను. అతడు హిమాలయప్రాంతములలో రెండు వందల యేబదియేండ్లు ధర్మోద్ధరణకై, తపస్సు చేసి గిరూపదిష్ట మగు సిద్ధిపొంది లోకోపకారార్థ మీ భరతభూమి యంతయు సంచరించుచున్నాడు.

అతడు శిరస్సునే గాక కనుబొమలుకూడ ముండనము చేసికొనెను. అతడు కట్టిన పుట్టములు పీతవర్ణముతో ధగధగలాడుచుండెను. అతని దేహచ్ఛాయ మెరయుచున్న యి త్తడివర్ణము ననుకరించుచుండెను. దాని పై

గట్టిన యాతని పీతకౌశేయము లతని శరీరకాంతికి అపూర్వశోభ కలిగించు చుండెను.

ప్రయాణకాలమున నత డెట్టి వాహనములు నధిరోహింపడు. ఎంత దూరమైనను పాదచారిగ నరుగవలసినదే! వెంట పరివార మేమియు లేదు. వస్త్రములుకూడ మారుజత తప్ప ఇతర మేమియు నుండవు. అతని వెంట తెచ్చుచున్న గ్రంథజాలము మోయుటకు మాత్ర మొక కంచరగాడిద వెంట వచ్చుచుండెను. జనసమూహమే పరివార మైనందున నా కంచర గాడిద యాతని పుస్తకములతో అతనివెంట సురక్షితముగా వచ్చుచుం డెను.

అతనికాయము దృఢమై స్థూలమైనది. అతని శిరస్సు విపరీతముగా పెద్దది. అందులో నున్న నోరుకూడ ఈ చెవినుండి యా చెవివరకు వ్యాపించి యున్నది. ముక్కు వెడల్పు మాత్రమేకాని ఏ మాత్రమును ఎత్తులేదు. కన్నులు సూదులవలె చిన్నవిగాని మిణుగురు పురుగులవలె బహు కాంతిమంతమై మెరయుచుండెను. అతని బాహువులు కురుచ నయ్యు దృఢమైనవి. కాళ్ళుకూడ పొట్టివై ఏనుగుకాళ్ళవలె బలిష్ఠమైనవి. చిన్న బొర్ర కలదు.

చెవులకు పెద్ద కడియములవంటి పోగు లతడు ధరించెను. అతని మెడలో మనుష్యాస్థులతో జేసిన అక్షమాల కలదు. దానికి కొలికిపూసగా చిన్న మనుష్య కపాల మొకటి యుండెను. అతడు విసరుకొనుటకు వాల వ్యజన మొకటి యెల్లపుడు చేత ధరించును. పాదములకు పలుచని పాద రక్ష లున్నవి. అతడు ప్రయాణ సమయముల నవసరమగు వస్తువులుంచు టకు తన వీపుననే వెదురుతో చేసిన పేటిక వంటి దానిని నడచునప్పుడు తగిలించుకొనును. దానికి ఒక ప్రక్కను విచ్చినఛత్ర మొకటి కట్టియుం డును. ఈ విధముగా నతనికి వర్షాతపముల బాధ యుండదు.

అతనికి త్రిపిటకములు హృద్గతము లట. చీనాదేశీయు లెరిగిన సమస్త శాస్త్రముల నతడు సమగ్రముగా నభ్యసించి యక్కడ సాటిలేని పండితు డని ప్రఖ్యాతిగాంచెను. హిమాలయపార్శ్వముల తపస్సు చేయు తరుణమున నతడు సంస్కృతము నేర్చి సమస్తశాస్త్రములు నేక దీక్షతో

విద్వాంసులయొద్ద నభ్యసించెను. ఉత్తర దేశమున నాతవి నెదిరించి సభలో నిలువగల భారతీయ విద్వాంసుడే లేకపోయెనట.

కాని యతడు పండితులతో వాదించు సమయముల దప్ప ఇతర వేళల నెక్కువ మాటాడడు. అతని కన్ను లేదో అలౌకిక విషయమును సందర్శించుచున్నట్లును చెవు లేదో పరశబ్దము నాలకించుచున్నట్లును తోప జేయును. అత డెప్పుడును పరధ్యానముగా నున్నవానివలె గనుపించును. ఇంత పరమశాంతుడు గలడా యింకొక డనిపించును.

అతనిని జూచినంతనె పిశాచగ్రస్తులు కేకలువేయుదురు. అట్టివారి నావేశించిన పిశాచములు వెంటనే పారిపోవును. అతడు చేతితో ధూళి యభి మంత్రించి యిచ్చినను, తీర్థము స్పృశించి యిచ్చినను సమస్త జాడ్యములు బోవునట.

అందువలన నతనియొద్దకు దారిపొడుగునను తీర్థప్రజవలె జనసమూహములు మూగసాగిరి. స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు, మరణమాసన్నమైనవారు, మూగ, కుంటి, గ్రుడ్డి—ఇంకను ఎన్ని రకముల మనుష్యులో అతని దర్శనార్థము వచ్చుచుండిరి. అందరికిని అతడుకరుణా సముద్రునివలె కనుపడును. అతని కటాక్ష ప్రసారముచేతనే దేహజాడ్యములే కాక అంతరజాడ్యములుకూడ తొలగిపోయిబోధముద్యోతించు నని విశ్వాసము ప్రాకిపోయెను.

అట్టి మహనీయుడు వేంగీమండలమునకు నాయకమణియుంబోని రాజమహేంద్రపురము వచ్చినాడన్న, వేంగీమండలములోని సామాన్యజన మక్కడ మూగకుండునా? అతడు విడిసియున్న సారంగధరుని మెట్ట సంఘారామమునకు దర్శనమునకు వచ్చువారిసంఖ్యకు మితి లేకుండెను. అతని దర్శించునది యచ్చటి బౌద్ధ ధర్మానుయాయులే కాదు. చాతుర్వర్ణ్య జనులుకూడ పలువు రాకృష్టులై యా మహానుభావుని దర్శించి నమస్కరించి కృతార్థత నొందితి మని భావించుచుండిరి.

అతడు సంఘారామమునకు వచ్చిన రెండుదినములకు రాజమహేంద్రవరపట్టణ మంతటను వివాదపత్రికలు పంచిపెట్టబడెను.

"గౌతమబుద్ధుడు లోకమున కుపదేశించిన ధర్మమే ధర్మము.ఇతర

ధర్మములు కృత్రిమములు. ఈప్రతిజ్ఞ ఖండింపగలవారు ఏ క్షణముననైనను సంఘారామమున చీనాపండితునితో వాదింపవచ్చును. వైశాఖశుద్ధ పూర్ణిమలోపల నీ యాహ్వాన మంగీకరించి ఎవరును వాదమునకురాకున్న, బౌద్ధవాదము జయమందినట్లు విజ్ఞులు భావించి బుద్ధజయంతినాటి యర్ధరాత్రమున చీనాపండితునికి జయపత్రిక సమర్పింతురు."

ఆ పత్రికలలో నిట్టి వాదాహ్వాన ముండెను!

ఇట్టి వాదపత్రికలు బహువిధముల ప్రచురించిరి అందముగా పెద్ద యక్షరములతో కుడ్యములపై వ్రాసిరి. చతుష్పథములలో ఫలకములమీద చిత్రించి ప్రదర్శించిరి. జనులుకూడిన స్థలములలో నెల్ల విరివిగా పంచి పెట్టిరి.

ఇంతే కాదు. పండితుల కీ పత్రికలు ప్రత్యేకముగా నందెను. నన్నయ, భీమనభట్టు, చీదమార్యుడు ఈ పత్రము లందుకొనిరి. వేదనిందకులతో వాదించుటే దోషమని వా రుపేక్షించిరి.

పావులూరి మల్లనకును, అధర్వణాచార్యులకును ఈ పత్రములేలనో చేరలేదు. వజ్జియ ప్రెగ్గడ యొద్దకు భిక్షార్థమువచ్చుచుండు బౌద్ధశ్రమణు డొకడు వా రిద్దరకు గూడ పత్రము లందించెను.

తన ప్రతిభ ప్రకటించుకొనుట కవకాశము చూచుచున్న అధర్వణాచార్యులు అది చూచినంతనే ప్రతిపత్రిక పంపెను.

"బౌద్ధధర్మము క్షణికము; తుచ్ఛము! జైనస్యాద్వాదము ఉపాదేయము. ఈ ప్రతిజ్ఞ మేము నిర్వహింపగలము. సభ యేర్పాటుచేసి సభానియమములు నిర్ణయింప వలసినది. ఎప్పుడైనను మేము వాదమునకు సంసిద్ధులమే!

అధర్వణాచార్యులు"

ఈ పత్రిక చీనాపండితునికి పంపి, పట్టణ మంతటను ప్రకటింప జేసెను.

ఒక్కసారిగా పావులూరి మల్లనగృహాంగణము జైనజనులతో నిండిపోయినది.

# 25

ఇన్నాటితో క్రీడాద్వీపములో వినోదములు సమాప్తమయ్యెను. మల్లయుద్ధములో రాజరాజు నంగరక్షకుడు రాజమయ్య అతిశయించెను. చంద్రాదిత్యదండ నాథుడు ఖడ్గయుద్ధములలో నద్వితీయుడని బిరుదు పొందెను. శూల కుంత ప్రయోగములలో జననాథుడు ముప్పిమయ్య యనువారు పేరు పొందిరి.

కాని యా చివరి రెండు దినములను యువరాజును చోళమిత్రులును కుమారసప్తకమును క్రీడలలో పాల్గొనలేదు. రాజరాజుకూడ తుట్టతుదకు బహూకృతి ప్రదానమునకు దప్ప క్రీడలు దర్శించుటకు రాలేదు. వినోదము లందుచే కాంతి విహీనములై యుండెను. అనేకవిధములుగా వదంతులును ప్రేక్షకులలో ప్రబలిపోయెను.

ఈనాడు రాజరాజనరేంద్రుడు ధర్మాసనమునం దాసీను డయ్యెను. నత్తి బ్రాహ్మణుడు సభాముఖమునకు వచ్చి వాఙ్మూల మియ్యగల స్థితిలో నున్నందున ఈసభ సమావేశపరచెను. ఈ సభకుకూడ వెనుకటివలె సామంతులు దండనాథులు రాజబంధువులు ఉద్యోగులు సంపన్నులువచ్చిరి. చూడదలచిన జన మంతటికిని వచ్చుట కనుజ్ఞ యిమ్మని రాజభటుల కాజ్ఞయైనది. ధర్మాసనమున మహారాజుండగా వచ్చుటకి జను లందరను రానిచ్చు నాచారమున్నది. యువరాజుకును రాజబంధువుకును సంబంధించిన వివాదము గనుక ఈ నిర్ణయ సమయమున సమస్త జనులు నుండుట యుత్తమ మని రాజరాజు ప్రకటన చేయించెను. సంతకువచ్చిన విదేశ వర్తకులుకూడ పలువు రా సభకు విచ్చేసిరి.

వందిమాగధుల కైవారములును కవిజనముల యాశీర్వాదములును కన్యకల మంగళహారతులును ఐనవి.

ధర్మాసనమున రాజరాజనరేంద్రుడే స్వయముగా నుపవిష్టుడయ్యెను. చీదమార్యుడు ప్రాడ్వివాకుడు, గణకుడు పావులూరి మల్లన, లేఖకుడు గండాచార్యుడు, కూడిన యశేష సామంతదండనాథులే సభ్యులు.

యువరాజరాజేంద్రదేవు డొక ప్రక్కను, కామరాజపుత్రు డింకొక ప్రక్కను అన్యోన్యాభిముఖులై కూర్చుండిరి.

రాజదూత సభాప్రారంభము ప్రకటించెను.

వెంటనే బాణహతుడైన బ్రాహ్మణుడు ఇద్దరు బ్రహ్మచారుల కైదండతో ప్రక్కనున్న గదిలోనుండి సభాంగణమునకు వచ్చెను. ఆ బ్రాహ్మణునకు ప్రత్యేకముగనొక యాసనము సిద్ధముగా నుండెను. బ్రాహ్మణుడు చేతిబాధ యోర్చుకొనుచు ప్రయత్నపూర్వకముగా బాహువులు కలిపి సభకు నమస్కరించి యనుజ్ఞాతుడై యాసనమున నుపవిష్టుడయ్యెను.

ప్రాడ్వివాకు డగు చీదమార్యుడు రాజేంద్రదేవుని, కామరాజపుత్రుని నా బ్రాహ్మణుని సాక్ష్యమున కభ్యంతర మున్నచో చెప్పవలసినదని కోరెను.

"ఈ బ్రాహ్మణుని క్రీడావినోదములకు పూర్వము చూడనైన చూడలేదు. నా కెట్టి యభ్యంతరమును లేదు." అని యువరాజు వెంటనే వచించెను.

"నేనును ఈబ్రాహ్మణు నెరుగను. అయినను యువరాజునెడ నభిమానముగల వజ్జియ ప్రెగ్గడల మందిరమున చికిత్స నొందుచున్నందున నాకు పూర్తిగా విశ్వాసము లేదు. సాక్ష్యమైన పిమ్మట అవసరమని తోచిన కొన్ని ప్రశ్నలడుగుట కనుజ్ఞ అర్థింతును" అని కాముడు చెప్పెను.

చీదమార్యుడు వెంటనే నిష్కర్ష చేసెను. "అట్టి వాగ్దానము ధర్మప్రభువులు ముందుగా చేయ వలనుపడదు. గాయమైన మానవుడు చికిత్స నొందక తప్పదు. ఎవరిదెబ్బకు కారణము నిర్ధార్యాంశమో అతనిని విచారింపకుండుటకు విశేష కారణము లుండవలెను. సాక్ష్యమైన పిమ్మట స్థితిగతులను బట్టి సభ్యులును ధర్మ ప్రభువులును అట్టి యనుజ్ఞ అనుగ్రహింపవచ్చును. అది యప్పుడు మనవి చేసికొనవలసినదే కాని ఇప్పుడప్రస్తుతము."

ప్రాడ్వివాకుని నిర్ణయమునకు రాజపుత్రుడు విధిగా తలయొగ్గెను. అంతట బ్రాహ్మణుని విచారణ ప్రారంభమయ్యెను.

ముం దా బ్రాహ్మణునియెదుట నగ్నిహోత్ర ముంచిరి. దానికి నమస్కరించి బ్రాహ్మణుడు అగ్నిసాక్షిగా సత్యమే చెప్పెదనని ప్రతిజ్ఞ చేసి ప్రారంభించెను.

"నా నామము నన్ని నారాయణభట్టు. మా తండ్రిపేరు అకలంకా శంకనా మాత్యుడు. బ్రాహ్మణుడను. మాది హరితసగోత్రము. అపస్తంబ సూత్రము. నాకు నలుబది యేడేండ్ల వయస్సు. ప్రస్తుతము రాజమహేంద్ర పురమే నా నివాసము. స్థిరవసతి లేదు."

ప్రాడ్వివాకుడగు చీదమార్యుడు వెంటనే వారించెను.

"స్థిరనివాసము లేనిచో పూర్వము వసించినస్థలము, వృత్తి వివరముగా చెప్పి తీరవలెను."

నారాయణభట్టు: చిత్తము. ఇప్పటికి రమారమి సంవత్సరము క్రిందటి వరకు కల్యాణకటకము నివాసముగా నుండెను. ఈ వత్సరకాలము నుండి స్వస్థానము వదలి దేశాటనముచేసి తుదకు మా పూర్వుల నివాస క్షేత్రమగు వేంగీమండలము చేరినాను. మూడేళ్ళ క్రిందటివరకు త్రైలోక్య మల్లదేవరయొద్ద ప్రధానిగా నుండెడివాడను.

అంతట ప్రాడ్వివాకుడు ప్రశ్నింప నారాయణభట్టు ప్రత్యుత్తరము లిచ్చుచుండెను.

"నీవు చైత్రశుద్ధత్రయోదశి సాయంకాలమున వినోదములయొద్ద నుండగా నీ దక్షిణబాహువున బాణము తగిలినదిగదా?"

"అవును."

"అది ఎవరు కొట్టిన బాణము?"

"నాకు ఆయుష్మంతుడగు యువరాజు చేతులతో విడువబడిన బాణమే తగిలినది."

"అంతకు పూర్వము బాణము లేమైనను బ్రాహ్మణబృందములోనికి వచ్చినవా?"

"రెండు వచ్చినవి; నా మీది.కే"

"అవి ఎవరు వదలినవి?"

"అవి కామ రాజపుత్రుని ధనుస్సునుండి వచ్చినవి."

"అతడు వదలినవి ప్రమాదజనితమా? బుద్ధిపూర్వకమా?"

"ప్రమాద మగుటకు అవకాశము లేకపోలేదు. కాని రెండు బాణములను నొకరు వదలినవే వెంట వెంటనే నా మీదికే వచ్చుట ప్రమాద మగునా యని సందేహింప వలసియున్నది."

"అవి రెండును నీ కెందుకు తగులలేదు?"

"భటు డొకడు దండముతో వారించినాడు. అతడే!" అని సభలో నున్న రాజమయ్యను నారాయణభట్టు నిర్దేశించెను.

"మూడవ బాణము ప్రమాదమున నీకు తగిలినదా? ప్రయత్న పూర్వకమా?"

"ప్రమాద మగుట కవకాశ మున్నది. కాని ప్రయత్నపూర్వక మనుకొనుటకు గూడ కారణ మున్నది."

"అనగా?"

"యువరాజును కామరాజపుత్రుడు చివరక్షణములో చేయిపట్టి కదలింపనిచో ఆయుష్మంతుని బాణము నాకు తగిలియుండదు."

"అనగా, ప్రయత్న పూర్వకముగా నిన్ను కొట్టుటకు కాముడు రెండు బాణములు ప్రయోగించి విఫలుడై తుదకు యువరాజు ప్రయోగించుచున్న బాణము నీకు తగులునట్లుగా అతనిని కామరాజపుత్రుడు కదలించినాడని నీ ఉద్దేశమా?"

"అట్లనియే నా దృఢవిశ్వాసము."

ఆ సమయమున రాజరాజనరేంద్రుడు ధర్మాసనమునుండి యిట్లు సెలవిచ్చెను:

"ఇది చిత్రముగా నున్నది! కామరాజపుత్రునికి ఈ బ్రాహ్మణుని బాణహతుని జేయుటకేమైన విరోధాదికారణము లున్నవేమో ప్రాడ్వివాకులు నిశ్చయించెదరు గాక!"

రాజానుమతితో ప్రాడ్వివాకుడు మరల ప్రశ్నింప నారంభించెను.

"నీయందు కామరాజపుత్రునికి పూర్వవైర మున్నదా?"

"ఆ రాజపుత్రునిమనస్సు నే నెట్లూహింపగలను?"

"నీవు పూర్వ మా రాజపుత్రు నెరుగుదువా?"

"ప్రత్యక్షముగా నెరుగను గాని, రాజబంధువులలో నొకరని విని కిడి యుండెను. మరియు కల్యాణకటకములో నొకమారు వేరు వేషమున జూచియున్న గుర్తుకలదు."

"ఇందా విషయము లప్రస్తుతములు. ఈ విషయమున నీ వింకను జెప్పుకొన వలసిన దేమైన నున్నదా?"

"లేదు."

అంతటితో నారాయణభట్టు వాఙ్మూలము ముగిసెను. గండాచార్యుడు ఫలకముపై లిఖించినది ప్రాడ్వివాకుడు సభాముఖమున జదివి యందుకు ననుమతించిన పిమ్మట పత్రముపై వ్రాయించుట కనుజ్ఞ యిచ్చెను.

అంతట కామరాజపుత్రుడు ముందు మనవిచేసినట్లు కొన్ని ప్రశ్నలువేయుట కనుజ్ఞవేడెను. ప్రాడ్వివాకుడగు చీదమార్యుడది న్యాయ విరుద్ధ మని సూచించుచు రాజరాజువంక జూచెను. రాజరాజనరేంద్రుడు నిస్సంకోచముగా కామరాజపుత్రుని కెన్ని ప్రశ్నలైన ప్రశ్నించుట కనుజ్ఞ యిచ్చెను. రాజపుత్రుడు ప్రశ్నింప నారంభించెను. నారాయణభట్టు ప్రత్యుత్తర మీయదొడగెను.

"మీరు గాయపడిన పిమ్మట వజ్జియ ప్రెగ్గడల మందిరములో చికిత్స నొందుచుంటిరిగదా?"

"అవును."

"అక్కడ ప్రెగ్గడలకును మీకును ఈ యభియోగముసంగతి సంభాషణలు జరిగెనుగదా?"

"గాయము కలిగిన రాత్రి నాకుస్మృతి వచ్చినవెంటనే నా గాయము కారణమునుగూర్చి మా కిద్దరకు సంభాషణ ఒక్కసారి మాత్రము జరిగినది. అప్పటికి యభియోగము విచారణ ప్రారంభింపలేదు."

"మిమ్ము మీ ప్రభువులు కొలువులోనుండి ఎందుకు తొలగించిరి?"

"నన్ను తొలగింపలేదు, నే నే మానుకొంటిని."

"ఎందుకని?"

"నాకు శాంతముగా నిత్యనైమిత్తిక విధులతో కాలము గడపవలె నని సంకల్ప ముదయించినది."

"ఈ దేశ మెందుకు వచ్చితిరి?"

"సర్వలోకాశ్రయ శ్రీ రాజరాజ విష్ణువర్ధనులు బ్రాహ్మణాభిమాని యనియు, కవి పండిత పోషకుడనియు విని యీ దేశము బ్రాహ్మణ నివాసమునకు యోగ్యమగునని వచ్చినాను."

కాముడు పొరపాటు ప్రశ్న వేసితి నని నొచ్చుకొనెను. కాని ప్రశ్నలు చాలింపలేదు.

"మీ కున్న నత్తి ఈనా డేమైనది?

"మీరు ప్రసాదించిన బాణహూతితో నానత్తి మాయమైనది." సభలో చిరునవ్వు ప్ర . రించెను.

"మీ రేమైన జదువుకొంటిరా?"

"కొంచెము."

"ఎక్కడ?"

"కాంచీపురములో ముఖ్యముగా."

"వజ్జియప్రెగ్గడల కుమారు నెరుగుదురా?"

"అతడు నా సహాధ్యాయుడు."

"నన్నయభట్టారకులు?"

"అతడును."

"రాజేంద్రదేవు నెరుగుదురా?"

"యువరాజునా? యువరాజని యెరుగుదును."

"యువరాజు మీ కిష్టుడు గదా!"

"కాకేమి! ఆయుష్మంతు డెవరి కిష్టుడు కాడు?"

కాముడు మరల పొరబడితి నని నొచ్చుకొనెను. రాజరాజుముఖములో కోపము వ్యక్తమగుచుండెను. కాముడు ప్రశ్నలు చాలింపలేదు.

"కొంచెము చదువుకొంటి నంటిరి? ఏమి టా చదువు?"

"నా చదువు పరీక్షింతురా, రాజపుత్రా! నా చదువు స్వల్పము. కావలసిన దడిగినచో చదివిన స్వల్పము చెప్పెదను."

"మీకు దండనీతి తెలియునుగదా!"

"అవును. ప్రధానిగా నుంటినిగదా, ఏడేళ్ళు."

"శస్త్రసాధనము చేసితిరా?"

"కొంత కొంత,"

"ఏ శస్త్రములు?"

"ధనుస్సు, ఖడ్గము, గద, కుంతము, శూలము—"

"వేదశాస్త్రములు రావుగదా!"

"అనంతమైన వేదము సంపూర్ణముగా నెవరికి వచ్చును? మాది కృష్ణయజుర్వేదశాఖ. అందులో నుపలబ్ధ మైనంతవరకు క్రమాంతము అధ్యయనము చేసితిని. శాస్త్రములలో నేమి కావలెను?"

కాముడు మరల ప్రశింపబోవుచుండెను.

సభ్యులలోనుండి రాజగురువులగు నన్నయభట్టారకుల కంఠము స్వచ్ఛముగా వినవచ్చెను.

"రాజపుత్రా! ఇతడే నా సహాధ్యాయుడు నారాయణభట్టు. ఐనచో ఇతడు కేవలము సరస్వతీమూర్తి! ఇతని పాండిత్యపరీక్ష చేయ ప్రయత్నించుట నీకు వ్యర్థప్రయత్న మగును."

వ్యాసప్రోక్తమైన దని సభ్యులు నిర్ణయించిరి. నారాయణభట్టు వినయముతో తల వంచుకొనెను. కాముని ప్రశ్నలు కాముని కంఠములోననె అడగిపోయెను.

అంతట రాజరాజు కాముని సంబోధించి యతనికేమైన సాక్షు లుండిరేమో యడిగెను. వెనుక విచారించిన వారు కాక యితరులు లేరని చెప్పెను. ఇంకను జెప్పుకొనవలసిన దేమే నున్నచో చెప్పుకొనుటకు ప్రభు వనుజ్ఞ ఇచ్చెను.

"నేను దోషిని కాను. యువరాజుమీది యభిమానముచేత యువ రాజు చేసిన ప్రమాదమును ఇందరు కలసి నామీదికి త్రోయుటకు ప్రయ

త్నించుచున్నారు. వజ్జియప్రెగ్గడల బుద్ధిసూక్ష్మత లోక మెరుగనిది కాదు" అని కామరాజపుత్రుడు చెప్పుకొనెను.

వజ్జియ మాటాడలేదు. రాజరాజు కోపము పట్టలేకపోయెను. "ఇందులో దోషి యెవరో సభ్యులు నిర్ణయింతురు గాక!" అనెను.

సభ్యు లందరు, "కామరాజపుత్రుడు దోషి" యని యేకగ్రీవముగా వచించిరి.

రాజరాజనరేంద్రుడిట్లు వచించెను:

"కామరాజపుత్రా! యువరాజు దోషి యను నిశ్చయముతో నతనిని శిక్షించుట కీ మహాసభలో ఈ వ్యవహారవిచారణ ప్రారంభించితిమి. కాని యువరాజు నిర్దోషియని సిద్ధాంతమైనది.

"నీవు చేసిననేరము తలచుకొనిన మాకే సిగ్గగుచున్నది. ఒక చాళుక్యరాజ పుత్రుడు విద్వాంసుడైన బ్రాహ్మణుని హత్యచేయుటకు మూడు ప్రయత్నములు చేసినాడు. అందులో విషదిగ్ధబాణములు ప్రయోగించినాడు.

"ఇంతియకాదు. నీ దోషము యువరాజుపై వేయుటకు కృత్రిమముగా నాతని నామాంకితబాణములు సృష్టించినావు. సభాముఖములో నిశ్శంకముగా యువరాజుబాణములు బ్రాహ్మణునికి తగిలినట్లు అసత్యమాడినావు.

"ధనుర్విద్యయందు నీకు కౌశల మున్నదని తెలియుచున్నది. వేద బాహ్యుని వాక్కున శ్రుతివలె నీయందా విద్య శోభింపనేరదు. నీయందు మా కున్న వాత్సల్యముచే పూర్వమిచ్చిన బిరుదలాంఛనములు గౌరవములు ఈ క్షణమునుండి యుపసంహరించు చున్నాము. అరత్ని ప్రమాణము కల ఖడ్గముమాత్రము ధరించుటకు అనుజ్ఞ ఇచ్చుచున్నాము."

ఆ మాటలు వినినవెంటనే కామరాజపుత్రుడు ఆసనమునుండి లేచెను. లేచి శాంతముగా తానుధరించియున్న గౌరవలాంఛనము లన్నియు నొక్కటొక్కటె రాజరాజుపాదముల సన్నిధిని నివేదించెను. సభ నిర్వాక్కుగా నుండెను.

మరల రాజరాజుమాటలు వినబడెను. అతడు కామునిసోదరులగు విజయాదిత్యుడు, విమలాదిత్యుడు, విక్రమాదిత్యుడు, విష్ణువర్ధనుడు, రాజమార్తాండుడు — అనువారల దిక్కు తిరిగి మాటాడెను.

"మీరు మీ సోదరునియం దభిమానముచేత సభాముఖమున చెప్పినది మేము విశ్వసింపలేము. మీ రంద రికముందు ధర్మదీక్ష అలవరచుకొనవలసిన దని ఆజ్ఞాపించుచున్నాము."

వారైదుగురు శిరస్సులు వంచుకొనిరి.

అంతట రాజరాజుకనుసన్నతో రాజమయ్యను ప్రభువు నెదుట నుంచిరి.

"నీవు సమర్థతతో నీబ్రాహ్మణుని రెండుమారులు కాపాడినావు. నీకు దండనాథపదవి ప్రసాదించుచున్నాము. ముందుకూడ నీ యోగ్యత ప్రకటించుకొనవలెను."

అని రాజరాజువాక్యములు వినబడెను. వెంటనే గండాచార్యుడు ఆజ్ఞాపత్రమువ్రాసి, రాజముద్రిక వేయించి రాజరాజుపీఠిక ముందుంచెను. అది రాజరాజనరేంద్రుడు స్వహస్తములతో ప్రసాదింపగా రాజమయ్య వంగి 'మహాప్రసాద'మని యందుకొని పత్రము రెండుకనుల కద్దుకొని రాజరాజుకు నమస్కరించెను. రాజాజ్ఞతో నతనికి దండనాథలాంఛన మగు నసిపత్రము ప్రసాదింపగా నదియు రెండు చేతులతో నందుకొని కన్నుల కద్దుకొని, యది చేతుల నుంచుకొని "ఇది సర్వలోకాశ్రయ శ్రీ రాజరాజ విష్ణువర్ధనుల సేవయం దుపయోగింతు" నని ప్రమాణము చేసెను.

మరల రాజరాజువాక్కులు వినబడెను:

"కామరాజపుత్రా, నీవు చేసిన యపరాధములు తీవ్రమైనవి. మాకు నీయందున్న వాత్సల్యముచే మా నోటితో శిక్ష విధింపలేకున్నాము. సభ్యులుగా నున్న మంత్రులు, దండనాథులు, విద్వాంసులు, నారాయణ భట్టారకులు, ప్రాడ్వివాకులు శిక్ష సూచింపవలెనని మా యాజ్ఞ!"

అట్లనుచు ఒక్కొక్కరివంక మహారాజు చూచెను. ఎవరును మాటాడలేదు. తుదకు ప్రాడ్వివాకు డిట్లు వచించెను:

దైవానుగ్రహమువలన బాణహతుడైన ఈ బ్రాహ్మణుడు జీవించి యున్నాడు. కనుక ఇట్టి దోషికి ఎట్టి యాస్తియు లేకుండజేసి యావజ్జీవము కారాగారములో నుంచునట్లు శిక్ష విధించుట కేవలము దయ చూపుట!"

రాజరాజు ముందు నారాయణభట్టువంక జూచెను. నారాయణభట్టు వినయముతో తలవంచి మాటాడలేదు. పిమ్మట దండనాథులవంక జూచెను. వారును మాటాడలేదు. అంతట వజ్జియప్రెగ్గడవంక జూడ నతడును మౌనము వహించెను. విద్వాంసులగు నితరసభ్యులును మౌనము వహించిరి. సభయంతయు మౌనము వహించెను.

రాజరాజే మరల పలికెను :

"సభామౌనము ప్రాడ్వివాకుని వాక్యము లమోఘములని నిశ్చయించుచున్నది. కామునికి ఇకముందు ఎట్టి యాస్తియు నుండదు. యావజ్జీవము కారాగారములో నుండవలెను. ఒక్కకత్తి ధరించుట కిచ్చిన అనుజ్ఞకు భంగముండదు."

లేఖకుడగు గండాచార్యుడు వెంటనే పత్రము లిఖించి ప్రాడ్వివాకునికి జూపెను. అంత రాజానుమతితో రాజముద్రిక ముద్రాధికారి దానిపై వేసెను. ఇద్దరు రాజభటులు కాముని కిరుప్రక్కలవచ్చి నిలువబడిరి.

కాముడు వినయముతో చేతులొగ్గి యొక్క విన్నతి చేసికొనెను :

"మహారాజా, ఒక్క మనవికలదు. అనాదిగా కుబ్జవిష్ణువర్ధనుల కాలమునుండి యిది కల్యాణకటకేశ్వరులకు సామంతరాజ్యము. నేను నిర్దోషిని. తమ తీర్పుపై కుంతలేశ్వరులకు పునర్విమర్శనార్థము విన్నతి చేసికొన నను జ్ఞ వేడెదను."

సభయంతయు నతని సాహసమునకు నివ్వెరపోయెను. అతని సోదరులే నిర్వాక్కులైరి.

రాజరాజు అతని తీసికొని పొమ్మని భటులకు సంజ్ఞ చేయుచు ధర్మాసనము నుండి యాభ్యంతరమందిరమునకు బోవుచుండెను. శిక్షితుని ముఖము చూచుట సార్వభౌముడు చేయదగని పని!

భటు లిద్దఱు కాముని రెండుచేతులు పట్టుకొనిరి. అకస్మికావేశముతో నతడు వారిద్దర విదలించి త్రోసివేసెను. వారు మరల పట్టుకొను నవకాశమున నతడు "ఇట్టి పక్షపాతముతో కూడిన నిర్ణయమునకు నేను బద్ధుడను గాను. అధర్మము నన్ను బంధింపలేదు!" అని బిగ్గరగా నరచుచు తన కనుమతి యిచ్చిన కత్తితో బలముగా రొమ్ములో పొడుచుకొని రాజసభాంతరమున పడిపోయెను.

కాముని సాహస వచనములకును సాహస చేష్టకును సభయంతయు జలదరించెను. కాని శిక్షితుని స్థితిగతులు రాజభటులేగాని సభాసదులు ప్రత్యక్షముగా జోక్యము కలిగించుకొని చూడరాదు. కాముని సోదరులు కూడ నతని యొద్దకు బోలేదు; అతని బలుకరించలేదు; అతని కుపచారములు చేయలేదు. రాజసేవ యెంత కఠినము! రాజభటులే యాతని నావలకుదీసికొని పోయిరి.

నన్నయభట్టారకుడు ప్రేమాతిశయముతో నారాయణభట్టుకడకు వడివడి వచ్చెను. దగ్గరకు వచ్చినంతనే నన్నయను నారాయణుడు గాఢముగా కంఠాశ్లేషము చేసికొనెను. ఇరువురకు కన్ను లార్ద్రమయ్యెను.

"నారాయణా, నేనుకూడ గుర్తుపట్టలేకుండ మారిపోయినావేమి?"

"ఏడేండ్లుమ మంత్రిత్వము చే చేసిన ఫలము" అనుచు తన నాసాగ్రము బలవంతముగ పీకి నన్నయచేతి కిచ్చెను. రక్తములేని యా మాంసఖండము చూచి నన్నయ ఏవగించుకొనుచు క్రింద పారవైచెను. ఇంతలో రెండు చెవుల ఖండములును దక్షిణగండభాగమునందలి కండయు పీకి యవికూడ నన్నయచేత బెట్టి "నా దే దేహఖండములమీదగూడ నినింత అసహ్యమా?" అని నారాయణు డనెను.

నీరక్తములగు నా కండలుగూడ క్రింద బారవేయుచు నన్నయ "ఈ నత్తి ఎక్కడ సంపాదించితివి?" అని యడిగెను.

"నత్తియా? మంత్రిత్వము వదలిన తర్వాత ఇక్కడికి వచ్చుచుండగా దారిలో దొ దొ దొరికిన దీ నిధి."

నన్నయ తలయెత్తి నారాయణుని ముఖము తిలకింపగా పూర్వ రూపము వచ్చి యుండెను.

"వేషధారీ!" అని నన్నయ యనుచుండగా వృద్ధుడగు భీమనభట్టు అక్కడికి వచ్చెను. నన్నయ యతని జూపి "నారాయణా, నీకు దూర ముగా నుండమని నాకు ప్రేమపూర్వకముగా నుపదేశించినవా డీ భీమన భట్టు. ఇతడు మనకు పూజ్యుడు. నమస్కరింపుము!" అనెను.

నారాయణుడు ప్రయత్నపూర్వకముగా చేయి యెత్తి రెండుచేతులు కలిపి భీమనకు నమస్కరించెను.

"ఇదుగో చెట్టనభట్టు, భీమనకుమారుడు. ఇతని కవిత్వము మధు రమైనది. ఇడుగో పావులూరి మల్లన, మన కాప్తకోటిలోనివాడు. పావ మితనిపై దండయాత్ర చేసితివి వెనుక. ఇతని కవిత్వము శాస్త్రానుకూల ముగా నుండును. గణితములో మేటి. ద్రవిడ కర్ణాట భాషలలో గూడ ప్రవీణుడు."

నారాయణభట్టు కూడిన కవులనందరను ఆదరదృక్కులతో గౌర వముతో దిలకించెను కాముని రక్తము చిందిన యాసభామధ్యమున నా కవీశ్వరుల సమావేశ మొక చిత్రశోభతో వెలుగొందెను. ఆ కవిసమ్మేళ నములో కాముని రక్తము మరపు తగిలెను. వారి మనస్సులలో కేవలము నారాయణుని గాయమే కలతపరచు చుండెను. వీర్యవంతమగు కాలమున దుర్మార్గులు సాహసకృత్యములుచేసి యుత్తమ జనుల మెప్పింపగలరా? రాజసూయసభాంతరాళమున శిశుపాలుని మస్తకము తెగనేయగా శిశుపా లుని ముఖ్యబంధువులుకాక యితరు లది గర్హించిరా? ఆదిరాజవిభుడగు రాజరాజు నాస్థానమున దోషిగా నిర్ధారితుడైనవాని చర్య ధీర పురుషులను కలంచునా?

కవులందరు నారాయణుని చుట్టు మూగిరి. అతని ప్రతిభ నన్నయ పూర్వ ప్రసంగములవలన వారంద రెరిగినదియే. మరియు నామధ్య

నమ్మంగమహాదేవి అర్చనసమయమున నాతడు చెప్పిన పద్యములవలన నతనికీర్తి కవిపండితలోకములో వ్రాకిపోయియుండెను.

"ఇన్నాళ్ళు నాకు చిక్కకుండ దొంగవలె తప్పించుకొంటివి. ఇట్టి దొంగపను లెప్పటినుండి నేర్చుకొంటివి?" నన్నయ ప్రశ్నించెను.

ఆ మాట లనుచుండగా వజ్జియప్రెగ్గడ వారియొద్దకు వచ్చి,"దొంగ పనులేమిటి, కవులకు?"అని చిరునవ్వుతో ప్రశ్నించెను.

నారాయణభట్టు నవ్వుచు, "వజ్జియమంత్రీశ్వరా, నన్నీ నన్నయ 'దొంగపనులెప్పటినుండి నేర్చుకొంటి'వని యడుగుచున్నాడు. మంత్రి పదవి స్వీకరించి నప్పటినుండి యని చెప్పబోవుచుండగా మీరు దయచేసి నారు. ఏమి చెప్పుదును?"అనెను.

ఎన్నడును చిరునవ్వుకంటె నెక్కువ నవ్వని వజ్జియ యా మాట లకు కడుపార నవ్వెను. కవులందరు నవ్విరి.

"కవులైనవారికి మంత్రిత్వము శాశ్వతముగా శోభింపనట్లున్నదే!" అని వజ్జియ పల్కినప్పటికి కవు లందరు నారాయణభట్టును జూచి నవ్విరి.

ఇంతలో నారాయణభట్టును వజ్జియమందిరమునకు తీసికొని పోవు టకు పల్లకివచ్చెను.

"కవులకు కవులను చూసినప్పుడు ఒడలిమీది గాయముల బాధ కూడ తెలియనంతటి మైమరపు కలుగును కాబోలును!" అని మరియొక మారు వజ్జియ పరిహాసమాడెను. కవులందరు నందుకు సమ్మతించిరి. వజ్జియ కానాడు మనస్సెంతయు నుల్లాసముగా నుండెను.

కవులకడ నారాయణభట్టు సెలవు తీసికొని పీదమార్యాదిపండితు లకు నమస్కరించి, వచ్చిన యాపల్లకి యెక్కుచు నన్నయనుగూడ నందే రమ్మని పిలిచెను

ముందు వజ్జియపల్లకియు నావెనుక నన్నయ నారాయణు లున్న పల్లకియు రాజమహేంద్ర పురవీథుల రాజసభాంగణమునుండి వజ్జియ మందిరమున కేగెను.

నన్నయయు నారాయణుడును పల్లకిలో వచ్చుచు దారిలో నెన్ని విషయములో ప్రసంగించిరి. వా రిద్దర ముఖములలో పరస్పరసాన్నిధ్య మున నూతన తేజము ద్యోత మయ్యెను. దీర్ఘకాలవియోగానంతరమున నా బాల్యమిత్రులు మరల కలసికొని పొందిన యానందమునకు మేరలేదు.

వా రిద్దరు నొక్క పల్లకిలో బోవుచుండ నందులో వారు రెండగ్ను లవలెను, రెండు దీపశిఖలవలెను వెలుగుచు గానవచ్చిరి. పురాణవిదులకు వీరు పురాణమునులగు నరనారాయణు లనియు, మహాభారతవేత్తలకు వీరు కృష్ణార్జును లనియు అనిపించిరి.

యజ్ఞము చేసికొనుటకు వజ్జియ యనుమతింపనందున రాజరాజ నరేంద్రుని కా విషయము మనవి చేసికొనుటకు సోమయాజులకు రాజ దర్శనము కాలేదు. ఈనాడు విన్నవించుకొనుటకు వారు మరల రాజ సభకు వచ్చిరి. కాని చెప్పుకొనుట కవకాశము మరల చిక్కలేదు. వారు మరల నాలోచించుకొని "ఆనాటి ఉదయమున వజ్జియ పనితొందరలో నట్లు మాటాడి యుండును. ఇప్పుడు చెప్పుకొందు" మని యాలోచించి వజ్జియమందిరమునొద్దకు వచ్చి వేచియుండిరి. కాని వజ్జియ వారిని చూచి నంతనే భటులచే దర్శనమునకు వీలులేదని చెప్పించి పంపివేసెను.

## 27

కృష్ణవేణీనది సముద్ర పరిష్వంగమునకు బహుబాహువులు చాచి నది. అందొక బాహువు దక్షిణముఖముగా నున్నది.

ఆ పాయకు పశ్చిమతీరమునకు సమీపభూమిలో కొందరు త్రేతలు నివసించుచుండిరి. కలిదిండియొద్ద ఇప్పటి కైదేండ్ల క్రిందట గొప్ప యుద్ధము జరిగినది.

గంగైకొండ మధురాంతక రాజేంద్రచోడభూపాలుడు రాజరాజ నరేంద్రుని మేనమామయు మామయు నై యుండెను. అతని మహాదండ పతి రాజరాజబ్రహ్మ మహారాజుకీర్తి దిగంతవిశ్రావ్యము. రాజరాజుమాతు లుని ఆదేశము ననుసరించి రాజరాజబ్రహ్మదండనాథుడు, ఉత్తమశోడ

చ్ఛోడగోను, ఉత్తమచోడమిలాడు డయ్యాను అను ముగ్గురు చోళసేనానులు మూడగ్నులవలె మహాసైన్యముతో నాంధ్రదేశమువచ్చి గృధ్రవార (గుడివాడ) విషయములోని కదిలిండియొద్ద కర్ణాటకసైన్యములతో తలపడిరి. ద్రమిళసైన్యములకును, కర్ణాటకసైన్యములకును పరస్పర ప్రతిఘట్టన భీకరమగు మహారణ మయ్యెను. అందు ముష్టాముష్టి, కేశాకేశి, దండాదండి, కుంతాకుంతి పరస్పరము ఆయోధనము జరిగెను. ధానుష్కుల బాణపాతములచే నుభయసైన్యముల పలువురు భటులు వీరస్వర్గము నొందిరి. ఆ యుద్ధము కాలవశమున సమయుద్ధ మయ్యెను. అటు కర్ణాటక దండనాధులును ఇటు ద్రమిళ దండనాధులును రణభూమిని ప్రాణములు వదలిరి. అచ్చట అనతి కాలమున రాజరాజనరేంద్రుడు ద్రమిళ దండనాధుల పేర శివాయతనములు నిలిపి మధురాంతక నల్లూరుగ్రామము ప్రతిష్ఠించెను.

కర్ణాటకసైన్యము చెల్లాచెదరయ్యెను. ఆ సైన్యము వెంటవచ్చిన వ్రేతలు చెదరిపోక మిగిలియున్న గోధనమును కృష్ణవేణీనది దాటించి తృణజలసమృద్ధిగల తావుల సంచరించుచు తుదకు ఒకచోట చిట్టడవి బాగు చేసికొని కుటీరములు నిర్మించుకొనిరి. అది వ్రేపల్లె యయ్యెను.

సోమిదేవిని కుపమను పిశాచవేషములతో నెత్తుకొనిపోయిన దొంగలు దొంగల మర్రికి రమారమి మూడు క్రోశముల దూరమున గల వ్రేపల్లె కారాత్రియే బహు వేగమున జేర్చి యందొక యింట దాచిరి. అప్పటికే స్మృతివచ్చిన వారికి త్రావుటకు మంచి గోక్షీర మిచ్చిరి.

వారినట్లు చేర్చినది పశువులశాలలోనికి. మరుసటి దినమున ఉదయమునుండియు వారికి వంటకమునకు మృణ్మయపాత్రలు ఆహారపదార్థములును ఇచ్చిరి. ఆ పల్లెలోని స్త్రీ పురుషు లెవ్వరు వారితో నేమియు మాటాడరు. కాని రాత్రింబవళ్ళను ఎక్కడికి బోకుండ నందరు కాపుగా నుండిరి. ఆ పల్లెనుండి వారు తప్పించుకొన యత్నించుచున్నట్లు వారికి దోచినప్పుడు కఠినముగా ప్రవర్తించుచుండిరి. కాని ఇతర సమయములలో వారి కెట్టి యొత్తిడియు లేకుండెను.

తమ్మె నెందుల కా ప్రేపల్లెకు వారు తెచ్చిరో తెలిసికొనుట కెంత ప్రయత్నించినను సోమిదేవికి సాధ్యపడలేదు. ధనాశ కల చోరులుగా వీరు కనిపింపలేదు. వారికున్న స్వల్పాభరణములు ముట్టుకొనలేదు. వెనుక వచ్చుచుండినవారి వస్తుసామాగ్రిని హరించినట్లు తోచదు. ఇంతదూర మున కాని దేశమున తమకు శత్రువులుందురా?—ఏ వనదేవతకై నను తమ్మెబలి యీయవలెనని వీరి యుద్దేశమా?

ఆ యూహ కనుగుణముగా నా పల్లెలో నప్పుడు జాతరయొకటి సాగుచుండెను. పల్లెకు కొంచెము దూరముగా దక్షిణమున నొక 'పురము' నిర్మించిరి. ఆ 'పురము' పటకుటీరము ననుకరించును. దానిపై శిఖరము వలె నొకయిత్తడికుంభముకలదు. ఆ 'పురమున' స్త్రీ లుండరు. ప్రేపల్లె లోనిస్త్రీలందరు నచటకొలుపుకు చేరుచుండిరి.

కొలుపు కచ్చట నొక ఘటము పెట్టి దాని నా ప్రేపల్లెచుట్టును ముఖరములగు బహువాద్యములతో నూరేగుచుచుండిరి. ఈ ఊరేగింపు పగలు మూడువేళలను అర్ధరాత్రమున నొకసారియు జరుగుచుండెను.

ఒక రాత్రి మహిషబలి యిచ్చుట చూచినదాది సోమిదేవికి భయ మెక్కువయ్యెను. ఈ పల్లెకు వచ్చువా రితరు లెవరు గనిపింపలేదు. మారుమూల పల్లెగా కనిపించెను. ఆదియు చిట్టడవిమధ్యమం దున్నందున నటువచ్చు నితరమనుష్యుల జాడయే లేదు. అర్ధరాత్రముల దూరముల నొక్కొక్కసారి సముద్రఘోషవలె శబ్దము వినబడుచుండెను. ఆ సముద్ర ఘోష చుట్టుప్రక్కలనున్న తాటితోపులలో దూరి యందుండి ప్రసరించుచు మరింత ఉద్వేగము కలిగించుచుండెను.

ఇట్లుండగా నొకనాడు దూరమున సోమిదేవిచే బహుమతినొందిన గంగిరెద్దుల వాడు కనిపించెను. సోమిదేవి ప్రాణములు లేచివచ్చెను. ఆమె యతని బిలువగా రాలేదు. అంతట నామెయే గంపెడాశతో నతనియొద్దకు బోయి పలుకరించెను. కాని యత డామె నెన్నడు జూడనివానివలె ప్రత్యుత్తరమిచ్చెను తానె పొరబడితినని సోమిదేవి యనుమానించెను. కాని కుపమయు నచటచేరి "మాట్లాడవేమి! మా పట్టుశాటీలు ఇంతలో

మరచిపోయినావా?" అని అడిగినది. దానికిని అతడు మాటాడక ముగా చూచుచు నావలకు బోయెను.

సోమిదేవికి దిగులు హెచ్చెను. ధనదుప్రోలులో సుదయమున కనపడి, సాయంత్రము భట్టిప్రోలులో మరల నెదురైనాడు వీడు. ఆ పిమ్మట రెండుమూడు గడియలకే యీ దొంగ లెత్తుకొని వచ్చిరి. వీడు పలుకరించిన మాటాడడు. వీరి యుద్దేశము బాగుగాలేదు. 'కుపమ'ను తలచుకొని యామెకు కడుపులో కెలికినట్లు బాధ కలుగసాగెను. ఈ యాపదలనుండి గట్టెక్కుట యెప్పుడు? ఇంత తొందరపడి సార్థముతో ప్రయాణ మెందుకు చేసితిని?

ఆమె యిట్లు దిగులు పడుచున్నను కుపమ కేమియు తెలియనీయ కుండెను కుపమ చురుకైన పిల్ల. సంస్కృతశ్లోకములు, తెలుగు పద్యములు, కన్నడ పద్యములు శ్రావ్యముగా చదువును. కంఠము శ్రావ్యమైనది. మధురముగా పాటలు పాడగలదు. ఆ వ్రేతలు కర్ణాటకము ఆంధ్రము సగము సగము కలసిన భాషలో మాటాడుచు నట్టి పాటలనే పాడుకొను చుండిరి. అట్టిపాట నొక్కసారి విన్నంతనే వారి యాసతో గ్రహించి వారి యెదుట తన మధురకంఠముతో కుపమ తిరిగి యవి పాడుచుండెను. నిర్భయముగా ప్రతివారిని బలుకరించును. ఈ విధముగా నామె గోపస్త్రీల యాదరము సంపాదించెను.

అందులో దుగ్గవ్వయను నలుబదియేండ్ల గోపిక యొకతె కుపమను విశేషముగా ప్రేమింపసాగెను. దుగ్గవ్వకు అదే యీడుగల కుమార్తె ఒక్క సంవత్సరము క్రిందట జనిపోయె నట. మరి దానికి పిల్లలు లేరు. కుపమను చూచినప్పటి నుండియు దానికి పోయిన కూతురు జ్ఞప్తికి వచ్చును. వచ్చి, 'ఈ విధముగా పిలుచునది,— ఈ విధముగా నడుగునది,—ఈ విధముగా మాట్లాడునది—' యని చెప్పును. దుగ్గవ్వ తన కూతురుచేష్టలు చెప్పినవిధము అనుకరించుచు కుపమ దుగ్గవ్వను పిలువసాగినది; పలుకరింపసాగినది. ఆ మాటలు విని దుగ్గవ్వ బావురుమని యొక్కొక్క మా రేడ్చును.

ఈ విధముగా దినములు గడచిపోవుచుండెను. క్రొత్త మనుష్యు లెవరును కనుపింపరు. ఇది అరణ్యమా? ద్వీపమా? మరియొక లోకమా?

ప్రేపల్లెలో జాతరయైపోయినది. వెంటనే వీరు ప్రాణములు తీయుదు రను భయము పోయినది. సంవత్సరమునుండి దక్షిణదేశ మంతయు తిరిగి తిరిగి వచ్చిన పిమ్మట నిక్కడి జీవనము శాంతముగా నుండెను. భోజనాద్యవసరములకు లోపములేదు. ఆవుపాలు, పెరుగు, నెయ్యి కొదువలేదు. మరొక ప్రపంచమున నున్నట్లు సుఖముగనే యున్నది.

మోటుపల్లికి రావలసియుండిన పొన్న ఏ మైనాఁడు? సార్థములో తమతో వచ్చుచు గదా ప్రహారములకు పడిపోయిన పరిచారకు లేమైరి? వెంటవచ్చుచున్న కంచర మే మైనది? శ్రీ నారాయణభట్టారకు లెందు న్నారు? క్షేమముగా నున్నారా? మే మిచ్చట నున్నట్లు వారికి తెలియు టెట్లు ? మా కిచ్చటనుండి మోక్ష మెన్నటికైన నున్నదా? మోక్షోపాయ మేమి? మేము చిరకాలమునుండి యుపాసించిన దుర్గాదేవి కటాక్ష మెప్పుడు ప్రసరించును?

"దుర్గే, స్మృతా హరసి భీతి మశేషజంతోః!"

# 28

రాజమహేంద్రపురములో సందడి కొంత తగ్గినది. క్రీడా ద్వీపములో వినోదములు చాలించి వారముదినములైనది. కోటగుమ్మమునొద్ద సంత సన్నగిలిపోయినది. వర్తకులు పలువురు స్థలాంతరములకు బోయిరి క్రీడాగతులైన సామంతదండనాథులును స్వస్థలములకు రాజాను మతితో చేరుకొనుచుండిరి.

ఆనాటి మధ్యాహ్నమున నమ్మంగమహాదేవి యంతఃపురమున చతురంగక్రీడ జరుగుచుండెను. మహాదేవి కా క్రీడా యభిమానపాత్రమైనది. రాజరాజనరేంద్రుని కది చిరకాలాభ్యస్తము. అంతఃపురమున మహారాజుతో మహారాణి చతురంగ మాడునపుడు దాని తిలకించుటకు పూజ్యులకును, ఇష్టులకును ఆహ్వానములు పంపుట యాచారము. ఈ క్రీడ తెలి

సినవారితో నాడుట యానందకరము. అట్టి యాహ్వానము లందినవారు రాజాదరపాత్రు లైరని నిశ్చయింపవచ్చును.

వజ్జియప్రెగ్గడకును, నృపకామదండనాధునకును ఆహ్వాన మంపుట సర్వసాధారణము. ఈ నా డా యాట తిలకించుటకు యువరాజరాజేంద్ర దేవునకును, అతని వయస్యులగు కరుణాకరతొండమానుడు జయంగొండ రులకును ఆహ్వానములు వచ్చెను వజ్జియతోపాటు నారాయణభట్టునకును ఆహ్వానము వచ్చెను. ఎన్నడు నన్నయభట్టారకు నా క్రీడకు పిలుచు నాచారము లేదు ఈనాడుమాత్ర మాతనికి గూడ నాహ్వానము వచ్చినది.

ఈ క్రీడాహ్వానము కొంత గోప్యముగా జరుగును. ప్రేక్షకులుగా వెళ్ళి వచ్చినవా రా క్రీడావిశేషము లితరు లెవరితో ముచ్చటింపరు. అట్లు గాక పొరపాటున ముచ్చటించినచో మరల జన్మలో నట్టి యాహ్వానము రాదు.

ఆ చతురంగ క్రీడకు బహువిశాలమగు మందిరము నిర్దిష్టమై యున్నది. ఆ మందిరములో మధ్యభాగమున నా క్రీడ జరుగును. అక్కడ సమావిష్టు లగునది యల్పసంఖ్యాకులే. ఆ కొద్దిమందికి నంత విశాల భవన మెందుకో కారణ మవగతము కాదు ఆ శాలలో సేవకులు గూడ నిరంతర ముండరు. ఉపచారాదులకు ఘంటావాదము విని దూరమునుండి వారు రావలసినదే. ఆ మందిరమున వాయు సంచారమునకు సేవకులు వాయుచాలనికములను అవలనుండి సూత్రములతో నిరంతరము లాగుచుందురు. పానీయములు, ఫలాదులు, తాంబూలకరండాదులు సమస్తము నందుబాటులో ముందుగనే అమర్చబడి యుండును.

ఆ మందిర మధ్యభాగమున విశాలమగు ఫలకముపై పటికపురాలతో తెలుపు గళ్ళు అమర్చబడినవి. ఒకటి పద్మరాగమణిబలము. రెండవది ఇంద్రనీల బలము. అమ్మంగదేవి యథాప్రకారము పద్మరాగబలము గ్రహించెను. రాజరాజు ఇంద్రనీల బలము తీసికొనెను.

చతురంగము తొందర లేక దినములు మాసములు పర్యంతము కూడ నాడుట క్రొత్తకాదు. కాని ఈ దినమునమాత్రము కాలవ్యవధి

యేర్పరచిరి. ఎత్తుకు నెత్తుకు మధ్య నెక్కువ కాలవ్యవధి యీయరు. ఐదుఘటికలలో క్రీడ తుదముట్టనిచో సమానులైనట్లు!

యువరాజు ఆ నా డెంతయో ఉబలాటముతో నా క్రీడ తిలకించుటకు వచ్చెను. అతడును అతని వయస్యులును శీఘ్రసమాప్తిప్రాయములే ఆలోచించుచు నా భవనమున కరుదెంచిరి. నన్నయకు రాజదంపతుల బుద్ధిసూక్ష్మత గమనింపవలెనను కుతూహలమె కాని యాటలో పాల్గొను నుద్దేశ మేమియు లేదు. నారాయణభట్టు ఏ మాలోచించుచుండెనో ఎవరికిని దెలియదు.

క్రీడకు ముందు అమ్మంగదేవి తనకు సహాయులనుగా ఆ దినమున యువరాజును అతని యిద్దరు దాక్షిణాత్య మిత్రులను కోరుకొనెను. రాజరాజు చిరునవ్వునవ్వెను.

"రాణికి చోళాభిమానము చతురంగములో కూడా పోలేదు." రాజరాజు మాటలకు అమ్మంగదేవి ముఖమంతయు సిగ్గుతో నెర్రవారెను.

"యువరాజుగూడ చోళుడేనా మహారాజా?" అని యామె చిరునవ్వుతో ప్రశ్నించెను.

రాజరాజు : కాదు. కాని నీవు చాళుక్యులనుగూడ చోళులనుగా మార్చివేయుచున్నావు.

వజ్జియ : ఈ కరుణాకరతొండమానుని పూర్వులుగూడ పల్నాటి పల్లవులే. ఇతడును తెలుగువాడు గాని దాక్షిణాత్యుడు కాడు."

రాణి : ఈ దినమున మాధ్యస్థ్యము వహించుటకు కుంతలదేశాగతులైన నారాయణభట్టారకుల నర్థింతును.

"క్రీడలో నెట్లుండునోగాని ముందుగా నీనాడు మాటలతో రాణి రాజరాజును బంధించుచున్నది." అని రాజరాజు చిరునవ్వుతో పలికెను.

రాణి : మహారాజా! పూజ్యులగు వజ్జియ నృపకాములు, నన్నయ భట్టారకులు మీపక్షమున నుండ మీకేమి చింత స్వామీ?

నృపకామ : "మహాదేవులు చక్కగా సెలవిచ్చినారు. మేము వృద్ధులము గనుక పూజ్యులము; ఆటలో నేర్పు పూజ్యము!" అందరు నా మాటలకు ఆనందముతో నవ్విరి.

నారాయణభట్టు మాధ్యస్థ్యపీఠ మధిష్ఠించి శ్రీ మహాగణాధిపతి స్మరణము చేసి క్రీడాప్రారంభమునకు అనుజ్ఞయిచ్చెను. ప్రశ్న వేయగా ముందు బలము కదుల్చుట మహారాణివంతుకు వచ్చెను.

అమ్మంగదేవి యాటలో చురుకుదనము గలదు. రాజరాజు నెత్తులు దూరాలోచన కలవి. అందువలన ముందు ముందు సామాన్యముగా అమ్మంగదేవి గెలుచునట్లు చూచువారికి కనుపించును. కాని తరుచుగా తుదకు రాజరాజే నెగ్గుచుండును. ఈ దినమున నమ్మంగమహాదేవి తనకు సహాయులనుగా అనుభవములేని యువకులను కోరుకున్నందున రాజరాజు కొంత నిర్లక్ష్యముగా నాడ సాగెను. రాజపక్షమున నన్న వజ్జియయు, నృప కాముడును కొంతదూరమున నుండి యేకాంతమున నేదియో మాట్లాడుకొను చుండిరి. వారిదృష్టి యాటమీద నున్నట్లే కనిపింపదు. ఒక్క నన్నయ భట్టారకుడే మౌనముగా నా యాట గమనించుచుండెను.

కాలవ్యవధి స్వల్పమైనందున నానాడు మహారాణి యాట అద్భుత ముగా సాగుచుండెను. దానికితోడు యువరాజును, అతని దాక్షిణాత్యమిత్రు లును క్రొత్తగా కాంచీపట్టణములోని యాటగాండ్ల ఎత్తులు సూచించి యామెకు సర్వవిధముల సహాయము చేయుచుండిరి.

రాజరాజు కంత తొందరగా నాడు నభ్యాసములేదు. దానికితోడు, ముందు కొంత యాత్మవిశ్వాసమువల్ల నశ్రద్ధగా నాడి యొక బంటును, రథమును గోల్పోయెను. గుఱ్ఱములకు ముందుకు పోవుట కవకాశము లేకుండెను. అమ్మంగదేవి యశ్వములు ఫలకమంతటను స్వేచ్ఛా విహార ముచేయుచుండెను. ఆయిరుకులో నుండి తప్పించుకొను నాలోచనలోనుండు నంతలోనే ఎత్తు వేయవలసి రాగా ఏదో ఆట ఆడవలసివచ్చుచుండెను.

వజ్జియ ప్రెగ్గడ ఆ యాట తిలకించుచున్నట్లే లేదు. కాని అకస్మా త్తుగా కలవరించుచున్న వానివలె నాతని కంఠము విననయ్యెను. "రాజా, కోటలో వెంటనే ప్రవేశింపనిచో మహారాణులు శీఘ్రముగా నెగ్గిపోయె దరు: "

"మాతో క్రీడాలోగూడ రాజరాజులకు పరాజయము రానీయరు కాబోలును ప్రెగ్గడలు" అని మహారాణి పలికెను.

రాజరాజు తన రాజును వెంటనే కోటలో ప్రవేశపెట్టెను. దానితో నమ్మంగదేవి యెత్తుగడలన్నియు నప్పటికి వ్యర్థములై పోయెను.

"తల్లీ, కోట భేదించుటలో యువరాజు నైపుణ్యము చూడవలెనని నా కోరిక అని వజ్రియ నివేదింపగా నుభయపక్షములవారు సంతోషించిరి.

"పుత్రా దిచ్ఛేత్ పరాజయమ్!" అన్నాడు నారాయణభట్టు.

అంతట మరియొక విధమున రాజరాజనరేంద్రునిరాజు కోటమీదికి అమ్మంగదేవి బలములు మరలెను. మరల రాణిబలములే రాజరాజుబలము లకంటె ముందు నడచుచుండెను. రాజరాజు బలహీనస్థానము లన్నియు బలపరచుకొను చుండెను. మహారాణి రెండు బంట్లకు రాజరాజుగుర్రము నొకదానిని ఆహుతి చేసికొనెను. అమ్మంగదేవి వదలక రాజరాజు బల హీనస్థానములమీదికి దృష్టి నిలిపి బలము నడిపించుచుండెను.

ఇట్టి సమయమున యువరాజు ఒకటి రెండెత్తులు తల్లికి సూచించెను. అవి స్పష్టముగా వ్యర్థములుగా కనుపడుచుండెను. అయినను కుమారునిపై నభిమానమున మహాదేవి యా సూచన లంగీకరించి కదల్చెను.

రాజరాజుకు ఆటలోకూడ వ్యర్థప్రయత్నము లిష్టము లేదు. అతడందుచే కుమారునివంక ననాదరదృష్టి పరపెను. యువరాజటు చూడక మోము వాల్చెను. నారాయణభట్టుమాత్రము చిరునవ్వు నవ్వుకొనెను.

అంతలో వజ్రియస్వరము వినవచ్చెను.

"రాజా, మీ బలమైన వైపునకు మహారాణిబలములు సాగినవి. ఆ కోట వెంటనే వదలవలె!"

అది విని రాజరాజొక్కసారిగా నావైపుచూచెను. అంతవరకు తాను యువరాజు వ్యర్థముగా వేయించినా డనుకొనిన ఎత్తులే తన కోటను భేదించుటకు సిద్ధముగా నున్నవని రాజరాజు గుర్తించెను. కుమారుని ప్రతిభకు ఆనందము పట్టలేక యాదరముతో మెచ్చుకొనుచు దక్షిణ హస్తముతో యువరాజు భుజము స్పృశించెను. యువరాజు వినయముతో తలవంచుకొని పితృపాదుల హస్తస్పర్శ యాశీర్వచనముగా గ్రహించి పులకరించెను.

"ప్రెగ్గడల కెన్ని కళ్ళున్నవి?" అని రాణి యనెను.

"సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్।" అని నారాయణ భట్టు అందుకొనెను.

రాజరాజు రాజును బలహీనస్థానములలోనికి తప్పించి ఆ మార్గమున నెట్లో మరియొక కోటలోనికి చేర్చెను. కాని ఈ సమయమున నెంతో సహాయము చేయుచున్న రాజరాజగజమును మహారాణి యేనుగు నిచ్చి తీసివేసెను. బలమున సమనష్టమైనను రాజరాజురాజుకు స్థాన బలము దానితో మరింత తగ్గెను.

ఈ విధముగా దెబ్బమీద దెబ్బ తిని రాజరాజు బలము క్షీణింప సాగెను. ఐనను రాజరాజు ధైర్యము వదలక జాగరూకతతో నాడుచు నిలువద్రొక్కుకొను చుండెను. ఈ విధముగా ఎప్పటికప్పుడు రాజరాజు రాజు కట్టిపోయినట్లే కనిపించుచు నెట్లో తప్పించుకొనుచుండెను.

ఇంతలో నైదు గడియలు సమాప్తమయ్యెను. మధ్యస్థుడగు నారాయణభట్టు చిరునవ్వు నవ్వుచు తప్పనిసరిగా ఆట సమమని తీర్పు చెప్పెను.

"ప్రెగ్గడలబుద్ధి రాజరాజులను బయట పడవేసినది ఈనాడు." అను మహారాణి మాటలకు అందరు ముసిముసి నవ్వులు నవ్వుకొనిరి.

# 29

వారంతట నొక్కింత విశ్రాంతి తీసికొనిరి.

ఆ పిమ్మట మరియొక విధమగు చతురంగక్రీడ ప్రారంభించెను. నృపకామదండనాధులముందు పెద్ద పట మొకటి వజ్జియప్రెగ్గడ యుంచెను. అందులో నదులు పట్టణములు పర్వతములు అరణ్యములు రాజ మార్గములు గుర్తింపబడి యున్నవి. మరియొక పటములో నొక స్థల జలదుర్గము చిత్రించి యున్నది. అందలి గోడలు గవనులు దిడ్డు ద్వారములు అగడ్త స్వరము స్పష్టముగా తెలియ నగును. అవియేగాక మరి కొన్ని పటములఁగూడ నతని యెదుట నుంచిరి. నృపకామ దండనాధుడవియన్నియు జాగరూకుడై కొంత సేపు పరిశీలించెను.

వజ్జియ యంతట యువరాజును అతని చోళమిత్రులను పలుకరించెను.

"యువరాజా, మీరు యాత్రాసన్నాహ మాలోచించినారా?"

"చిన్నవారము, మాకు తోచినంతవరకు ఏకదీక్షగా రాత్రింబవళ్ళు నీ మూడు దినముల నాలోచించినాము. మా ఊహలకు పెద్దలగు మీరును దండనాధులును సార్వభౌములును మాతృదేవులును అనుమతించినచో మేము కృతార్థులము" అని యువరాజు ప్రత్యుత్తరమిచ్చెను.

అంత వజ్జియ కోరగా యువరాజు నృపకామదండనాధునికి సేనల నేవియెట్లు నడపదలచినదియు, ఏ బల మెక్కడ నుంచునదియు, నదులు వాగులు ఎట్లు తరించునదియు పర్వతములు నరణ్యములు ఎట్లు దాట దలచినదియు విశదీకరించెను.

అందులో వజ్జియ ఏమియు కలిగించుకొనుట లేదు. కాని యామూలాగ్రముగా శ్రద్ధతో నాలకించుచుండెను. ప్రశ్నలన్నియు నృపకామదండనాధుడే వేయుచుండెను. ఉత్తరములు యువరాజు చెప్పుచుండెను. మధ్య మధ్య కరుణాకర తొండమానునితో యువరాజు సంప్రదించుటయు, నతడు గొన్ని వివరించుటయు జరుగుచుండెను ఏ సందర్భమునైనా ప్రయత్నమునకు అనుకున్న వానికంటె ఎక్కువసాధనాదులు కావలయునని తోచినచో నప్పుడు వానినిసాధించునుపాయములు మాత్రము వజ్జియ నడుగుచు తెలిసికొనుచుండిరి.

మధ్యమధ్య దండనాధుని ప్రశ్నల కుత్తర మిచ్చుట యువరాజుకును అతని మిత్రయుగమునకును కష్టతరముగా నుండెను. అట్టియెడ వారెల్ల రాలోచించి యెట్లో తుదకు సమాధాన మిచ్చుచుండిరి.

అర్ధరాత్రమువరకు నాలోచనలు సాగినతర్వాత తుదకు నృపకాముడిట్లు వచించెను.

"మహారాజా! యువరాజును మిత్రులును సమర్థులు. వారిమీద నీ భార ముంచవచ్చును. వారి యూహలు స్వతంత్రమైనవి. ఈ యూహలు

నాకు చిన్నప్పుడు తోచియున్నచో నేను పరాజయము పొందిన యుద్ధములు కొన్ని మరొక విధముగా పరిణమించియుండును."

ఆ మాటలు విని రాజరాజు కుమారునివంక సాదరదృష్టులు పరపెను. అమ్మంగదేవి కుమారుని ప్రతిభ విని గర్వముతో కూడిన యానందముతో పొంగిపోయెను.

"ధన్యుడనైతిని దండనాథా!" యనుచు యువరాజు గౌరవముతో నృపకామ దండనాధుని పాదములంటి వంగి నమస్కరించెను. అతని వినయముచూచి రాజరాజు మరియు సంతోషపరవశు డయ్యెను.

"యువరాజీ ప్రయత్నములో నిశ్చయముగా జయశాలియై తీరును! ఐనను ఊహించిన విధముగా పనులన్నియు నాచరణలో జరుగవు. అందువలన జాగ్రత్త కొరకు యువరాజుకు మంత్ర ముపదేశించుచుండుటకు అనుభవము కల వృద్ధునొకని తోడుపంపుట శ్రేయస్కరము" అని నృపకాముడు నిశ్చయించెను.

"అందుకు మీకంటె నర్హులెవరు?" అనెను రాజరాజు.

"మహారాజా, ఇందులో దండనాధులను శ్రమపెట్టరాదు. యువరాజుకు యుద్ధానుభవము కలుగవలె నన్న నట్లు కాదు. నృపకాములే వెంట నున్నచో భారమంతయు వారిమీదనే యుండును. వా రందువలన వెంటనుండరాదు." అని వజ్జియ చెప్పెను.

రాజరాజు : అట్టిచో యువరాజును కవచమువలె కాపాడగలవా రింక నెవరున్నారు?

వజ్జియ : అదే మన మాలోచింపవలసినది. నారాయణభట్టును తోడుగా నంపిన నెట్లుండునా యని యాలోచించుచున్నాను.

రాజరాజు : నారాయణభట్టారకుల కనుభవము లేనిచో ప్రెగ్గడలు ఆలోచింపరు. వజ్జియఊహ దివ్యముగా నున్నది— భట్టారకా, మీభుజము మీది గాయ మెట్లున్నది?

నారా : తమ దయవల్ల చాలవరకు నయమైనట్లే!

వజ్జియ : ఇందులో నన్నయభట్టారకులతోగూడ నాలోచింప దలచినాను. నీ యభిప్రాయ మేమి భట్టారకా?

నన్నయకేమి చెప్పుటకును తోచలేదు. "యుద్ధవ్యవహారములు నాకేమి తెలియును? ఇందులో నే నేమి చెప్పగలను, యాత్రాలగ్నమునిర్ణయము తప్ప?" అని యడిగెను.

నారాయణుని నమ్మకమునుగూర్చి వజ్జియ నన్నయ నడుగుచున్నాడని నన్నయ గ్రహింపలేకపోయెను. అది గ్రహించిన నారాయణునికి చిరునవ్వు వచ్చెను.

అంతట నృపకాముడు నారాయణభట్టు పూర్వానుభవమును గూర్చి ప్రశ్నలు వేయుజొచ్చెను. అతని యుత్తరములవలన నతని యనుభవ మపారమని విస్పష్ట మయ్యెను.

వజ్జియ నారాయణభట్టు నిట్లడిగెను: "ఇంతవరకును మీరు మా యాలోచనలు వినియుంటిరిగదా! అందులో నింకను లోపము లేవే నున్న నెరిగింప గోరెదము; చెప్పగలరా?"

నారాయణభట్టు కొంతసే పాలోచించెను.

"అంతయు బాగుగనే యున్నది. కాని యిందుకు నాకొక పెద్ద యాపత్తి పొడగట్టుచున్నది. భ్రమరకోట్యాధిపతి యగు మధుకాంతక దేవుడు రహస్యముగా చేసిన ప్రతిజ్ఞపై నీయాత్రయంతయు నాధారపడి యున్నది. ఏ కారణముచేనైన నతని సహాయము లభింపనిచో మన సైన్య మేమి కావలెను?"

యువరాజును చోళమిత్రులును తెల్లవోయిరి. నృపకాముడును వజ్జియయు నొకరి ముఖము లొకరు చూచుకొనిరి. "ఆ బాల్యమిత్రులగు నీ యిద్దరు భట్టారకుల చేతులలో నున్న దీ నిశ్చయము" అని వజ్జియ వచించెను.

అంతట నన్నయ యిట్లు పలికెను: "నారాయణభట్టు నాకు చిన్నతనమునుండి యిష్టమిత్రుడే కాక యొకింత పూజ్యుడుగాగూడ నుండెను. అతనిపై భారము వేసినచో తనశక్తికి మించిన కార్యము సాధించుటకు పూనుకొనడు"

"అటైనచో వ్యాసప్రోక్తమైనట్లే" యనుచు వజ్జియ నారాయణభట్టు చెప్పిన చిక్కు విప్పమని యువరాజును కోరెను.

"అట్టి సందర్భములో మరియొక సైన్యముకూడ సహాయముగా వచ్చుటకు సిద్ధముగా నుండవలెను. అయినను చక్రకోట్యము వెంటనే స్వాధీనముకాదు. మరియొక సంవత్సరమైన నాగవలసియుండును." అని వెంటనే యువరాజు చెప్పెను.

అంతట వజ్జియ యాచిక్కు తటస్థింపదని చెప్పుచు నైనను తట స్థించినచో సిద్ధముగానుండు బలమునంగతియు, నది యెప్పుడెక్కడ నుండ గలదో ఇత్యాదికమును వివరించి తెలిపెను. దానితో యువరాజేంద్ర దేవుడును నతని చోళ మిత్రులును తృప్తిపడిరి.

వజ్జియ నృపకాలములు సూచింపగా రాజరాజు నారాయణభట్టును యువరాజు చేయనున్న చక్రకోట్య దండయాత్రకు అతని వెంటనుండి మంత్రిత్వము నిర్వహింపగోరెను. నారాయణభట్టు అంగీకరించెను. యువ రాజు ప్రథమదండ యాత్ర యద్భుతవిధముగా జయప్రదము కానున్నది. దానికి వెంటనుండి యశస్సు సంపాదించుకొనుట కభ్యంతర మేమి?" అనెను.

నన్నయభట్టారకు డా యాత్రాప్రస్థానము నాశీర్వదించెను.

వజ్జియ యువరాజుతో నిట్లు చెప్పెను: "ఈ యాత్ర శీఘ్రఫలో న్ముఖ మగుటకు సమస్తప్రయత్నములును చేయుదుము. వైశాఖ శుద్ధ పూర్ణిమ లోపల నెంత ముందుగా నీవు చక్రకోట్యము పట్టుకున్న నంతవిశే షము ధారావర్షుడు సామాన్యుడు కాడు. అతని చారులు రాజమహేంద్ర వరమున చిక్కులు పెంచుచున్నారు వైశాఖపూర్ణిమకు మా కందరకు నిచ్చట చేతినిండ పనియుండును. మామీదనే మీరు పూర్తిగ నాధారపడ రాదు.

"చంద్రాదిత్యదండనాథుడు విశ్వాసపాత్రుడు, సమర్థుడు. ఆతని యాధిపత్యమున సేన లిప్పటికే గూఢముగా చాలదూర మేగినవి. ఇప్పు డవి భ్రమరకోట్యమును సమీపించుచుండును. నీవు, నీ మిత్రులను, నారా యణభట్టును గూడి వెడలి శీఘ్రప్రయాణముల నేగి యా సైన్యములకు సర్వాధిపత్యము వహింపవలెను.

"పూర్వము మీ పితామహులు రాజేంద్రచోళదేవులు గంగాయాత్రకు

చక్రకోట్యముమీదుగలి వెడనే జయించిరి. నీ కీ చక్రకోట్యయాత్ర జయ పరంపరలకు ప్రథమసోపానముగా నుండగల దని మా విశ్వాసము!"

కూడిన పెద్దలందరు "తథాస్తు" అనిరి. అమ్మంగదేవియూహ లన్నియు వజ్జియకెట్లు తెలిసెను? గంగైకొండ రాజేంద్రచోళునియంతవా డైనపుడే యువరాజు మాతృదేవతకు తృప్తి కలిగించును!

మరునాడే యువరాజు యాత్రాప్రస్థానమునకు శుభలగ్నము నిశ్చయించిరి.

శత్రువుల కన్నులు కప్పుటకు యువరాజు మిత్రులతో కాంచీపురమునకు మాతులదర్శనార్థము వెడలుచుండె నని పురమంతట ప్రకటించి యుత్సవము జరిపిరి.

# 30

చక్రకోట్యమండలము రాజమహేంద్ర పురమునకు పశ్చిమోత్తర భాగమున గలదు. ఈ మండలములో నుత్తరభాగమున దక్షిణకోసలులు, దక్షిణభాగమున నాంధ్రులు నివసించుచున్నారు. ఈ మండలమును అంటి తూర్పున కళింగులును, దక్షిణమున నాంధ్రులును, పశ్చిమమున కర్ణాటకులు రాష్ట్రకూటులును. ఉత్తరమున కోసలులును గలరు. ఇది నానా భాషల కూడలిమండలము ఇది వేంగీరాజ్యమునకు పశ్చిమోత్తరపు సరిహద్దున నున్నది. ఈ మండలమున నుత్తరపు చివరను వజ్రపుర మని జగత్ప్రసిద్ధి గల వాయిరానగరము గలదు. ఆ ప్రాంతమున నుత్తమ వజ్రములే కాక, పరిసరారణ్యభూములలో సమున్నతములగు దంతావళములును దొరకును. అందుచే నచ్చట ననేకవిధములగు దంతపువస్తువులు గూడ ఉత్పత్తియగును.

ఇన్ని భాషలకు కేంద్రమగు నీ మహామండలము తరుచుగా దండయాత్రలకు గురియగుచుండెను. పూర్వ మెప్పుడో కోసలాధిపుడగు విజయాదిత్యు డీ మండలము మీదుగనే దక్షిణయాత్ర చేసి, త్రిలోచనపల్లవునితో బోరి దైవదురీహచే లోకాంతర గతుడయ్యెను. అతని కుమారుడగు విష్ణువర్ధనుడే తల్లివలన వృత్తాంత మెరిగి, చాళుక్యపర్వతముపై తపస్సుచేసి,

త్రితోచనపల్లవుని జయించి, యతని కుమార్తెయగు నుత్తమదేవి నుద్వాహమై చాళుక్యవంశకర్త యయ్యెను. మరియు నిప్పటికి రమారమి పాతికేళ్ళ క్రిందట రాజేంద్ర చోళచక్రవర్తి ఉత్తరమున గంగానదివరకు విజయయాత్రకు బయలుదేరి, ముందు చక్రకోట్యమండలము చేరి ఆపై కళింగము జొచ్చి, గంగవరకు యాత్రచేసి, గంగాజల మనేకకుంభములతో దెప్పించి గంగైకొండచోళు డను సన్వర్థబిరుదము నొంది, సముద్రతీరమున గంగైకొండచోళపురము నిర్మించి యచ్చట సముద్రములో గంగాజలములు పోయించెను. మరియు కళింగులు వేంగీప్రభువులు కర్ణాటులు రాష్ట్రకూటులు కోసలులు—ఎవరు బలవంతులైనప్పుడు వారి మండలమును వశపరచుకొనుచుండిరి. ప్రస్తుత మిది రాజరాజనరేంద్రునికి సామంతమండలము. ఈ మండలము మధ్యభాగమున ఇంద్రావతీనది తూర్పునుండి పడమరకును, అచ్చటినుండి దక్షిణముగను ప్రవహించి గోదావరీనదిలో గలియుచున్నది. పడమరనుండి దక్షిణమునకు దిరిగినచోట రాజధానియగు చక్రకోట్యము కలదు గోదావరిలో కలియుచోట దాని సామంతమండలమునకు ముఖ్యపట్టణమగు భ్రమరకోట్యము కలదు.

చక్రకోట్య మహామండలేశ్వరుడు జగదేకభూషణ ధారావర్ష మహారాజు. ఇతడు సైంధవ వంశమువాడు. ఈ వంశమునకు మూలపురుషుడు సింధునదీగర్భ దేశమునందు అహిక్షేత్ర పురాధిపతి యగు ధారణీంద్రుడను నాగరాజుకు మానవ రూపమున జన్మించిన పుత్రుడట. అతడు పుట్టిన వెంటనే అతని నొక వ్యాఘ్ర మెత్తుకొనిపోయి పాలిచ్చి పాలించెనట. అతడు పెద్దవాడై కదంబ రాజపుత్రికనువివాహమాడి ముగ్గురు పుత్రులను పొందెను. ఆ ముగ్గురు పుత్రులు మూడు సైంధవ వంశములకు కర్తలైరి అందులో నొక వంశమువాడీ ధారావర్షుడు.

వీరు ధ్వజములపై తక్షకుడు, వాసుకి, అనంతుడు ఇత్యాది నాగచిహ్నములతోపాటు మూలపురుషుని సాకిన వ్యాఘ్రము చిహ్నముకూడ చిత్రించుచుండిరి. వీరి కులదైవము వింధ్యవాసినీదేవి.

ఇన్ని మండలములకు మధ్యనున్న చక్రకోట్యాధిపతులు ఒకరి యధికారము తప్పించుకొనుటకు మరియొకరి సహాయము పొంది వారికి

సామంతు లగుచుండిరి. పూర్వము వీరు కొన్నాళ్ళు రాష్ట్రకూటులకును, అపిమ్మట కుంతలచాళుక్యులకును సామంతులు. ధారావర్షుని తండ్రి వేంగీ చాళుక్యులయు గంగై కొండచోళునియు సహాయముతో కుంతల చాళుక్యుల నెదిరించి వేంగీసామంతుడయ్యెను. వేంగీ ప్రభువు ఈ మహామండలేశ్వరుల నధికారముతో జూచుచుండెను. కాని ధారావర్షుని కదికూడ ఇష్టము లేదు. ఈ సంవత్సరము నిజచైత్రమాసాంతములో కుంతలచాళుక్యులు వేంగీమండలముపై దండెత్త నెంచియుండి ధారావరునికి రాయబారము లంపిరి.

కుంతలచాళుక్యుల రాయబారులు ధారావర్షుడు కోరినన్ని సైన్యములను ఆ మండలమునకు సహాయముగా బంపుటకు త్రైలోక్యమల్ల దేవరలు సిద్ధముగా నుండెనని చెప్పిరి. ధారావర్షుడు పరసైన్యములు తన మండలములో నుండుట తనకే అపాయకరమని యెరిగినవాడు గాన సైన్యము లక్కరలేదనియు, ఆయుధ సామాగ్రియు నశ్వములును కావలెనని తెప్పించుకొనెను.

చక్రకోట్యము సరిగా ఇంద్రావతీనదిమలుపులో నున్నది. అచ్చట బలిష్ఠమగు స్థలజలదుర్గము కలదు. దానికి ఉత్తరమునను పశ్చిమమునను పెట్టని యగడ్తగా ఇంద్రావతీనది ప్రవహించుచున్నది. అటువైపున నా కోటగోడలు దుర్భేద్యములు. ఇక తూర్పునను, దక్షిణమునను బలిష్ఠమైన ప్రాకారపరంపరయు, వాని రక్షించు బలములును సాధనసంపత్తియు ఉన్నవి. ధారావర్షమహారాజు ఈదుర్గభాగములను మరింత బలపరచెను. కోటనిండ ధాన్యాది భోజనసామగ్రులన్నియు నిలువచేసి పూరించెను. ఈ యుద్ధప్రయత్నములలో నతని ఏకైకపుత్రియగు వింధ్యవాసిని యతని దక్షిణభుజమై సహాయభూతయై యుండెను. ఇంతవరకును ఆ మహారాజుకు పుత్రులు లేనందున నీమెనే పుత్రునిగా జూచుచు పురుషవిద్యలన్నియు నేర్పెను. ఆమెయు పురుషవేషముధరించి తన్ను ఆయుధవిద్యలలో జయించిన రాజపురుషునిగాని వివాహమాడనని ప్రతిన పూనియుండెను.

ధారావర్షమహారా జీ సంవత్సరము నిజచైత్రములో పంపవలసిన కానుక రాజరాజుకు పంపలేదు. తాను మహాసభకు వెళ్ళకపోగా ప్రతినిధి నైనను బంపలేదు. ఇట్లీ సంవత్సరముచేసి కుంతలచాళుక్యుల దండయాత్ర ఫలము గమనించి నెమ్మదిగా స్వాతంత్ర్యము ప్రకటింపవలెనని యత డాలోచించెను.

ఈ యాలోచనలతో నతడు స్వదేశమునుండి యూరకొనలేదు. అత డనేక చారులను రాజమహేంద్రపురమునకును వేంగీభూమియందలి యితరపట్టణములకును పంపెను. వారు కొందరు పారశీకులమనియు, కొందరు సైంధవుల మనియు, కొందరు కళింగులమనియు నెన్నియో విధముల వ్యాపారములు చేయుచుండిరి. వారు సారంగధరుని మెట్టసంఘారామము తమ ప్రయత్నముల కనువగు స్థానమని తెలిసికొనిరి.

పారశీకమునుండి తెచ్చిన నూనె వ్యాపారము చేయుచున్న వర్తకులు ధారావర్షుని చారులే! వారు పైకి నూనెసిద్దెలని ప్రకటించుచు నావలపై ననేక ఖడ్గాద్యాయుధములు సంఘారామమునకు తెప్పించి చేర్పించిరి నారాయణభట్టు సేవకుడు 'పొన్న' వీరి రహస్యములు గుర్తించి రావర్తి బేతయనాయకున కెరిగించెను. అందుపై పారశీకవర్తకులను రాజభటులు బంధించిరి.

మరునాడు విచారణకనుక 'పొన్న'నప్పటికి రాకుండ జేయవలెనని వారాలోచించిరి. అప్పటికి రెండుమూడు రాత్రులనుండి యతడు వారి నావల మధ్యమున రాత్రులం దీదికొనుచు రహస్యము తెలిసికొనుటకు ప్రయత్నించుచున్నాడని యనుమానించిరి. అతడుమిక్కిలి స్థూలగాత్రుడు గాన సులభముగా గుర్తింప గలిగిరి. ఏకాదశినాటిరాత్రి పొన్న యానావల మధ్య గోదావరిలో నీదుచుండగా సంఘారామములోని యమభటషట్కము పట్టుకొని సామానుకొట్టులో బంధించెను. అతనని హత్యచేసినను సులభముగా వారి కార్యము సానుకూలమై యుండెడిది. కాని వానిని తమ స్వాధీనములో నుంచుకొనిన విశేషప్రయోజనము పొందవచ్చునని యాశించిరి. అతడా కొట్టులో రెండు దినములుండెను.

రెండు దినములును 'పొన్న' అధికరణస్థానమునకు రానందున ప్రాడ్వివాకుని ఉపదేశముతో పొన్నసాక్ష్యము వినకుండానే నూనెవర్తకు లపై నభియోగమున తీర్పుచెప్పిరి. సభ్యులందరు నేకగ్రీవముగా వర్తకు లిద్దరు శిక్షార్హు లనియు, సేవకులు క్షంతవ్యులనియు నభిప్రాయపడిరి. క్రయిక ద్రవ్యములో మిశ్రము చేయుట పెద్దనేరము. ఆ యిద్దరువర్తకుల కును ఒక్క సంవత్సరము కారాగార శిక్షయు, చెరియొక వేయిగద్యాణ ములు అపరాధమును వేసి యా ద్రవ్యములో కొంత భాగము నూనెకొని నష్టపడినవారికి ఇచ్చునట్లును గురునాథశ్రేష్ఠి తీర్పు చెప్పుచు సేవకులు ముగ్గురను వదలివేసెను. కాని వారిని వదలిపేసిన యుత్తరక్షణముననే రాజభటులు రెండవ నేరముదకై బంధించిరి. అది రాజద్రోహము! దాని విచారణ యింకను ప్రారంభింపలేదు.

పొన్నను బంధించుటచే నతని వాఙ్మూలము లేనందున వర్తకుల సేవకులు అప్పటికి తప్పించుకొన్నను, రాజబంధము తప్పించుకొనలేక పోయిరి. నారాయణభట్టు బాణహతుడైనరాత్రి వజ్జియతో పొన్న రెన్నాళ్ళ నుండి కనుపడలేదని చెప్పియుండెను. ఆరాత్రియే స్థూలకాయుడొకడు సంఘారామములో రెండు రాత్రులనుండి కొట్టులో బంధితుడై యుండెనని చారునివలన వజ్జియు తెలిసికొనెను వెంటనే వజ్జియప్రెగ్గడ రహస్య సేవకుల బంపి పొన్నను సంఘారామమునుండి తప్పించెను. అవల నాగ గాథ జరుగుచుండగా సంఘారామములో పడిన దొంగలు వజ్జియ సేవకులే. బేతయనాయకు డక్కడ పట్టుకొనిన వస్తువులవలన సర్వము దెలిసికొన గలిగెను.

ఇట్లొకపంక ధారావర్ష మహారాజు చారులను బంపి రాజరాజ నరేంద్రుని రాజ్యమున కల్లోలములు విజృంభింపజేయు ప్రయత్నములలో నుండ, వజ్జియప్రెగ్గడ యూరకుండలేదు. అతడు చారచక్షుపై సహస్రాక్షుని వలె సమస్తము గమనించుచు ప్రతిక్రియ లొనర్చుచుండెను.

కుంతలాధిపు డగు నాహవమల్ల సోమేశ్వరుని సైన్యములు వేంగి మండలముపై దండెత్తుటకు సిద్ధముగా నున్నవని యాతనికి ముందుగనే

తెలియవచ్చెను. ఆ సైన్యములను ప్రతిఘటించుటకు గడిదుర్గము లన్నియు బలపరచి సమర్థులగు దండనాథుల వశమున నెన్నియో సేన లుంచెను. కాని యసహాయముగా వేంగిసేన కుంతలసైన్య ప్రవాహముల కెదురీదుట దుస్సాధ్య మని యాత డెరుగును. అందువలన నాతని మంత్రము ననుసరించి యమ్మంగ మహాదేవీ రాజరాజనరేంద్రులు చోళచక్రవర్తియగు రాజాధిరాజుకు దూతల నంపిరి. ఈ రాజాధిరాజు అమ్మంగ మహాదేవి సోదరుడు. మరియు నతని తమ్ముడగు రాజేంద్రచోళుడు వేంగీ యువరాజగు రాజేంద్రదేవునికి కేవలము శ్వశురుడైనందున వేంగీప్రభువు వియ్యంకుడు. అతనికి ప్రత్యేకముగా దూతల నంపిరి. ఆ చోళసోదరులిద్దరు రెండుదిక్కులనుండి కుంతల చాళుక్యమండలము భస్మముచేయుట కంగీకరించి యా ప్రయత్నమున నుండిరి.

ఇక ధారావర్షుడు మహాసభకు రాకయు, కప్పము పంపకయు పోయినందున నతని శిక్షించుటకు వజ్జియ కాలహరణము చేయదలచి యుండలేదు. ధారావర్షుని వలన నెప్పటికైన బాధ కలుగుచో నతని శిక్షించుటకు సహాయభూతుడుగా నుండగల డని యతని సామంతుడగు భ్రమరకోట్యాధిపతియగు మధురాంతకదేవుని సర్వ విధముల రాజరాజుకు మిత్రసత్తముడుగా నుండునట్లు వజ్జియ చేసెను. అంతియ కాదు. అతడు చంద్రాదిత్య దండనాథుని వశమున మహాసైన్యముల నుంచి విజయసభ మరునాడే రహస్యమార్గముల చక్రకోట్యముపై దండెత్త నాజ్ఞాపించెను. ఆ సైన్యములు ముందు భ్రమరకోట్యము ముట్టడించును. అంతరంగములో మిత్రుడగు మధురాంతకదేవుడు లొంగిపోవును. అపై చక్రకోట్యముపై శీఘ్రయాత్ర జరుగును. ఈ మహాసైన్యములను నడిపించు చంద్రాదిత్యుని సేనకు మరికొంత సేనచేర్చి యంతటిపై నధికారము వహించుటకు యువరాజరాజేంద్రదేవుడు అతని చోళమిత్రులతోడను నారాయణభట్టు పరిరక్షతోడను వెడలి యుండెను.

రాజమహేంద్రపురమునను, వేంగిమండలములో బహుప్రదేశములను బౌద్ధధర్మానుయాయు లున్న ప్రదేశములం దెల్లెడ రాజశాసనమును దిరస్కరించి తిరుగుబాటు చేయుటకు ప్రయత్నములు జరుగుచుండెను. ఆ

ప్రయత్నములలో నెల్ల 'చంద్రగ్రహణము, బుద్ధజయంతి' అను మాట సాంకేతికముగా ప్రచారమగుచుండెను. ఈ సంవత్సరము వైశాఖ శుద్ధ పూర్ణిమకు చంద్రగ్రహణము పట్టునని జ్యోతిష్కులు తెలిపియుండిరి. ఆ నాడే బుద్ధజయంతి! "చంద్రగ్రహణము, బుద్ధజయంతి" యను మాటలు అందువలన నిరపాయముగా కనిపించును. అందువలన బౌద్ధులీ పద ప్రయోజనము సంకేతించిరి. రాజరాజనరేంద్రుడు చంద్రవంశపు రాజు. అతని రాజ్యభ్రష్టుని జేయుటకు బౌద్ధులు సంకల్పించిరి. అదే 'చంద్రగ్రహణము, బుద్ధజయంతి' కాగలదు! ఈ సంకేతము వజ్జియ గ్రహించి వైశాఖ పూర్ణిమకు తిరుగుబాటు చెలరేగునని నిశ్చయించి దాని నడచుటకు రాజ్యమంతటను ముందుగనే రహస్యముగా కఠినాజ్ఞలు పంపియుండెను.

వజ్జియ దీనిని వేరులో త్రుంచియున్నచో చెలరేగకుండి యుండును. కాని అందుకై ముందు బౌద్ధ సంఘారామములపై దండెత్తవలయును. అట్లు చేసినచో నత డది స్వమతాభిమానము వలననే చేసినట్లు ప్రజాభిప్రాయము ప్రాకిపోవును. మరియు రాజద్రోహు లందరు పట్టువడరు. అందువలన దానిని వృద్ధి కానిచ్చి సమూలముగా నుద్ఘాటింప నెంచెను. అప్పుడు తగిన కారణము కనుపడును. రాజద్రోహులు దిశ్శేషు లగుదురు.

అయినను ఇట్టి తిరుగుబాటులు నియమిత కాలము వరకు నాగియుండక కొన్నియెడల తొందరచే ముందుగనే చెలరేగును. అట్టి పరిస్థితి నరికట్టుటకును అతడు సిద్ధపడియుండెను. ఈ ప్రయత్నము లన్నిటిలో వజ్జియకు నృపకామదండనాథుడు దక్షిణభుజముగా నుండెను.

క్రీడా వినోదములలో ధనుర్విద్యా ప్రదర్శనము నా డేదో జరుగు నున్నదని వారికి సంశయముపొడమెను. అందుచే రాజరాజనరేంద్రు డా నాడు ధనుర్విద్యా పరీక్షకు రాలేదు.

ఈ విధముగా నొకవంక బౌద్ధులయు ధారావర్షునియు త్రైలోక్యమల్లదేవరలయు ప్రయత్నములు సాగుచుండ నన్నిటిని ప్రతిఘటించుటకు వజ్జియ ప్రతి క్రియలు సలుపుచుండెను. ఇప్పుడు వేంగీమండలమున ననేకోద్యోగములలో జైనులున్నారు. వారు బౌద్ధులతో కలియకుండ జేయుట వజ్జియ ప్రతిభా మూలమే!

# 31

నారాయణభట్టు నామము సభాస్థానమున విదితమైనదాది నన్నయ భట్టారకుడాతని ననుదినము చూడబోవుచుండెను. నన్నయహృదయములో చిన్ననాటి స్నేహభావము పొంగి వెల్లువలు కట్టసాగెను. అతని మనస్సున నిరంతరము నారాయణస్మృతియే పారుచు నార్ద్రిత కలుగు చుండెను. ఇప్పుడు తలచుకొనగా ఇనాళ్ళ నట్టి మిత్రోత్తముని విడిచి యెట్లుండగలిగెనో కూడ నత డూహింప లేక పోయెను. ఈ హార్దభావ ముతో పాటు నన్నయ కప్రయత్నముగా పద్యపరంపర జిహ్వాగ్రమున నాట్య మాడ సాగెను.

రాత్రుల మహాభారతప్రవచనము సాగుచునే యుండెను. కాని మధ్య మధ్య కొంత ప్రాకుచెందుట యారంభించెను. విద్యార్థి చదివిని శ్లోకార్థము వివరింపబోవు నన్నయ మధ్యమధ్య నుదాత్తమగు తెలుగు పద్యములే దొర్లించును. అతని వాక్కున నొక్కుమ్మడి నట్లు చెలరేగు చున్న కవితాస్రవంతి కతడే ఆశ్చర్యపడును.

నారాయణభట్టు చక్రకోట్యయాత్రకు బయలుదేరుచున్న సమయము ననే సరిగా నతని కొక కష్టవార్త తెలియవచ్చెను. అతని భార్యను, పుత్రికను మోటుపల్లి నుండి వచ్చుచుండగా వెల్లటూరు సమీపమున దొంగలమర్రియొద్ద చోరులు హరించి ఎచ్చటికో తీసికొనిపోయిరను వృత్తాంత మప్పుడే వజ్జియ యెరిగించెను. అ ల్లెరిగించి వజ్జియ యాతని నొక్కసారి కన్నెత్తి తిలకించెను.

నారాయణభట్టు కాపాడమ సక్కము దైన్యము ఒక్కసారిగా నావేశించెను. వజ్జియ యాతని ముఖము చూడలేక తల వాల్చెను. నన్నయ నిశ్చేష్టుడయ్యెను.

కాని మరునిముసమున నారాయణభట్టు మనస్సు పదిలపరచు కొనెను.

"ప్రెగ్గడలే వారిని రక్షించు నుపాయ మాలోచింపవలెను. రాజ

కార్యములకు ప్రజల సంసారబాధలు అడ్డు రాకూడదు కదా!" అని గంభీరముగా నారాయణభట్టు పలికెను.

"వారు సురక్షితముగా నుందురనియే నా విశ్వాసము. నీవు చక్రకోట్యము నుండి తిరిగి విజయవార్తతో వచ్చునప్పటికి వారిని మరల పొందగలవని నా నిశ్చయము" అనుచు నన్నయ నారాయణభట్టు దక్షిణ భుజ మాదరముతో స్పృశించెను.

నారాయణభట్టు మాటాడలేదు. నన్నయభట్టారకుడు మిత్రునికి జయప్రదముగా శీఘ్రపునరాగమనమును బంధుదర్శనమును ఆశించుచు వీడ్కొనెను.

అట్లు నన్నయ యింటికి వచ్చినదాది నారాయణభట్టునే స్మరించుచుండెను. అట్లు నారాయణభట్టుస్మరణ చేయగా చేయగా నారాయణావతారుడగు శ్రీ కృష్ణభగవానుడు అతని హృదయఫలకమున నుద్యోతితుడయ్యెను. వెంటనే రెండవ కృష్ణుడు శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాస మహర్షియం దావిర్భవించెను. ఆ వెంటనే అనేక పర్యాయములు పాఠ ప్రవచనములు చేసిన శ్రీ మహాభారతము అమూలాగ్ర మొక్కసారి విద్యుద్వేగమున ప్రసరించెను!

ఆ కృష్ణద్వైపాయనుని జయవాక్కు తాను తెలుగులో చెప్పినచో నెట్లుండును?

"నన్నయభట్టారకా, ఏమి సాహసము! అది దేవవాక్కు! శ్రీమన్నారాయణావతారుడై శ్రీకృష్ణద్వైపాయనుని పవిత్రవాక్కు! అందులో వేదసమ్మితమగు వేదవ్యాసుని శ్రీ మహాభారతము! నీవు, గాసట బీసట గాథల తెలుగులోనికి దానిని పరివర్తింతువా? ఏమి అహంభావము!—అయ్యో, నారాయణభట్టు నడిగిన నతడు దీని కేమనునో గదా!"

ఈ విధముగా నన్నయభట్టారకుని హృదయములో ఉత్సాహము, భయము, బోటు పాటులతో భయంకరముగా తుపాను రేగుచుండెను.

సరిగా నా సమయమున విద్యార్థివచ్చి పావులూరిమల్లన యిద్దరు నూతనకవి మిత్రులతో నతనికొరకు వేచియున్నాడని చెప్పెను. వెంటనే నన్నయ వారిని తోడి తెచ్చుటకు గృహాంగణభూమి కేగెను.

సావులూరి మల్లనతో వచ్చినవారు అథర్వణాచార్యులును, వేముల వాడ భీమకవియు.

"కుంతలదేశమునుండి దేశసంచారము చేయుచు విద్యాప్రదర్శన మున కిటు వచ్చిన పండిత శ్రేష్ఠు డీ అథర్వణాచార్యులు. గొప్ప వైయా కరణి, కర్ణాటాంధ్రములలో గొప్ప కవి. పంపభారతము ఆంధ్రీకరింప సాగినాడు. ఈ కుఱ్ఱవాడు వేములవాడ భీమకవి. ఈశ్వరవరప్రసాదముచే కవిత్వము సాధించిన సిద్ధుడు, బహుసమర్థుడు. వీ రుభయులు నిన్ను చూడవచ్చినారు భట్టారకా!" —ఇట్లు మల్లన వారిని నన్నయ కెరుక పరచెను.

నన్నయ వారి నందర నాదరముతో లోని కాహ్వానించి యుచితా సనముల గూర్చుండజేసెను. అంతట నత డథర్వణుని నెన్నియో ప్రశ్న లడిగెను. ఏగ్రామము? తల్లిదండ్రు లెవరు? గోత్రమేమి? శాఖ ఏది? ఎప్పుడు రాజమహేంద్రవరము చేరితిరి? ఏన్నాళ్ళుందురు? పంపభారత మెంతవరకై నది? అథర్వణు డన్నిటికి సమాధానము లిచ్చెను.

ఇట్లు నన్నయ యథర్వణునితో ప్రసంగించుచుండ భీమకవికి కోపము ప్రారంభించెను. ఒకమాటకూడ నన్నయ యతనితో మాట్లాడ లేదు. మంత్రసిద్ధుని యందు ఇంత నిరసనమా?

ఇంతలో నన్నయ మల్లనవంక తిరిగి, "ఈ పిల్లవాడు సిద్ధు డంటివి. ఇతని కుపనయనమే యైనట్లు లేదే! నీ కెన్నేళ్ళు నాయనా?" అని తుద కాతని బ్రశ్నించెను.

భీమ : నాకు తెలియదు. మా యమ్మగారి నడుగవలెను.

నన్నయ: పాపము నీకు తండ్రి లేడా? మీ గోత్రమేమి?

భీమ : నేను ద్రాక్షారామభీమేశవరప్రసాదలబ్ధుడను. ఆ భీమేశుడే మాతండ్రియని మా యమ్మగారు చెప్పినది. నేను ఈశ్వరగోత్రుడను.

నన్నయ: ఉపనయనము చేసికొనలేదేమోయి? యౌవనము వచ్చు చున్నను వేదాధ్యయనము ప్రారంభింపని ద్విజబాలకు నేమనవలెవనోయి?

భీమన కొక్కసారిగా సిగ్గయ్యెను. పూజ్యుడగు నన్నయ యాదరా తిశయముతో నుపనయనము చేసికొమ్మని చెప్పుచుండ నత డేమనగలడు!

"మా అమ్మగారి కీ విషయము చెప్పెదను."

"మంచిది. దీర్ఘాయుష్మాన్ భవ!"

అ ట్లనుచు నన్నయ మరల నధర్వణునితో ప్రసంగమందుకొనెను

నన్నయ : మీరు నారాయణభట్టు నెరుగుదురా?

అధర్వణు డొక్కక్షణ మాలోచించెను. పావులూరి మల్లనయే యందుకొని ప్రత్యుత్తర మిచ్చెను.

"కుంతలదేశములో నుండగా బాగుగా నెరుగునట!"

నన్నయ్య : పాప మాతని దక్షిణబాహువును ధనుర్విద్యాప్రదర్శనములో రాజపుత్రుడొక డీమధ్య బాణముతో కొట్టినాడు; వింటిరా?

అధర్వ: అవును, వింటిని మల్లనార్యులవలన. అతడు బహు సమర్థుడు. ధర్మము కొరకు తీవ్రముగా పోరాడును. అందువలననె యక్కడకూడ పెక్కురతో నాయనకు విరోధములు కలిగెను.

నన్నయ : ఆచార్యా, మీ రన్నదంతయు నిజమే. విద్యార్థిగా నుండగా కాంచీ పురములో విద్యార్థి బృందమునకు అతడే నాయకుడుగా నుండువాడు. అతడు విద్యాలయము మీదికి తెచ్చిన పోట్లాటలేనా?

మల్లన : విద్యాలయముమీద పోట్లాట లన నేమి?—శాస్త్రార్థములా?

నన్నయ్య : శాస్త్రార్థము లైనచో భయ మేమి? మాకు యాదవప్రకాశునితో తరచుగా శాస్త్రార్థములు జరుగుచుండెడివి. వాని కేమి? ఇవి సాక్షాత్తుగా కొట్లాటలే! ఒకమా రచ్చటి సంఘారామమునందలి శ్రమణులను ముగ్గురిని వీథిలో కొట్టినాడు ఆ రాత్రి ఆ శ్రమణుల భక్తులు పలువురు కర్రలు కత్తులు తీసికొని గురుకులముపై దండెత్తివచ్చిరి. కులపతి యా వచ్చినవారిని శాంతపరచి పంపుచుండెను. కాని యంత సేపును మే మెంత యాపినను నారాయణభట్టు ఊరకొనెనా! తా నొక్కడే పోయి వారందరమీద లంఘింతు ననును. మమ్ము వదలమని పెనగులాడుచుండగా ఎందరమో పట్టుకొని మే మతికష్టముమీద నాపితిమి.

అధర్వ : ఆ శ్రమణుల తప్పేమి?

నన్నయ : వారా? వేదములు బ్రాహ్మణులు కల్పించిన యబద్ధము

లనియు, శ్రుతిమూర్ఖప్రలాపమనియు వీథిలో జనములకు బోధచేయుచుం డిరి. ఆ దారిన పోవుచున్న మా యిద్దర చెవుల నా మాటలు పడినవి. నేను చెవులు మూసికొంటిని. ఆ బోధచేయు శ్రమణులకు నారాయణభట్టు ఎదురై 'నోరు మూయు'డని గద్దించినాడు. వా రది లక్ష్యముచేయక పూర్వబోధ చేయుచుండగా, నారాయణభట్టు వారు ముగ్గురమీద బడి కొట్టి నాడు. అప్పు డక్కడ జరిగిన కల్లోలమేనా? నేను నారాయణభట్టుతో కొట్టవద్దనుచు చేతనున్న ఛత్రముతో శ్రమణుల కడ్డుపోతిని. ఆ ప్రక్కను పిండివంటలు చేయు వర్తకులు ఆ శ్రమణుల యనుయాయులు. వా రందరు నాపై బడి 'గొడుగుతో కొట్టుచున్నాడు' అనుచు నన్ను కొట్టిరి. వంటలు చేయువారి పిండి ముద్రలు నా దేహమంతయు ముద్రితమైనవి. నా ఛత్రము విరిగిపోయెను. అంతలో రాజభటులు వచ్చి మా విద్యార్థి వేషములు చూచి అప్పటికి కచ్చటనుండి తప్పించి గురుకులము చేర్చినారు.

అథర్వ : కొంత తొందర ఉన్నదికాని బహుధర్మబుద్ధి!

నన్నయ : తొందరా, తొందరా! ఒకమారు కామాక్షీదేవియాలయ సమీపమున వసంతోత్సము జరుగుచుండెను. ఆ యుత్సవములో నొక జవ్వనిని యువకులు కొందరు వెంటనంటి హాస్యముతో నిర్బంధించుచుం డిరి. ఆమె వారలను నోటికివచ్చినట్లు తిట్టుచుండెను. ఆస్త్రీకి అవమానము జరుగుచున్నదని నారాయణుడు నిశ్చయించి వెంటనే అందర యువకు లపై బడి చేతి కందినవారి నెల్ల కొట్టి యామెను రక్షించెను. ఆ పిమ్మట నది నారాయణభట్టును మోహించి వెంటనంటగా దానినుండి తప్పించు కొనుట యతనికి దుర్ఘటమయ్యెను. చివర కది వారకాంత యనియు, ఆ యువకులలో నొకనియొద్ద ముందు రూకలు పుచ్చుకొని కామవాంఛ తీర్పక పారిపోయెననియు, మరల నీ యుత్సవములో గుర్తించి వా రట్లు దానిని నిర్బంధించిరనియు మాకు తెలియవచ్చినది. నారాయణభట్టు పెంకెగా ప్రవ ర్తించినప్పుడు గురుకుల విద్యార్థుల మా వారకాంత కప్పగింత పెట్టుదు మని యతనిని బెదరించుచుండు వారము! ఇట్టి వెన్నియేని గలవు!

నన్నయభట్టారకుని మనస్సు పూర్వస్మృతులతో నిండిపోయెను. "ఒకమారు సహగమనము చేయనొక పతివ్రత కోరుచుండెను." నారా

యణభట్టు కథలతో నిక నన్నయతో వచ్చిన కార్యము నివేదింప వీలు లే నట్లుండెను. అధర్వణాచార్యులాలోచించి యడిగెను.

అధర్వ : ఆయన కొక చక్కని కుమార్తె యుండవలె. ఆ పిల్ల బహు చాక చక్యము కలది. ఎనిమిదేళ్ళు నిండకముందే యామెకు కలిగిన సంస్కృత జ్ఞానము కల్యాణ కటకములో నబ్బురముగా చెప్పుకొనువారు.

నన్నయ నిట్టూర్చెను "తీర్థయాత్ర చేసి వచ్చుచుండగా ఆ పిల్లను, తల్లిని దొంగ లెవరో పల్లకితోసహా ఎక్కడికో తీసికొనిపోయిరట. ఈనాడే వార్త వచ్చినది."

"ఎంతమాట! పాపము, ఎక్కడ నేమిటి?" — మల్లన ప్రశ్నించెను.

"భట్టిప్రోలుకు అర్థక్రోశము దూరమున దొంగలమ్రి యొకటి కలదట, అక్కడ!"

అధర్వ : ఈ బౌద్ధశ్రమణు లెంతకైన సాహసులే!

నన్నయ : పాపము, వారి నక్రమముగా నిందింపనేల? దొంగ లందరు బౌద్ధులనుట న్యాయమా!

అధర్వ : కాదు కాని, బౌద్ధసంఘారామము లున్న చోట్లకు సమీపముననే ఇట్టి దొంగతనములు దుర్మార్గములు నెక్కువగా జరుగుచున్నవి. ఆ విషయమున దేశాటనము చేసిన మాబోంట్లకు అనుభవ మున్నది.

నన్నయ : ఏమో, మరి! రాజభటులు జాగరూకులై విచారణలు చేయుచున్నారట. పాపము, వారు సురక్షితముగా నుండవచ్చును. వారికే ఆపద వచ్చినచో నారాయణభట్టు దేహమున ప్రాణములు ధరించుట కష్ట తరము!

అధర్వ : కాదా, మరి! పాప మాతని ఏకైకపుత్రిక. మీ కెందరు పుత్రులు భట్టారకా?

నన్నయ : ఒక్కడే. కాంచీపట్టణములో గురుకులమున వేదాధ్య యనము చేసి సిద్ధాంతగ్రంథములు పూర్తి చేయుచున్నాడు. ఈమారు చాతు ర్మాస్యల సెలవులలో విద్యసంపూర్తికావచ్చును. మల్లనార్యా! మావాడు అర్య

భటుని మ్లేచ్ఛ సదృశు డని తిరస్కరించును. నా కతని మాటలు యుక్తి యుక్తముగనె యున్నవి. నీ యుద్దేశ మేమి?

మల్లన : ఈ కాలపువారి పైత్యమది. కేవలము సూర్యసిద్ధాంతము తప్ప వేరు ప్రామాణ్య మంగీకరింపనివారి మత మిది. ఆర్యభటుడు మ్లేచ్ఛదేశములో విద్యాభ్యాసము చేసి ఉపదేశించిన విషయములు ప్రత్యక్షముగా సత్యములని తోచుచుండ గ్రహింపరాదా?

నన్నయ : అట్లైయినచో శబ్దప్రమాణముకంటె ప్రత్యక్షము బలవత్తర మందువా మల్లనార్యా?

మల్లన నవ్వుచు, "నన్నయా, మీ శాబ్దప్రమాణమున కొక నమస్కారము! అప్రత్యక్ష విషయముల కెట్లున్నను కన్నులకు కనుపడుగ్రహగతులు సూర్య సిద్ధాంతమునకు విరుద్ధముగా నున్నచో మే మేమి చేయగలము, గణకులము!"

నన్నయ : తిథులు కనులకు కనుపడునా!

మల్లన : మీమాంసకు నమస్కారము! మేము అనుభవ జ్యోతిష్కులము గాని సిద్ధాంతులము కాము. నీ కుమారుడు విద్య పూర్తిచేసి వచ్చిన పిమ్మట సూక్ష్మముగా విచారింతము!

అథర్వ : అదృష్టశాలివి నన్నపార్యా, విద్యావ్యసనముకల పుత్రుని పొందితివి. సంతోషము!

నన్నయ : పెద్దల యాశీఃప్రభావము. భగవత్కృప!

అంతట నెమ్మదిగా తాము వచ్చిన పనినిగూర్చిన ప్రసంగము మల్లన ప్రారంభించెను:

"ఈమధ్య చీనాదేశమునుండి పండితు డొక డీ పట్టణము వచ్చినాడట, ఎరుగుదువుగదా నన్నయా?"

"ఆ, ఎరుగ కేమి?"

"అతడు వాదాహ్వానము చేయుచు నందరికి పత్రికలు పంపినాడు. విజయధ్వజ మొకటి సంఘారామముపై నెత్తినాడు. పత్రిరాత్రమునను నచ్చట జయభేరి మ్రోగించుచున్నాడు."

నన్నయ : నాకును నొక పత్రము వచ్చినది. నాస్తికులగు బౌద్ధ

లతో శాస్త్రార్థ మేమిటి? జయభేరి సంగతి నాకు తెలియదు. ఏమిటి యది?

మల్లన : ఏమున్నది? రాత్రుల భేరీశబ్దము వినిపింప నది యేమో యనుకొంటిమి మొదట. విచారింపగా నది చీనాపండితునితో ప్రతివాదము చేయువారు రాలేదని సూచించు జయభేరి యని తెలిసినది. రాత్రులనెప్పుడు నసి వినలేదా?

నన్నయ : వినలేదు. అయితే అది రాక్షసభేరి యన్నమాట!

మల్లన : అల్లే. అధర్వణులు ఇటువంటి సభలు సంభవించినచో వారి తర్కపటిమ ప్రదర్శింపవలె నని చూచుచున్నారు. దైవవశమున నిది తటస్థపడినది. వెంటనే ప్రతిపత్రిక వ్రాసి పంపినారు. ఆ సందర్భములో నిన్ను చూడవలె నని వారిక్కడికి వచ్చినారు.

నన్నయ యొక్క క్షణ మాగి యనెను.

"నాకు వివాదము లిష్టము లేదు. అందులో నాస్తికులతో మనము వాదించుటెట్లు? వారికిని మనకును ప్రమాణమున సమానత లేదుగదా! అట్టిచో శాస్త్రవాదమునకు అవకాశమే లేదని నా మతము. ఇక వారితో పాటు నలుగురను చేర్చి యల్లరి చేయించవలసియుండును! ఎవ రెక్కువ రభస చేసిన వారు గెలిచినవా రగుదురు."

అధర్వణాచార్యు లందుకొనెను.

"మీరు చెప్పుచున్నది నిజమే. కాని వారంత నిర్భయముగా ప్రచురించు కొనుచున్నప్పుడు వారి నేదో యొక విధమున నెదుర్కొననచో సామాన్యజనము వారి మాయలో పడిపోవును. ఇది యాలోచించియే నేను ప్రతిపత్రిక పంపినాను. మీరు మధ్యవర్తిగా నుండుట కంగీకరింప ప్రార్థింప వచ్చినాను."

నన్నయ: అయ్యో, మీ యుద్దేశము మంచిదియే గాని, యిట్టి వివాదములలో మాధ్యస్థ్యము వహించుటకు నేను తగను. నన్ను క్షమింపుడు! మీ రడుగకముందె యిట్టివానిపై నా యనిష్టము తెలిపితిని గదా!

అధర్వ: మీబోటివారు సమర్థులయ్యు నిట్టివి ప్రతిఘటించి నిలువక

పోగా, మా బోంట్ల ప్రతిఘటనకు సహాయభూతులుగానైన నుండకున్నచో నెట్లు?

ఆ మాటలకు నన్నయభట్టారకుడు ప్రత్యుత్తరము పలుకక యొక్క చిరునవ్వు నవ్వెను. మల్లన నన్నయస్వభావ మెరిగినవాడు గాన మరి యొత్తిడిచేయ నెంచలేదు. ఆ పిమ్మట నత డా విషయము వదలి యితరవిషయములు ప్రస్తావించెను. నన్నయ సంభాషణమంతయు నారాయణభట్టు బాల్యక్రీడల స్మృతులలోనికి దింపుచుండెను.

"వజ్జియప్రెగ్గడల కుమారు డిప్పు డింతవా డయినాడు గదా! అత డొకసారి కాంచీనగరములో జూదరుల చేతుల జిక్కుకొనెను. వారు చేయు మోసము కనిపెట్టలేక సర్వస్వ మోడిపోయి మరికొంత ద్రవ్యము వారికి ఋణపడి వారల నిర్బంధములో నుండెను. ఈ సంగతి చూచినవిద్యార్థుల వలన నారాయణభట్టు తెలిసికొనెను. అతనియొద్దను నా యొద్దను గల స్వల్పధనమంతయు దీసికొని యతడు వెంటనే యా ద్యూతభవనమునకు సహపాఠులతో నేగెను. నారాయణభట్టు వజ్జియ కుమారునికి బదులు పందెము లొడ్డి యా జూదరులతో నాట ప్రారంభించెను. మరియొక విద్యార్థి చిక్కినాడని వారు యథాప్రకారము మాయాద్యూతము ప్రారంభించిరి. వారి నట్లు కొంతసేపు మోసము చేయనిచ్చి యదను చూచి యది బయటపెట్టెను. అది పట్టుకొనిన వెంటనే సహపాఠులను, రాజభటులను పిలిచి తెచ్చుటకు పంపెను. ఆ జూదరు లంతట గడగడలాడుచు బ్రతిమాలుకొని క్షమాపణలు చెప్పుకొని వజ్జియకుమారుని వదలిపెట్టి యతని వలన మోసముచే హరించిన ధనమంతయు నతని కిచ్చివేసిరి. ఆ పైన వజ్జియకుమారుడు మరి ద్యూత మాడనని ఘోరప్రతిజ్ఞ చేసెను.

"నారాయణభట్టుకృత్యము లెంత యద్భుతములు! తెలుగువారికి చోళవిద్యార్థులకు విద్యలోగాని క్రీడలలో గాని స్పర్థ కలిగినప్పుడు ఎంత ధైర్యముగా తెలుగు వారి మానము గాచువాడు."

నన్నయ నా విషయమునుండి మరలింప సాధ్యము కాలేదు. కొంత సేపు వారును నన్నయ స్వగతప్రకటమునకు ఊఁ కొట్టి సెలవు తీసికొని వెడలిపోయిరి.

విమలాదిత్యుని కిద్దరు దేవేరులు. అందులో పట్టమహిషి కుందవా దేవి. ఆమె చోళ చక్రవర్తియగు రాజరాజుకుమార్తె. ఆమెకు రాజరాజ నరేంద్రు డుదయించెను. విమలాదిత్యుని రెండవ దేవేరి మాలవదేవి. ఆమెయందు విజయాదిత్యుడు కలిగెను.

విమలాదిత్యుని మరణానంతరము జేష్ఠపుత్రుడగు రాజరాజనరేంద్రుడు పట్టాభిషిక్తుడయ్యెను. రాజరాజనరేంద్రుడు పండ్రెండేండ్లు రాజ్యముచేసిన పిమ్మట కుంతలచాళుక్యుల సహాయముతో నతని సవతి సోదరుడు విజయుదిత్యుడు వేంగీరాజ్యముపై ప్రచండసైన్యములతో దండెత్తి రాజరాజనరేంద్రుని పారద్రోలి శక సంవత్సరము 2వ కార్తిక శుద్ధ పంచమి ఆదివారము కన్యాలగ్నమున వేంగీ రాజ్యమున కభిషిక్తుడయ్యెను. అంతట తలయెత్తిన శత్రువులనెల్ల నతని దండనాథుడు భీమభూపుడు అడచివేసెను. భీమభూపుడు నాగరాజు. అతనికి మేఘగిరినాథుడు, మేల్పకందర్పుడు, మలయభాస్కరుడు ఇత్యాదిబిరుదములు కలవు. విజయాదిత్యుని ద్వితీయ రాజ్యవర్షమున నతడీ భీమభూపునికి కొంపులుంగు గ్రామము దానము చేసెను.

రాజరాజనరేంద్రు డా యుద్ధములలో స్వయముగను, ఉత్సాహాతిశయముగల పడుచు దండనాథుల సహాయముననుపాల్గొనెను. తండ్రి విమలాదిత్యుని కాలమున విశ్వాసపాత్రులైన వజ్జియప్రెగ్గడలను నృపకామదండనాథులను మరచిపోయెను.

రాజరాజు పరాజితుడైన పిమ్మట కతిపయపరివారముతో చోళదేశమునకును పలాయితుడై మామగారగు గంగైకొండ రాజేంద్రచోళుని శరణుచొచ్చెను. అచ్చట నాతడు వ్యాసమహాభారతశ్రవణము చేసెను. జనమేజయునికి వైశంపాయనునిచే నేలయది యుపదేశింపచేసెనో రాజరాజు కవగతమయ్యెను. అంతట నృపకామదండనాథులను, వజ్జియప్రెగ్గడలను స్మరించెను. వజ్జియ విమలాదిత్యదత్తమగు రణస్థిపూడి అగ్రహారములో త్రేతాగ్నుల సేవించుచు శాంతముగా కాలము గడుపు

చుండెను. అట్టి వజ్జియను, అట్లే శాంతుడను నృపకాముని గంగైకొండ చోళపురమునకు పిలిపించెను. వారితోబాటు నన్నయభట్టారకుని పిలిపించి పాండవులవలె దుర్గోపాసన చేసెను. ఆ పెద్దల యుపదేశానుసారముగ చోళసైన్యములుకొని వేంగీరాజ్యముపై రాజరాజు దండెత్తెను. విజయాదిత్యుని రెండవ రాజ్యసంవత్సరముననే అతని నా సైన్యములు వెడలగొట్టగా, నతడు మరల పారిపోయి యప్పుడు కుంతలప్రభువగు జయసింహ జగదేకమల్లుని శరణుచొచ్చెను. విజయాదిత్యుడు ఎంత ప్రయత్నించినను మరల వేంగీరాజ్యము వశపరచుకొనలేకపోయెను. నృపకామ దండనాధుడును, వజ్జియయు రాజరాజనరేంద్రుని రాజ్యము సర్వవిధముల రక్షించుచుండిరి.

కుంతలరాజ్యమునకు జయసింహ జగదేకమల్లుని మరణానంతరము అతని కుమారుడు ఆహవమల్లసోమేశ్వరుడు ప్రభువయ్యెను. అతడు విజయాదిత్యునికి సహాయముగా పంపిన సైన్యములు వేంగీరాజ్యమున కృష్ణకుత్తరమున గృధ్రవార (గుడివాడ) విషయమున కలిదిండివరకు చొచ్చుకొని వచ్చెను. వాని నెదిరించుటకు రాజరాజనరేంద్రుడు స్వయముగా నొక మహాసైన్యమును గొని రాజమహేంద్రపురమునుండి బయలుదేరెను.

ఇంతలో రాజరాజుకోరికపై చోళదేశమునుండి యుత్తరమున కొక మహాసైన్యము బయలుదేరెను. దానిని ముగ్గురు చోళదండనాధులు నడిపించిరి. అందులో ప్రధానుడు రాజరాజ బ్రహ్మమహారాజను మహాదండనాధుడు. రెండవవాడు ఉత్తమశోడచోడగోను. మూడవవాడు ఉత్తమచోడమిలాడుడయ్యాను రాజరాజనరేంద్రుని సైన్యములు చేరకముందె చోళసైన్యములును కర్ణాటకసైన్యములును కలిదిండి క్షేత్రమున తలపడెను అరెండు సైన్యముల కచ్చట ఘోరసంగరమయ్యెను. సేనలు పరస్పరము ముష్టాముష్టి, కేశాకేశి, దండాదండి, కుంతాకుంతి ప్రతిఘటించెను. ధానుష్కులు శరవృష్టి కురిపించిరి. గజముల ప్రతిఘట్టనము భీకరమయ్యెను. భటులు ఖడ్గాఖడ్గి పోరగా ఖడ్గదృఢఘట్టనచే విస్ఫులింగములుదయించెను. కబంధములు నృత్యముచేసెను. గజములను గజములు తాకెను.

వాజులను వాజు లెదొర్కొనెను. నరులను నరులు భేదించిరి. ద్రమిళదండ నాధులు ముగ్గురును త్రేతాగ్నులవలె వీరవిహార మొనర్చిరి.

ఐనను దైవదురీహచే కర్ణాటదండనాధులకును ద్రమిళదండనాధులకును సమయుద్ధ మయ్యెను. పలువురు కర్ణాటదండనాధులతో పాటు ద్రమిళదండనాధులు ముగ్గురును వీరస్వర్గ మలంకరించిరి.

కర్ణాటకదండనాధులు వీరస్వర్గము నొందినందున కర్ణాటసైన్యము లను విజయాదిత్యుడెట్లో కూర్చుకొని, కర్ణాట దేశమునుండి వచ్చుచున్న మరికొన్ని సైన్యముల కొర కెదురు చూచుచు కృష్ణానదిని దాటి కృష్ణకు దక్షిణ పశ్చిమ భాగముల ననుసరించి విజయవాడ కెదురుగ కృష్ణానది యావలితీరమున నుండవల్లి చేరెను. అచ్చట నొక జైనవసది కలదు. అది కొండయంచున మూడంతస్థులుగ గుహలుగుహలుగదొలిచియున్నది. ఆ పర్వతప్రదేశము ఆత్మరక్షణ కెక్కువ యుపయోగించునని కనిపెట్టి విజయాదిత్యు డచ్చటనే యుండ నిశ్చయించెను.

విజయాదిత్యుని సైన్యములలో పలువురు జైనదండనాధు లుండిరి. ఆ ప్రాంతమంతయు జైనాక్రాంతమైయుండి కర్ణాటాభిమానము కలిగి యుండెను. ఉండవల్లి జైనవసతిలోని యాచార్యులు అతనియందు కొంత యాదరము చూపిరి. రాజరాజనరేంద్రుని సైన్యములు కృష్ణానది నుత్త రింపవలెను. విజయాదిత్యుని సేనలు పర్వతముల మధ్యనుండి యా ప్రదే శమున నాత్మరక్షణకు దుర్గనిర్మాణము తాత్కాలికముగ జేసికొనెను. చుట్టుప్రక్కల ఫలవంతమగు భూములును, సంపన్న గ్రామములును గలవు. అచ్చటనుండి కర్ణాటకభటులు నయమునను భయమునను సైన్యము నకు అవసరమగు నాహారద్రవ్యములు సంపాదించి నిలువచేయసాగిరి.

రాజరాజ నరేంద్రుని సైన్యములు కలిదిండిప్రాంతము చేరునప్ప టికే, యచ్చట జరిగిన మహాయుద్ధవార్త తెలియవచ్చినది. రాజరాజు క్రోధోగ్రుడై కర్ణాటక సైన్యములమీద దాడ నుంకించెను. కాని యప్ప టికే కర్ణాటసైన్యములు కృష్ణయొద్దరికి దాటి పశ్చిమముగా కృష్ణాతీరముననే నడచుచున్నట్లు తెలిసెను. వెంటనే కృష్ణానది దాటుట యుపాయకరమని

నృపకామదండనాధుడు మంత్ర ముపదేశించెను. వెంటనున్న వజ్జియకూడ నృపకాముని వచనములను బలపరచెను.

రాజరాజును తన సైన్యముల నీవలి యొడ్డున కృష్ణాతీరముననే పశ్చిమదిక్కుగా నడిపించుచు విజయవాడ వచ్చి విడిసెను. అతడక్కడ భక్తిశ్రద్ధలతో కనకదుర్గను, మల్లికార్జునదేవుని సేవించెను. జైనకాలాముఖాచార్యులగు త్రికాలయోగసిద్ధాంత దేవరలకు మొగలిరాజపురమున నొక వసతి కలదు. ఆ వసతికి పూర్వము రాజరాజ నరేంద్రుని తండ్రియగు విమలాదిత్యుడు కొన్ని దానములు చేసియుండెను. కాని యందులో కొన్ని గ్రామములరాబడి యా వసతికి కొంత కాలమునుండి చేరుటలేదు. అందుపై నచ్చటి యాచార్యులు సరిచేయవలెనని ప్రార్థించుచు రాజమహేంద్రపురమునకు విన్నపములు పంపుకొనిరి.

విజయవాడ చేరినవెంటనే వజ్జియ యా విన్నపముల కవిలె పైకి తీయించి జైనాచార్యుల బిలిపించెను. ఆ గ్రామాధిపతులనుగూడ బిలిపించి యుభయుల వాదములు శ్రద్ధతో నాలకించెను. వజ్జియ మేధ ప్రదర్శించి యా గ్రామముల మరల జైనచార్యుల కిప్పించి వివదించిన గ్రామాధికారులనుగూడ సంతుష్టచిత్తులజేసెను. అందుపై జైనమతానుయాయులు గూడ రాజరాజుపైరాజభక్తి కలవారైరి.

ఇటు కృష్ణ కుత్తరమున విజయవాడలో రాజరాజు సైన్యములును అటు దక్షిణమున నుండవల్లిలో విజయాదిత్యుని సైన్యములును విడసి యుద్ధమున కదను నిరీక్షించుచుండెను.

ఒకనాటి రాత్రి విజయాదిత్యుడు పటకుటీరములో ప్రొద్దుపోవు వరకు దీర్ఘచింత చేయుచుండెను. కర్ణాటసైన్యములు వచ్చుచున్న నిశ్చయవార్త తెలియలేదు. ఏమి చేయవలెను? సమీపమున నిద్రించుచున్న కుమారుడు శక్తివర్మ పలవరించెను. పండ్రెండేండ్ల యా కుర్రవాని ముఖము నిద్రలో భయవిహ్వాల మయ్యెను. అది చూచిన విజయాదిత్యునికి గుండె తరుగుకొనిపోయెను. దాది పిల్లవానిని వెంటనే స్వస్థుని జేసెను. గాని యాస్మృతి విజయాదిత్యుని మనసును వీడలేదు.

కృష్ణానదిపైనుండి వీచుగాలి. కొండనందునుండి రివ్వున వీవసాగెను. విజయాదిత్యుడు చింతించుచుండగనే నిద్దుర పట్టెను.

చింతాక్రాంతులైనవారికి సరిగా నిద్దురపట్టదు. కాని యానాటి రాత్రి వీచిన కృష్ణావీచికల గాలిమాహాత్మ్యమో, ఎదుట కొండపై వెలసియున్న కనకదుర్గి మహాత్మ్యమో, మల్లేశ్వరుని మహిమమో, ఎరుగరాదుకాని యారాత్రి విజయాదిత్యునికి సుఖనిద్ర పట్టెను.

ఆ నిద్రలో నతని కొక కల వచ్చెను. అప్పటి కెన్నడో ముప్పదేండ్లనాడు స్వర్గతుడైన యాతని తండ్రి విమలాదిత్యుని ప్రేమమూర్తి కనిపించెను తండ్రి ప్రక్కనే కులదైవమగు ఆదివరాహమూర్తి చూడనయ్యెను.

ఆ రెండు దివ్యమూర్తులను సగౌరవముగా తిలకించుచున్నంతలో ఆది వరాహమూర్తి రాజరాజనరేంద్రుడుగా మారిపోయెను. తమ్ముని ఆదరముతో తన ప్రక్కకు రమ్మని పిలుచుండెను. ఒక్కసారిగా విజయాదిత్యునికి అన్నగారిపై హృదయములో ప్రేమగౌరవములు పొంగెను.

ఆ పొంగులో నతడు మేల్కాంచెను. పటకుటీరములో నుత్తర భాగమున నున్న వాతాయనమునుండి చంద్రకాంతి చల్లగా నాతని వక్షోభాగమును వెలిగించుచుండెను. రాజరాజుదియు, విమాలాదిత్యునిదియు మూర్తులు తన హృదయభాగమునుండి వాతాయనమార్గమున నుత్తర దిక్కుగా నిష్క్రమించుచున్నట్లు భావ ముదయించెను.

అంతరంగమందలముకొన్న సువాసనలవలె విజయాదిత్యుని నా స్వప్నస్మృతి వదలలేదు. రాజరాజనరేంద్రుని రూపములో తండ్రి విమలాదిత్యుని పోలిక యెంత యున్నదనియు నాతని కప్పుడు విశదమయ్యెను. ఆ స్వప్నమునే స్మరించుచు సుఖానుభూతితో నుండి యాత డాపై నిద్దుర పోలేదు.

తెల్లవారగనే యాంతరంగికు డగు స్వప్నశాస్త్రకోవిదుని బిలిపించి స్వప్నఫల మడిగెను. స్వప్నవేది దీర్ఘకాల మాలోచించెను. అతని కప్పటికే ఉండవల్లి జైనవసతి యధిపతి త్రికాలయోగ సిద్ధాంతదేవరల వసతి

నుండి వచ్చిన స్వర్ణములు ముట్టజేసియుండెను. దీర్ఘాలోచనానంతర మత డిట్లు చెప్పెను.

"మహారాజా, ఇది దివ్యమగు స్వప్నము, మీ అన్నగారితో సంధి చేసికొనుట పూజ్యులగు మీ పితృపాదుల యభిమతమే కాక, కేవల మాది వరాహదేవుని ఆదేశము. మరియొక సూచనయు నందు కలదు. రాజరాజ నరేంద్రుని పక్ష మవలంబించినచో మీకు వారి అనంతరము వేంగీరాజ్య పట్టాభిషేకము ప్రాప్తించు లక్షణము గూడ స్పష్టముగా తోచుచున్నది.

విజయాదిత్యు డాతనికి సెలవిచ్చి పంపెను. అతడు చెప్పిన ఫల మాలోచించుకొనెను. మాటిమాటికి పిల్లవాడగు శక్తివర్మ పడుచున్న యగచాట్లు మనస్సును వేధించుచుండెను.మూడు దినము లాలోచించినను స్వప్నవృత్తము విస్మృతి నొందలేకపోయెను. రాయబార మంప నిశ్చ యించెను. కాని రాజరాజు రాయబార మంగీకరించునా? స్వప్నమందలి రాజరాజువలె వాస్తవ రాజరాజు ప్రవర్తించునా? ఐనను రాయబార మంపినంతమాత్రమున నష్టమేమి?

అప్పటికే కర్ణాటకుల సైన్యము విజయాదిత్యుని సహాయమునకు వచ్చుచుండెను. ఆ సైన్యము వచ్చుచున్నట్లు వజ్జియప్రెగ్గడలకు ముందుగనే తెలిసెను. కాని యా వార్త విజయాదిత్యునికి జేరకుండ నరికట్టెను.

విజయాదిత్యుడు జంకుతో నన్నకు సంధినిమిత్తము రాయబార మంపెను. వజ్జియప్రెగ్గడ యేకాంతమున రాజరాజుకు మంత్ర ముప దేశించెను. "సోదరులు కలహించుట యుభయులకు శ్రేయస్కరము కాదు. ఈ యవకాశముచేతనే గదా, కర్ణాటకసైన్యములకు మనము చులకన యైనది! ఈ యుద్ధమువలన జనసంక్షోభము కలుగుచున్నది. పంటలు చెడి పోవుచున్నవి, తమ్ముని నాదరముతో దరిజేయుట లోకక్షేమము."

రాజరాజు ఆలోచించెను. పూర్వ మొకమారు ఈ తమ్ముడు తన్ను దేశమునుండియే వెడల నడిచెను. ఇప్పుడు పెద్దసేనలతో దండెత్తెను. ద్రావిడసేనలు ముందు తాకినందున సన్నగిల్లిన సేనతో నిత డిప్పు డున్నాడు. మరియును కర్ణాట సేనలు వచ్చుచున్నవి. ఇప్పు డితనితో సంధి చేసికొనుట ప్రమాదము కాదా!

రాజరాజు మనస్సులో నాలోచించుచుండగనే వజ్జియ కంతయు తెలిసిపోయెను. రాజరాజు మాటాడకముందె యిట్లనెను:

"రాజా, విజయాదిత్యదేవులతో మన మిప్పుడు సంధి చేసికొనినచో నా వచ్చుచున్న కర్ణాటసేనలు వెనుకకు పారిపోవును. అప్పుడు సులభముగా వానిని నాశనము చేయవచ్చును। ఒకవేళ తలపడినను సుఖముగా నోర్వవచ్చును. మీ తమ్ములను రాజధానిలో సమస్తగౌరవములు చూపుచు గౌరవాదరములతో బంధితుని చేయవచ్చును."

రాజరాజు భారమంతయు వజ్జియప్రెగ్గడలకే వదలివేసెను. శీఘ్ర కాలములనే సోదరులకు సంధి కుదిరెను. కష్టసమయములలో తా నంపిన రాయబారమును రాజరాజు సరిగా చూచు నని విజయాదిత్యు డూహింప లేదు కాని యాత డెన్నడును తలంపని విధముగా విశేషమగు నాదరముతో నుత్తరము వచ్చెను విజయాదిత్యుడు నమ్మలేకపోయెను. ఒక్కుమ్మడిగా నతని హృదయములో నన్నగారిపై భక్తి గౌరవము ప్రేమ ఉబికి పొంగి పొరలసాగెను. రాజరాజు రాయబారమును విశ్వసించి విజయాదిత్యుడు ససైన్యముగా లొంగిపోయెను.

రాజరాజు రాయబారములో నిచ్చిన యభయము సర్వవిధముల చెల్లించెను విజయాదిత్యునికి సమస్తగౌరవములు చేయ నుత్తరువు లొసంగెను.

ఇంతలో విజయాదిత్యునికి సహాయమునకు వచ్చుచున్న కర్ణాట సైన్యములు కృష్ణకు దక్షిణతీరముననే తూర్పునకు వచ్చుచుండెను. నృపకాముని యాధిపత్యమున రాజరాజు సేనలు కృష్ణ నుత్తరించెను. విజయాదిత్యుని సేన లచ్చట నున్నట్లే సూచనలు చేయుచు వార్తలు ప్రబలజేసెను. కర్ణాటసైన్యములు దురహంకారముతో ముందుకు వచ్చుచుండెను.

అకస్మాత్తుగా నా సైన్యములపై నృపకాముని సైన్యములు పడెను. కర్ణాట దండనాథులు నివ్వెరపోయిరి. వారికి సేనలు కూర్చుకొని యెదిరించు నవకాశముకూడ లేకపోయెను. ఆ సేనలో బహుభాగ మా యుద్ధములో హతమయ్యెను. పలువురు భటులు దండనాథులు బంధితులైరి. శేషించిన సేన పారిపోయెను. నృపకాముని సేనలు సులభముగా

వానిని తరిమికొట్టగలిగెను. ఈ విధముగా నప్పటిలో కర్ణాటసైన్యములకు వేంగిరాజ్యముపై నాశ లేకుండ పోయెను.

రాజరాజనరేంద్రుడు మహాసంరంభముతో నా విజయయాత్ర చేసి తమ్మునితో రాజమహేంద్రపురమునకు తిరిగివచ్చెను. తదాది విజయాదిత్యునకు సమస్త గౌరవములు సన్మానములు జరుగుచుండెను.

అయితే, రాజమహేంద్రపురిలో విజయాదిత్యు డెవరు? అతడు కేవలము రాజభ్రాత, రాజబంధువు! అతనికి ఎవ్వరును గౌరవము చూపుటలో లోటు చేయరు. అతనికి కావలసిన వస్తువులకు పరిచారకులకు నేమాత్రము కొరత యుండదు. అతడు తలపు సూచించినంతనే జరిగిపోవుచుండెను. విద్యాగోష్ఠికి పంపనభట్టాచార్యులు వచ్చిపోవుచుండును. రాజరాజు ఎడమప్రక్క నతడు తప్ప మరి యెవ్వరు నుండ వీలులేదు. కాని ఏమైనను అతడు రాజభ్రాతయే కదా, ఉత్సవవిగ్రహమే కదా!
విజయాదిత్యుని కెట్టి యుద్యోగమును లేదు. అతనిపై నెట్టి ప్రభుత్వభారమునులేదు అతనితో నెట్టి రహస్యాలోచనయు జేయరు. స్వభావసిద్ధముగా నతనిబుద్ధి చురుకైనది. అతడు భరణపు జీవితముతో నెట్లు తృప్తి పడగలడు? కవులతో గాయకులతో నర్తకులతో గోష్ఠితో విలాసములతో నాతడు తృప్తిపొందువాడు కాడు. అధ్యాత్మచింతలతో దేహము మరచు ప్రకృతికాదు. వజ్జియవలె రాజ కార్యములను నృపకామునివలె యుద్ధకర్తలను అన్నగారికి మంత్రము ఉపదేశింప గల సమర్థుడు. కాని యతని నందుకు పిలువరు. పిలువని పేరంటమునకు పోవుట రాజశీవికి కొరత కదా! అందుచే నాతని నిశితబుద్ధి త్రుప్పుపట్టిన ఖడ్గమువలె మొక్కవోవుచు మరుభూమిలో నాటిన మొలకవలె నిష్ఫల మగుచున్నట్లు అతనికే గోచరింపసాగెను.

ఈబంగారు సంకెల లతనికి మధ్య మధ్య విసుగు కలిగించును. విసుగుతోపాటు రాజరాజనరేంద్రునిపై నతని హృదయమున కోప మంకురించును. కాని నిజముగా నతనికి రాజరాజనరేంద్రుడు చేసిన లోపమేమి? ధర్మమూర్తియగు నన్నగారిపై కోపమా! ఆ కోపము పితృపాదుల కిష్టము కాదు, ఆదివారాహునకు సమ్మతముకాదు!

విజయాదిత్యుని కుమారుడగు శక్తివర్మస్థితికూడ తండ్రిస్థితినే అను కరించుచుండెను. తండ్రితోపాటు రణరంగములలో తిరుగుచు పడకడ గండ్లు గట్టెక్కినవి. రాజకుమారుల కవసరమగుసమస్తవిద్యలు నతనికి ఉపాధ్యాయులు గరపుచుండిరి. రాజనీతి రణనీతి నేర్చుచుండెను. అతనిది తండ్రివలె తీక్షణప్రకృతి కాదు.తనపై నేభారమునుంచక సుఖముగాజీవితము వెళ్ళనిచ్చినచో సంతోషించు స్వభావము. కష్ట పరంపరల పిమ్మట నిలుక డగా రాజమహేంద్రపురములో పొందుచున్న శాంతి సౌఖ్యము లాతని మరింత సుఖలాలసుని చేసెను.

కాని విజయాదిత్యుని కది బాగుండలేదు. తనవలెనే కుమారుడు గూడ నిరుద్యోగియై కృశించుట యాతని కెంతమాత్రము నిష్టములేదు. తుద కన్నగారితో నా విషయము ప్రస్తావింప నిశ్చయించెను.

ఏకాంతముగా ముచ్చటించుట కవకాశమీయ మని వేడుచు విజయా దిత్యుడు అన్నగారికి వార్తనంపెను. ఆసాయంత్రమే వచ్చుట కభ్యనుజ్ఞ యొసంగి రాజరాజు తమ్ముని నాహ్వానించెను. అంత శీఘ్రముగా నవకాశ మిచ్చినందున నన్నగారి యవ్యాజానురాగమునకు విజయాదిత్యుడు ముగ్ధుడ య్యెను. ఆ సాయంత్రమాతడు రాజదర్శనమునకు పోవునప్పుడు రాజ మందిరములో నాతనికి రెండవ రాజరాజుకువలెనె విశేషపూజలు జరిగెను. అది చూచి యతని హృదయము మరింత యార్ద్రమయ్యెను.

విజయాదిత్యుడు రాజరాజుముందు శిరస్సు వంచి పాదములంటి కన్నుల కద్దుకొని యభివందన మాచరించెను. రాజరాజాతని కరస్పర్శతో నాదరించి యున్నతాసనమున గూర్చుండజేసెను. అచ్చట వారి యేకాం తమున కెట్టి యభ్యంతరమును లేనట్లే యాతనికి గోచరించెను. అన్న గారికి నాయం దెంత విశ్వాస మున్నదని తలంచుకొనుచు నత డుప్పొం గెను.

కుశల ప్రశ్నాదికమైన పిమ్మట వచ్చిన కార్యమేమని రాజరాజు ప్రశ్నింపగా, శక్తివర్మసంగతి ప్రస్తావించుటకు వచ్చినట్లు విజయాదిత్యుడు తెలిపెను.

"శక్తివర్మను కష్టసాధ్యములగు కొన్ని కార్యములలో నియోగింప దలచినాము. అందు కతడు సమ్మతించునా?" అని రాజరాజు అడిగెను.

విజయాదిత్యుని కాశ్చర్య మయ్యెను. తానువచ్చిన కార్య మడుగకుండనే సఫల మైనందున నత డానందభరితు డయ్యెను.

"మీరు నియోగించిన కార్యములు నిర్వర్తించుటకంటె శక్తివర్మకు మరేమి కోరికయుండును? మీ యాజ్ఞ లత డనుగ్రహములుగా భావింపగలడు" అనెను విజయాదిత్యుడు.

"అవును. కొంతకాలమునుండి మాకు అతనికి భారమగు పని చెప్పనిచో ననుభవ మేర్పడక మాంద్య మేర్పడునేమో యని భయ మగుచున్నది. కానియట్టిది మీకు రుచించునో రుచింపదో యని ప్రస్తావింప శంకించితిమి" అనెను రాజరాజు.

విజయా : ఎంతమాట! మమ్ము, మా కుమారుని మీస్వజనముగా భావించి యాజ్ఞాపింపవలె మహారాజా!

రాజరాజు: "మీరును నది సమ్మతమని తెలిపినారు గనుక శక్తివర్మను త్వరలో పిలిపించి యతని కెట్టి కార్యములు సాధించుటలో నెక్కువ యిష్టమో విచారించి నియోగింతుము. మీరు చెప్పిన మాటలపై నాధారపడుచున్నాము సుమా! లేనిచో మరియొకరికా శ్రమ విధింతుము!

విజ : శ్రమ యనవద్దు ప్రభూ! శక్తివర్మ నిరుద్యోగిగనుండుటచే మంద బుద్ధియు వినోదలాలసుడునై దుర్బలు డగునని మేము బహుకాలముగా చింతించుచు నా విషయము మనవిచేయుటకై యీ యేకాంత మభిలషించినాము. అడుగకుండగనే మీ యనుగ్రహమున మా యభీష్టము సిద్ధించినది.

రాజరా జాదరముతో చిరునవ్వు నవ్వెను.

రాజ : పూజ్యులగు విమలాదిత్యులు మాలోనను మీయందును సమానముగ మూర్తీభవించియున్నారుగదా! మన చిత్తములును నందుచే నొకేవిధముగ బ్రసరించును. మీ కోరిక తెలియుటనే మాకు పరమానందమైనది.

విజయాదిత్యుడు మరియు నితరవిషయములు ప్రసంగించి సెలవు తీసికొని వెడలిపోయెను.

వజ్జియ ప్రెగ్గడలు ఉపదేశించిన సువర్ణశృంఖలములు ఈవిధముగా విరియసాగెను. ఆ మరునాటి యుదయముననే శ్రోత్రియులగు పలువురు బ్రాహ్మణులు గోదావరీతీరమున రాజమహేంద్రపురములో యజ్ఞ మొనర్చుటకు అనుజ్ఞ నిరాకరించెనని వజ్జియప్రెగ్గడలపై రాజరాజునకు కొండెము చెప్పి మనవి చేసికొనిరి. అందుపై రాజరాజు వారిని విచారింతు నని చెప్పి సెలవిచ్చి పంపెను.

తాత్కాలికముగా వజ్జియప్రెగ్గడ రాజ్యతంత్రములో నెక్కువ స్వాతంత్ర్యము వహించుచున్నా డని రాజరాజునకు విసుగు జనించెను. అప్పుడే మోటుపల్లిలోని నావధ్యక్షుని రాజమహేంద్రపురమునకు పిలిపింప వలసివచ్చినది. తాత్కాలికముగా నా పదవి యెవ్వరి కీయవలెనో యని యాలోచనలో నుండెను. వజ్జియకు తన యుద్దేశము తెలుపకుండ రాజరాజు శక్తివర్మను పిలిపించి సంభాషించెను. అందుపై నతని కోరికప్రకారము శక్తివర్మకు తాత్కాలికముగా మోటుపల్లిలో నావధ్యక్షపదవి యొసంగెను.

వజ్జియ కది యిష్టము లేదు. నావధ్యక్షపదవి మిక్కిలి విశ్వాసపాత్రునకు సమర్థునకు నీయదగినది. అందులో రానున్న దినములు ప్రమాదకరముగా నున్నవి.

శక్తివర్మ కా పదవి యిచ్చినట్లు రాజరాజు వజ్జియ కెరిగింపగనే వజ్జియ నివ్వెరపోయెను.

"ఇందుచే మనము తీర్పవలసిన భారము ద్విగుణ మొనర్చినారు ప్రభూ! కాని యీ బ్రాహ్మణులకు వైశాఖమాసములో యజ్ఞ మొనర్ప ననుజ్ఞ యిచ్చినచో మాత్రము మనకందరకు నా భారము దుర్భరమగు నని మనవి చేసికొందును."

వజియ పల్కులు విని రాజరాజు చిరునవ్వు నవ్వెను. "భయశీలురగు మీవంటి వృద్ధబ్రాహ్మణుల భయము మా కావేశింప జూచెదరా?" అని యడిగెను.

వజ్జియ దీర్ఘకాలము రాజరాజుతో ప్రసంగించి వెడలిపోయెను.

కొలదికాలమునకే శక్తివర్మ మోటుపల్లికి నావధ్యక్షుడుగా వెడలెను విజయాదిత్యుడు శ్రద్ధగా రాజకార్యము సమర్థతతో నిర్వహింపవలె నని కుమారునికి పునః పునః ఆదేశించి ఆశీర్వదించి పంపెను.

ఎండలు ముదిరెను. ఎండాకాలము రాజమహేంద్రపురములో తన ప్రభావము స్పష్టపరచుచుండెను. వడగాలి ఈ చెవినుండి యా చెవిలోని కీడ్చి వీచుచు జీవకోటులను నీరసప్రాయులనుగా జేయుచుండెను. ఆ పట్ట ణమును పాలించిన రాజు లెందరో మారిరి కాని ఋతురాజులు మాత్రము ఎవరికాలమున వారి ప్రభుత్వము నిర్విఘ్నముగా నెరపుచుండిరి.

పట్టణమంతటను ప్రపలు నెలకొల్పిరి. అందు ఎండబాధకు తాళలేని వారికి నిల్వ నీడయే గాక దాహము తీర్చుకొనుటకు చల్లని నీరమును మజ్జిగయు పుష్కలముగా లభించును. ప్రధానములగు చతుష్పథములం దెల్ల నట్టి ప్రపలు కలవు. అవి విశేషభాగము రాజస్థాపితములే; కాని ధన వంతులగు ధర్మాత్ములు పెట్టినవికూడ గలవు.

ప్రపాదులు ఎండబాధను కొంత యుపశమింపజేయు సాధనములే కాని యవి రాజమహేంద్రపురి ఎండబాధ నెట్లు తీసివేయగలవు! అందును సామాన్యుల మందిరములలో వాతాయనములు తక్కువ. మహాపట్టణములో నిండ్లు దగ్గర దగ్గరగా నున్నందున ప్రకృతిసిద్ధముగా నెండవేడి ఎక్కువ ప్రసరించు నచ్చటి గృహములు వాససౌఖ్యము లేకుండెను. జనములకు హృదయములలో నావేదన పెరుగజొచ్చెను.

కాని విశేషధనాఢ్యులకు ఋతు భేదమునుబట్టి ప్రత్యేక సౌక ర్యములు గల వేర్వేరు మందిరములుండెను. రాజరాజు రాజబంధువులును వారి వారి గ్రీష్మ మందిరములలో ప్రవేశించిరి. విజయాదిత్యు డానాడు విశాలమగు తన గ్రీష్మమందిరములో ప్రవేశించెను.

అది యొక చక్కని యుద్యానమధ్యమున నున్నత ప్రదేశమున గలదు. అచ్చటినుండి గోదావరీప్రవాహము కనుపించును. ఆ మందిరము

నకు వాతాయనము లనేకము లున్నవి. వాతాయనపార్శ్వముల జలయంత్ర ములనుండి నీటి తుంపురులు చల్లగా పడుచుండెను. వేడి గాడ్పు లోనికి రాకుండ ద్వారములకు వట్టివేరు తడకలు వ్రేలజేసి వానిని నిరంతరము తడుపుచుండిరి. కృత్రిమముగా నా మందిరమున నెండవేడి ప్రవేశింప కుండుట కెన్నియేని కల్పనలు చేసిరి.

విజయాదిత్యుడు సుఖాసనముపై సుఖాసీనుడై యుండెను. ఇరువురు యవన మత్తకాశినులు చామరములు పట్టి మందమందముగా విసరు చుండిరి. మఱి యొకతె మేనికి చందనచర్చ చేయుచుండెను. అతని మనస్సు చల్లపడి అన్నగారి ప్రేమాతిశయమును గూర్చి యాలోచించుచు శక్తివర్మను వెంటనంపెను.

నావధ్యక్షపదవి వేంగీరాజ్యములో మండలాధిపత్యముకంటె నున్నత మగు పదవి. సముద్రయానము చేయు ప్రవహణములకును నదీప్రయా ణము లొనర్చు నావలకును వాహినుల తరించు తరులకును నావధ్యక్షుడే యధికారి. దేశములోనికి దిగుమతి యగు సరుకు లన్నిటిమీద పన్ను వసూలుచేసి పరాహముద్రిక యతడే వేయును. అతని యనుజ్ఞాపత్రము లేని దే నావయు నదీప్రయాణము చేయరాదు; ఏ తరియు తరింపరాదు; ఏ ప్రవహణమును బయలుదేరరాదు. ఈ శాసనము ధిక్కరించినవారు క్రూర దండనకు పాత్రులగుదురు ప్రజల ప్రయాణములు చాలభాగము నావధ్య క్షుని యధికారమునకు లోబడియుండును. అత డాజ్ఞాపించినచో దేశములో రాకపోక లన్నియు కట్టువడిపోవును. అందుచే నావధ్యక్షపదవి బహు విశ్వాసపాత్రుడు, అనుభవశాలి, అప్రమత్తుడు నగువాని కిచ్చు నాచారము.

అట్టి యున్నతపదవి రాజరాజు తన కుమారున కిచ్చినాడు. అందులో నది యయాచితముగ నసుకొనకుండగ లభించెను. ఈ పదవి శక్తివర్మ సామర్థ్యముతో నిర్వహించిన నతనికి వేంగీరాజ్య మంతట విశేషగౌరవము పలుకుబడి రాగలదు।

అదియునుగాక ఆ సమయములో రాజధానీ నగరమునను వేంగీ రాష్ట్రమునను జరుగుచున్న గుసగుసలు విజయాదిత్యుని చెవి జేరకున్నవా?

సముద్రములో తుపాను రేగుటకు ముందు కనపడునట్లు రాజ్యమంతటను గొప్పయలజడి జరుగు ప్రయత్నములతో రాజమహేంద్రపురము కడుపు నిండి యుండెను.

అట్టి సమయములో నావధ్యక్షునికి చాల పని కలుగును. అత డా సమయమున తీవ్రముగా జాగరూకుడై విధి నెరవేర్పనిచో అల్లరి యడచుట సాధ్యముకాదు. విశ్వాసపాత్రులగు రాజభటులకు శీఘ్రగమనమునకు సౌకర్యములు సంపాదింపవలెను. రాజశత్రువులగు విప్లవకరులను అడుగు కదల్పకుండ జేసి ప్రమాదవార్తలు ప్రాకకుండ నరికట్టవలెను. ఈ క్లిష్ట పరీక్షాసమయమున శక్తివర్మపై నీ భారముంచుట అలోచించనకొలదియు విజయాదిత్యునికి సంతోషముతోపాటు కొంత భయము కూడ కలిగించెను. శక్తివర్మ విధి నిర్వర్తింపనిచో నెంత ప్రమాదము! యువరాజుపై నీభారముంచక తన కుమారునిపై మహారాజీ భార మెందు కుంచినాడు?

ఈ స్థితిగతులలో యువరాజును చోళరాజ్యమునకు పంపుట శుభమే. కీడెంచి మే లెంచుట రాజనీతి. రాజమహేంద్రపురిలో నుపద్రవ మేదేని సంభవించి రాజరాజుకు, యువరాజుకు నొకేసారిగా నపాయము కలిగిన ప్రమాదము కాదా! ముందు యువరాజును సురక్షితముగా కాంచీపట్టణము చేర్చుట క్షేమమే. అయినను ఇట్టి విపత్సమయములో నపాయము లెదుర్కొనుట నేర్చుకొననిచో యువరాజు మరెప్పుడు నేర్చుకొనును! ఈ వేంగిరాజ్యమును అవిచ్ఛిన్నముగా మూడు తరములు పాలించినవా రెవరు?

అంతలో నతనికి విజయవాడ కెదురుగా ఉండవల్లి రేవునొద్ద స్కంధావారములో నాతడు కనిన స్వప్నమును స్వప్నవేత్త చెప్పిన వాక్యములును జ్ఞప్తివచ్చెను. రాజరాజనరేంద్రుని యనంతరము తానే వేంగీరాజ్యాధిపతి కాగల డని కాదా యాతడు చెప్పినది! ఒక్క నిమేష కాల మా భావనాసౌఖ్యముతో లోలుడై యానందించెను కాని యుత్తరక్షణముననే యాతని హృదయము శూలముతో పొడిచి నట్లయ్యెను. సాక్షాత్తు పితృతుల్యుడగు తన యన్నగారి రాజ్యమును కాంక్షించు తా నెంత దుర్మార్గుడు! ఎంత కృతఘ్నుడు! ఎంతవిశ్వాసఘాతకుడు! రాజపుత్రుడు

ఖడ్గము పట్టి చేసిన ప్రమాణము తప్పునా! విజయాదిత్యుడు రాజరాజుతో సంధి చేసికొనినప్పుడు ఖడ్గముపట్టి రాజరాజునకు అతని సంతతికిని విశ్వాసపాత్రుడై సేవ చేయునట్లు ప్రమాణము చేసెనే! అట్టియెడ అన్న గారి రాజ్యపదవియందు లోభము కలుగుట— ఒక్కనిమేషము మాన సికముగానే ఐనను— ఎంత నీచము! ఛీ! అతని దేహము అప్రయత్న ముగా జలదరించెను!

చామరము వేయుచున్నవారిలో నొక యవనయువతి యది గమ నించి 'జలయంత్రములోని శైత్యము తగ్గింతునా?" అని ప్రశ్నించెను.

'అవసరములే'దని విజయాదిత్యుడు త్తరమిచ్చి దేహమునుప్రయత్న పూర్వకముగా స్వాయత్త మొనర్చుకొనెను. అప్పుడు ప్రతీహారి వచ్చి మల్లప్ప రాజపుత్రుడు దర్శనార్థము వేచియున్నాడని నివేదించెను. కొంచె మాశ్చర్యపడుచు వెంటనే యాతని ప్రవేశపెట్ట ననుజ్ఞ యొసంగెను ప్రతీ హారి మల్లప్పను ప్రవేశపెట్టి నిష్క్రమించెను.

ఇప్పుడు మల్లప్ప యథాప్రకారము స్వస్థుడై యుండెను. విజయా దిత్యుని వయస్సుకును పదవికిని అర్హమగు విధమున నతనికి మల్లప్ప వంగి నమస్కరించెను. విజయాదిత్యునిచే ననుజ్ఞాతుడై యాత డాసన మలంకరించెను.

కుశలప్రశ్నాదిక మైనది. అంతట మల్లప్ప యిట్లనెను :

"ఇన్నాళ్ళకు శక్తివర్మశక్తికి అర్హమగు నుద్యోగము లభించినది. మా కందరికి నందు కెంతయు నానందమైనది. మీ కుమారుని కీ గౌర వము లభించుట మాకు లభించినట్లే మా సోదరుల మందరము భావించి యానందించుచున్నాము".

ఆ మాటలకు విజయాదిత్యుడు సంతోషముతో పొంగిపోయెను. కాని చిరకాలాభ్యస్తమగు నాత్మనిగ్రహముతో పొంగు కనుపరపక, "ఆప్తులైన మీ రానందించుటలో వింత యేమున్నది? కాని యత డా పదవి నిర్వ హించినప్పుడు గదా మనబోటి యాప్తుల మెక్కువ సంతోషించునది!" అనెను.

మల్లప్ప : అందుకు సందేహమా! పితృ సహజమైన యధైర్యముతో మీరట్లను చున్నారు. కాని శక్తివర్మకును మీకును తలచుకొన్నచో సాధ్యము కాని దేమున్నది! సాక్షాత్తు మీరిరువురు రాజరాజుకును యువరాజుకును తుల్యులాయెను.

వెంటనే విజయాదిత్యుడు సవరించెను :

"అంతమాట స్తోత్రములోకూడ ననరాదు. ప్రభువులతోడను ప్రభు పుత్రుని తోడను సామ్య మెంతవారికిగూడ కూడదు."

అనాడు మల్లప్ప సంభాషణ మంతయు నాతీరుననే యుండెను. విజయాదిత్యుని పలుకులుగూడ నా విధముననే అవకాశ మీయకుండ నుండెను.

మల్లప్పకు అశ్వ మెక్కుటలో గలిగిన ప్రమాదముచే కలిగినబాధ, తచ్చికిత్స విషయములు విజయాదిత్యుడు ప్రశ్నించెను. మల్లప్ప యా సంగతులు వివరించి తనకు కలిగిన ప్రాణాపాయము కేవలముగా సంఘారామములోని వైద్యులు పోసిన ప్రాణమువలననే తప్పినట్లు చెప్పెను. మరియు —

"ఆ అశ్వము తెచ్చిన సైంధవుడు, పాపము, తస్కరుడు కానే కాడట! సంతకు వచ్చిన యశ్వవర్తకుని యశ్వశిక్షకుడట! రాజానుమతితో కేవలము క్రీడార్థము వచ్చినవానిని తస్కరునిగా బంధించి యింతకాలము నధికరణస్థాన మునకుగూడ రాకుండజేయుట విదేశవర్తకుల కలజడి కలిగించుచున్నది. ఇది రాజరాజులకు మనవి చేయవలెనని యున్నది." అనెను.

"మంచిది! ధర్మకరణమునకు రాజరాజనరేంద్రులు వెనుదీయువారు కారు. నేను చిన్నతనమునుండి యెరుగుదును గదా! ఎప్పుడు నింతే" అని విజయాదిత్యుడు ధైర్యము చెప్పెను.

మల్లప్ప : నిజమే కాని, రాజరాజుల మతి విరుచువా రున్నారు. వా రంధ్రరక్షు నట్టి ధర్మబుద్ధి యున్నట్లు తోచుటలేదు. చూడరాదా! యువరాజు ప్రమాదమని మాసోదరు లందరు కన్నులార చూచి చెప్పుచున్న

దానికి మా సోదరులలో గాండీవివంటివానిని శిక్షపాలు చేసిరి! ఈ సందర్భమున నాకేమి చేయవలెనో తోపకున్నది.

విజయా : ఆ విషయము మీకంత బాధ కలిగించుటకు కారణమేమి?

మల్లప్ప : అతడు నిర్దోషి యని నాకు సంఘారామములో చికిత్స నొందుచుండగా నిశ్చయముగా తెలియవచ్చినది. అశ్వైంధవ వర్తకుడు, తన యశ్వ శిక్షకాగ్రేసరుడు లేనందున నశ్వములన్నియు నీరు మేత ముట్టక క్షీణించిపోవుచున్నవని ఘోషపెట్టని దినములేదు. జనఘోష యాలకించనిచో మనకు మాత్రము శుభమా!

విజయా : అట్లగుచో, నా విషయము మీరే రాజరాజులతో ప్రస్తావింపక పోయితిరా? ఇన్నాళ్ళు నపరాధిని అధికరణస్థానమునకు తేకుండుట మాకును వింతగనే యున్నది. కాని యం దేదో కీలక ముండవచ్చును.

మల్లప్ప : ఏమియు లేదు. నిర్లక్ష్యము! నైర్ఘృణ్యము!

విజయా : ఐనచో మీ రా విషయము వెంటనే రాజరాజులకు నివేదించుట యుత్తమము! ఆలసింపవలదు!

మల్లప్ప యెన్నో విధముల నంతరము సంపాదించుటకు ప్రయత్నించియు, విజయాదిత్యుని యుత్తరములచే విఫలీకృతయత్నుడై యాశ వదలుకొని యానాటికి సెలవు తీసికొని వెడలిపోయెను. విజయాదిత్యుడును మల్లప్ప వ్యంగ్యవాక్యము లర్థమయ్యు నర్థము కానివానివలె ప్రవర్తించెను.

శక్తివర్మ యనుభవము లేనందున వీరి తేనె మాటలకు లొంగిపోయి ప్రమాదము తెచ్చుకొనడు గదా!

ఇట్లు తలంచుచు చిత్తశాంతి కొరకు పంపనభట్టోపాధ్యాయులను దయచేయవలసినదని వార్త నంప నాతడు వచ్చెను. ఈ పంపనభట్టోపాధ్యాయులు పరాశర గోత్రుడు. వేదవేదాంగవిదుడు. మీమాంసాప్రవీణుడు అంతియకాక యాతడు అగస్తునివలె చుళుకీకృత సమస్తసాహిత్యసాగరుడు. పాఠప్రవచనమున ప్రవీణుడు. ఐనను సభాముఖమున మాటాడగల నేర్పు కలవాడు కాడు. అదియునుగాక యాతని కావ్యపక్షపాతము చీద

మార్యుని నిశితతర్కము ముందు తరచుగా నిలువక పరాస్త మగుచుండు టచే రాజసభలో నాతడు మాట్లాడ జంకుచుండెను. కాని యాతని ప్రతిభ యేకాంతప్రసంగములలో మిక్కిలి శోభిలుచుండును.

చాల ప్రొద్దు పంపనభట్టోపాధ్యాయులతో శాస్త్రవిచారణ చేయుచు విజయాదిత్యు డానాడు గడిపెను. శాస్త్రగ్రంథము లన్నియు సంస్కృత ములో నున్నవి. శాస్త్రవిషయములు భాషాగ్రంథస్థ మేల చేయరాదు? ఇది విజయాదిత్యుని ప్రశ్న.

ఉపాధ్యాయు డది యనేక శాస్త్రోదాహరణలతో విశదీకరించెను. జైమినీయ ధర్మసూత్రము లున్నవి. అవి వేదమంతయు మనస్సులో నుంచుకొని పుట్టినవి. ఆంధ్రభాషలో పాఠము చెప్పిన ధోరణిగా విస్తరింప దగునే గాని యట్టి సూత్రము వ్రాయుట సాధ్యము కాదు. భరతధర్మ సారము సులభముగా గ్రహింప దలచిన వారికి వేదవ్యాసకృత మహాభార తమే శరణ్యము. అది ఆంధ్రీకరించుట సాధ్యమా!

# 34

అనాదిగా భరతఖండమునకు బంగారు పండు భూమియను ప్రతీతి కలదు. మానవుల తృష్ణకు అంతములేదు భరతఖండవివాసులకు కూడ ఈ ధనతృష్ణ కలదు ఇంతకంటెగూడ నెక్కువ బంగారు సులభముగా దొరకునని ప్రతీతిగల యితరభూములకు భరతఖండవాసులు యాత్రలు సాగించినారు. అట్టిభూములు ప్రధానముగ తూర్పుసముద్రమున నెన్నియో కలవు. అవి ఎక్కువభాగము ద్వీపములు, కొన్ని ద్వీపకల్పములు. అందులో ప్రధానములు సుమిత్రద్వీపము, యవద్వీపము, సువర్ణద్వీపము, మధురద్వీపము, బలిద్వీపము, లంబకద్వీపము, కుంభద్వీపము, తామ్ర ద్వీపము, మలయద్వీపకల్పము. వాని నన్నిటిని పేర్కొనుట యసాధ్యము. కేవలమవి యసంఖ్యాకములు, వేనకువేలు కలవు. ఇట్లువానికి ప్రత్యేక నామము లున్నను అన్నిటికి సామాన్యనామము సువర్ణభూమి, సువర్ణద్వీప మనియే!

భరతఖండమున తూర్పు సముద్రతీరమున ముఖ్యమగు రేవుపట్టణ

ములు మూడు ఉత్తరమున గంగానదీద్వారమునొద్ద తామ్రలిప్తి, వేంగీతీర మున కృష్ణానదీ ముఖద్వార సమీపమున మోటుపల్లి, దక్షిణమున కావేరీ నదీద్వారమునొద్ద నాగపట్టణము — ఇవి ప్రధానములు. ఇవిగాక మరియు ననేకములు గలవు. సువర్ణద్వీపయాత్రచేయు నావలు సూటిగా సముద్రము లోనికి ప్రయాణముచేసి నక్కావరము (నికోబారు) దీవులు చేరుకొనును. ఆ పిమ్మట సుమిత్రద్వీపమున ఇంద్రగిరినదీ ముఖద్వారమునో, మలయ ద్వీపకల్పము దక్షిణాగ్రమున సింహపురమునో చేరుకొనును. అచ్చటి నుండి యా నావల లోననెగాని యితరనావలపైగాని నిర్ణీతప్రదేశము చేరి కొందురు. రాజరాజనరేంద్రుని మామగారగు గంగైకొండ రాజేంద్ర దేవుడు నక్కావరము ద్వీపములను, మలయద్వీపకల్పమున, ద్రావిడవాఙ్మ యములో కడారమను నామము గల కటాహమును అందలి విద్యాధరతో రణమును జయించి, పన్నాయ్, మలైయూరను పర్వతదుర్గము మాయిరు డింగ మను సముద్రజలదుర్గమును, మరియు ననేక ప్రదేశములను జయిం చెను. కటాహాధిపతియగు విజయోత్తుంగవర్మ యెదిరింపగా నతనిజయించి బంధితుని చేసెను. ఇట్లచ్చట ననేక భూభాగములు జయించి యంతటికి శ్రీవిషయమును నామమిడి చోళరాజ్యమున నొక మండలముగా జేసెను.

అట్లాదీవుల జయించిన మొదటి భారతచక్రవర్తి గంగైకొండ చోళుడు కాడు. అప్పటికి వేయి సంవత్సరములకు పూర్వమే ఘూర్జర రాజకుమారు డొకడు యవద్వీపమును జయించెను. తదాది యచ్చట నా రాజపుత్రునిపేర శక మారంభమయ్యెను. అట్లే ఆ ప్రదేశము లన్నియు భరతఖండములోనుండి తెగి దూరముగా నున్న ఖండములవలె నున్నవి.

ఈ దీవులకు ముందు వర్తకులు వ్యాపారార్థము వెళ్ళుచుండిరి. నెమ్మది నెమ్మదిగా బౌద్ధశ్రమణులు, జైనశ్రావకులు వారి ననుగమింప సాగిరి. వర్తకము, దానివెంట నొక మతము, దానివెంట వలసలు ప్రారం భమయ్యెను. వలస లొక్కొక్కతరి శాంతముగా జరుగుచుండెను. కాని తరుచుగా నవి యా ద్వీపవాసులకు ఇష్టము లేకపోవుటచే వలసలే దండ యాత్రలుగా మారజొచ్చెను. ఒక్కొక్కమారు జయము వీరిది, ఒక్కొక్క

మారు జయము వారిది! నెమ్మదిగా ఆ ప్రదేశములపై భారతముద్ర స్థిరమయ్యెను. దేవాలయములు వెలసెను. భారత రామాయణములు పాదుకొనెను. సంఘారామములు నిండిపోయెను. భరతఖండములో నెక్కడ సముద్రతీరప్రాంతముల జీవనము కష్టముగా నున్నను, కల్లోలములు చెలరేగినను జనులు సువర్ణభూములకు వెళ్ళుట పరిపాటి యయ్యెను. ఇది ముఖ్యముగా బౌద్ధమతానుయాయులలో ప్రబలెను.

బౌద్ధధర్మమున వర్ణవ్యవస్థ లేదు. భారతధర్మము వర్ణవ్యవస్థపై నాధారపడియున్నది. భరతభూమిలో పుట్టిన ప్రతివ్యక్తియు వద్దనుకొన్నను తప్పనిసరిగా ఈ వర్ణవిభాగ మంటుకొనును. ఈ సృష్టియే వర్ణభేదముతో చేయబడినట్లు తోచును. వర్ణభేద మంగీకరించిన బౌద్ధధర్మము జైనముగా పరిణమించి రూపాంతరములతో నిలువగలిగెను.

కేవలము బౌద్ధము ఈ దేశమునకు బయటినుండి వచ్చినవారిలో నుద్భవించెను. అట్టివారు ప్రాకిన ప్రదేశములలో నదియు వ్యాపించెను. ఎట్లయినను శుద్ధబౌద్ధము భరతభూమిలో నిలువలేక లోకమంతటను వ్యాపించెను. పశ్చిమభూములలో జందు, యూదు, క్రైస్తవ, మహమ్మదీయ మతములుగా పరిణామము నొందెను; తిబ్బతీ దేశములో లామామత మయ్యెను. చీనా, జపాను, బ్రహ్మదేశము, సువర్ణభూములు, సింహళము ఇత్యాది ప్రదేశములలో స్థానికమతములతో కలసి హీనయాన మహాయానములయ్యెను.

భరతఖండములో బౌద్ధధర్మవ్యాపనకు అడుగడుగునకు విఘ్నములే సంభవింపసాగెను. కాని భరతఖండములో దీర్ఘకాలమున్నందున, వైదిక ధర్మము, సాంఖ్యము, యోగము, ఇత్యాదులతో సాహచర్యమువలన బౌద్ధధర్మమునకు నూతనశక్తి కలిగెను. అందుచే ఇతర భూములలో దానికి నల్లేరుపై బండినడకవలె వ్యాపనము సులభసాధ్యమైనది. అది యే భూమిలో ప్రవేశించిన నాభూమిలోని జనుల విశ్వాసాదులు గ్రహించుచు వారి ధర్మముగా పరిణామము పొందసాగెను. సువర్ణభూములకు బౌద్ధవీరులు ఖడ్గములు, వర్తకులు సరుకులు తీసికొని పోవుచుండగా, బౌద్ధ

శ్రమణులు మైత్రి, శ్రీధ్వజములు తీసికొని వారివెంట ననుగమించు చుండిరి

ఇట్లు బౌద్ధము రూపాంతరములు పొందుచున్నను చాలకాలము వరకు ఉత్తరదేశములను తూర్పుభాగములను మాత్రము భరతఖండ మందలి మూలబౌద్ధముతో సంబంధము తీరిపోలేదు. శాక్యగౌతముడు ప్రథమమున బోధిదీక్ష దీపంకరబుద్ధునియొద్ద గ్రహించెను. నాలుగు అసం ఖ్యేయకల్పములును, లక్షకల్పములును గడచినవి. అందులో ఇరువది నలు గురు బుద్ధులు గడచిరి. ఇంత కాలమును జన్మలెత్తుచు ఇందర బుద్ధుల యొద్ద దీక్ష గైకొనుచుండెను. చివరకు కాశ్యపబుద్ధునియొద్ద దీక్ష తీసి కొనెను. ఈ కలియుగాదిగా 2478వ సంవత్సరమున హిమాలయభూము లలో శుద్ధోధనుని పుత్రుడై వైశాఖపూర్ణిమనాడు జనించి, వైశాఖ పూర్ణిమ నాడు దారాపుత్రుల వదలి వైశాఖపూర్ణిమనాడు బుద్ధత్వము నొంది వైశాఖ పూర్ణిమనాడు పరినిర్వాణము నొందెను. ఈ గౌతమబుద్ధుడు మగధరాజ్య ములో పర్యటనము చేసి మతప్రవర్తకుడయ్యెను. బుద్ధుని పాదనిక్షేపముచే భరతభూమి పవిత్రమైనది. అతని హస్థిశేషములు అశోకచక్రవర్తి భరత ఖండమంతట వెదజల్లి ఈ భూమినే మహాచైత్యముగా మార్చివేసినాడు. ఇట్టి విశ్వాసములు బౌద్ధులకు కలవు కనుక లోకమందలి బౌద్ధనామధారుల కెల్ల భారతభూమి, యూదులకు పాలస్తీనువలెను, క్రైస్తవులకు జరూస లేమువలెను, మహమ్మదీయులకు బర్బరదేశమువలెను పుణ్యభూమి యయ్యెను. అందును ముఖ్యముగా గౌతము డవతరించిన వేలువనము, సంబోధి పొందిన బుద్ధగయ, ప్రథమధర్మ ప్రవర్తనచేసిన సారనాథము మహాపరి నిర్వాణము పొందిన కుశీనగరము వారికి పవిత్రాతిపవిత్ర దేశ ములు. అవి వారికి తీర్థయాత్రాస్థలములు. అవియే భరతభూమిపైకి ఎన్ని యేని దండయాత్రలకును అంతఃకలహములకును కల్లోలములకును గూడ కారణములయ్యెను.

సువర్ణద్వీపయాత్ర యనాదిగా సాగుచున్నను పెద్దయెత్తున వేంగీ మండలము నుండి యిప్పటికి ఎనుబది యేండ్లనుండియే సాగినది. రాజ

రాజనరేంద్రుని పెత్తండ్రి శక్తివర్మ యిప్పటికి రాజ్యమునకు వచ్చి ఏబది మూడేళ్ళయినది. అంతకు పూర్వము ఇరువది యేడేండ్లు దేశ మరాజకముగా నుండెను. రాజరాజనరేంద్రుల పితామహులగు దానార్ణవులను దూరపుజ్ఞాతి యగు బాదపరాజు హత్యజేసి రాజ్య మాక్రమించుకొనజూచెను గాని సామంతదండనాథులను ప్రజలును బాదపరాజుపాలన మంగీకరింపరైరి బలవంతులు బలహీనులను హింసింపచొచ్చిరి. భూవసతులు లేక కేవలము శిల్పము, నేత, అద్దకము, వైద్యము, కంచరము, కూలి—ఇత్యాదివృత్తులపై జీవించువారి జీవనము కష్టతరమయ్యెను. వారప్పుడు విశేషము బౌద్ధాభిమానులు! సంఘారామములు సువర్ణభూములకు అట్టివారు వలసలుపోవుట కెన్నియో వసతులు కల్పించెను. అందుచే సంఘారామములు కొంత ధనవంతము లయ్యెను. నావలగల వర్తకులు లక్షాధికారులును కోటీశ్వరులును నైరి. అట్లా ఇరువదియేడేండ్లును వేంగిరాజ్యము నుండి వలసలు నిరాఘాటముగా సాగిపోయెను.

మరల వేంగిరాజ్యములో చోళప్రభువుల సహాయముతో రాజ్యస్థయిర్య మేర్పడిన పిమ్మట వలసలు తగ్గిపోయినవి అయినను వలసపోయి సువర్ణభూములలో ధనవంతులై పూర్వబంధువులను దర్శించుటకును పుణ్యక్షేత్రములు దర్శించుటకును, వ్యాపారము సాగించుకొనుటకును కొందరు మధ్యమధ్య వేంగిభూమికి వచ్చి పోవుచుండిరి. అట్టివారు సువర్ణభూములలోని సౌఖ్యము అతిశయోక్తులతో వర్ణించి చెప్పుచుండ వినినవారికి అచ్చటికి వెళ్ళవలెనను వ్యామోహ మతిశయింపసాగెను. అక్కడికి వెళ్ళినవారికి తమకు సజాతీయులు మరికొందరు వచ్చుట తమ స్థయిర్యమునకు బలమైనందున నట్టివారి యుత్సాహము నెక్కువ చేయుచుండిరి. వర్తకులు నావలలో తెచ్చు నమూల్యవస్తువులవలనను వారు స్వలాభార్థము చేయు నుద్బోధవలనను మరింత యుత్కంఠ యతిశయించుచుండెను. అట్లు మధ్యమధ్యవలసలు సాగుచునే యుండెను. అన్ని వలసలకును సంఘారామములు సహాయకారులగుట పరిపాటి యయ్యెను.

ఈ వలసలు ఒక్కొక్కసమయమున వేంగిప్రభువులకు సమ్మతములే కాని కొన్ని ప్రదేశములు నిర్జన మగుచున్నందున తరుచుగా

వారి కిష్టము లేకుండెను. అయినను వాని నరికట్టకుండుట వారి యాచారమయ్యెను. బౌద్ధ సంఘారామములకు ప్రజాసామాన్యములో పలుకుబడి సంపాదించుకొనుటకు వలస లేర్పాటు చేయుట యొక యాధారమయ్యెను.

ఈమధ్య నెన్నడు లేనంత విపులమైన వలస యీ సంవత్సరము వైశాఖశుద్ధ పూర్ణిమకు సారంగధరమెట్ట సంఘారామమునుండి బయలుదేరు నని వేంగీమండల మంతయు మ్రోగిపోయినది. అది చైత్రశుద్ధములో ప్రారంభించిన సంతమూలకముగాను క్రీడావినోదములమూలమునను మరింత వ్యాప్తిచెందెను. నాగరాజులు సువర్ణభూములలోని సంపత్తు జీవనసౌఖ్యము కథారూపమున గానములు చేయసాగిరి. జీవనము జరుగని పేదలు అశాంతిగల యువకులు విశేష ధన మార్జింపవలె నని తృష్ణాతురతకలవారు వ్యవహారములు సద్దుకొని త్వరగా బయలుదేరసాగిరి. చీనా నుండివచ్చిన మహాత్ముడు వారి ప్రయాణమునకు ముందు మహోపదేశము చేసి యాశీర్వదించు నని కూడ వార్త వ్యాపించెను. వలస వెళ్ళదలచిన జనము చైత్రమాసాంతమునుండియే రాజమహేంద్రవరమునకు గుంపులు గుంపులుగా కూడసాగిరి. ఇందరు జన మొక్కమారుగా నొకచోట కూడుచున్నందున వారికొరకు కెన్నియో సౌకర్యములును కట్టుదిట్టములును జేయవలసి వచ్చెను. పౌరారోగ్యమునకు భంగము లేకుండచేయుట మొదటి పని. అట్టి నియమములను ఆగంతకులు తెలిసికొని వానిని పాలించునట్లు చేయుట రెండవపని. ఇట్లు వలసలు పోవువారు ఎట్టి కార్యములాచరించుటకును వెనుదీయని సాహసులు. అందును సమూహముగా చేరినవారు చేయు గుండగములు పట్ట శక్యము కాదు. ఇన్ని పనులు నిర్వర్తించుటకు సమర్థులగు రాజభటు లెందరేని అవసరము. ఎక్కువ పని యుండని దూరమండలమునుండి సహస్ర సంఖ్యలుగా భటులను రాజమహేంద్రపురమునకు పిలిపించిరి. అశ్వికులు శీఘ్రముగా వార్తలు చేర్చుచుండిరి గజబలములు పురరక్షణమునకు కేంద్రములలో నిలిచియుండెను. పదాతు లంతట ప్రసరించియుండిరి. ఈవిధముగా నెమ్మది నెమ్మదిగా

రాజమహేంద్రపురము శాంతినిలయమగు పట్టణపు లక్షణములు లేక మహా సైన్యము పోగైన స్కంధావారముగా మారిపోయెను.

బౌద్ధుల కన్నిటికంటె వైశాఖపూర్ణిమ పెద్ద పండుగ. ఆ నాడు ప్రతి బౌద్ధ సంఘారామములోను, చైత్యములోను క్షేత్రములోను పెద్ద ఉత్సవము చేయుదురు. ఆ తిరునాళ్ళకు పూగు ప్రజలు ప్రభలు కట్టుకొని పోవు నాచారము కలదు. చిన్న మ్రొక్కుబడు లున్నవారు వీపుప్రభలు కట్టుకొని వెళ్ళుదురు. ధనికులగువారు బండ్లపై ప్రభలు తీసికొనిపోవుట కద్దు పశుజాడ్యములు వచ్చినప్పుడు బౌద్ధదేవతలకు మ్రొక్కుకొనుట కలదు. నయమైనచో నా పశువులతో శకటము కట్టియందుపై ప్రభ పెట్టి దేవతకు ప్రదక్షిణము చేయింతురు. నావలు నడుపువారు తరుచుగా బౌద్ధాభిమానులు. వారు యాత్రికులను తీసికొనిపోవుచు నావలపై వీలుకొలది ప్రభలు పెట్టువారు.

ఇట్లనేక విధములగు ప్రభలున్నను అవి ప్రభాస్వరూపమును నిర్వర్ణించునవికావు ప్రభ యొక లాంఛనము। ఒక్కొక్కసమితి కొక్కొక్క ప్రభయుండును. ఒక్కొక్కశ్రేణి కొక్కొక్క ప్రభయుండును. ఒక్కొక్క గ్రామమునకు గాని మండలమునకుగాని ప్రత్యేక లాంఛనము యుండును. వానితో ఒక్కొక్కశ్రేణి లాంఛనము మేళవించును.

ఏ వృత్తికి సంబంధించిన ప్రధానసాధనములు ఆ వృత్తిచే జీవించువారికి పూజ్యదైవతములు. పడవనడుపువాడు అనుదినము పడవకు నమస్కరించి పడవ సాగించును. కులాలుడు చక్రమును పూజించును. మగ్గము సాలీనికి పవిత్రము. మంగలిపొదిని దైవముగా భావించును. శిల్పికి బాడిత, ఉలి, సుత్తి, దిమ్మె—ఇత్యాదులు దైవతములు. తెలుకులకు గానుగ, చాకలికి బాన, గౌడుకు తాడి, గొల్లకు కంబలి—ఈ విధముగా నెన్నియేని పూజింతురు. కర్షకుడు ఏటేట నాగలిని కోడేరును పూజించి ఏరువాక సాగించును.

ఇట్లే వర్తకశ్రేణులకుగూడవర్తకద్రవ్యమునుబట్టిప్రభాలాంఛనము మారును. ఈ వర్తక సంఘములకు సమయములనియు నామాంతరము కలదు. పదునెనిమిది సమయములు ప్రసిద్ధమైనవి కలవు. వ్యాపారము

చేయు దినుసునుబట్టి సమయము భేదించును. 'సమయము' నకొక లాంఛన ముండును. అదియే ఆ 'సమయప్రభ.' అయ్యావళీవర్తక సంఘమునకు తెడ్డువంటి యాకారముగల 'వజ్రభైషిగ' చిహ్నము.

ఎవరి లాంఛనము వారి ప్రభాచిహ్నము! బౌద్ధచిహ్నములగు బుద్ధ విగ్రహము, బోధిద్రుమము, అపసవ్యమగు స్వస్తికాకారముగల ధర్మ చక్రము, ఇందులో నొకటిగాని కొన్నిగాని యన్నియుగాని బౌద్ధప్రభ లన్నిటిమీద నుండును. ఏ మండలమువారిది, ఏ శ్రేణివారిది, లేక ఏ సమ యమువారిది తెలియజేయు చిహ్నములుగూడ నుండును. ఒక్కొక్క తఱి గ్రామపుర సంజ్ఞలుగూడ నుండును. ఈ సంజ్ఞలు మారవు. చిత్ర కారుల యూహకొలది వాని యలంకారములు మారవచ్చునేగాని స్వరూ పము మారదు. తద్జ్ఞులైనవారు ప్రభచూచినవెంటనే యది యెవరిదో తెలిసికొనగలరు.

బౌద్ధుల తిరునాళ్ళలో ప్రారంభించినది శివాలయములకు చేరు భక్తజనులుగూడ నవలంబింప సాగిరి. వానిలో బౌద్ధచిహ్నము లు తీసివేసి శైవచిహ్నము లెక్కించిరి. రంగురంగుల చిత్రములతో నీ ప్రభ లెంత యేని నయనాకర్షకముగ నుండును. చిత్రరచనలో సమర్థులగు చిత్రకారుల కందుకై విశేషధన మిచ్చువారు.

వలసలుకూడ ఉత్సవములనే అనుకరించుచుండెను. ఒక్కొక్క జట్టు ఒక్కొక్క ప్రభ కట్టుకొని వచ్చుచుండెను. ఆ వలస పోవువారిని కడసారి చూచి స్వాగనంపుటకు వారి బంధువులును బహుదూర మనుగ మించుచుండిరి. ఈ వలసలు వీరోత్సవములవలె పరిణమించును. ప్రభలు దారివెంట పట్టణములలో పల్లెలలో నూరేగును. అవి ప్రధానస్థలములలో నాగును. కొందరు వీరావేశముతో వీరాంగము వేయుదురు. సమర్థులగు వారు ఖడ్గములు చదువుదురు.

ఈనాడమరావతినుండి వేంగీపట్టణము మీదుగా రాజమహేంద్ర వరమునకు వలసజనము వచ్చిరి. వారివెంట నొక పెద్ద ప్రభవచ్చెను. అది పురవీథుల నూరేగుచుండెను. దానిపై ప్రత్యేకలాంఛనము వ్యాఘ్రము ఖడ్గములు చెప్పువారు సమర్థు లనేకులుండిరి. ఒక డొకచోట చెప్పిన

మరియొక డింకొకచోట చెప్పుచుండెను అందులో నొక డిట్లు ప్రారంభించెను. అతడు ఖడ్గము చేతబట్టి ఆవేశముతో చెప్పుచుండ దోలు మ్రోగుచుండెను. మధ్య శరభశబ్దములు మిన్నుముట్టును.

హుమ్మని గాండ్రించి — హాశ్శరభ! హాశ్శరభ!
యొక బొబ్బ వేసినన్ — హాశ్శరభ। హాశ్శరభ।
చంద్రుడే మినుమీద - హాశ్శరభ, హాశ్శరభ।
చదికిలబడు! — హాశ్శరభ। హాశ్శరభ।
వెన్నెవన్నెల మేని చిన్నె లుపలక్షింప! - కన్నులే పోవును - చిన్నపులికి
భద్రగంభీరమౌ - రౌద్రాకృతిం గాంచి — క్షుద్రజంతువు నేల - జొచ్చి వచ్చు
ఒకసారి కనువిచ్చి - యొడలు జృంభణచేయ - పడపడమని భూమి — పడకిపోవు!
మారవిద్రావణా కారఘోరశత్రువారణాకార వ్యాఘ్రావతార, శరణు!
వీరసారంగ బౌద్ధవిహారసిద్ధ నాగహార ప్రవృద్ధపున్నాగ శరణు!
హాశ్శరభ! హాశ్శరభ। హాశ్శరభ।

# 35

సోమిదేవికి ప్రొద్దుపోవుట లేదు. తలచుకొనినకొలదియు దిగులు హెచ్చసాగెను. బహుకాలముగా నుపాసించిన దుర్గాదేవి హృదయములో దృఢవాసము చేసి కానసాగెను. దుర్గాసప్తశతిలో ననేకమంత్రములామెకు హృదయస్థములు. మనస్సులో నిరంతర మామెకు నా మంత్రావలోదనమే మనశ్శాంతి కూర్చుచుండెను.

ఆమెకు ద్విజులు దూరులై పోయినప్పటినుండియు సరియగు తిథుల లెక్క పోయినది. చంద్రసంచారముచే హెచ్చు తగ్గుగా తిథు లూహించుచుండెను. వార గణన మాత్రము పోలేదు.

తెల్లవారినచో మంగళవారము। చంద్రసంచారమునుబట్టి యది త్రయోదశియో, చతుర్దశియో కావచ్చును. తెల్లవారుజామున సోమిదేవికి

కృష్ణచతుర్దశినాఁ డయ్యెడునని స్ఫురణ కలిగెను. అది మహాపర్వ మగుటచే నామె వెంటనే దుర్గాస్మరణముతో శయ్యపైనుండి లేచినది. ప్రాతఃకృత్యములైన వెంటనే స్నానమొనర్చి శుభ్రంగా ధౌతివస్త్రము ధరించెను. ఆహారమున కిచ్చుచున్న యావునేతితో దీపారాధన చేసెను. నిజగురువులగు నారాయణభట్టారకుల ధ్యానించెను. గణపతి స్మరణ చేసెను. ఆ దీపశిఖయందు సర్వమంగలాదేవత నావాహన చేసెను. సంభవమైన ద్రవ్యములతో పూజచేసి తుదకు బంధమోక్షణ మంత్ర జప పారాయణ యయ్యెను. కుపమ యాది చూచి ఇచ్చియై తల్లిని అనుకరించి జప పారాయణ యయ్యెను. ఉదయమిట్లు పూజించి జపముచేసి లలితారహస్యనామస్తోత్ర పారాయణముతో సోమిదేవి ముగించెను మరల మధ్యాహ్నమట్లే చేసెను. రాత్రి వర కుపవసించి సాయంత్రమట్లే చేసెను. కుపమయు పాలుత్రాగి యట్లే పూజించెను ఆ రాత్రి సోమిదేవి హృదయమున నున్న భారమంతయు తీసివేసినట్లయ్యెను. బంధమోక్షణ మగువరకు నట్లే నిత్యమును ఉదయపూజ చేయ నిశ్చయించెను.

మరునా డమావాస్య; బుధవారము. సోమిదేవియు కుపమయు ఉదయపూజ పూర్తిచేసిరి. మధ్యాహ్నభోజన మయ్యెను. అంతట కుపమ దుగ్గవ్వను పలుకరింపబోయెను.

కుపమ యా వ్రజాంగనతో ముగ్ధమోహనముగా ప్రసంగించుచుండెను. ఆ గోపిక వినివిని చుట్టుప్రక్కల నెవ్వరు లేకుండ చూచి కన్నీళ్ళు కార్చసాగెను.

"అవ్వా, కన్నీళ్ళు కార్చుచుంటివి, తాత కొట్టినాడా?"

కుపమ యట్లనగానే దుగ్గవ్వ పట్టలేక బావురుమని యేడ్చుచు కుపమను దగ్గరకు తీసికొని కౌగిలించుకొని మరిమరి ముద్దు పెట్టుకొనసాగెను. ఆమె ప్రేమ బంధమునుండి మెల్లగా తప్పించుకొన యత్నించుచు కుపమ మరలమరల ప్రశ్నింపసాగెను.

"వైశాఖపూర్ణిమకు నిన్నెక్కడో బలి యిచ్చెదరటమ్మా! ఈ రాత్రియో, రేపటి రాత్రియో నిన్ను ఇక్కడనుండి తీసికొనిపోదురటమ్మా! నిన్ను వదిలి ఎట్లుండగలను తల్లీ! ఇతరులకు ఈ సంగతి చెప్పినచో

నా పెనిమిటియే నా పీకె నొక్కి పారవేయును, తల్లీ! ఎవరికిని చెప్పవుగా అమ్మా!"

దుగ్గవ్వ ఈ మాటలు చెప్పగా నిబ్బరముగా విని వెళ్ళి కుపమ అంతయు తల్లికి నివేదించెను. వెంటనే పెరుగు కావలెనను వంకతో సోమిదేవి దుగ్గవ్వయొద్దకు పోయెను. ఆమెతో మంచిమాటలు చెప్పి యేమి, ధనాశపెట్టియేమి, దుగ్గవ్వను వశమొనర్చుకొనెను.

ఆ రాత్రి జాము ప్రొద్దుపోయిన సమయమున వారికి మరొకచోటికి పోవుటకు దారి చూపెదననియు, వారివెంటనే తానుకూడ వచ్చి జీవిత శేషము గడపెదననియు, ఆ చీకటిలో ఆ అరణ్యప్రదేశములో మూడు క్రోశములదూరము నడచి రాగలిగినచో నొక సంపన్న బ్రాహ్మణుని యింటికి చేర్తుననియు నాపై రాజభటుల సాహాయ్యము లభింపవచ్చు ననియు, దుగ్గవ్వ చెప్పెను. సోమిదేవి యందు కంగీకరించెను.

సోమిదేవిని కుపమను తెచ్చిన యందల మిన్నాళ్ళును కనుపడ లేదు. ఆ సాయంత్రమున కది మరల వారున్న సావడియొద్ద నుండెను. అది చూచి యా రాత్రియే చోరులు తమ్ము బయలుదేరదీయ దలచినట్లు సోమిదేవి యూహించి దుగ్గవ్వకు తెలిపెను. ఆ సాయంత్రము నుండి సోమిదేవిని కుపమను పారిపోకుండ కనిపెట్టు వంతు దుగ్గవ్వ తనపై వేసికొనెను. అందుచే నామె యా ప్రదేశము వదలలేదు.

అది అమావాస్యరాత్రి! పల్లెలోనుండి పాలు పెరుగు వచ్చెను. అందులో మాదకద్రవ్యము లుండునని సోమిదేవి పారబోసి రహస్యముగా దుగ్గవ్వచే మంచిపాలు తెప్పించుకొని కుపమతో నారగించెను. వారిద్దరు శయనించి నిద్ర నటించిరి. దుగ్గవ్వ జాగరూకురాలై రక్షణకువచ్చు నితరుల నిషేధించి వాకిట గొళ్ళెము పెట్టి కూర్చుండెను. ఆమెభర్త పెద్ద గొల్లయైనందున నామె నెవ్వరు ప్రశ్నింపలేదు.

జామురాత్రి దాటినది. ప్రేపల్లె పూర్తిగా మాటుమడగినది. దుగ్గవ్వ బయటి గొళ్ళెము నెమ్మదిగా తీసినది. వెంటనే సోమిదేవి దుర్గాస్మరణ చేయుచు కుపమతో కలిసి నిశ్శబ్దముగా లేచి దుగ్గవ్వను వెంటనంపెను.

అమావాస్యరాత్రి. అరణ్యమార్గము. ముగ్గురుస్త్రీలు. దొంగలపల్లెనుండి బయలుదేరుట. మరల వారి చేతులలో నెప్పుడు పడినను ప్రాణములపైనాశ యుండదు. అంతియ కాక, ఆపల్లెకు తూర్పున సమీపమున పులిగడ్డగలదు. పులిగడ్డయొక కృష్ణలంక. అందు పులులు నివసించునను ప్రతీతి కలదు. కొంతకాలమునుండి యందుండి పులియొకటి కృష్ణపాయ దాటి వ్రేపల్లె పరిసరారణ్యమున కారాడుచుండెను అయినను ప్రాణములు బిగబట్టుకొని వారు ముగ్గురు సాగిపోయిరి.

గొల్లలా యర్ధరాత్రమున సోమిదేవిని, కుపమను అందలములో నెక్కించుకొని పోవుటకు వచ్చిరి. వారు పాలలోకలిపిన మందుచే నప్పటికి తల్లియు కూతును ఒడలుమరచి యుందురని వారు నిశ్చయాభిప్రాయముతో నుండిరి. అట్లే యా యందలమున దొంగలుమఱి యొద్దకు బోయి యొడలు తెలియని సోమిదేవిని అక్కడనే వదలి కుపమను సులభముగా నిర్ణీతస్థానమును జేర్పవలెనని వారి యుద్దేశము.

వారు పోయిచుడగా వాకిట దుగ్గవ్వలేదు. సావడికి గోళ్ళెము తీసి యుండెను. లోపల సోమిదేవియు కుపమయులేరు. వారికి ఆశ్చర్యమయ్యెను. వా రెచ్చటి కేని వెళ్ళియుందురా? ఎట్లు? ఆ పాలు త్రావినవారు అంత శీఘ్రముగా లేవజాలరె! పాలు త్రావలేదేమో! అయినను వారు త్వరలో తిరిగివత్తురని కొంతతడవు నిరీక్షించిరి.

ఎంత తడవుకును వారు రాకపోగా వ్రేపల్లెయంతయు వెదకిరి. ఎక్కడను కనపడలేదు. అంతట చుట్టుప్రక్కల పరిసరారణ్యమంతయు వెదకిరి. ఏమియు జాడపొడకట్టలేదు.

ఆ రాత్రిజాము ప్రొద్దుపోయిన తర్వాత వ్రేపల్లెకు దక్షిణభాగమున మెకము బొబ్బ వేసినదని కొందరు చెప్పిరి. అప్పుడే ఆవైపునుండియే భయపడినవారి కేకలు గూడ స్పష్టముగా వింటిమని మరికొందరు చెప్పిరి. అవి స్త్రీలకంఠములను బోలియుండెనని యొక గొల్లపడుచు పలికెను.

అంతట వారు దివిటీలు వేసికొని బరిసెలు, ఈటెలు ధరించి పులి బొబ్బవేసిన దిక్కుగా దూరముపోయి వెదకిరి. వెదుకగా వెదుకగా నొక

చోట పులి యాహారము నెగురవేసికొనిపోయిన గుర్తులు, మాంసము, నెత్తురును సమీపముననే కనిపించెను. ఆ పులియడుగుల నెత్తురుజాడలను బట్టి కృష్ణవేణివైపు వెళ్ళినట్లు స్పష్టపడెను. ఆ ముగ్గురు మాత్రము కను పింపలేదు. వారి కళేబరము లైనను కనుపింప లేదు. ఎన్ని పులులు వచ్చి నవో!

ఆ ముగ్గురును మతురాత్రముందు ఆవలకుపోగా పులినోట పడి యుందురని ప్రేతలందరు నేకగ్రీవముగా నిశ్చయించిరి. దుగ్గవ్వ పెనిమి టియే ఆ గంగిరెద్దుల వాడు! అతడు పొందిన దుఃఖమునకు మేరలేదు. ఎక్కడి వారమో వచ్చి యిక్కడ చేరితిమి. ఒక్క కుమార్తెయు మరణిం చెను. ఇప్పుడు భార్యకూడ పులినోట బడెను. చేతులార భార్యదేహము మట్టిచేసికొనుటకైనను దొరకలేదని యాతడు మరిమరి విలపించెను. పట్టు బట్టలు పెట్టి యాదరించిన తల్లిని కూతును హరించిన తనకెట్లు శుభ ములు కలుగును! కులములో ఇక తనకు పెద్దరికమెందుకు!

అతనితోపాటు ప్రేవల్లెలో నందరు విలపించిరి. కొందరు గోపి కలుమాత్రము సూచనగా నాతడు తలపెట్టిన దుర్మార్గము ఎరుగుదురు. వారు మాత్రము, బ్రహ్మహత్య తలపెట్టిన వీనికి మేలెట్లు కలుగును! ఇందువల్ల మనకందర కేమి మూడగలదో గదాయని భయపడసాగిరి.

చీనాదేశమునుండి వచ్చినానని సారంగధర సంఘారామములో విడిసి యొకానొక మహాపండితుడు వాదమునకు రమ్మని పత్రములు పండితులకు పంపి పట్టణమంతటను ప్రచురించెనుగదా! ఆ పండితుని పేరు 'టయోలిన్'. అతడు బుద్ధధర్మములో విధియని ప్రసిద్ధి నొందిన వాడు. అతడు భరతఖండమునకు వచ్చి యప్పటికి మూడువందల సంవ త్సరము లయ్యెనట. అంతకు పూర్వము ఆతనికి ఎన్నేళ్ళుండెనో ఎవరి కిని తెలియదు. అట్టి ప్రశ్నలా మహానుభావుని నెవ్వరడుగుదురు? ఎవరైన నొకరు సాహసించి యడిగినను ఒక్క చిరునవ్వుతో మాత్రమే ప్రత్యు త్తరమిచ్చి యట్టివారిని నిర్వాక్కులుగా జేయును.

భరతఖండమునకు వచ్చినప్పటినుండియు నెన్నియో భారతభాష లభ్యసించి సమస్తశాస్త్రములు నేర్చి భరతదేశములోని పండితులనే మించిపోయెనని ప్రతీతి కలదు. అతఁడు భరతపండితులతో మూడువందల సంవత్సరములనుండి చేయుచున్న వాదములలో జయించిన జయపత్ర ములే అతడు ప్రధానముగా వెంటనుంచుకొను గ్రంథజాలములు. అందులో నెవ్వరు నెప్పుడు కని విని యెరుగని యనేక భరత పండితులయు, ప్రభు వులయు నామములును స్వహస్త లిఖితపత్రములును గలవు. సంస్కృత మాతడు ధారాళముగా మాటాడగలఁడు. ఉచ్చారణ కొంచెము క్రొత్తగా నుండును గాని త్వరలో నలవాటుపడినవా రర్థము చేసికొనగలరు.

అట్టి మహాత్మునితో అథర్వణాచార్యు డొక్కడే వాదించుట కంగీ కరించి, ప్రతిపత్రిక పంపియుండెను. అథర్వణుడు జైనసిద్ధాంతములను సూక్ష్మతరమగు స్యాద్వాదమును చక్కగా నవగతముచేసికొనెను. మరియు బౌద్ధుల ప్రధాన వాదమగు క్షణికవాదమును దాని లోపములను సంపూర్ణ ముగా గ్రహించెను. పూర్వులుచేసిన పూర్వపక్షములే కాక స్వబుద్ధిచే మరి కొన్ని యూహించుయు అవసరమునకు సిద్ధముచేసి కొనియుంచెను. చది విన చదువంతయు నిరంతరము నాతని జిహ్వాగ్రమున పశ్యమైయున్నం దున మరల నతడు కోశములు తిరుగవేయ వలసిన యవసరము లేదు. ఎవరైనను ఏదైన నెక్కడనున్నదో అడిగినచో చూపుటకు కోశములలో పెట్టుకొనిన గుర్తులు మాత్రము ఒకసారి సరిచేసికొనెను.

కాని, చీనాపండితుడు కేవలపండితుడే కాక గొప్ప మంత్రసిద్ధుడు. అతని యెదుట వాదింప సమకట్టినవారిని తన మంత్రమహిమచే ముందు ముగ్ధులనుజేసి అసందర్భ ప్రలాపములు ప్రేలునట్లు చేయుననియు, నందుచే నతనికి జయము సులభసాధ్యమనియు పట్టణమంతటను ప్రతీతి ప్రబలెను. అవసరమైనచో వాక్ స్తంభనము చేయగలడట! లేనిచో నందరు మహాపండితుల నెట్లు జయించెను?

ఏమి చేయవలెను? రాజమహేంద్రవరము వచ్చిన వారములోప లనే అథర్వణాచార్యుల పేరు ఈ ప్రతిపత్రికచే పురమంతట మ్రోగిపో యెను. రాజసేవ చేయువారిలో కరణములెక్కువభాగము జైనాభిమానులు.

పెద్ద యుద్యోగులు గూడజైనులే. పలువురు వైశ్యులును జైనాభిమానులు కలరు. పట్టణములో పలుకుబడిగల వారిలో జైనులు అనేకులుండిరి. అందుచే అథర్వణుని కింతంతనరాని గౌరవము ఆకస్మాత్తుగా వచ్చినది.

బౌద్ధాభిమాను లెక్కువ భాగము కాయకష్టముచే జీవించువారు, నిరక్షరులు. జైను లట్లుగాక అక్షరాస్యులు. అందుచే వారి కభిమాన మెక్కువ తుచ్ఛమగు నుపాసనల బలముగల యీ చీనావానితో వాదము పెట్టుకొనిన నేమి ప్రమాదము మన యథర్వణునకు సంభవించునో యని యాదరము కొలదియు భయపడి యది చెప్పసాగిరి.

అథర్వణాచార్యు లాలోచించెను. పూర్వచరిత్రలు పరిశీలించెను. బౌద్ధులకు, జైనులకు వివాదములు జరుగుట యిప్పటిది కాదు. బౌద్ధులెప్పుడును తమయుపాసనచే జైనపండితులను బాధపెట్టుచుండిరి. పూర్వము కలింగదేశమున 'సంఘశ్రీ' యను బౌద్ధపండితుడు జైనాలయమున రథోత్సవ మాపించివైచెను. సంఘశ్రీని జైనపండితు లెందరో వాదమున నెదుర్కొని పరాస్తులైరి. అంతలో భట్టాకలంకు డక్కడికి వచ్చెను. అతడారు నెల లా 'సంఘశ్రీ'తో నిరంతరము వాదించియు గెలువలేక పోయెను అంతట నాతడు చక్రేశ్వరీదేవిని ధ్యానించి పంచ నమస్కార మంత్రము జపించెను. వెంటనే యామె సంఘశ్రీరహస్యము తెలిపెను. 'తెరలో కలశలో తారాదేవిని సంఘశ్రీ యావాహన చేసియుండెను. తారాదేవియే యిన్నాళ్ళు వాదముచేసెను. చెప్పినది మరల చెప్పుమన్న తారాదేవి మరల మాటాడదు.' ఈ రహస్య మెరిగి మరునాడు భట్టాకలంకుడు మరల చెప్పుమనెను. తెరచాటున నిశ్శబ్దమయ్యెను. వెంటనే భట్టాకలంకుడు ఆ తెర చించి తారాదేవిని ప్రతిష్ఠించిన కలశ తన్నివేసి సంఘశ్రీని పరాభవించినాడు. ఇట్లే పంచ నమస్కారమంత్ర మెన్నియేని పర్యాయములు జైనులకు రక్షగానుండి జయము చేకూర్చినది.

"ధర్మిణో యేఽత్ర వర్తంతే జ్ఞాతశ్రీ జినసద్గిరః
నిత్యం పరోపకారాయ సంతు తే పరమార్థతః"
"ఓం........................... నమః

ఇత్యాదిగా పంచనమస్కారమంత్రము అధర్వణాచార్యులు జపింప ప్రారంభించెను.

"ణమో అరిహం తాణం ణమో సిద్ధాణం
ణమో ఆయరియాణం ణమో ఉవజ్ఝాయాణం."
ఇట్లు నిరంతరము ధ్యానింప నారభించెను.

ఈ జైనబౌద్ధ పండితవాదమునకు వాదస్థలము నిర్ధారణ చేసికొనుటకే ముందు కొంత కాలము పట్టెను. చీనాపండితుడు వాదసభ సారంగధర సంఘారామముననే భిక్షువుల సమక్షముననే జరుగవలెనని కోరెను. అందుపై నధర్వణుడు సయుక్తికముగా వాద మెప్పుడును తటస్థప్రదేశములో జరుగవలెనని నిర్దేశించెను.

అది విని రాయబారములు జరుపువారు అధర్వణుని మాటలే న్యాయసమ్మతముగా నున్నవని యొత్తి చెప్పిరి. అందుపై చీనాపండితు డంగీకరింపక తప్పినది కాదు.

అంతట మధ్యస్థనిర్ణయములో చిక్కుకలిగెను. పవిత్రులగు బౌద్ధశ్రమణులకు తప్ప ధర్మనిర్ణయము చేయుట కితరుల కధికారము లేదని చీనాపండితుడు వాదించెను. అందుకు అధర్వణుడు బౌద్ధశ్రమణుల ముఖము చూచిననే తమ శాస్త్రప్రకారము దోషముకలుగును గనుక సచేలస్నానము చేయవలెననియు, అట్టివారు సభామాధ్యస్థమునకు ఎంతమాత్రము ననర్హులనియు, విజయవాడనుండి గాని, ఉండవల్లినుండిగాని, అవసరమైనచో శ్రవణబెలగోలానుండి గాని దిగంబరశ్రావకుల గాని, శ్వేతాంబర శ్రావకుల గాని పిలిపింపవలెననియు, వారు తప్ప మరి యెవరును మధ్యసులుగా నుండ వీలులేదనియు నిర్ధారణగా జెప్పెను

ఇది తేలుటకు బహుప్రయాస కలిగెను. ఉభయుల పట్టుదలలను జూడగా ఉభయులు వాదముచేయక తప్పించుకొనుటకు యత్నించుచున్నారని రాయబారము జరుపువారికి సందేహము కలిగి వారి కది చెప్పివేసిరి. అందుపై వా రుభయులు గట్టిగా నది కానే కాదనియు వాదమునకు సిద్ధమనియు వారికి తోచినవారిని మధ్యస్థులుగా పెట్టవచ్చుననియు చెప్పిరి.

ఆ రాయబారములు జరుపువారు ఆలోచించి రాజాస్థానమునందలి ప్రసిద్ధ మీమాంసకులను మాధ్యస్థము నెరపవేడిరి చీదమార్యుడు, పంపన భట్టోపాధ్యాయులు ఇత్యాది మహాపండితులందరు నట్టి పని చేయుట కంగీక రింపలేదు. వారు బౌద్ధ జైనపండితు లిద్దరనుగూర్చి పలికిన పలుకులు రాయబారులకు కర్ణకఠోరముగా నుండుటచే ఆ ప్రయత్నమునుండి విర మించి సభాస్థానములో కూడిన యశేష జనమే మధ్యవర్తిగా నుండవలె నని నిర్ధారణచేసిరి. దానికి పండితు లిద్దరు నెన్నియో చిక్కులుపెట్టి తుదకు పురములో తమతమ బలములు చూచుకొని యంగీకరించిరి.

ఆ పైని ప్రమాణనిర్ణయములో వివాద మేర్పడెను. బౌద్ధగ్రంథ ములే ప్రమాణము అని చీనావాడు పట్టుపట్టెను. జైనగ్రంథములు తప్ప యితరగ్రంథములు చూడనుగూడ చూడరాదనియు, అట్టివి ప్రమాణము లెట్లగుననియు అధర్వణుడు నిష్కర్షగా చెప్పివేసెను. జైనులు 'నిర్గ్రం థుల' మని తామే చెప్పుకొందురుగదా! వారికి గ్రంథప్రామాణ్య మేమి?" యని చీనాపండితుడు ప్రతిప్రశ్న పంపెను. ఇట్లు ఉత్తర ప్రత్యుత్తరము లతో ఈ విషయము తెగలేదు.

రాయబారములు జరుపువారు ఎంత ప్రయత్నము చేసినను ఈ విష యములో నెవరును పట్టుదల వదలలేదు. జైనుల గ్రంథముల పేరెత్తినచో చీనాపండితుడు చెవులు మూసికొని జైనులను వారి గ్రంథములను పద దిట్టును. బౌద్ధగ్రంథముల పేరెత్తినచో నధర్వణుడు వానిని నీచమైన యసహ్యవస్తువులతో నుపమించి యవి చోరులకు ద్రోహులకే సరిపోవు నని దూషించును. ఈ సందర్భమున నుభయులును త్రిపిటకమును సర్వస్వము నందును పాండిత్యమును పాటవమును ప్రదర్శించిరి.

అట్టిచో జైన బౌద్ధ మతములకు వాద మెట్లు పొసగును? అధర్వ ణుడు చెప్పినట్లు తన వాదమునకు జైనగ్రంథములే ప్రమాణము లగుచో బౌద్ధమతముతో వాదమేమిటి? చీనాపండితుడు చెప్పునట్లు బౌద్ధగ్రంథములే ప్రమాణము లగుచో జైనముతో గాని యితరమతములతో గాని వాదా హ్వాన మేమిటి? సమస్తజనులకును సామాన్యమగు నొక ప్రమాణముతో

వా రుభయులు వాదించుట న్యాయము: కాని యందు కుభయులు నొప్పు కొనరు.

ఆ అథర్వణు డొకనాడు అనుష్ఠానదీక్షలోనుండి బయటికి రాలేదు. ఆ యవకాశము తీసికొని చీనాపండిత పక్షపాతులు అథర్వణుడు వాదము చేయ లేక భయపడి పారిపోయెనని పురమంతట కరపత్రికలు పంచిపెట్టి, యట్టి చిత్రములుకూడ చిత్రించి వీథులలో ప్రదర్శించిరి.

ఆ మరునాడె అథర్వణుడు పురమున బహిరంగసభలు చేసి తాను నిర్భయముగా రాజవీథులలో నందరియెదుట సింహగర్జనము చేయుచు తిరుగుచుండగా చీనాపండితుడే దొంగవలె సంఘారామము గోడలమధ్య దాగియున్నాడనియు, దివాంధమువలె వెలుగు చూచుటకే వెరచుచున్నాడని యు నుపన్యాసములు సాగించెను.

బౌద్ధులును, జైనులును తమతమ మతసిద్ధాంతములు వీధివీథులను వాడవాడలాను, సంతలను, ఉత్సవములను, పగలనక రాత్రియనక యెప్పుడు నెల్లడల నమ స్తజనము తెలిసికొనగల తేట తెలుగున బోధించుచు,తమతమ పురాణపురుషుల చరిత్రలు కీర్తించుచు జనసామాన్యములో బహుళ ప్రచారము చేయుచుండిరి. ఈ ప్రచారముతో పాటు వారు కొన్ని మంత్రసాధనలుచేసి అమానుషశక్తులు ప్రదర్శించి ప్రజల నాకర్షించువారు. తేలు, పాము, కుక్క ఇత్యాది విషజంతువుల కాటుకు వారు మంత్రశక్తి చేవిషచికిత్సలు చేయుచుండిరి. మరియు బెణుకు, జడుపు, చెలిది, సర్పి, దృష్టి, బాలచేష్టలు ఇత్యాదులకుగూడ మంత్రప్రయోగములచే నుపశాంతి కలిగించువారు. ఆ మంత్రములుగూడ తెలుగుమాటలు, గురువుల పేర్లతో నుండును. మనుష్యులకే కాక గోవులకు, మహిషములకు, మేకలకు, గొఱ్ఱెలకు, ఉంగిడి పెద్దగుండము ఇత్యాదిజాడ్యములకుగూడ మంత్ర ప్రయోగముచేయువారు. కొంచెము సూక్ష్మబుద్ధిగలవారికి జైనులలో దిగంబరభిక్షువులు 'బట్టబయలు మంత్రము' అను తెలుగుమంత్రముపదేశించుచు దానిని మహావాక్యములతోను ఉపనిషత్సూక్తులతోడను సమన్వయించు చుండిరి.

ఇట్టి బోధలు, ఉపదేశములు, శక్తి ప్రదర్శనముల వలన జనులు యధాధికారముగా కొందరు. జైనులయందును, కొందరు బౌద్ధులయందును అభిమానముకలవారగుచుండిరి. కాని వారిలో బుద్ధిసూక్ష్మతకలవారికి ఈ ఉభయమతములలోనను తప్పక సత్యము సత్త్వము నుండు ననియు తత్తన్మతానుయాయులు స్వాభిమానమువలన తాము పట్టిన కుందేటికి మూడే కాళ్ళని మొండివాదము చేయుదురుగాని, యుభయుల నేకదేశమున గూర్చినచో నుభయమతములలోని సారమును, నిగ్గును, తాము గ్రహింప గలుగుదు మనియు, అందువలన లోకోద్ధరణ మగు ననియు విశ్వాసము కలదు. అందుచే నట్టి యవకాశము కలిగినప్పు డెల్ల నట్టిదానికై యత్నములు చేయుచుండిరి. అట్టి బుద్ధి శాలురే ఈ చీనాపండితునికి, అధర్వాణునకును రాయబారములు నడుపుచుండిరి.

ఈ రాయబారములు జరుపువారిలో ముఖ్యముగా ఉన్నతరాజోద్యోగములు చేసి వృద్ధులై విరమించి ఉపకారభృతు నందువారును, విశేషధన మార్జించి మరి యార్జింప నోపిక లేకపోవుటచే తృష్ణ విరమించిన వర్తకులును కలరు. వారందరు బుద్ధిసూక్ష్మత కలవారు. బహుగ్రంథద్రష్టలు. దేశాటనము చేసి విశేషలోకానుభవము సంపాదించినవారు. అట్టివారు తరుణప్రాయమునుండియు లోకచింతా మగ్నులై యాత్మచింత వదలి యుండిరి. వారికి నిత్యనైమిత్తికకర్మలు చేయుటకు శ్రద్ధగాని, తీరిక గాని లేదు. నిరంతరము పనిచేసిన బుద్ధులుకలవారు. వార్ధక్యముచే నొక్కసారిగా హృదయములో నశాంతి ప్రవేశించును. ఈ లోకయాత్ర చాలించవలసిన సమయము చేరువగుచున్నది. మరియొక లోకములో సౌఖ్యము కలుగు నుపాయ మన్వేషింపనిచో నెట్లు? వారిలో పునర్జన్మ మందుగాని, మరొక లోకమందు గాని విశ్వాసము లేనివారు కూడ, "ఇంతమంది చెప్పునట్లు అవియు నున్నవేమో, ఉన్నచో లాభించు ప్రయత్నములు చేయుట మంచిది కాదా!" అని యోచించుచుండిరి.

అట్టివారికి కష్టసాధ్యమగు నాత్మసాధన చేయు నోపిక లేదు. అందుచే ఒక్క దర్శనమాత్రముచే ముక్తి నీయగల మహర్షికై వెదకి పదిమంది మ్రొక్కు మహర్షికి మ్రొక్కు మొక్కి వత్తురు. లేనిచో 'ఆ

కొనమాట'యొక్కటియు నుపదేశింపు మని యొకానొక మహానుభావు నర్థింతురు. మరియొక మహాత్ముని పాదుకలు సంపాదించి గృహమున పెట్టుకొని పూజచేసి వండిన పదార్థములన్నియు వానికి నివేదనచేసి తామును దారపుత్రాదులును ఆ ప్రసాదము శ్రద్ధగా స్వీకరింతురు. లేక, ఒక గుడికో గోపురమునకో సంఘారామమునకో వసతికో తామార్జించిన ధనములో లక్షాంశమును—ఎన్నియో లెక్కలు కట్టి—దానము చేయుదురు. వా రందరు నిశితబుద్ధులు కలవారు. వారికి సూక్ష్మములో మోక్షము కావలెను. మందబుద్ధులు నిత్యనైమిత్తిక కర్మలు యజ్ఞయాగాది క్రతువులు దీర్ఘకాలము బహుప్రయాసపడి చేయుదురు. ఎంత శ్రమపడి చేసినను వారు పొందగల మనునది స్వర్గాదిలోకములోని తుచ్ఛసౌఖ్యమే! ఈ బుద్ధిమంతులకు మధ్యసంతరయున్న నవసరము. కేవలము మోక్షమే దిగి రావలెను. ఈ లోకములో వారు తమ బుద్ధికుశలతచే ఎన్ని కల్లోలము లడచినారు! ఎంత ధనమార్జించినారు! అట్టి వారికి మోక్ష సంపాదన మొక లెక్కయా!

అట్టిబుద్ధిమంతులే యీ రాయబారములు జరుపుచుండిరి. వారికి రాజమహేంద్రపురిలో ఎక్కువ పలుకుబడి గలదు. ఇట్టి వాదసభలు బహిరంగముగా జరిగినచో కొట్లాటలకు కారణమగు నని వానిని రాజపురుషులు నిషేధించుచుండిరి. ఈ సభకుగూడ నట్లే నిషేధము వచ్చెను. అంతట ఈ రాయబారులందరు వజ్జియప్రెగ్గడలను దర్శించిరి. వారెంతయు జంకుచు నీ విషయము ప్రస్తావించిరి. తమ యుద్దేశమును విస్తరించి సర్వవిధముల నిది తమ యధ్వర్యమున జరుగుచున్నందున నల్లరులు లేకుండ నన్నివిధముల కట్టుబాట్లు చేసెదమని బాసయిచ్చిరి. వజ్జియ శాంతముగా వినెను. ఒక్కప్రశ్నయు మధ్య వేయలేదు. అంతయు విని భారమంతయు నారాయణబారుపై నుంచి వాదసభకు అనుజ్ఞ యిచ్చి అనుమతిపత్రము వెంటనే కరణముచే వ్రాయించి ముద్రవేసి వారి కొసంగెను. వారందరు ధన్యుల మైతిమని యది యందుకొని తమతమ మాటలకు తామే గర్వించుచు సీవలకు వచ్చిరి. వజ్జియ యనుమతిపొందుట మోక్షము

కంటె కష్టసాధ్యమని వారి భయము. అట్టిది వారు తమ పలుకుబడిచే సంపాదించిరి.

ఇంతకష్టముమీద వారు అనుమతి సంపాదించిరి. కాని చీనాపండితునియు అధర్వణునియు ప్రమాణనిర్ణయవిషయికమగు వివాదము చూడగా నుభయులును ఒకరి నొకరు సభాముఖమున నెదుర్కొనకుండగనే అవతలివానిమీద నెపము పెట్టి ఎవరికివారు జయించితి మని ప్రకటించుకొన ప్రయత్నించుచున్నా రనికూడవారు గ్రహించుకొనిరి.

ఈ పెద్దలే ఒక సందర్భంలో నొక యర్థములో నన్న మాటలకు వేర్వేరుగా అర్థములు కల్పించి ఇటు చీనాపండితుడును అటు అధర్వణుడును తమ కనుకూలముగా ప్రచారము చేసికొనుచుండిరి. అందుచే తమ మాటలు తామే యీ పెద్దలు సమర్థించుకొనవలసివచ్చుచుండెను. ఈ విధముగా బౌద్ధులు, జైనులు, వారికి రాయబారములు జరుపు పెద్దలు, ప్రచురించు పత్రికలతో రాజమహేంద్రవర వీథులు నిండిపోవుచుండెను.

బౌద్ధులలో చిత్రకారు లెక్కువ; కనుక అధర్వణాచార్యులను అపహసించుచు చిత్రచిత్రములుగా దినమున కొక తీరున రంగు రంగుల పటములు చిత్రించి వీథులలో ప్రదర్శించుచుండిరి. జైనులలో శిల్పులెక్కువ; కనుక వారు రాత్రుల మేల్కొని వికృతాకారములుగల గంజారపుబొమ్మలు చీనాపండితు ననుకరించినట్లు చెక్కి వీథులవెంట నూరేగించుచుండిరి. ఒకరికంటె నొకరు అనుదినము ఉపజ్ఞ ప్రదర్శించుకొనుచుండిరి. స్వేచ్ఛగా నుభయపక్షములవారును తిట్టుకొనసాగిరి. అందుకు ఉన్న భాష చాలక క్రొత్తభాషకూడ పుట్టుచుండెను. ఉభయ పక్షములను అహింసాధర్మ మాచరణలో కనబడలేదు. మధ్యమధ్య వీథులలో కొట్లాటలు సాగుచుండెను.

ఏమి జరుగుచున్నను రాయబారములు జరుపువారు సమర్థులు;పట్టుదలగలవారు. వారి కెట్లెయినను ఉభయులను సభాముఖమున సమావేశపరుపవలెనని దీక్షకలిగినది.

"మేము నిర్ణయించిన చోట, కూడిన యశేష సభాజనమే మధ్యవర్తులుగా, కేవలము సర్వసామాన్యమగు హేతువాదమే ప్రమాణముగా,

మీ మీ మత ధర్మము ఉత్తమమైన దని సిద్ధాంతము చేయుట కంగీకరింపుడు. అట్లు కానినాడు మే మందర మేకగ్రీవముగా మీ రిద్దరు కువాదములు చేయుచున్నారని ప్రకటన చేయుదుము. అంతియకాక పండితుల మని లోకమును భ్రమింపజేసి ధనసంపాదన చేయుచున్న మోసగాండ్రని మిమ్ము రాజపురుషుల కప్పగింపవలసికూడ వచ్చును."

ఇట్లా రాయబారు లుభయులకు నిష్కర్షగా చెప్పిరి. అందుపై వారిద్దరికి నొప్పుకొనక తప్పినది కాదు.

వైశాఖశుద్ధవిదియ శుక్రవారమునాడు మధ్యాహ్నము సరిగా పండ్రెండు గంటలకు గోదావరీతీరమున వెనుక సంత జరిగిన ప్రదేశములో మహాసభ జరుగునని నిర్ణయించిరి. ఆ విధముగా ప్రకటనలు చేసిరి.

సభా కాలమున కుభయపక్షములవారును అధికసంఖ్యాకులను ప్రోవు చేసికొనుటకు ప్రయత్నములు సాగించుచుండిరి. వలసకు చేరుచున్న బౌద్ధ జనములు నానాటికి పెరిగిపోవుచుండిరి. జైనులు చుట్టుప్రక్కల గ్రామములకును, పట్టణములకును శీఘ్రవార్తాహరులను పంపి జనసమూహములను కూర్చుచుండిరి. గోదావరిపాయ లన్నిటిమీదగల నావలలో నశేషజనము రాజమహేంద్రవరము చేరుచుండిరి. రాజమార్గములలో సందు దొరకుట లేదు.

## 37

నియమితవిధానమున గోదావరీతీరములో వెనుక సంతజరిగిన ప్రదేశమందె రాయబారులు విశాలమైన పందిరి వేయించిరి. అందు సముచితస్థలమున నున్నతమగు వేదిక నిర్మించిరి. ఆ వేదికపై రెండే ఉన్నతాసనము లుండెను. వేదికకు ముందును రెండు ప్రక్కలను వాదనిర్ణయము చేయుటకు పాటుపడుచున్న పెద్దలందరికి లెక్కప్రకారము క్రిందుగా నాసనములు వేసిరి. వారు తప్ప వేదికయొద్ద కెవరును వచ్చుట కనుజ్ఞలేదు.

ఇక సభాసదులకు మూడు ప్రత్యేక స్థానములు నియమించిరి. ఒక ప్రక్క బౌద్ధాభిమానులు, రెండవప్రక్క జైనులు, మధ్యభాగమున ప్రేక్ష

కులగు నితరులు కూర్చుండవలెను. సమాకీర్ణమైనవా రల్లరి చేయకుండ జూచుటకై ఆ పెద్దలే యువకుల నెందరినో వేణుదండములతో ననేకస్థలముల నిలువబెట్టిరి. ఆ సభామందిర మెందరు వచ్చినను సరిపోవునట్లుండెను. దాని చుట్టును సాయుధులై బేతననాయకుని యాజ్ఞాప్రకారము రాజభటులు కాపుండిరి. వారితో నాలుగు గజములును పదునారశ్వములును గూడ కలవు.

ఆ నా డా సభకు చేరిన జనసమూహమును చూడవలసినదే కాని మాటలతో వర్ణింప సాధ్యము కాదు. ఉత్సాహము వీరరసము తెలుగువారి రక్తనాళములలో ఉబుకుచున్న కాల మది. బౌద్ధులకు తమ ధర్మము ఉత్తమమైనదని విశ్వాసము కలదు. అదియే లోకము నుద్ధరించి యశేష జనమును నిర్వాణగాములను చేయగలదని వారు నమ్ముచుండిరి. అది వారికి తమ మత మని యభిమానము కాదు. అది నిష్ఠ! ఆ నిష్ఠచేతనే జైన మత మన్న వారి కసహ్యము; కాని ద్వేషమువలనను విరోధము వలనను గాదు. అట్లే జైనులకును తమ మతమందు నిష్ఠయే యభిమానకారణము కాని పక్షపాతముచే గాదు

ఈ నాడు మహాసభాముఖమున నిర్వివాదముగా బౌద్ధధర్మ ముత్తమమైనదని చీనాపండితుడు ఋజువు చేయగలడని బౌద్ధుల నిశ్చయము. జినమతమే అనాది ధర్మమనియు బౌద్ధాదిమతము లన్నియు మూర్ఖవాదములని యీ మహాసభాంగణమున నా దినమున అశేషజనమునకు అధర్వణాచార్యులు నిరూపింపగలరని జైనమతానుయాయుల విశ్వాసము. ఉభయులును ఇట్టి యదృష్టము పూర్వపుణ్యవిశేషముచే చూడ లభించిన దని యుప్పొంగుచుండిరి.

ఆ సభకు జైనపండితులును బౌద్ధపండితులును అసంఖ్యాకులు వచ్చిరి. ఒకానొక బౌద్ధుడు త్రిశరణములు ప్రారంభింపగా బౌద్ధసంఘమున నా శబ్దము ప్రతిధ్వనించును. అంతట నిటు జైనసంఘములో రత్నత్రయస్మరణ మిన్నుముట్టును. బౌద్ధులు 'మణిపద్మేహుం' అని హుంకారములు చేయగా, జినసంఘము సిద్ధచక్రస్మరణతో పందిరి నింపును. ఈ రెండు ఘోషలను మధ్య చేరిన యితరులకు వినోదము కలిగించుచుండెను

గాని యల్లరి యాపుటకు నిర్దిష్టులైన యువకుల పని మాత్రము కష్టసాధ్య మయ్యెను.

సభాప్రారంభమునకు నిర్ణీతవేళ సమీపించుచుండెను. అధర్వణుడు మూడు శకటములపై కోశసంచయములు తెప్పించి వానిని వేదికయొద్ద పేర్పించెను. చీనా పండితుడు భీభత్సముగా ఎముకలు, దంతములు, నరకపాలములు మూడుశకటములపై దెప్పించి యతనికి నియమితమైన ప్రదేశమునకు వేదిక సమీపమున పేర్పించెను. నియమిత కాలము రాగానే ఆ రాయబారులు ఎడమవైపునుండి చీనాపండితుని, కుడివైపునుండి అధర్వణాచార్యులను వేదికపై కెక్కించి యాసనములపై నొక్కసారి కూర్చుండజేసిరి.

అధర్వణుడు టయోలినును. టయోలిను అధర్వణుని ఒకరినొకరు తిరస్కారముతో తృణీకారభావముతో తీవ్రదృష్టులతో నొక్కసారి తిలకించుకొనిరి. అప్రయత్నముగా చేరిన జనసమూహము చప్పట్లు కొట్టిరి. రెండుగజముల పోరాటము చూచుటకు చేరిన జనుల యుత్సుకతనే యా జనుల యుత్సాహమనుకరించెను.

సభాసమావేశకర్తలలో ప్రముఖుడు లేచి సభకు వందనము చేసి యుభయుల ప్రతిజ్ఞలు ఆ సభానియమములు స్వచ్ఛమైన కంఠముతో చదివి వినిపించెను. దానికందరు సాధువాదములతో నామోదము తెల్పిరి.

చీనాపండితుని ప్రతిజ్ఞ యిట్లు మధ్యస్థుడు చదివెను :

"నమో తస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స!— బుద్ధులు లోకమునకు మరల మరల బోధించు ధర్మమే ఉత్తమధర్మము. దానికి విరుద్ధధర్మములు తుచ్ఛములు. దీనిని కాదని ఋజువుచేసినవారికి నా తల నరికివేయుటకు ఈ సభాముఖమున ననుజ్ఞ యిచ్చుచున్నాను."

ఈ ప్రతిజ్ఞ చదువగానే బౌద్ధసంఘము జయజయధ్వానములు చేసెను.

అంతట నా మధ్యస్థుడు అధర్వణాచార్యుల ప్రతిజ్ఞ యిట్లు చదివి వినిపించెను:

"శ్రీమత్పరమగంభీరస్యాద్వాదామోఘలాంఛనమ్
జీయాత్ త్రైలోక్యనాథస్యశాసనం జినశాసనమ్॥"

"ఋషభనాథాది వర్ధమాననాథపర్యంతము గల చతుర్వింశతి సంఖ్యాక తీర్థంకరులే పవిత్రులైన ధర్మబోద్ధలు. జినశాసనమునకు విరుద్ధ మైనది హేయము, అనుపాదేయము. ఇది సరికాదని ఎవరేని ఋజువు చేసినచో నేను ఈ సభాద్వారములు దాటి బయటికి పోకుండ సల్లేఖనము చేసి ప్రాణము లర్పింతును."

అధర్వణుల యీ ధీరప్రతిజ్ఞకు జైనపక్షపాతులందరు బిగ్గరగా సాధువాదములు చేసిరి.

సభాసమావేశకులకు అప్పు డొక చిక్కు తటస్థించెను. ముందెవరు ప్రారంభింపవలెను? ఎవరు పూర్వపక్షము చేయవలెను? మధ్యస్థులలో ప్రముఖుడు దాచక తనకు గలిగిన సందేహమును సభకు వెల్లడించెను.

చీనాపండితుడు సర్వమతములలో బౌద్ధము సర్వోత్కృష్టము కనుక తానే ముం దుపన్యసింపవలె నని కోరెను.

అధర్వణాచార్యులు పూర్వపక్షము చేయుట యెక్కువ సుఖ మని యెరిగినవాడు గనుక ముందు చీనాపండితునిచేత ప్రారంభింపజేయు టే యతనికి సమ్మతమైనను, వెంటనే తా నందు కొప్పుకున్నచో గౌరవహాని యగు నని నిశ్చయించి, "ఇందరు తీర్థంకరు లుపదేశించినది ధర్మ మగును గాని గౌతమబోధ ధర్మము కానేరదు. నే నే ముం దుపన్యసింప వలెను" అని సభకు తెలిపెను.

అంతట చీనాపండితుడు తాను సన్యాసి గనుక గృహస్థుడగు ప్రతి పక్షికంటె ముందు వాదించుటకు తనకే హక్కు కల దని వాదించెను. బౌద్ధులలో వర్ణాశ్రమాచారములే లేనందున బౌద్ధభిక్షువులు సన్యాసాశ్రమము గ్రహించినవారివలె పూజ్యులు గారనియు, బౌద్ధభిక్షు వనగా భ్రష్టులలో నతి భ్రష్టుడు గనుక అతనికి సభాపూజ్యత లే దనియు, తాను స్వయముగా పండితుడై యనేకవిద్వత్సభలలో జయపత్రికలు పొందినందున తనకే ముందు ప్రారంభించు హక్కు కలదనియు నధర్వణుడు వాదించెను.

ఆ మాటలకు బౌద్ధాభిమానులలో కల్లోలము ప్రారంభించెను. వారి

నిరువురనిక మాటాడనిచ్చినచో నుభయపక్షముల రోషము ప్రజ్వరిల్లును. ఆ మధ్యస్థులలోనుండి కోటీశ్వరుడును రాజపూజ్యుడును బుద్ధిమంతుడును నగు గురునాథశ్రేష్ఠి మాటాడుటకు లేచెను. సభ నిశ్శబ్ద మయ్యెను. అత డిట్లు చెప్పెను :

"ఈ యిరువురును గొప్ప పండితులు. వారిలో నొకరును మరి యొకరి వాదము నంగీకరింపరు. ఒకరిని మించిన యుక్తి యొకరియొద్ద నున్నది. కాని నా స్థూలబుద్ధి కొకటి న్యాయ మని తోచుచున్నది. వాదము నకు రమ్మని ముందు ఆహ్వానించినది చీనానుండి వచ్చిన యీ మహాను భావుడు. తర్వాత ప్రతిపత్రిక పంపిన దీ మహానుభావుడు. కాబట్టి ముందు పత్రిక పంపిన చీనాపండితుడే ఉపన్యసించుట సమంజసమని నా బుద్ధికి తోచుచున్నది."

ఒక్కసారిగా బౌద్ధసంఘములోనుండి జయజయనినాదములు మిన్ను ముట్టెను. చీనాపండితుడే గెలిచినాడు. చీనాపండితునకే ముం దుపన్యసించు నధికారము కలదు! జైనపక్షమునుండి అన్యాయ మని కొన్ని కేకలు విన వచ్చెను గాని, ఆ వైశ్యశ్రేష్ఠి నిర్ణయము అన్యాయ మని యెక్కరును రూపింపజాలరైరి. శ్రేష్ఠి యుక్తికి ధర్మదీక్షకు నతనిని బౌద్ధసంఘ మగ్గించెను.

చీనాపండితుడు ఉపన్యాసము ప్రారంభించెను. అతడు ముందు చీనా భాషలో కొన్ని స్తోత్రములు చదువుకొనెను. పిమ్మట పాలీభాషలో స్తోత్ర ములు చదివెను. ఆ పైని సంస్కృతభాషలో స్తోత్రములు చేసెను. అవి ముగించి, తాను చీనాభాషలో నుపన్యసింతు ననియు నక్కడ కూడినభిక్షువు లలో నొకడు తెలుగులోనికి భాషాంతరీకరణము చేయు ననియు సభకు తెలియజేసెను.

వెంటనే యధర్వణుడు దాని కడ్డుపెట్టెను. "ఉభయులును సంస్కృత తములోనైన మాటాడవలెను. ఉభయులును తెలుగులోనైన మాటాడ వలెను. ఇంతవరకును తెలుగులో మాట్లాడిన చీనావానికి తెలుగు రాదా? మరియొక భిక్షువును తెచ్చినచో నతడు చెప్పున దొకటి ఇతడు చెప్పున దొకటికావచ్చును. మాకువిచారింపగా ఈ చీనామనుష్యుడు చీనావాడే కా

డనియు పండితు డెంతమాత్రము కా డనియుతెలియవచ్చుచున్నది.అందుచే
నతడు సభకు తెలియని భాషలో మాట్లాడుట న్యాయము కాదు. ఒక వేళ
నాతనికి చీనాభాషలోనుపన్యసింప ననుజ్ఞ యిచ్చునెడల నాకు కన్నడములో
నుపన్యసింప ననుజ్ఞయీయవలెను. ఎవరో ఒకరు తెలుగులోనికి పరివర్తన
చేయుదురు."

ఆ సభకు చీనాభాషగాని కన్నడముగాని రాదు. ఆ యుభయపండి
తుల వాదములు తెలుగులోననె వినవలె నని యా సభకు కుతూహలము
కలదు. అందుచే అథర్వణాచార్యులు చెప్పినది యుక్తియుక్తముగా నున్న
దనియు, చీనాపండితుడు గూడ తెలుగులోనే యుపన్యసింపవలసిన దనియు
నా సభవారు నిర్ధారణ చేసిరి. అది విని జైనసంఘములో ఒక్కసారిగా
జయజయనినాదము లుప్పతిల్లెను. బౌద్ధ సంఘములోనుండి 'అక్రమము!
అక్రమము!' అని కేకలు బయలుదేరెను. ఆ యల్లరి శాంతింపజేయుట
కెంతో కాలము పట్టెను.

అంతట విధిలేక చీనాపండితుడు తెలుగుబాషలో నుపన్యాసము
ప్రారంభించెను. ఆతడు తెలుగు కొంత నట్టుగా మాట్లాడుచున్నను
మాట్లాడినంతవరకు పుస్తకమువలె మాట్లాడసాగెను. దానికి అక్కడ
కూడినవా రంద రాశ్చర్యపడిరి. ఎంత మేధ కలవా డీ చీనాపండితుడు!
అథర్వణాచార్యులే యాతని భాషాసాధన కాశ్చర్యపడెను.

"దానము, శీలము, నైష్కర్మ్యము, ప్రజ్ఞ, వీర్యము, సత్యము,
క్షాంతి, అధిష్ఠానము, మైత్రి, ఉపేక్ష—ఇవి దశ పారమితములు. ఇవి
యన్నియు నాలు గసంఖ్యేయ కల్పములు నిరంతరముగా, అనేకజన్మలలో,
సాధించి సిద్ధత నొంది శాక్య గౌతమముని బుద్ధుడయ్యెను. ఆ మహానుభా
వుడు ప్రథమమున దీపంకరబుద్ధునియొద్ద దీక్షపొంది కాశ్యపబుద్ధునివరకు
నిరువదినలువురు బుద్ధులయొద్దను బుద్ధదీక్ష పొంది తుదకు గౌతముడై
యవతరించి సమ్మాసంబుద్ధి నధిగమించెను.

"బుద్ధదీక్ష యెంత కఠినసాధ్య మైనదో శాస్త్రమిట్లు చెప్పుచున్నది:

ఈ లోక మంతయు సముద్రమయ మైనపుడు ఎవడైనను దానిని బాహువులతో నీది తరింప గల సమర్థు డున్నచో నట్టివాడు బుద్ధత్వము సాధింప వచ్చును. ఈ లోకమంతయు మండుచున్న మహాగ్నిగోళ మైనచో దానిపై పాదచారియై యీ చివరనుండి యా చివరకు నడిచిపోగలవా డెవడైన నున్నచో నట్టివాడు బుద్ధత్వము ప్రాపింపగలడు. అట్టి బుద్ధత్వ మనేక జన్మ లెత్తి సాధించినవాడు గౌతమబుద్ధుడు.

"బుద్ధభగవానుడు బుద్ధత్వము ప్రాపించినవెంటనే మారుడు వచ్చి నిర్వాణములో ప్రవేశింపు మని యాయన కుపదేశించెను. ఇంత విశాల లోకము దుఃఖ సముద్రములో బడి యాల్లాడుచుండగా వారికి తరణోపాయము చూపనిది నిర్వాణ మక్కరలేదని భీష్మించిన పరమదయార్ద్రపూర్ణుని ధర్మము మా బౌద్ధధర్మము. అట్టి ధర్మ మక్కరలే దనువారు అమృత మక్కరలే దని కాల దన్ను మూర్ఖులు!"

ఇట్లనుచు 'మూర్ఖులు' అను పదము పెద్ద కంఠముతో నుచ్చరించి యా చీనా పండితుడు నిరసనభావముతో నధర్వణాచార్యునివంకను ఆయన పక్షమున జేరిన జైన సమూహమువంకను కలయ తిలకించెను.

వెంటనే జైన పక్షమున కూడినవారిలో హాహాకారములు బయలుదేరెను. "మేము మూర్ఖులమా?"—"నోరు మూయి!"— "శాస్త్రార్థమునకు వచ్చినావా, తిట్టుటకు వచ్చినావా?"—"ఇప్పటికి బౌద్ధసిద్ధాంత మేమేడ్చినావు?" ఆకేకలు పట్టశక్యము కాకపోయెను. చీనాపండితునిమాటలు వినబడు నవకాశము కలుగలేదు.

గురునాథశ్రేష్ఠి మరల లేచి నిలువబడి జైనులవంక తిరిగి నమస్కరించి నిశ్శబ్దముగా నుండ మని ప్రార్థించి యిట్లనెను:

"మీరు ఆగ్రహించుటకు కారణము లేక పోలేదు. వాదములో కొంచెము దూషణ ఓర్చుకొనవలెను. నేను చీనాపండితుల నిదే ప్రార్థించుచున్నాను. ఎవరి సిద్ధాంతము వారు చెప్పవలసినదే గాని ప్రతిపక్షమును దూషించుటకు వీలులేదు. మీ రందరు నన్నుజ్ఞ యిచ్చుచో దూషణ వదలి పండితు డుపన్యసించును!"

అధర్వణుడును జైనులును శాంతించిరి. అంతట చీనాపండితు డుపన్యాసము సాగించెను:

"నాకు ధర్మబోధకు కోశము లక్కఱలేదు. ఎందు కా ఎద్దుబరువు! నాకు మీరిక్కడ చూచుచున్న ఎముకలు దంతములు కాపాలములుచాలును. ఈ లోకమంతయు దుఃఖము! దుఃఖము! దుఃఖము! దానికి హేతువు తెలిసికొని దాని నివారణోపాయము తెలిసికొనవలె!

" 'పతిచ్చసముప్పాదము' అది!—అది అట్లగును గనుక ఇది కలుగును. అది ఉండుట కలుగుటవల్లనే ఇది ఉండుట జరుగుచున్నది. అది అట్లు ఉండనిచో ఇది మాయ మగును. అది ఆగిపోయినచో ఇది యాగిపోవును."

'పతిచ్చసముప్పాద'మని బౌద్ధ సంఘమునుండి హర్షధ్వనులు చెలరేగెను. దాని వివర మెన్ని మారులో బౌద్ధపండితులయొద్ద తెలిసికొనియు నర్థము కాకున్న మధ్యవర్తి రాయబారులు చీనాపండితుని వివరణమెంతయు బాగున్నదని ప్రత్యక్షముగా శ్లాఘించిరి. ఆ శ్లాఘలు నిర్లక్ష్యముగా చిరునవ్వుతో స్వీకరించుచు చీనాపండితు డుపన్యాసము సాగించెను:

"నిర్వాణ సంపాదన 'ఆర్యాష్టాంగమార్గము' ననే గాని సాధ్యము కాదు. ఆ అష్టాంగము లివి: సదభిప్రాయము; సదాలోచనము; సత్సంభాషణము; సత్ప్రివర్తనము; సజ్జీవనము; సత్ప్రియత్నము;సన్మనస్కత; సన్మనము.

"మరియు బుద్ధుల మార్గము 'మధ్యమార్గము!' అటు దేహమును విశేషముగా శ్రమ పెట్టి నీరసింపజేసి జీర్ణింపచేయరాదు. ఇటు ఇంద్రియ లోలురై దేహసౌఖ్యమునే సంపాదింపరు.

"బుద్ధుల ధర్మము క్లుప్తముగా నిది :

"సబ్బ పాపస్స అకరణమ్, కుశలస్స ఉపసంపదా
సచ్చిత్తపరియోదపానమ్ ఏతం బుద్ధన శాసనమ్!"

"ఇట్టి సన్మార్గ మనుసరించుట పనికిరా దని చెప్పువారుకూడ నుందురా? సమ్మాసంబుద్ధుడు మహేంద్రునికంటె బ్రహ్మకంటె సమస్త దేవతలకంటె నుత్కృష్టుడు. ఆ మహానుభావుడు ఈ లోకమున సంచ

రించుచున్నప్పుడు ఆ సమ్మాసం బుద్ధుని శిరస్సునుండియు నేత్రముల నుండియు నీలకిరణములును, దేహమునుండి సువర్ణపీత కిరణములును, పెదవులనుండి లోహితకిరణములును, దంతములనుండి యవదాతకిరణములును, కరపదములనుండి మాంజిష్ఠకిరణములును ప్రసరించుచు నన్నియు గలసి దివ్యప్రభాస్వరమైన రూపముగా జేసి భాసింపజేయుచుండెను. చిత్రకారులందరును తమయన్ని రంగులు ప్రయోగించియు నా యద్భుతరూపమును చిత్రింప యత్నించియు నింతవరకు కృతకృత్యులు కాలేకున్నారు.

"ఆ తథాగతుని ధర్మము నెవరు పూర్వపక్షము చేయగలరు!"

ఇట్లు పల్కుచు హుంకారముతో చీనాపండితుడు ఉపన్యాసము ముగించెను. ఆ హుంకారము మేఘగర్జనమువలె సభాస్థలమంతయు ప్రతిధ్వనులీనెను.

బౌద్ధసంఘములోనుండి యొక్కసారిగా జయ జయ నినాదము లుప్పతిల్లెను.

అథర్వణాచార్యులు ఉపన్యాసము శ్రద్ధగావిని, సూక్ష్మగ్రాహి కాన నది యా చీనావా డప్పగించుచున్న పాఠమని గ్రహించెను. మరియు నందులో తాను పూర్వము వినని విషయముగాని పద్ధతికానిలేదు. ఇక నతని హుంకారము ఊపిరితిత్తుల బలమునే ప్రదర్శించెను గాని, యందు ఉదాత్తమగు నాంతరమంత్రశక్తి యేమియు ద్యోతము కాలేదు. తన మనస్సుగాని వాక్కుగాని కాయముగాని అణుమాత్రమును స్తంభన మందలేదు.

ఆ జయ జయ నినాదము లాత డడగనిచ్చెను. అటుపై నథర్వణుడు పెదవులపై చిరునవ్వు నాట్యమాడ సభయంతయు గలయ తిలకించెను. అంతట నిట్లు ప్రారంభించెను :

"చీనా పండితవర్యుని యుపన్యాస మందరు నాలించితిరి. తెలుగు భాష తనకు రాదనిన యీ పండితుడు తెలుగు రానివాడనే నమ్ముదురా?"

ఆ మాట యెవ్వరు గాదనలేక పోయిరి. ఇరు పక్షముల గాక మధ్య గూర్చున్న జనములోనుండి యొక్కడు "పాఠము బాగా అప్పచెప్పి

నాడు" అని కేకవేసెను. అందుకు అధర్వణుడు మరింత సంతోషించి యిట్లు సాగించెను.

"శ్రేష్ఠి నన్ను పూర్వపక్షకోటిలో నుంచినాడు. ముందు చీనా పండితుడు వాదాహ్వానము చేసెను గనుక కొంతతడవు నేను ప్రశ్నలే వేసెదను. జైనసిద్ధాంతము నుపన్యసింపను. సభకిది సమ్మతమే యను కొందుము."

సభలో బహువిధముల యభిప్రాయములు బయలుదేరెను. కొందరు ముందు జైనమతముగూడ వినగోరిరి. జైనులు మాత్రము అర్యాష్టాంగమార్గము పనికిరాదందురా? కొందరు ప్రశ్నలే వేయుమని కోరిరి. ఒకటి ఖండించిననే కదా రెండవది నిలుపబెట్టుట? తుదకు మొత్తముమీద ప్రశ్నలకే యనుమతి యిచ్చిరి. అంతట అధర్వణు డిట్లు మరల సాగించెను.

"ఇంతసేపు చీనాపండితుని యుపన్యాసము మీరందరు నోపికగా విసుగులేక శ్రద్ధగా నాలకించినారు. మా కన్నడదేశములో సభాసదులింత శ్రద్ధచూపరు. మాకు పరమానంద మైనది. మీలో కొంద రీ యుపన్యాసము వినుచు సాధు వాదములు చేసినారు. కాని యిందులో నొక్కరికైనను ఆయన చెప్పినది అర్థమైనదా? ఎంతసేపటికి గౌతముని గొప్పదనమే ప్రశంసించెనుగాని గౌతమబోధయేమో నాకు మాత్రము బోధపడలేదు. సన్మార్గప్రవర్తనము కావలెనని సమస్త మతములు బోధించునదే. గౌతముని విశిష్టత యేమి? గౌతముని గొప్పదనము ఎట్లు ఋజువు చేయుదువు? అతడు మహానుభావు డనుటకు నీకు ముందుప్రమాణమేమి?"

అధర్వణుని వివరణ విని, యంతవరకు చీనాపండితుని వైదుష్యము మెచ్చుకొనుచున్న రాయబారులుగూడ నిజమే యనిరి.

చీనాపండితుడు నిర్లక్ష్యముగా తలకూడ ఎత్తక ప్రత్యుత్తర మిచ్చెను:

"ఇదేనా పూర్వపక్షము? అందు కనేక బౌద్ధగ్రంథములే ప్రమాణము!"

సరిగా నథర్వణు డా ప్రత్యుత్తరమే రావలెనని యుద్దేశించెను. అతడు ముందు నెమ్మదిగా ప్రారంభించి అంతకంతకు కంఠము పెద్దది చేసెను.

"మంచిది. మీ బౌద్ధగ్రంథములే గదా నీ వాక్యములకు ప్రమాణము? నా వెంట తెచ్చిన యీ కోశములన్నియు అతనిని మరొక విధముగా ఘోషించుచున్నవి. మరి నీ ప్రమాణగ్రంథములు సభకు తీసికొనిరాలేదు. నీవు తెచ్చిన యెముకలు దంతములు కపాలములు గౌతముని గొప్పదన మేమి ఋజువు చేయగలవు? బౌద్ధధర్మము అస్థుల ధర్మము. సంఘారామములో మీరు పూజించునది అస్థులను దంతములనేగదా! చితులపై గట్టిన సమాధులేగదా మీ చైత్యములు! నీవు మూడు బళ్ళపై ప్రమాణార్థము తెచ్చిన యీ భీభత్సద్రవ్యములే బౌద్ధధర్మము శ్మశానధర్మ మని ఋజువు చేయుచున్నవి. శ్మశానముల నాశ్రయించి యుండునవి పిశాచములు కనుక మీది పిశాచధర్మము. మీ మతము నాగజాతులలో ప్రాకినదికాన అది రెండు నాలుకల నాగుల ధర్మము!—— అంతేనా?"

అధర్వణుని కంఠము పెద్దది పెద్దదియై కాలమేఘగర్జముగా తుదకు పరిణమించెను. పుస్తక మప్పగించుచున్న చీనావాని మాటలకును విద్వాంసుడగు అధర్వణుని స్వయంప్రభూతవాగ్ధాటికిని వెంటనే భేదము విన్నవారి కెల్ల గోచరించెను.

సభ దద్దరిల్లెను. అధర్వణుడు చాలించువరకు నెవ్వరు నతని వాక్ప్రవాహ మాపలేకపోయిరి. మంత్రముగ్ధులవలె నందరు నంతవరకు నిస్తబ్ధులైరి. నిజముగా అధర్వణుడే మహామంత్ర సిద్ధుడా యని విన్నవారి కనిపించెను.

బౌద్ధజనములో కలకలము పుట్టెను. మధ్యనున్న తటస్థజనులను వేదిక చుట్టియున్న రాయబారులును, 'నిజమే. ధర్మము ఋజువు చేయుటకు ఈ ఎముకలూ దంతములూ, కపాలములూ ఎమిటి మరి! మరీ ఇంత భీభత్సప్రదర్శనమా!' అనుచు అసహ్యము ప్రదర్శించిరి.

చీనాపండితుడు మండిపడెను.

"నీ వేదో పండితుడ వనుకొంటిని. నీ పూర్వపక్ష మింతేనా? ఇట్టి పూర్వపక్షము చేసినవారిని చీనాదేశములో నేమి చేయుదురో ఎరుగుదువా?"

ఇట్లనుచు చీనాపండితుడు ప్రక్కనున్న ఎముకలు దోసె డొక్కసారి యెత్తి వేదికపై బోసి యేదియో చెప్పబోవుచుండెను.

అథర్వణాచార్యులు మెరపు మెరసినట్లు లేచి యా యెముకలు తీసి చీనాపండితుని నెత్తినవోసెను అపై నొక్కత్రుటిలో నా సభాంగణము రణరంగముగా మారిపోయెను. ఉభయపక్షములును అందుకు సంసిద్ధులై వచ్చినట్లుండిరి. గాని యిందులో బౌద్ధుల మెలకువ జైనులలో కనిపింప లేదు. సందడి సద్దుచున్న యువకుల చేతులలోని కర్ర లుభయపక్షముల వారు బలవంతముగా లాగుకొని ప్రయోగించిరి. చీనాపండితుడు తన వాదమునకు సాక్ష్యముగా తెచ్చిన మూడుబళ్ళ ఎముకలు దంతములు కపాలములు నొకవైపునను, అథర్వణుడు తెచ్చిన కోశము లొకవైపునను ఆయుధములుగా నుపకరించెను.

బౌద్ధపక్షమున పదిమంది చనిపోయిరి. జైనపక్షమున నిరువదిమంది మృతులైరి. ఉభయపక్షములను గాయములు దెబ్బలుతిననివారు అరుదుగా నుండిరి. తటస్థులై చూడవచ్చినవారికి గూడ నా మర్యాద తప్పలేదు.

అతికష్టముమీద పైగుడ్డలతో అటు చీనాపండితుడు, ఇటు అథర్వణుడును, నిర్వాణులై నివాసములు చేరిరి. పావులూరి మల్లనయు, వేములవాడ భీమకవియు పూచిన కింశుకములవలె నెత్తురుతో తడసిన వస్త్రములతో నిల్లుచేరిరి.

సభకు రాయబారము జరిపినవారిలో ముఖ్యాశ్రీ ఉభయులను వారింప నడ్డముపోయి రెండువైపుల దెబ్బలును తగిలి క్రిందపడి మూర్ఛవోయెను.

చిత్రముగా గురునాథశ్రేష్ఠిమాత్ర మెట్లో తప్పించుకొని శకటమారోహించి యతివేగమున దాటిపోయెను.

రాజభటు లానాడు మొత్తము మూడువందలమందిని, బంధించి కారాగారమునకు దీసికొనిపోయిరి. రాజభటులు చీనాపండితుని, అథర్వణుని రాయబారులను పట్టుకొనబోవుమండ బేతయనాయకుడు వారించెను.

ఆ రాత్రి చీనాపండితుని పక్షమున గొందరును, అధర్వణాచార్యుల పక్షమున గొందరును జయపత్రికలు వ్రాసియిమ్మని రాయబారము జరిపిన వారి గృహమునకు జనములు వెళ్ళిరి.

అందులో కొందరి కానాడు బుద్ధపండితునిదే తప్పని తోచెను. అతడు ఎముకలెందుకు దుష్కృతిపోసినట్లు వేదికపై పోయవలె! అధర్వణాచార్యులడిగిన యొక్క ప్రశ్నకే చీనాపండితుడు ప్రత్యుత్తరమీయలేక దౌర్జన్యమునకు దిగె ననియు, బౌద్ధధర్మము శ్మశానపిశాచధర్మ మని అధర్వణాచార్యులు యుక్తి యుక్తముగా నిరూపించెననియు వివరములు వ్రాయుచు నట్టివారు అధర్వణాచార్యుల జయపత్రికపై సంతకములు చేసిరి.

మరికొంద రానాడు అథర్వణునిదే తప్పని యభిప్రాయపడిరి ఆ యెముకలుతీసి చీనాపండితుడు వేదికపైనుంచి యేదియో వివరింపబోవు చుండెను. అది వినలేయిక అథర్వణుడు ఆ ఎముకలు చీనాపండితుని నెత్తిన పోయుటెందుకు? అల్లరి చిల్లరవానివలె విద్వాంసుడనని పేరు పెట్టుకొనినవాడు ప్రవర్తింపవచ్చునా? అట్టివారు చీనాపండితుడు బౌద్ధుల యష్టాంగమార్గమును ప్రతిచ్ఛసముత్పాదమును అద్భుతముగా నిరూపించె ననియు, అధర్వణాచార్యులు జైనవాదముకూడ చెప్పజాలక వంకపెట్టి తప్పించుకొని, చొప్పదంటుప్రశ్న వేసి, దానికి జవాబు చెప్పుచుండగా నడ్డము వచ్చి, హీనముగా దౌర్జన్యము చేసినా డనియు నితర వివరములు చేర్చి చీనాపండితుడు ఉయోలిను జయపత్రికపై చేవ్రాళ్ళు పెట్టిరి.

ఆరాత్రి గురునాథశ్రేష్ఠి యొద్దకు ముందు అధర్వణపక్షపాతులు వచ్చి వారి జయపత్రములపై సంతకము చేయించుకొనిరి. ఆ పిమ్మట చీనాపండితపక్షమువారువచ్చి వారి జయపత్రములపై గూడ నాతని చేవ్రాలు వేయించుకొనిరి.

ఆ రెండు జయపత్రికలపై ఇతరులు వేనవేలుగా నా రాత్రియెల్ల సంతకములు చేయుచునే యుండిరి. మరునాడు రాజమహేంద్రపురమెల్ల రెండు జయపత్రికల ప్రతులు ఆర్భాటముతో పంచిపెట్టిరి. కొన్ని వీథులలో

బౌద్ధుల విజయోత్సవమును, మరికొన్ని వాడలలో జైనుల విజయోత్స వమును మహావైభవముతో నూరేగెను.

పాపము, అధర్వణాచార్యుల కీ జయసందర్భమున పెద్ద దుఃఖ కారణము సంభవించెను. సభాంగణమునకు అతఁడు తీసికొనిపోయిన కోశ ములు చాలభాగముపోయెను. అవి బౌద్ధులపై విసరినందున వా రవి తీసి కొని కసితీర ముక్కలుచేసి నిప్పంటించి యా బూడిద ప్రక్కనున్న గోదా వరిలో కలిపివేసిరి. ఆ కోశములలో నమూల్యములగు ననేక గ్రంథములు కలవు.

అందులో అధర్వణుడు పద్యకావ్యముగా నాంధ్రీకరించుచున్న పంపభారతములో మూడు పర్వములు వ్రాసిన గ్రంథముకూడ కలదు. మరియొక ప్రతి యాతడుంచుకొనలేదు. ఆడంబరముకొరకు వేసిన కోశము లలో నత డదికూడ వేసికొని వెళ్ళెను. అది పోయినందున అతని ఉత్సాహమంతయు పోయెను. ఆ కోశము సంపాదించినవారికి పెద్ద బహూ కృతి యొసరించెద మని ప్రకటించిరి. కాని లభ్యము కాలేదు. అప్పుడు వ్రాయుచున్న విరాటపర్వము మాత్రమే భద్రముగా నుండెను.

## 39

శ్వేత వరాహకల్పమున వైవ్వతమన్వంతరమున ఇరువది యెనిమిదవ కలియుగమున నాలుగువేల నూటయేబది నాలుగు సంవత్స రములు (4154) గడచిపోయినవి. శ్రీ విద్యాశంకరు డుదయించి పదు నైదువందల యిరువదియొక్క సంవత్సరములు (1521) గతించినవి. భారతధర్మ నిష్ఠాగరిష్ఠులగు చాళుక్య ప్రభువులలో ధర్మమూర్తియగు శ్రీ రాజరాజనరేంద్రుని రాజ్యమున నీ నాడు శ్రీ విద్యాశంకర జయం త్యుత్సవము దేవేంద్ర వైభవముతో జరుగుచున్నది.

రాజమహేంద్రవరమునకు సమీపమున ధవళగిరియొద్ద నొక ముని పల్లె కలదు. అచ్చట శృంగగిరి పీఠాధిపతు లెన్నడో ఒక యీశ్వరాయ తనము ప్రతిష్ఠించి ధవళేశ్వరుడని నామకరణము చేసిరి. ధవళగిరిపార్శ్వ

మున శృంగగిరి పీఠాధిపతులయొద్ద సన్యాసాశ్రమము స్వీకరించిన భారతీ స్వామి యొక రందు తపస్సుచేసికొనుచు నివాస మేర్పరచుకొనిరి. వేంగీ ప్రభువు లా భారతీస్వామిని జగద్గురు ప్రతినిధిగా పూజించుమండిరి. దర్శనాదికముల కచ్చట నిత్యము భక్తులు వచ్చుట ఆ స్వామివారి కిష్టములేదు. కాని శ్రీ విద్యాశంకర జయంతినాడు మాత్రమట్లుకాదు.

రాజమహేంద్రపుర మందు గల యశేషబ్రాహ్మణ బృందమును ప్రాతఃకాలమున జేయవలసిన నిత్యకర్మలన్నియు శీఘ్రముగా ముగించు కొని సమిత్పాణులై ధవళేశ్వరమునందలి భారతీస్వామి యాశ్రమము చేరిరి. అచ్చట నప్పటికే సర్వసంపన్నముగా నలంకరించిన భద్రగజ మొండు నిలిచియుండెను ఆ భద్రగజమునకు శంకరగజమని నామము. అదియు రాజరాజనరేంద్రుని భద్రగజమును ఒకే తీరున నుండును. ఆ రెండును రాజరాజశాలలో సర్వగౌరవములతో పూజ నొందుచుండును.

శంకరగజము దంతములకు రత్నములతో పొదిగిన బంగారు తొడుగు వేసియుండెను. ముఖమున శంకర విగ్రహాకారమున ముత్యము లతో గ్రుచ్చిన చిత్రపట్టిక మెరయుచుండెను. వీపుపై కాషాయవర్ణముగల పట్టువస్త్రము కప్పియుండెను. దానిపై శ్రీచక్రాకృతిగల యమూల్యమగు నంబారీకలదు. శంకరగజము కదలినప్పుడెల్ల మేన నలంకరించిన వెండి ఘంటల మంజునాదములు శ్రవణపర్వము చేయును.

అచ్చట చేరిన బ్రాహ్మణ బృందములో నన్నయభట్టారకుడును, చీదమార్యుడను, పంపనభట్టోపాధ్యాయులును, భీమనభట్టును, చెట్టన భట్టును, ముట్టనభట్టును, వజ్జియ ప్రెగ్గడయు, నృపకామదండనాథుడును, ఘూర్జరబ్రహ్మణాగ్రణియు, అతనివెంట ప్రబోధచంద్రోదయ గ్రంథకర్త యగు కృష్ణమిశ్రుడును, బిల్హణభట్టును కాశ్మీరాగతకవియు మరియు నెందరేని గలరు. వారందరును యథాశాస్త్రీయముగా నా భారతీయతికి సాష్టాంగవందన మాచరించిరి.

అంతట నా శంకర సంయమీంద్రుని యనుజ్ఞవడసి యొక సువర్ణ ఘటము భద్రగజముపై నుంచి యేకాదశసంఖ్యాకులగు వేదవిప్రులు రజత

ఘటములు గ్రహించిరి. మంగళవాద్యపురస్సరముగా వారందరు గోదా వరికి బయలు దేరిరి. వేదవిదులు శంకరగజమును పరివేష్టించి స్వస్తి వాచనము చేయుచుసాగిరి. వేదవిప్రులు పవిత్రమగు గోదావరివారి మంత్ర పురస్సరముగా గజముపైనున్న సువర్ణఘటమును తమచేతులనున్న వెండికుండలను పూరించిరి. మరల మంగళవాద్యపురస్సరముగా ప్రదక్షిణ మార్గమున వేదఘోషతో నూరేగుచు ధవళేశ్వరాలయమునకు జను దెంచిరి.

శంకరస్వామి ఏకాదశవిప్రుల సహాయముతో మహాన్యాసపూర్వ కముగా ఈశ్వరుని కభిషేకము ప్రారంభించెను. పదునొకండుమారు లందరు అభిషేకము చేయునప్పటికి మహారుద్రాభిషేక మయ్యెను చుట్టు చేరిన శతాధికసంఖ్యాక విప్రుల నమకఘోషతో అతిరుద్రపారాయణ మయ్యెను. నిరంతము నక్కడికి గోదావరినుండి చేర్చి యందిచ్చుచున్న గోదావరీవారితో సహస్రాధికఘటాభిషేకమయ్యెను.

శంకరసంయమీంద్రుడు శతరుద్రీయము శాంతముగ స్పష్టముగ స్వచ్ఛ మగు మధురకంఠముతో చెప్పుచుండెను. బ్రాహ్మణబృంద మంతయు నేక గ్రీవముగా నా యతీంద్రుని కంఠముతో కలిపి చెప్పుచుండెను. ఆ యభి షేకముశోభ ద్రవ్య విశేషములలోగాని పరికర వైభవములోగాని జన సమ్మర్దములోగాని లేదు. ద్రవ్యలోపములేదు. గోక్షీరము, గోఘృతము, గోదధి, ఇక్షురసము, మధువు, ఆమ్రఫలరసము, నారికేళోదకము— ఇత్యాదిగా నభిషేకార్హమగు సమస్తవస్తువులు పుష్కలముగా నుపయో గించిరి. గోగణములు నిరంతరముగా గిరిప్రదక్షిణము చేయుచుండెను. జనసంఘములు తండోపతండములుగా వచ్చి దర్శించి పోవుచుండిరి. వారు తెచ్చు మామిడిపండ్లరాశి పర్వతాకారమగుచుండెను. వీణామురజ జాదివాద్యములు కర్ణపర్వము చేయుచుండెను. నర్తకజనముల నృత్యము లయ హృదయములలో తాళములు వేయుచుండెను. అచ్చట కననగు శోభ యా బ్రాహ్మణ మహాజనము నిశ్చల బుద్ధులతో నిష్కంపములగు శిరస్సులతో నేకకంఠముతో మధ్యమస్వరముతో— అటు తొందరగాని యిటు జాగుగాని చేయక—చేయు మంత్రోచ్చారణలో నున్నది. కృష్ణ

మిశ్రుడు అదిచూచి పొందిన యానందమున కవధిలేకుండెను. అభిషేకానంతరమున భారతీస్వామియే సహస్రకమలములతో ఈశ్వర పూజ చేసి యథా సంభవమగు ఫలాదుల నైవేద్య మర్పించెను. పూజావసానమున వేదవేదాంగములు తత్ద్విదులు ధవళేశ్వరునికి వినిపించిరి. శంకరస్వామి తైత్తిరీ యోపనిషత్తును, గీతాశ్లోకములు కొన్నియు, మొదటి నాలుగు బ్రహ్మసూత్రములును శంకరకృత శారీరక మీమాసంలో అధ్యాయ భాష్యమును ప్రవచనము చేసెను.

మూడు జాములైన పిమ్మట శంకరగజముపై శంకరసంయమీంద్రుడు పట్టణవీథుల నెల్లెడ మహావైభవముతో నూరేగెను. కోట గుమ్మంనొద్దకు వచ్చినంతనే రాజరాజనరేంద్రుడు అమ్మంగమహాదేవితో గూడి విచ్చేసిరై వచ్చెను. వారు శంకర సంయమీంద్రుల పాదములంటి వందనమాచరించి చరణరేణువులు శిరముల భక్తితో ధరించిరి. ఆ ఉత్సవము ఆగు స్థలములు బహు స్వల్పసంఖ్యాకములు.

సంధ్యాకాల మగునప్పటికి పురసంచారము సమాప్తమయ్యెను. అప్పటికే సువాసిను లసంఖ్యాకముగా నచ్చట చేరి ధవళగిరియంతట మేరుప్రస్తమగు శ్రీ చక్రాకార మేర్పడునట్లు దీపాధారములు సిద్ధము చేసిరి. సంధ్యాసమయమయినవెంటనే ఆ సువాసినులు ఆ దీపముల వెలిగించిరి. 'సుమేరుమధ్య శృంగస్థయై శ్రీమన్నగరనాయిక' యశేషపరివారముతో నా ధవళగిరి నప్పుడధిష్ఠించినట్లుగా ఆ దీపావళిమధ్య సంచరించు సువాసినీజనముతో నా గిరిశోభిల్లెను.

సాయంకాలమున శంకరసంయమీంద్రులు శ్రీ దేవ్యాలయమున శ్రీ చక్రరాజార్చనము ప్రారంభించిరి. తదంగముగా నచ్చట సమావిష్టులైన సువాసినీ జనమును బారులుబారులుగా కూర్చుండజేసి పరదేవతాబుద్ధితో భక్తివినమ్రుడై యా శంకరస్వామియే స్వయముగా పూజ చేసెను. ఆ సువాసినీ పూజామహోత్సవము ఆనాటి యుదయముకాలము నందలి మహారుద్రాభిషేకమహోత్సవమును శోభలో మించి కనిపించెను. అచ్చట నట్లు పూజనొందిన సువాసినులలో వజ్జియ సోమిదేవి పవిత్రమూర్తి యగ్రస్థాన మలంకరించెను. భరతభూమిలో కన్యాకుమారి

మొదలు బదరీనారాయణమందలి నారాయణీమూర్తివరకు గల సమస్త దేవతామూర్తులు నాయెడ ప్రత్యక్షమై కనిపించెను.

సువాసినుల కందరి కమృతపాత్ర లిచ్చిరి. శిష్టామృతమును శంకర సంయమీంద్రులు గ్రహించిరి. అమృతపాత్రలు యథాధికారముగా పంచి పెట్టుచుండిరి.

అంతలో రాజరాజనరేంద్రునికిని దేవేరులకును అమృతపాత్రలు పంపుటకు రాజపురోహితుని శంకరసంయమీంద్రులు పిలిచిరి. ఆ పిలుపు వినబడినంతనేయక్కడ నక్కజముగా రాజరాజనరేంద్రుడే పట్టమహిషి యమ్మంగదేవితో ప్రత్యక్షమయ్యెను. వా రుభయులు శంకరసంయమీంద్రుల స్వహస్తదత్తమలగు నమృతపాత్రలు యథావిధి స్వీకరించిరి.

రాజరాజనరేంద్రులకు శంకరసంయమీంద్రులు—

"వత్స, తుభ్యం మయా దత్తం శిష్టజుష్టం సుధారసమ్,
తవ శత్రూన్ హరిష్యామి సర్వాభీష్టాన్ దదామి తే"

అని పల్కిరి. రాజరాజును—

"ఆదాయ చ గురో స్సాక్షాత్ ఆదిశక్తే ర్ముఖాంబుజాత్
దత్తం శిష్టామృతం పుణ్యం సంవిదగ్నౌ జుహోమ్యహమ్"

అనుచు స్వీకరించెను.

మహారాజు పూజాసమయమున వచ్చుట యరుదు. అట్లు వచ్చునప్పుడు కూడ ముందుగా తెలియజేసి వచ్చునాచారము. అట్టి యెడ మహారాజు కూర్చుండుటకు నియమితమగు ప్రత్యేకస్థాన ముండెను. ముందు తెలుపకుండ వచ్చినను భేదమేమియు లేకపోయెను. మహారాజును, మహారాణియు నెప్పుడు వచ్చిరో కూడ ఎవ్వరికి తెలియదు. పూజోత్సవ సమయములో మహారాణులకు భారత సంప్రదాయములో తెరచాటు లేదు.

పూజాంతమున శ్రీదేవికి బ్రాహ్మణులు వేదవేదాంగశ్రవణము చేసిరి. శంకరస్వామి వేదాంతశ్రవణము చేసెను. అంతట చీదమార్యులు ఆచార్యులకొక మనవి చేసెను :

"పూజాంగముగ నాటకపఠనముచేయు నాచారములేదు. భారత రామాయణపఠన మున్నది. కేవల ముపనిషదర్థమే దృశ్యకావ్యముగ

ప్రబోధచంద్రోదయమను నాటకమున నిచ్చట సమాగతులైయున్న కృష్ణమిశ్రకవీంద్రులు చిత్రించుచున్నారు. అందులో నొక ఘట్టము శ్రీదేవీసమక్షమున వినిపింప ననుజ్ఞ వేడుచున్నాను."

శంకరస్వామి చిరునవ్వు నవ్వెను.

"పూర్వమీమాంసకుడవు నీవే కావ్యశ్రవణ మర్థించినచో మా కెట్టి యభ్యంతరము నుండదు. పరమానందము!"

కృష్ణమిశ్రుడు ఆచార్యులకును పరదేవికిని వందన మాచరించి ప్రబోధచంద్రోదయమున నారవయంకమందలి ప్రస్తావభాగము వినిపించి "తతః ప్రవిశతి ఉపనిషత్ శాంతిశ్చ" అని చదివి ముగించెను. సభాసదు లెంతయు నానందించిరి

ఆ పిమ్మట శంకరసంయమీంద్రులు తమ గురువులు శృంగగిరి పీఠాధిపతులు ఈ శ్రీముఖ మీసమయమున శ్రీదేవీసన్నిధానమున నిచ్చటి చాతుర్వర్ణ్యజనములకును వినిపింప నాజ్ఞాపించిరని చెప్పుచు నా పత్రమును సభాపతి కీయ నాతడు కన్నులకద్దుకొని యిట్లు చదివి వినిపించెను:

"శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య పదవాక్య ప్రమాణ పారావార పారీణ యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగానుష్ఠాననిష్ఠాగరిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్త సాంప్రదాయక షడ్దర్శనస్థాపనాచార్య వ్యాఖ్యానసింహాసనాధీశ్వర సకల వేదార్థ ప్రకాశ సాంఖ్యత్రయీప్రతిపాలక సకలనిగమాగమసారహృదయ వైదికమార్గప్రవర్తక సర్వతంత్ర స్వతంత్ర శ్రీ మద్రాజాధిరాజ మహారాజగురు భూమండలాచార్య ఋశ్యశృంగగిరిపురవరాధీశ్వర శ్రీమద్విద్యాశంకరపాదపద్మారాధక శ్రీమత్సచ్చిదానంద భారతీస్వామి కరకమలసంజాత శ్రీబోధానంద భారతీస్వామిభిః ప్రవర్తితా శ్రీముఖపత్రికా.

"ఇప్పటికి ఇరువది సంవత్సరముల క్రిందట శ్రీ కృష్ణశర్మయను కర్ణాటకదేశ బ్రాహ్మణుడు తురీయాశ్రమము తీసికొని మా యొద్దకు ఉపదేశార్థమువచ్చి యర్థింపగా కరుణించి యుపదేశించితిమి గాని యనుష్ఠానాదికము తెలిసికొనకుండగనే యతడుసెలవు తీసికొని వెడలిపోయెను.

పిమ్మట విచారింపగా నతడు బౌద్ధభిక్షువులతో సహవాసము చేయుచు హేయమగు నాచారము నవలంభించుచున్నాడని తెలియవచ్చి విచారింపగా అది నిశ్చయమైనది. అంతట నాతని మేము చాతుర్వర్ణ్యశిష్య బృందము నుండి బహిష్కరించుచు నాతని హృదయ మధ్యమున తప్తమగు మా ముద్ర వేయించి శ్రీముఖపత్రికలు కల్యాణకటకాది ప్రదేశముల ప్రచు రించితిమి. కాని యాతడు చాలకాలము అదృశ్యుడై పోయెను.

"ఇప్పుడు విచారింపగా నాతడు రాజమహేంద్రపుర ప్రాంతముల కొంత కాలమునుండి మారువేశమున సంచరించుచు గౌరవము పొందు చున్నాడని తెలియవచ్చినది. అతని వక్షోభాగమున నంకితమగు మా ముద్రచే గుర్తించి యాతని సర్వ విధముల బహిష్కృతునిగా భావింప వలసినదని రాజమహేంద్రపుర చాతుర్వర్ణ్య శిష్యబృందమునకు తెల్లము చేయుచున్నాము.

ఇతి నారాయణస్మృతిః

శ్రీ జగద్గురు
విద్యాశంకర శ్రీ బోధానంద
భారతీస్వాములు"

ఆ శ్రీముఖపత్రిక చదివించి పూజ పూర్తి కావించిరి. మహా వైభవముగా నా రాత్రి సంతర్పణము జరిగెను.

శ్రీకృష్ణశర్మ ఎవరు? ఏ మారు వేషముతో నిక్కడ పూజ్యత నొందుచున్నాడు? మారు వేషముతో రాజమహేంద్రవరములో తిరిగిన బ్రాహ్మణుడు తన పేరు నారాయణభట్టు అనిచెప్పెనే! అత డెంతయో వైదికనిష్ఠ కలవానివలె ప్రవర్తించుచున్నాడే. అతడు బహిష్కృతు డగునా? అది మరుగుపరుచుటకే అంత విశేషాభిమానము నటించు చున్నాడేమో! అతడు కాజాలడు ఎవరో మరి? ఈ విధముగా నాతని గుర్తించుటకు పలువురు వ్యగ్రులైరి.

అచ్చటికి వచ్చునప్పుడు రాజరాజనరేంద్రుడును అమ్మంగ మహా

దేవియు నజ్ఞాతముగా వచ్చిరి. మరల రాజమందిరమున కేగునప్పుడు రాజరాజు ఉత్తమాశ్వముపై నధిరోహించెను. అమ్మంగమహాదేవియందల మెక్కెను. పంచతూర్యములు మొరసెను. రాజమయ్య, జననాథుడు, ముప్ప రాజు నను ముగ్గురు దండనాథులు అనేక రాజభటులతో పరివేష్టించి వారి ననుసరించి కోటలోనికి చేర్చిరి. అప్పుడు వెలిగించిన కరదీపికల కాంతి రాజమార్గమున పగలే యను భ్రాంతి కలిగించెను.

యువరాజరాజేంద్రదేవుడు చోళమిత్రులగూడి నారాయణభట్టును మంత్రిగా నుంచుకొని శీఘ్రప్రయాణములతో చంద్రాదిత్యుని యాధిపత్యమున చక్రకోట్యాభిముఖముగా నేగుచున్న సేనను కలసికొనెను. ఆ ప్రదేశముననె నియమిత విధమున మరికొన్ని సేనలును గలసెను. ఆ సర్వవాహినికి రాజేంద్రదేవు డాధిపత్యమూని ముందు ఆకస్మికముగా భ్రమరకోట్యముపై బడి ముట్టడించెను.

భ్రమరకోట్యము ఇంద్రావతీనది గోదావరిలో కలయుచోట నున్న స్థలజల దుర్గము. ఆ దుర్గము మిక్కిలి బలిష్ఠమైనది. అది పట్టుకొనుటకు బలమగు సైన్యములకు కొన్ని మాసములు పట్టును. భ్రమరకోట్యము చక్రకోట్యాధిపతికి సామంతుడగు మధురాంతకదేవునిది.

మధురాంతకదేవుడు అంతర్యమున రాజరాజనరేంద్రుని భక్తుడు. మధురాంతకుని రాజగురువగు మేడిపాత్రుడు నన్నయభట్టారకునకును నారాయణభట్టునకును వజ్జియ కుమారునికిని కాంచీపురమున సహాధ్యాయుడు. మధురాంతకదేవు డెన్నటికైనను స్వతంత్రుడు కావలె నని యర్థించుచు తన దృష్టియంతయు చక్రకోటాధిపత్యము పై నుంచుకొని రాజరాజు బలములపై నాధారపడుచుండెను.

మధురాంతకదేవుడు దుర్గమును రక్షించు ప్రయత్నములో నున్నట్లు నటించెను. కాని యాకస్మికముగా వేంగీసైన్యములు ముట్టడించినందున విధిలేక లొంగి పోయినట్లు లొంగిపోయెను. అందుచే నాంతరంగికులకు దప్ప నెవ్వరికి నీ రహస్యము తెలియదు. వేంగీ సైన్యములు యువరాజు

నాయకత్వమున మహావిజయము పొందితి మని పొంగిపోయెను. ద్రావిడ దేశమున యువరా జభ్యసించిన రణవిద్య అద్వితీయ మని యా చుట్టు ప్రక్కల కీర్తి వ్యాపించెను. భ్రమరకోట్యపతనముచే యువరాజుకు చక్ర కోట్యదండయాత్ర సులభసాధ్యమయ్యెను. భ్రమరకోట్యము చైత్రబహుళ అమావాస్య బుధవారముననే స్వాధీనపడెను.

యువరాజు మధురాంతకదేవుని మహాసభాముఖమునసామంతునిగా నొనర్చుకొని బహుమానములు గ్రహించి మన్నించి యాతనియొద్దననేక నావలు యాత్రార్థము పుచ్చుకొనెను. అచ్చట విజయోత్సవములు రెండు దినములు నడిపించి వైశాఖ శుద్ధవిదియ శుక్రవారము వృషభ సంక్రాంతి నాడు అభిజిల్లగ్నమున ప్రయాణభేరి వేయించెను. ముందు ఇంద్రావతీ నదిపై నావలలో సైన్యమును తీసికొనిపోవనెంచి యందుగల నావ లన్నియు గ్రహించెను. గాని చివరిక్షణమున నేలమీదనే ప్రయాణము చేయ నిశ్చయించి యట్లు ప్రకటించెను.

భ్రమరకోట్యమును వేంగిసేనలు ముట్టడించువరకు దండయాత్ర వచ్చుచున్న దనియే చక్రకోట్యాధిపతియగు ధారావర్ష మహారాజెరు గడు. చైత్రమాసాంతముననే కుంతలచాళుక్యప్రభువు ఆహవమల్ల సోమే శ్వరుని సైన్యములు వేంగీమండలమును దండెత్తునని అతనికి తెలిసియే యున్నది. మరియు తాను ఎందరోచారులను వేంగీమండలమున కంపి యెన్నియో కేంద్రస్థలములలో అలజడులు జరిపించుటకు ప్రయత్నములు చేసియుండెను. రాజమహేంద్రవరములో రాజ బంధు వులలో కుమారషట్కము బౌద్ధసంఘారామముల సహాయముతో రాజద్రో హమునకు పెద్దయెత్తున చేయుచున్న ప్రయత్నములు నిరాటంకముగా సాగిపోవుచున్నవని యతనికి వార్తలు వచ్చుచుండెను. మరియు తాను రాజరాజనరేంద్రుని మహాసభకు కప్పముగాని, ప్రతినిధి నిగాని పంపకున్నను రాజసభలో బహిరంగముగా నెట్టి రోష ప్రదర్శనమును జరిగి యుండలేదు. అప్పటికి రాజరాజు అసమర్థత వల ననే యట్లు చేసెనని నిశ్చయించెను. తాను అందరు చారులను వేంగీమండ లమునకు పంపినప్పుడు ప్రభువు కూడ రహస్యముగా దనపైకి మహా సైన్యములు పంపునని మాత్ర మాత డూహింపలేకపోయెను.

ఆహవమల్లసోమేశ్వరుడు గూడ ధారావర్షుని మోసగింపలేదు. చైత్ర పూర్ణిమకే వేంగీమండలము పశ్చిమపు సరిహద్దునకు చాముండ రాయుడను దండనాథుని యధీనమున మహాసేన యొకటి పంపెను. ఆ సేన దండెత్తుటకు నెపమునకై నిరీక్షించుచు నింతలో యాత్రాసన్నాహములు పూర్తిచేసికొనుచుండెను. ఇంతలో కామరాజపుత్రుడు తన్ను శిక్షించుచు రాజరాజనరేంద్రుడిచ్చిన తీర్పుపై కుంతలేశ్వరులకు మనవి చేసికొనుట కవకాశ మీయవలెనని యర్థించెననియు, రాజరాజది నిర్లక్ష్యము చేసెననియు వార్త కుంతలేశ్వరులకు చేరెను. అందుపై నాహవమల్ల సోమేశ్వరుడు రాజరాజనరేంద్రునకు అట్లు చేసినందుకు వెంటనే సమాధాన మీయవలెననియు. లేనిచో శిక్షింపవలసి వచ్చుననియు రాయబార మంపెను. అది విని రాజరాజనరేంద్రుడు ముఖము బొమముడి వేసెను. మరల మనస్సు నిలువరించుకొని పరిచారకునిచే రాజమందిరాంగణమునుండి యొక్క తృణకణము తెప్పించి యది రాయబారిచేతి కిమ్మనెను. అట్లు చేసిన పిమ్మట "మీ ప్రభువుకు మా ప్రత్యుత్తర మిది యని యిమ్ము!" అని యా రాయబారిని తృణహస్తముతో పంపివేసెను. ఆ రాయబారి వేంగీభూమి పడమటి సరిహద్దులు దాటినదేతడవుగా చాముండరాయని సైన్యములు ఒక్కసారిగా, ఆరుగుడిదుర్గములపై బడెను. అందులో ఉత్తరమున నున్న రెండు దుర్గములను దక్షిణమున నున్న రెండు దుర్గములను చాముండరాయని వశమయ్యెను. మధ్యనున్న రెండు దుర్గములు మాత్రము సాహసముతో నెదిరించుచుండెను. స్వాధీనమైన రెండు ప్రక్కల నుండియు చాముండరాయని సైన్యము లా రెండు మధ్య దుర్గములమీదికిని మహోర్పాటముతో మ్రింగివేయుటకు నడచుచుండెను. ఇది యంతయు చైత్రబహుళ అమవాస్యకే జరిగిపోయెను. ఈ శుభవార్త లింకను ధారావర్షునికి చేరలేదు.

ఇంతలో భ్రమరకోట్యమును వేంగీ సేనలు ముట్టడించె ననువార్త వచ్చెను. అది ధారావర్షుని నాశ్చర్యచకితులని జేసెను. అయినను భ్రమరకోట్యము మిక్కిలి బలిష్ఠమగు దుర్గము. అది బహుకాలము నిలువరించు

కొనగలదని ధైర్యము తెచ్చుకొని శీఘ్రముగా చక్రకోట్యదుర్గమును మరింత బలపరుపసాగెను. శిథిలమైన స్థలములు శిల్పులచే త్రాటింబవళ్ళు పనిచేయించి పునర్నిర్మాణము చేయించెను. ఖనకులు పరిఖలోతు చేసిరి. దండనాథులు సేనలను ఉచితరీతిగా విన్యసించి యాయుధములు విరివిగా సైనికుల యధీన మొనర్చిరి. వర్తకులు కోటలో నందరకు సంవత్సరము నకు సరిపోవు నాహారపదార్థములను అశ్వాదులకు గ్రాసము పదిల పర చిరి. దూరమున నొక కొండపైగల సరోవరమునుండి రహస్యమార్గమున నా దుర్గమధ్యమున వింధ్య వాసినీదేవి యాలయమందలి వాపిలోనికి జలము వచ్చును వింధ్యవాసినీదేవి చక్రకోట్యాధిపతుల కులదేవత. ఆ వాపిలో స్వయంభూలింగము కలదని ప్రతీతికలదు. ఆ వాపిలో జల మెంత తోడి నను తరుగదు. అదియే దుర్గమందలి సమస్త జీవులకును జీవనాధారము. ఆ వాపీజలమూలము దుర్గరహస్యములలో నొకటి. దండయాత్రలు వచ్చి నప్పుడు దుర్గములోనున్న కొన్ని యితర కూపములు బాగుచేయించుట పూర్వాచారము. ఇప్పుడును సూత్రధారు లట్లే చేయించిరి. అన్ని ప్రయ త్నములను ధారావర్షుడును, అతని ఏకైకపుత్రిక వింధ్యవాసినియు స్వయ ముగా పరీక్ష చేయుచుండిరి.

కాని రెండుదినములలోననె భ్రమరకోట్యము లొంగిపోయెనను వార్త వినగానే ధారావర్షునికి భయ మావేశించెను. ఐనను ధైర్యము వహించి భ్రమరకోట్యము నుండి చక్రకోట్యమునకు సేనలు సామాన్యముగా వచ్చు మార్గము లన్నియు సేనాప్రస్థానమున కయోగ్యములుగా జేయ నుత్తరువు లిచ్చెను. విశాలమార్గములలో వృక్షతక్షకులు మహావృక్షములు పడవేసి మార్గము నిరోధించిరి. సంగ్రహించిన ధాన్యములు దూరభూములకు శీఘ్ర యానముల జేర్చిరి. పెద్దపెద్ద తటాకముల కట్టలు త్రెంపి యా ప్రదేశము నిర్జలము చేయజూచిరి.

ఇదియంతయు రాజేంద్ర దేవు డంతకుమున్నె జరుగునని శంకించి యందుకు సిద్ధపడియుండెను. ముందు ధారావర్షు డూహించిన మార్గము లనే యాత్ర చేయనున్న వానివలె ప్రకటించెను. కాని మనస్సు మార్చు కొని వెనుదిరిగిపోవుచున్న వానివలె కొంతదూరము తూర్పుకు నడచి

చుట్టుమార్గమున మూడుదినములలో చక్రకోట్యదుర్గము సమీపించెను. వైశాఖశుద్ధ పంచమి శ్రీ విద్యాశంకరజయంతి ఆదివారమే యయ్యెను. ఆ జయంత్యుత్సవము మార్గమధ్యముననే భక్తిలోపము లేకుండ లఘుకలాపముతో సైన్యములు నిర్వర్తించెను. సోమవారమునాడు చక్రకోట్యము తూర్పువైపునకు సైన్యము లట్టహాసముతో చేరెను.

ధారావర్షునికి భయము మినుమడించెను. దుర్గరక్షణ కార్యము లింకను జరుగుచునే యుండెను. దుర్గరక్షణకు గొప్పసైన్యమును వింధ్యవాసిని యాధీనమున నుంచి కతిపయసేనలతో ధారావర్షుడు స్వయముగా రాజేంద్రదేవుని సైన్యముల బయలున నెదుర్కొనెను ధారావర్షుని సేనలో ననేక గజములు కలవు. చక్రకోట్య మండలమును దానికి సమీపముననుగల వాఘురానగర మను నామాంతరము గల వజ్రపుర ప్రాంతమును గజములకును, వజ్రములకును జన్మస్థానములు.

రాజేంద్రదేవునికి గజబలము తక్కువ, అశ్వబల మెక్కువ. అశ్వబలములను వామదక్షిణపక్షముల నుంచి, యున్న గజబలమును మధ్యనుంచెను. కాని యా గజబలమునకు ముందుకు నడవకుండ నొక యున్నత ప్రదేశమున నిలిచియుండునట్లు శత్రువులు చేసెను అశ్వికులు మాత్రము విద్యుద్వేగముతో ధారావర్షుని సైన్యపక్షములను తాకిరి. ఆ తాకునకు చక్రకోట్యసైన్యపక్షములు విచ్చిపోయెను. అందుచే బలమగు ధారావర్షుని సైన్యశిరస్సగు గజబలములు వృథ యయ్యెను. ప్రక్కలనుండియు కొంత వెనుకభాగమునుండియు పైబడిన వేంగీహయదళములు ఆ గజబలమును చీకాకుపరచెను. అప్పుడు సమయము చూచి కరుణాకర తొండమానుడు వేంగీగజబలముతో ముందుకు నడచెను. క్రమశిక్షణ నొందిన వేంగీ ధానుష్కులు చక్రకోట్యగజపాలకులను పలువుర శరనిహతుల జేసిరి. ధారావర్షుడు ఇక లాభము లేదని యా మధ్యాహ్నముననే నిశ్చయించుకొనెను. అంతట సాధ్యమైనంతవరకు సేనల కూర్చుకొని విచ్చిపోని గజబలముల వెనుక నడ్డుగా నుపయోగించుకొని సాయంకాలము లోపల కోటలో ప్రవేశించెను. ధారావర్షుని గజములలో నేబది గజములు వేంగీయువరాజు వశమయ్యెను.

వేంగీయువ రాజా రాత్రి తన సేనలను విజయోత్సవములు చేసి కొనుట నిషేధించెను. దుర్గము స్వాధీనమై యందు వరాహలాంఛనము ఎత్తించిన నాడు కాని విజయోత్సవము విషయముగూడ ప్రస్తావింపరాదని యాతని కఠినశాసనము। ఆ రాత్రి యువరాజునకు, చోళ మిత్రులకును, చంద్రాదిత్యులకును, నారాయణ భట్టుకును నిద్దురలేదు. వారుచక్రకోట్య దుర్గనిరోధమునకు అనుకూలించు ప్రదేశము లన్నియు నిర్దేశించుకొని యన్నియెడల తగుబలములు సంస్థాపించిరి. తెల్లవారుసరికి చక్రకోట్య దుర్గము ముట్టడి పూర్తియయ్యెను. చక్రకోట్యదుర్గమునకు వచ్చు మార్గము లన్నియు నిరోధించిరి. సమీపములో నున్నత ప్రదేశములం చెల్ల స్కంధావార కేంద్రములు నిర్మించి వాని సంరక్షణకు నేర్పాట్లు చేసిరి. పల్లపు ప్రదేశములలో సేన కాహార సౌకర్యము చేయ నియోగించిరి.అందుమిక్కిలి పల్లముగానున్న యొకప్రదేశమును చంద్రాదిత్యుడు సూక్ష్మదృష్టిచే కను గొని యచ్చటి కింద్రావతీ నదీజలము మరలించిన పరోవరముగా నగు నని యుపలక్షించి సూచింపగా ఖనకులు మరునాటి కది సిద్ధము చేసిరి. స్కంధావారమున కన్నిదిక్కుల రాత్రింబవళ్ళు జాగరూకులగు సైనికుల గా నుండ నియోగించిరి.

క్షతగాత్రులకు చికిత్స చేయుటకు శతాధికులగు వైద్యశిఖామణు లా సేనవెంట నుండిరి. సేనల వెంట తరచుగా వచ్చు నటులను గాయకు లను విదూషకులను మరి యితర వినోదకరులను,రాకుండ యువరాజు కఠి నముగా నిషేధించెను. సురాపానము సేనకులనిషేధించెనుగాని ప్రతిదినము స్కంధావారమున కమితముగా సుర వచ్చునట్లుగౌడజనుల నియోగించెను. అసుర, గజములకును, యుద్ధము లోనికి దిగుచున్న భటసంఘములకు మాత్రము యుద్ధాత్పూర్వము యథావాంఛితముగా నిచ్చుట కనుజ్ఞ యిచ్చె ను. యుద్ధకాలమున వీరుల కనుమతమగు నీ సురా పానమునకు వీరపాన మను సంకేతనామము కలదు.

ఇట్లు సమస్తసన్నాహములు జేయుచు రాజేంద్రదేవుడు సేనల కొక్కనాడు పోరు లేకుండ విశ్రాంతి యిచ్చెను. ఎదుట దుర్గములో మహాసేన యుండగా ముట్టడించిన సేనలకు విశ్రాంతి యుండునా? ఒడలు

మరచి నిద్రించుట కవకాశముదునా? విశ్రాంతి పొందుట యనగా తాముగా కయ్యమునకు తలపడకుండుట! ఈవిశ్రాంతిచే సైన్యములకు మరునాటికి నూతనశక్తి వచ్చును. తాను కష్టనిష్ఠురములు పరీక్షించి యాలోచించుకొనుటకు నుట కవకాశ మేర్పడును.

చక్రకోట్యదుర్గము ఇంద్రావతీనది తూర్పునుండి దక్షిణముగా తిరిగిన మలుపులో నున్నది. అందుచే నుత్తరమునను పశ్చిమమునను దానికి త్రవ్వని యగడ్తగా నా నది ప్రవహించుచున్నది. ఆ వైపుల కోటగోడల కానుకొని యా నది యేకాలమగాధముగా నుండునట్లు కృత్రిమముగా నిర్మాణము చేసిరి. అటు కోట గోడలును మిక్కిలి యున్నతములు. నావలు వేసికొని వచ్చువారులను అటునుండి కోటగోడను ప్రాకుట దుస్సాధ్యము. ఆ రెండువైపుల గోపురద్వారములును లేవు.

ఇక తూర్పునను దక్షిణమునను బలిష్ఠములగు సింహద్వారములు గలవు. ఆ రెండు గవనులకు రెండు రెండు దిడ్లు గలవు. నియమిత దూరములలో ననేకములగు బురుజులును మధ్య నసంఖ్యాములగు కొమ్మలును గలవు. నిరంతరము గవను కొక్కొక్క దానికి ఐదువందలమంది సాయుధభటులును, దిడ్డి కొక్కొక్కదానికి నూర్గురును, బురుజుకు ఏబది మందియు, కొమ్మ కిద్దరు చొప్పునను కాపుండుట సర్వసామాన్యము! అట్లే చక్రకోట్యమును నిరంతరము సాయుధభటులు రక్షించుచుండిరి.

తన స్కంధావారము బాణపాతనమార్గమును దాటి రాజేంద్ర దేవుడు నిర్మించెను. అది నిర్ధారణ చేసికొనుటకు పలుతావులకు బోయి బాణప్రయోగము చేయించి చూచి యా పిమ్మట ధ్రువపరచుకొనెను. అశ్వము లెక్క యాతడును, మిత్రులును, నారాయణభట్టును, దండ నాథులును స్వయముగా నిరంతరము సర్వ విషయములు కనిపెట్టుచుండిరి.

## 41

చక్రకోట్యద్వారములలో బలిష్ఠతమమైనది తూర్పుగవను. అది ఎట్టి సైన్యములనైనను ధిక్కరించి నిలువగలదు.

ఒక్కనాడు సేనలకు విశ్రాంతియిచ్చి రాజేంద్రదేవుడు అభేద్య

మగు ఆ తూర్పుద్వారమును భేదించుటకే సేనల కాజ్ఞాపించెను. సూర్యో దయము కాకుండగనే పెద్దయార్భాటముతో నాతని సేనలు తూర్పుగవను పైకి కవిసెను.

ఈ దండయాత్రలో నాయకులగు వారందరును యువకులని ధారా వర్ష మహారాజుకు చారులవలన దెలిసియుండెను. బహిరంగయుద్ధములో అశ్వబలములయాధిక్యమే వారి జయమునకు కారణముగాని వేంగీనాయ కుల నైపుణ్యముకాదు. తూర్పుద్వారము భేదించుటకు వీరు చేయుచున్న యత్నమును వీరి యనుభవ దారిద్ర్యమునే వ్యక్తము చేయుచున్నది. ప్రమాదమగునని భయపడనక్కరలేదు.

ఇంతలో చూడగా యువరాజరాజేంద్రదేవుడును, కరుణాకర తొండ మానుడును, జయంగొండడును, చిత్రచిత్రవిధముల నలంకరించుకొనికవచ ములుగూడ నున్నవియో లేవో యనిపించుచు నిర్భయముగా రణభూమి లో నశ్వములపై సంచరించుచుండిరి. వారికి అది వినోదమగు రంగ భూమిగా నున్నదికాని రణభూమిగా కన్పింపలేదు. ఇట్టివారు భ్రమర కోట్యము నంత సులభముగా నెట్లు పట్టుకొని రబ్బా! ఏదో మోస ముండి యుండవలెను.

సేనానాథులిట్లు రణభూమిలో సంచరించుట ధారావర్ష మహారాజుకు వినోదావహ మనది. వెంటనే ధానుష్కులను వారిపై లక్ష్యముంచి యవ కాశము చిక్కినప్పుడు బాణహతుల జేయ నాజ్ఞాపించెను.

ఎంతయో సేన నష్టమైన పిమ్మట నాగోపురము నొద్దకు గజములు పోవుటకు మాత్రము కొంత యనువుగా అగడ్తలో దారి యేర్పడెను. రెండునాళ్ళనాటి బహిరంగయుద్ధమున వేంగీసైన్యము చేజిక్కించుకొనిన చక్రకోట్యగజములనే ప్రధానముగా ద్వారభేదనమున కుపయోగించిరి. వాని ముఖములకు లోహపట్టములు కట్టిరి. శూలములవంటి గుబ్బలుగల గోపుర ద్వారముల మీదికి తడినకు ఐదు ఏనుగులను పురికొల్పుచుండిరి. ఆ గజ ములను వానిపై నారోహించినవారిని కోటపైనుండి సైనికులు బాణముల తోడను అగ్నితోడను కాగిన తైలాదిపదార్థముల తోడను శిలలతోడను పలువిధముల నొప్పించుచుండిరి. అందుచే నా ఐదింటిలో తరచుగా నొక్క

టిగూడా గోపురద్వారమును ఒక్క తాపు తాకుటకైన నవకాశము కలుగుట లేదు. మార్గము సరిగా లేనందున తప్పి తాకిన తాపుకూడ బలముగా తగు లుట లేదు.

కోటపైనున్నవారి కిది వ్యర్థప్రయత్నముగా కనిపించుచుండెను. అవి నిజముగా తమ గజములే. అయినను శత్రువులు హస్తగతము చేసికొని వారి వి విధముగా వృథ చేసికొనుట ఏమి బుద్ధివిహీనత!

వేంగిసేనల బుద్ధిమాంద్యము చూచుచున్నకొలదియు కోటగోడల పైని సైనికుల ఉత్సాహ మతిశయించుచుండెను ఇక బయట యువకుల యుత్సాహ మెంత తడవు నిలువ గలదు! రాజేంద్రదేవుని సైనికులు చీకాకు పడుచుండిరి అయినను యువరాజును దండనాథులను అలసిన వీరులకు విశ్రాంతి యిచ్చి కొత్త సేనలను ముందుకు పంపుచు నిర్భయముగా రణభూమిలో విహరించుచు నాజ్ఞలిచ్చుచు నుత్సాహము కలిగింప యత్నించు చుండిరి.

గజములు ద్వారభేదనమునకు ఢీకొనబోవునప్పు డెల్ల పల్లవుల సైనికులు కోటగోడల కెగబ్రాకుటకు త్రాటినిచ్చెనలతోడను ఉడుములు పూనిన సూత్రముల తోడను ప్రయత్నించుచుండిరి. మరియు రెండు ఉన్నతప్రదేశములలో శతఘ్నులు రెండు పెట్టి వానిచే గోపురముపై పెద్ద శిలలు రువ్వించుచుండిరి. చక్రకోట సైనికులు పేరువినుటయే గాని శతఘ్నులను మున్ను చూచి యెరుగరు. ఈ నూతన యంత్రము చూచి ప్రథమములో వారు కొంచము కలత నొందిరి. కాని శతఘ్నియొక్కొక్కటి జామునకు రెండు శిలలకంటె ప్రయోగింపలేకుండెను. మరియునవి ప్రయోగించువారు దక్షులు కానందున లక్ష్యము తప్పుచుండెను. అభ్యాసమునవాని బాధ తప్పించుకొనుట కోటలోనివారికి సులభసాధ్య మయ్యెను.

అలుపెరుగక విశ్రాంతి తీసికొనకుండ యువరాజును అతని చోళ మిత్రులును సంచరించుచు సైనికులకు నూతన ధైర్యము కలిగించుచుండిరి. దానికితోడు ముందుకు పోవు భటులకును గజములకును కరవు తీర 'వీరపానము' లభించుచుండెను. కానియది యావేశముకలిగించిముందుకు

బోవుటకు మైమరపుతో కలసిన ధైర్యము కలిగింపగలదు గాని వారుపొందు చున్నగాయముల నెత్తురునాపగలదా? అగ్నివర్షముచే కమలిన దేహము లను సరిచేయగలదా?

మొదటినాటి ప్రయత్నములచే కోటగోడలుగాని గోపురములుగాని దిడ్డుగాని యావంతయు చలింపలేదు. సాయంత్రమునకు యువరాజు మిత్రుడగు జయంగొండదు బాణహతుడై పటకుటీరమున శస్త్రచికిత్స పొందుచున్నాడను వార్త స్కంధావార మంతటను మారు మ్రోగిపోయెను.

ఆనాడు గోపురమును గోడలను సమీపించుటకు వేంగిసైన్యములు చేసికొనిన స్వల్పావకాశముకూడ నా రాత్రి కోటలోని సైనికుడు నాశ నము చేసి పరిఖ యథాప్రకార ముండునట్లు చేసిరి.

మరునాడు మరల క్రిందటిదినమున ప్రయత్నమే యారంభించెను. మరల వేంగిసేనల ప్రయుత్నము వ్యర్ధము లయ్యెను. కోట యింత బీటువారలేదు. ఆనాటి సాయంకాలమునకు కరుణాకర తోండమానుడు గూడ బాణహతుడై పడక బెట్టెనను వార్త వేంగిభటులను దుఃఖాక్రాంతు లను జేసెను.

మూడవనాడుగూడ మరలనదే విధముగా ప్రయత్నము సాగెను. ఈ దినమున యువరాజు యుద్ధరంగమున నగపడలేదు. అతనిచోళమిత్రు లపాయస్థితిలో నున్నారనియు వారిని జూచుటకు పటకుటీరములను వదల కున్నాడనియు యువరాజు నంగరక్షకులు తెల్పిరి. మరియు నంత నిర్భయ ముగా రణరంగమున దిరుగుట పాడిగా దని నారాయణభట్టు బోధించె నని కూడ యొక వదంతి బయలుదేరెను. ఏది యెట్లున్నను యువరాజు ఆత్మ రక్షాప్రయత్నములో నున్నందుకు అశేష భటసమూహమును సంతోషిం చెను.

యువరాజును, చోళమిత్రులును రణభూమికి రానందున నీ నాడు రణభార మంతయు చంద్రాదిత్యదండనాధునిపై బడెను. అతడు బహుసమ ర్థుడు. చోళదండనాధులు లేని లోటాత డొక్కడే తీర్చెను.

మరియు నతడు చక్రకోట్యమండలాధిపుని ఏకైకపుత్రిక వింధ్య వాసిని విషయమున అనేకాద్భుతకథలు వినియుంచెను. ఆమె బహురూప

లావణ్యవతి, విద్యావతి. ధారావర్షునికి పుత్రసంతానముకలుగ దని జ్యోతిష్కులు చెప్పియున్నందున నత డామెను పుత్రనిర్విశేషముగా పెంచుచు పురుషవేషములో అస్త్రశస్త్ర ప్రయోగాది రాజపుత్రోచితవిద్యలన్నియు నామెకు నేర్పించెను అందులో ఖడ్గ సాధనలో నామె యద్వితీయురాలను ప్రసిద్ధి సంపాదించెను. ఆ కాలమున పలువురు రాజపుత్రు లామెనువివాహమాడవలె నని వాంఛించిరి. కాని వీర్యశుల్క మామెకు నిర్ణయించుట దానికి ప్రతిబంధక మయ్యెను. కొందరు ఆమెతో ఖడ్గయుద్ధము చేయుట కంగీకరింపలేదు. అంగీకరించిన వారినామె పరాజితుల జేసెను. ఆమెను చంద్రాదిత్యుడు సర్వవిధముల జయించి వివాహమాడ సంకల్పించెను. అందుకు వజ్జియప్రెగ్గడ రాజరాజుకు నివేదించి యనుజ్ఞ యిప్పించెను.

అనుదినమును చక్రకోట్యరాజపుత్రిక కోటగోడలపైనుండి సైనికుల కుత్సాహము కలిగించుచు నిర్భయముగా సంచరించుచుండెను. ఆమె యెచ్చటికి వచ్చిన నచ్చట కోటలోని సైనికులు జయజయనినాదములు చేయుచుండిరి. ఆ జయజయ నినాదముల రహస్యము ప్రేమశీలియగు చంద్రాదిత్యున కవగత మయ్యెను.

ఆ దినమున చంద్రాదిత్యుడు చూపిన నేర్పు ఓర్పు వర్ణనాతీతములు. కోటలో జయజయనినాదములు వినవచ్చుచున్న పైపుకెల్ల తన సేనల విజృంభణ మెక్కువకాసాగెను. వింధ్యవాసినికవచావృతదివ్యరూపదర్శనము చంద్రాదిత్యుని హృదయమును పలుమాఱు చూరగొనెను. పునః పునః తద్దర్శనాకాంక్షియై బాణపాతమార్గ మధ్యమునకు పలుమారు అతిక్రమించి పోసాగెను. సాయంత్ర మింకను జాముప్రొద్దున్నది. చంద్రాదిత్యుని హృదయపార్శ్వమున కోటనుండి వదలిన బాణ మొకటి వచ్చి నాటుకొనెను. అది వింధ్య వాసినీ నామాకింతమైన బాణము!

చంద్రాదిత్యుని పటకుటీమునకు సేవకులు చేర్చి చికిత్స చేయించుచుండిరి.

ఆ నాడాపైని నారాయణభట్టు దూరముననే యుండి వేంగిసైన్య

ములను నడిపింపసాగెను. కాని ఆ దినమున సైన్యములిక నుత్సాహముతో కోటమీదికి దూకలేకుండెను. వరుసగా మూడు దినములు ముగ్గురు వేంగీ సేనాపతులే పడిపోయిరిగదా! ఈ చిన్నతనపు ఉత్సాహము కోటలను బేధింపగలదా!

వేంగీసైనికోత్సాహము సన్నగిలుచున్నట్లు చక్రకోట్యమువారికి ద్యోతమయ్యెను. వేంగీసైన్యము వెనుకభాగమున చక్రకోట్యము ముట్టడి వదలి వెనుదిరిగి పోవలెనను నుద్దేశముతో కాబోలు, సంభ్రమము విదితమయ్యెను. సింహనాదములు చక్రకోట్యముకోటపైనుండి భేరీపటహాదివాద్యఘోషలతో కలసి వినవచ్చుచుండెను.

## 42

చక్రకోట్యమునకు మూడు క్రోశముల దిగువను ఇంద్రావతీనదీ తీరమున ఇంద్రవిహారమను గొప్ప బౌద్ధక్షేత్రము కలదు. వైశాఖమాసమున నష్టమినుండియు పూర్ణిమ వెళ్ళువరకు నేటేట నచ్చట మహోత్సవములు జరుగును. చక్రకోట్యమహామండలమునుండియు తదంతఃపాతియగు భ్రమరకోట్యమండలమునుండియు యాత్రికులా యుత్సవమునకు విస్తారముగా వచ్చుచుందురు. చక్రకోట్య మండలము యుద్ధములో నిమగ్నమైయున్నను ప్రజలతీర్థయాత్రలకును ఉత్సవములకును దేవపూజలకును నిషేధముండదు. రాజుల యుద్ధములు రాజులవే. అవి ప్రజాసామాన్యజీవనమునకు భంగకరముగా నుండవు. కాకున్న యుద్ధ సమయములలో వేడుకలు కొంత తగ్గును. చేరు యాత్రిక సంఖ్య తగ్గును. అంతే

చక్రకోట్యదుర్గద్వారములను యువరాజరాజేంద్రదేవుడు సైన్యములతో బేధించుటకు యత్నించుచుండెను. ధారావర్ష మహారాజును,కుమారై వింధ్యవాసినియు నితరదండనాధులును వేంగీసైన్యములను తరిమివేయుటకు ప్రయత్నించుచునే యుండిరి. ధారావర్షుని సైన్యములలో చుట్టుప్రక్కల జన మెందరో చేరిరి. అట్లే చుట్టుప్రక్కల జనులు రాజేంద్రదేవుని సైన్యములకును ఎన్నియో విధముల సేవలు చేయుచుండిరి.

చక్రకోట్యమునకు వస్తువులు చేరకుండ రాజేంద్రదేవుని సేనలు నిరోధించుచుండెను. రాజేంద్రుని సేనలకు పెరుగు పాలు సుర ఇట్టి నిత్యము వాడుకలో నుండు ద్రవ్యములు చేరకుండ ధారావర్షమహారాజు సేనలును,దండనాథులును రహస్యముగను సాధ్యమయినప్పుడు బహిరంగముగను అరికట్ట యత్నించుచుండిరి. ఇట్లు ఉభయసేనలవారు చేయు నిరోధముల్లు తప్ప సామాన్యప్రజలు తమ తమ కార్యములు చేసికొనుటకు విశేషభంగ మేమియులేదు. రైతులు తమ పొలములలో పనులు చేసికొనుచుండిరి. ఎవరి పనులమీద వారు రాకపోకలు జరుపుకొనుచుండిరి. నావికులు పడవలు నడపుకొనుచుండిరి. చక్రకోట్యపరిసరములలో మాత్రమే నావలకు నిరోధముండెను గాని యటు ఎగువనుగాని, యిటు దిగువనుగాని యెట్టి యాటంకమును లేదు.

ఇంద్రవిహారమునకు భగవత్సేవకొరకై నలుదిక్కులనుండి యాత్రికులు మూగుచుండిరి. దినమున కొక వాహనము చొప్పున బుద్ధవిగ్రహము లా యుత్సవ కాలమున నూరేగును. ఆ సమయముల భక్తులు భజనలు చేయుచు దీపస్తంభములతో వీధుల వెంట గంతులు వేయుదురు. కొందరు కేవల నామసంకీర్తనము చేయుదురు. కొందరు నృత్యప్రదర్శనములు చేయుదురు. కొందరు వివిధవేషములు ధరించి బుద్ధ జాతకకథలు ప్రదర్శింతురు. తోలుబొమ్మలాటలు జరుగును. వీధులలో నాటక ప్రదర్శనములుండును. వీని యన్నిటితోపాటు తమ వస్తువులు ఎక్కువ ధరలకు విక్రయించుటకు పలురకముల వర్తకులు మూగుదురు. సామాన్యముగా లభింపని వస్తువు లెన్నియో అప్పు డచ్చట లభించును. కాన నట్టివి కొను వేడుక కలవారు అక్కడ కూడుదురు. కష్టసాధ్యములగు సాధనాదులు లేకయె సులభముగా మహా ఫలములు పొందవచ్చునని పెద్దలమనువారు ప్రచురించుచుండగా, అలసులగు సామాన్యజను లా ఫలతృష్ణచే నీ యుత్సవములకు వచ్చుటలో నాశ్చర్యమేమి! అందును వినోదము కలిగించుచు పుణ్యసంపాదన చేయు సులభసాధనలీ యుత్సవములు! జనహృదయ మవగతము చేసికొనినవారు బౌదులే!

బుద్ధోత్సవములకు వెళ్ళువారిని ప్రధానముగా నాకర్షించునవి ప్రభలు. వీపుల పైనను బండ్లమీదనే కావు అవి వెళ్ళునది; నావలమీద కూడ నవి వెళ్ళుచుండును. సమున్నతములగు నా ప్రభల దర్శనము చూపరుల మనోనేత్రమున చిరకాలము మరపురాక నాటుకొనిపోవును.

ఈ సంవత్సరము భ్రమరకోట్య సమీపగ్రామములవారు నావలపై గొంపోవుటకు సమున్నతమగు ప్రభలు అయత్తపరచిరి. అంత పెద్ద ప్రభలు పైకెత్తినప్పుడు ఆ నావలు తలక్రిందులై పడిపోక యెట్లుండునో ఊహింప సాధ్యము కాకుండెను. అవి పెద్దనావలపై తెరచాపలపై నెత్తుటకు దింపుటకు ననువుగా నేర్పరుపబడెను. అవి యద్భుతమగు వర్ణములతో చిత్రింపబడియున్నవి. కాని యా ప్రభలు పైకెత్తుట కష్టసాధ్యమైనందున తరచుగా నావలపై పండుకొనబెట్టియే యుండెను. అట్టి ప్రభలున్న నావ లనేకము ఇంద్రవిహారమున కుత్సవమునకు వచ్చినవి.

బౌద్ధుల యుత్సవము లతిమనోజ్ఞములు. చిత్రకారులు, శిల్పులు, రంగులు వేయువారు, వస్త్రములు నేయువారు, మరియు నెన్నో విధములగు చేతిపనివాండ్రు బౌద్ధాభిమానులు. అందుచే నా యుత్సవముల శోభ బహుముఖముల ప్రకాశించుచుండెను. భూలోకములోనను కేవల దేవేంద్ర వైభవము ఇంద్రవిహారోత్సవము చూడ వచ్చినవారు తిలకింపగలుగుచుండిరి.

ఈ రాత్రి కంఠకోత్సవము! శాక్యగౌతముడు విరక్తుడై వెడలిపోవ నిశ్చయించెను. ఆ నాడే యతని ప్రియపత్ని యశోధరాదేవి ప్రథమపుత్రుని ప్రసవించెనను వార్త వచ్చెను. మరియొక రాహులము — సంకెల — పుట్టిన దని యాతడు పలికెను. ఆ రాత్రియే యశోధరను రాహులుని తండ్రి శుద్ధోదనుని రాజ్యమును, ఐశ్వర్యమును సమస్తమును వదలి లోకోద్ధరణార్థము ప్రయాణమయ్యెను. అతని సారధి చన్న డొక్కడె యతని గొంతదూర మనుసరించెను.

గౌతమునికి ప్రేమపాత్రమగు నశ్వము కంఠకము. ఆ కంఠకము నెక్కియే అతడు కపిలవస్తునగరము దాటిపోయెను. చాల దవ్వు పోయినంత తనకు ప్రేమ పాత్రులందరు నప్పుడు సుఖనిద్రలో మునిగియున్న

కపిలవస్తునగరమును కడసారి చూడవలె నని వాంఛ కలిగెను. వెంటనే గౌతముడు కంథకాశ్వము నొక్కసారి వెనుకకు మళ్ళించి దూరమున వెన్నెలలో కనుపడుచున్న కపిలవస్తునగరమును కనుల పండువుగా గాంచెను. అదియే కంథకనివర్తనము, కంటకనివర్తనము, కంధకనివర్తనము నని బహునామములతో బౌద్ధుల నేక కావ్యములు వ్రాసిరి, పాటలు రచించిరి, చిత్రములు చిత్రించిరి.

కంథకోత్సవమునకు కీలుగుఱ్ఱము నుపయోగింతురు. ఇంద్రవిహారమున నుపయోగించూ నా యశ్వవిగ్రహము మహోన్నతమైనది. దానిపై రంగులు ఆకర్షకముగా నున్నవి. నాలుగు యక్షవిగ్రహములు ఆ అశ్వ పాదములు పూనియున్నవి. గౌతమాశ్వముపదధ్వనిచే జనములు మేల్కొనకుండజేయుట కానాడు నలుగురు యక్షులు కంథపాదములు తమ చేతులపై వహించిరని బౌద్ధకథలు వర్ణించుచున్నవి.

ఇంద్రవిహారమునుండి యొక్క క్రోశము దూరము ఉత్తరముగా ఇంద్రావతీ నదీతీరము ననుసరించియున్న రాజమార్గముపై నా వాహనము నూరేగింతురు. ఆ యశ్వముపై బుద్ధుని యుత్సవవిగ్రహమును, ప్రక్కను నిలిచిన ఛన్నుని విగ్రహము కలవు. ఆ సమయమున జనసమూహములు భూమిమీదను, నదిపై పడవలమీదను కోలాహలము చేసికొనుచు ఆ వాహనమును వెంబడించును. గమ్యస్థానము చేరిన తరువాత నొక్కసారి యంత్రనియంత్రమై యా యశ్వవిగ్రహము వెనుకకు మరలును.

అప్పు డా యుత్సవజనములు చేయు సందడి కంత ముండదు. భక్తు లావేశముతో కేకలు వేయుదురు. కొందరు పాటలు పాడుదురు. మరి కొందరు స్తోత్రములు చేయుదురు. పలువురకు కన్నులవెంట నేకధారగా బాష్పజలములు ప్రవహించును. కన్నులయెదుట గౌతముని వినిర్గమనము మరల చూచినట్లే వారు భావించి యా భావావేశ మనుభవింతురు. సమస్త వాద్యము లొక్క పెట్టున మ్రోగును. అసంఖ్యాకములుగా కొబ్బరికాయలు అవకాశమున్నయెడ నెల్ల— తైర్థికుల శిరస్సులపై నయినను— పగుల గొట్టుదురు. కర్పూరహారతులు వెలిగింతురు. సుగంధధూపముల నెల్లెడ

వ్యాపింపజేయుదురు. జయఘోషలు చేయుచు గంతులు వేయుదురు. కంఠక నివర్తనోత్సవము చూచినవారికిని ఆ కథ భక్తితో వినినవారికిని మరల జన్మముండదు; రాజులకు పరాజయ ముండదు।

అశ్వ మట్లు వెనుదిరిగి జనుల యావేశ మడగువరకు గొంత కాల మట్లేయుండును. ఆ పిమ్మట మరల యంత్ర ప్రేరితమై అశ్వము ముందుకు తిరుగును. ఊరేగింపు నాలుగడుగులు ముందుకు సాగి ప్రదక్షిణముగా మరియొకమార్గమున ఇంద్రవిహారము చేరుకొనును.

ప్రతిసంవత్సరము జరుగు విధముననె ఈనాడుగూడ కంఠకనివర్త నోత్సవము జరిగెను. ఎప్పటిప్రకారమే ఆయుత్సవము గమ్యస్థానముచేరెను. ఎప్పటిప్రకారమె పడవలు, జనము, ప్రభలతో కోలాహలముగా దానిననుగమించెను. కంఠక నివర్తనము దర్శించి భక్తు లావేశము నొందిరి. అనేక వాద్యముల ధ్వని మిన్నుముట్టి యుబ్బిపొంగి వచ్చిన దనిపించెను. భక్తితోడ కొందరును, సేవించిన మద్యాతిశయముచే కొందరును పరవశులైరి.

భ్రమరకోట్య పరిసరములనుండి వచ్చిన నావలు ప్రభలతోనా యుత్సవము ననుగమించెను. ఉత్సవము వీరోత్సాహముతో దిక్కులు దద్దరిల్లుచుండెను. ఆ సమయములో నేలనో గాని యా నావ లాగక ముందుకు సాగిపోయెను. అది గమనించువారెవరు।

వేంగీసైన్యములు చక్రకోట్యముట్టడి సాగించిన మూడవనాటి సాయంత్రమునకు స్థితిగతులన్నియు కోటలోనివారి కనుకూలముగా నున్నవి. వేంగీసైన్యములో వెనుక భాగమున చలనము, ముఖభాగమున మాంద్యమును దుర్గపాలకులకు ఆనందము కలిగించెను.

చక్రకోట్యదండనాథులందరు నారాత్రి యొక యాంతరంగికసభ చేసిరి. ఆ సభకత్యుత్సాహముతో రాజపుత్రిత వింధ్యవాసిని ధారావర్షుని దక్షిణభుజ మూని యరుదెంచెను. ఇప్పుడు కర్తవ్యమేమి?

ప్రస్తుతము కోట దండయాత్రనుండి తప్పించుకొన్నట్లే. పారిపోవు శత్రువులను వెంబడించుటా? కోట దాటి బహిరంగయుద్ధములో ఆ

యపరిత సైన్యముల నోర్చు శక్తి మనకు కలదా! ధారావర్షుడు స్వయముగా నడిపిన బహిరంగ యుద్ధానుభవమువలన జంకుచుండెను.

రాజపుత్రిక మహారణములో తన రణపాండిత్యము ప్రదర్శించుకొనుట కదే ప్రథమపర్యాయము. ఈ మూడుదినముల యనుభవముతో నామె కాత్మవిశ్వాస మెక్కు వయ్యెను. అందును ఈనాడు వేంగిదండనాథులలో ప్రసిద్ధుడగు చంద్రాదిత్యుని వక్షస్థలముపై "వర్మము చించి బాణహతుని జేసినందున నామెయౌవనసహజమగు నుత్సాహ మినుమడించెను. తెల్లవారకముందె ముట్టడించిన సైన్యములపై బడి చెల్లాచెదురు చేయ వలెనని యామె బోధించుచుండెను. వృద్ధామాత్యులును దండనాథులును అంత తొందర పనికిరా దనియు, మనబలము నెదిరిబలము మరిమరి విమర్శించి నిశ్చయింపవలె ననియు శాంత ముపదేశించుచుండిరి. బలవిషయికమగు వివరములు చారులు తెచ్చినవి వారు విమర్శించుచు గణనము చేయుచుండిరి.

ఇంతలో నారాత్రి వేంగిసైనికులు వివిధములగు దివిటీలు సిద్ధము చేయుచున్నా రని వార్త వచ్చెను. ఎందు కివి? శతఘ్నితో మహాగ్నివర్షము కురిపించు యత్నమా యిది? ఆ రాత్రియె పారిపోవుటకు జేయు సన్నాహమా? దూరమున వేంగీసైన్యము ప్రయోగించుచున్న శతఘ్నిని సూక్ష్మదృష్టితో పరిశీలించి. చక్రకోట్య దుర్గములోని సూత్రధారులును, శిల్పులును సమావేశమై నూతనశతఘ్నులు నిర్మించు విధాన మాలోచించిరి. కాని యా శతఘ్నుల నిర్మాణము పూర్తియగుట కింకను రెండుదినములైన పట్టును.

"పారిపోవువారికి గాక యిన్ని దివిటీ లెందుకు? జాముకు రెండు రాళ్ళు విసరు శతఘ్నితో నెన్ని దివిటీలు విసరగలరు? విసరినను వాని యగ్ని మార్గమధ్యమున జల్లార కుండునా?" అని వింధ్యవాసిని వచించెను.

"రాజపుత్రిక పల్కినది సమంజసముగా నున్నది. శతఘ్నిలో ప్రయోగించుట కయియుండ దా ప్రయత్నము. అయినను 'ప్రయోజనము నుద్దేశింపకుండ మందుడుగూడ ప్రవర్తింప' డని యభియుక్తులు పల్కుదురుగదా! వారు ఏ ప్రయోజన ముద్దేశించుచున్నారో మన మెరుగవలసియున్నది" అని వృద్ధామాత్యుడు పల్కెను.

ఎవరును ఏమియు మాట్లాడకుండుట గమనించి రాజపుత్రిక యది పారిపోవు ప్రయత్నమే యని నిశ్చయించెను. కాని అనుభజ్ఞుల కది సమ్మతముగా నుండలేదు. ఆ రహస్యసభ యర్ధరాత్రమువరకు జరుగుచునే యుండెను.

ఆ సభ జరుగుచుండగనే దుర్గమునకు పశ్చిమ భాగమునుండియేదో వింత శబ్దము వినవచ్చెను. ఆ శబ్దము నేలయురుమువలె దడదడమని నట్లున్నది. ధారావర్షుడు భటుని బిలిపించి యడుగగా, నతడు పోయి వచ్చి యింద్రవిహారమున కింతకోత్సవమునకు వచ్చిన నావలు ప్రభలతో కొన్ని యటు సాగిపోవుచున్నవని నివేదించెను.

ప్రభలతో నావలు యుద్ధసమయమున కోట గోడ ప్రక్కనుండి పోవుటయేమి? నావ లటు నడువకుండ నిషిద్ధమైనవే! వెంటనే యా నావల నాపి నావికులను బంధించి తెచ్చుటకు దండనాథు నొకని నాజ్ఞాపించి ధారావర్షుడు పంపెను.

ఆ దండనాథుడు వెళ్ళునప్పటికే అచ్చట కాపున్న సైనికులు కలవరపడుచు నావికులపై బాణములు ప్రయోగించుచు నిరోధింప యత్నించుచుండిరి. కొందరు భటులు రహస్యమార్గముల నదిమీదికి బోయి యా నావలను ముందుకు సాగనీయకుండ నరికట్టుటకు యత్నించుచుండిరి. ఆ నావలు గజగమనముతో సాగుచునే యుండెను.

వాయువు స్తంభించిపోయెను. ఆ నావలపై ప్రభలు పైకిలేచెను. ఆ ప్రభలు సామాన్యప్రభలు కావు. రెండు నావలపై ప్రభ లొకచోట చేరగనే రెండును కలసి గోపురాకార మేర్పడును. ఆ గోపురములు కోట గోడల కంటె నెత్తుగా నుండెను. ఆ ప్రభల మధ్యభాగమునుండి వేంగి వీరులు పైకి వచ్చి కోటగోడమీదికి సులభముగా చేరుచుండిరి. అందుకు బురుజులకు దూరముగానున్న ప్రదేశములు ఉపయోగించుచుండిరి.

ఆ సమయముననే యువరాజు స్కంధావారమంతయు నీరవమయ్యెను. నిర్ఛిద్రముగా నుండెనని య స్తంగతుడగుచున్న చంద్రకాంతిలో కానవచ్చుచుండెను. స్కంధావారము వెనుకవైపున కదలుచున్న సైనికులు

పశ్చిమమునకును ఉత్తరమునకును ఇంద్రావతీ నదీతీరమునకు శీఘ్రగతుల నడచుచు క్రొత్తవిధముగా క్రమ్ముచుండిరి.

కోటలో సహస్యాలోచనము సాగుచునే యుండెను. నావికుల సాహసము నరికట్టి వారిని శిక్షించుటకు బోయిన దండనాథుడు రాజాజ్ఞలు నిర్వర్తించి ఎంతకు తిరిగి రాలేదు. ఇంతలో నొక్కసారిగా కోట తూర్పు ద్వారమునొద్ద మహాకోలాహలము ప్రారంభించెను. సాయంత్రము సన్నగిల్లిన వేంగీసైనికుల యుత్సాహము నిశాచరులకువలె నా రాత్రివేళ నొక్కసారిగా శతగుణముగా విజృంభించినట్లు తోచెను ఒక్కుమ్మడిగా ఎన్నియో గజములు తూర్పుగోపుర ద్వారమును తాకిన తాకుడు చప్పుడుకు కోటయంతయు దద్దరిల్లి ప్రతిధ్వనించెను. ఈ మారు వేంగీగజములే తాకుచుండెను.

ఏమి టీ సాహసము! ఎక్కువ సైన్యములు వచ్చినవా? పారిపోవు టకు ముందు బెదరించుట కీ ప్రయత్నము చేయుచుండిరా?

చక్రకోట్యము ఉత్తరమునను పశ్చిమమునను దుర్భేద్యమైనది. అటు ప్రాకారము ఉన్నతమును బలిష్ఠమును ఐనది. దాని ప్రక్కనే త్రవ్వని యగడ్తగా ఇంద్రావతీనది ప్రవహించుచున్నది, ఎవరైనను అటునుండి కోటగోడలెగబ్రాక సాహసించినను అట్టివారిని తుడిచివేయుటకు జాలిన బలమచ్చటనున్నది.

అందుచే దుర్గరక్షకులు తూర్పుద్వారమువైపునే దృష్టులు నిలిపిరి. అక్కడికే సేనలును దండనాథులును ఎక్కువగాపోయిరి. అక్కడికే రాజపుత్రికయు తండ్రి యాజ్ఞ నొంది శీఘ్రగతి నేగెను. ఆమె వచ్చినంతనే దుర్గరక్షకుల ధైర్య మతిశయించెను. రాజపుత్రిక ప్రయత్నముల ముందు వేంగీవీరుల ప్రయత్నము క్షీణింపజొచ్చెను. ఒక్కసారి యున్న ఔద్ధత్యము రెండవమారు కనపడదు. అదియును మూడవమారు తగ్గెను.

కాని యింతలో దుర్గము పశ్చిమ ప్రాకారమున కోలాహల మెక్కువైపోయెను. దుర్గరక్షకుల భయవిహ్వలనాదములు ప్రబలెను. రక్షణకు రావలసినదని యక్కడ నుండి సంజ్ఞలును వార్తలును అతిశయించెను.

అక్కడ గోడమీదికి వేంగీసైన్యములు నిరంతరముగా వంతెనల మీదినుండి వలె వచ్చుట కారంభించెను. ప్రభాగోపురమధ్యములనుండి వారు పుట్టుకొనివచ్చినట్లు పైకి లేచివచ్చి ప్రాకారముమీదికి సాయుధులై నడచి వచ్చుచుండిరి. ఇట్లే పలుతావుల జరుగుచుండెను ఒక్కొక్కమా రెందరు వచ్చుచుండిరోకూడ నూహింప నలవి కాకుండెను. చాళుక్య సైనికుల మొదటి ధాటికే నావికుల శిక్షించుటకు రహస్యాలోచన సభ నుండి వచ్చిన దండనాథుడు నిహతు డయ్యెను.

చాళుక్యసైన్యములు అచ్చటినుండి నెమ్మది నెమ్మదిగా దుర్గమున నన్నిదిక్కుల వ్యాపింప మొదలిడెను. గండి తెగిన యింద్రావతీనద్ధ ప్రవాహమువలెను గాలి రేగిన చెలరేగు దావానలమువలెను ఆ సైన్యము చక్రకోట్యదుర్గ మెల్లెడ ప్రసరింపసాగెను. దానిని దుర్గరక్షకు లెంత ప్రయత్నించినను అడ్డుకొనలేకుండిరి.

దుర్గమునకు కలిగిన యపాయవార్త నెమ్మదిగా కోటయంతటను ప్రాకిపోయెను. తెల్లవారగనే కోట వెలుపలికిపోయి చాళుక్యసైన్యములను తాకి వెన్నాడి తరుమవలెనని యాలోచించుచున్న చక్రకోట్యదండనాథుల యాశలన్నియు భగ్నము లయ్యెను. వారికందరకు నాశత్రుసైన్యములు లోపల నెట్లు ప్రవేశించుచున్నవియో కూడ గోచరము కాలేదు. ధారావర్షుని యాంతరంగికసభ వెంటనే మరియొక యాలోచనలోకి దిగెను.

ఆ సభలోనిదండనాథులు ఒకరివెంట నొకరు దుర్గరక్షణోపాయము లాలోచించి బయటికి వెళ్ళుచుండిరి. కాని యా మందిరము విడిచిపోయిన దండనాథులు తిరిగి వచ్చుట లేదు. కొందరు వీరస్వర్గము నలంకరించిరి. మిగిలినవారు బంధితులైరి.

ధారావర్షమహారాజుతో నాతని వృద్ధామాత్యు డిట్లనెను :

"రాజా, ఈ ముట్టడించినవి కేవలము వేంగీసైన్యములే కావు. వారిలో చోళ దండనాథులు కూడ నున్నారు. వారు కేవలము రాక్షసులు: చోళసైనికులు కుంతల దేశభాగములు జయించినప్పుడు జైనవసతులు దేవాలయములే కాక గ్రామములే తగులబెట్టిరి. అట్లు రాక్షసకృత్యములు

చేసి మహాపాతక చోళు డని బిరుదము పొందినవారియొద్ద రణవిద్య నభ్య సించిన వీరి చేతులలో మన ప్రాణములు దక్కుటకల్ల!"

"మన మేమి చేయుట వృద్ధామాత్యమతము?" అని ధారావర్షమహారాజు ప్రశ్నించెను.

"మహారాజా, మహారాణి గుండమహాదేవి యిప్పుడంతర్వత్ని కదా! ఆమెను వెంటనే శత్రువులబారి బడకుండ రహస్యమార్గమున వర శూరపట్టణము చేర్చవలెను. అట్లు చేసినగాని సోమేశ్వరప్రసాదమున ఫలించిన యామె గర్భము సురక్షిత మగుట కష్టము! ఆమెతో మీరును వింధ్యవాసినియు ఆత్మరక్ష చేసికొనుట నా మతము!"

ఆ మాటలు విని ధారావర్షుడు వెంటనే యిట్లనెను: "నిజమే కాని, నేను మాత్రము మీ యిందర నపాయములో విడిచి ప్రాణరక్ష చేసి కొనను!"

రణభూమినుండి వృద్ధామాత్యుడు రాజపుత్రికను పిలిపించి సమ స్తము వివరించెను. ధారావర్షమహారా జామెతో నంతట, "తల్లీ, నీవు కూడ మీయమ్మగారి ననుగమించుట క్షేమము" అనెను.

ఆ మాటలకు వింధ్యవాసినికి ముఖము అంతర్గర్భితముగా రోషము గల సిగ్గుతో నెఱ్ఱవారెను.

"తండ్రీ, నన్ను క్షమింపుడు! మీ దక్షిణపార్శ్వము వదలిపోవుట కిష్టములేదు. మీ రాజ్ఞాపించినచో మీ యాజ్ఞ నుల్లంఘింప వీలులేదు."

వృద్ధామాత్యుడు "తల్లీ, మహారాజశాసనములు అంతకంటె స్పష్ట మగు భాషలో నుండవు!" అనెను.

"అమాత్యసింహా, మీ కొక నమస్కారము. మీరు చెప్పినది నిజమే. కాని, నాకు వారు మహారాజులే కాక పితృదేవులుగూడ గనుక కొంత స్వాతంత్ర్య మూని వారి నర్థించుచున్నాను. వారు స్పష్టముగా నాజ్ఞాపించువరకు నేను వారి యండనుండి యొక యడుగు ఆవలకు పోను.—మహారాజా! నన్ను మీ సన్నిధానము నుండి వెడలిపొమ్మని యాజ్ఞాపింతురా?"

వింధ్యవాసినిమాటలు విని ధారావర్షమహారాజు ఒక్కక్షణ మాలోచించెను. అంతట, "మహామాత్యా, మీరు మహారాణిని శీఘ్రముగా నుచితమగు పరివారముతో రహస్యమార్గమున వరశూరపట్టణము చేర్పింపుడు!" అని వృద్ధామాత్యుని నా పనిపై పంపివేసెను.

ఇంతలో తూర్పుగోపురద్వారముకడ ఘోరయుద్ధము జరుగుచున్నదనియు ద్వారమున కర్గళములు లేవనియు, మధ్యమధ్య ద్వారము తెరచుకొనుచు మరల నతిప్రయత్నముమీద కోటలోనివారిచే మూయబడుచున్నదనియు వార్తవచ్చెను. అది విని వెంటనే ధారావర్షుడును రాజపుత్రికయు స్వయముగా నచ్చటికి బోయిరి.

చూడగా, వేంగిసైనికుల కరదీపికలు చీమలబారులవలె కోటలగోడలమీదను కోటలోపలను క్షణక్షణము నెక్కువగుచు వ్యాపించుచు చుట్టుముట్టుచుండెను. వారికి దుర్గభాగములన్నియు జ్ఞాతపూర్వములుగా దోచుచుండెను. ఆ కరదీపికల వెలుగుతో నా దుర్గము అగ్ని ముట్టుకొనిన మహాపర్వతమువలె రూక్షముగా వెలిగిపోవుచుండెను.

వేంగిభటుల కుత్సాహము నావేశము గలిగించుటకు భేరీపణవాది వాద్రిత్రములు మొరయుచు వీరరసము వెల్లివిరియజేయుచుండెను. కాని ఆ భటుల చాలనము ఆవేశపూరితులై ఒడళ్ళు మరచినవారిది కాదు. ఆ సేనల నడకలో గొప్ప స్థైర్యము ద్యోతమగుచుండెను. సమర్థుడగు హాలికుడు నాగలితో భూమిని కొండ్రలువేసి దున్నునట్లే యా దివిటీల వరుసలును ఆ దుర్గమును దున్నివేయుచున్నట్లు పొడకట్టెను.

మరల మహారాజు రాజకుమారికను గూడి, యందున్న యమాత్యులను చేరిన దండనాధులను గూడి వారికి స్థితిగతులు తెలిపి కర్తవ్య మేమని యడిగెను.

అందులో ననుభవశాలి యగు నమాత్యుడు ఈ విధముగా ననెను:

"మహారాజా, ఇట్టి స్థితిగతులలో వ్యర్థముగా జననష్టము చేసికొనుట సంభావ్యము కాదు. మన మిప్పుడు లొంగిపోయి యీ చిక్కు తప్పించుకొనుటయే శ్రేయస్కరము!" అట్లనుచు నా యమాత్యుడు కంట తడి పెట్టెను.

మిగిలిన యమాత్యులును దండనాధులును గత్యంతరము లే దని యువరాజు సన్నిధికి రాయబార మంపు టే యుక్తమని విన్నవించిరి.

వింధ్యవాసిని తానే యా రాయబారము నడుపుట కనుమతికోరెను. రాజానుమతి నొంది, కతిపయపరివారము శ్వేతధ్వజములు ధరించి వెను వెంట రా నిరాయుధయై వింధ్యవాసిని యువరాజరాజేంద్రదేవ దర్శ నార్థము స్కంధావారమునకు బయలుదేరెను.

ఇంతలో తూర్పుద్వారము శత్రువశమైన దని వార్త వచ్చెను.

"శీఘ్రముగా శోభనముగా తిరిగి రావలసినది!" అని తండ్రి దీవన పొంది రాజపుత్రిక నిర్భయముగా నుభయసైనికులకును జరుగుచున్న యుద్ధమును గణింపక సాగిపోయెను. కరదీపికల వెలుగులో నామె వెంట నున్న శ్వేతధ్వజములు కాంచి వారి నెవరు నేమియు జేయరైరి.

చక్రకోట్య రాజకుమారి సంధికొరకు రాజేంద్రదేవుని స్కంధా వారమును సమీపించుచుండగా యువరాజు పటకుటీరము బయటనేయుండి సైనికుల నడకలు పరీక్షించుచు నవసరమగు నుత్తరువు లిచ్చుచుండెను. అతని పటకుటీరము ఉన్నత స్థలమున రణరంగమంతయు కనిపించు నట్లుగా నుండెను. కొటలో నుండి రాయబారము వచ్చినట్లు తెలియగనే దర్శన మిచ్చుట కనుమతించెను.

రాజపుత్రిక వీరపురుషవేషముతో ధీరముగా వచ్చి రాజేంద్ర దేవునికి వందన మాచరించి ప్రక్కనున్న నారాయణభట్టుకుగూడ వందన మాచరించెను.

"శీఘ్రమేవ కళ్యాణప్రాప్తిరస్తు! దీర్ఘసుమంగళీభవ!" అని నారాయణభట్టు ఆమెను ఆశీర్వదించెను.

అది విని వింధ్యవాసిని తీక్ష్ణదృక్కులతో నారాయణభట్టు వంక జూచెను గాని నారాయణభట్టు నిర్లక్ష్యముగా చిరునవ్వు నవ్వెను. యువరా జొక్క క్షణ మాలోచించి యా వచ్చినది రాజపుత్రిక యని యర్థము చేసికొనెను. ఆ పిమ్మట నామెపై యువరాజు కాదర మతిశయించెను.

"చక్రకోట్య ప్రభువులు ధారావర్షమహారాజులు అనవసరమగు జన నాశనము పరిహరించుటకు సంధికి రాయబారము పంపినారు" ఇట్లని క్లుప్తముగా రాజపుత్రిక వచ్చిన పని నివేదించెను.

"మాకును జననష్ట మంగీకారము కాదు!" అని యువరాజు పలికెను.

"రాజపుత్రులు రాజపుత్రులను జూచునట్లు చూచెద మని మీరు వాగ్దానము చేయుట యొకటే ధారావర్ష మహారాజు లర్థించుచున్నారు!"

యువరాజు ముఖమున భ్రుకుటి భయంకరముగా నుండెను. రాజపుత్రిక తాను చేసిన తప్పు తెలియక యొకింత జంకెను.

"జయశాలి వాగ్దానములు చేయునా?" అని నారాయణభట్టు అందుకొనెను.

"నిజమే. కాని పరాజితులకుగూడ గౌరవమునకు భంగములేని మృత్యువు వరించు మార్గములు తమ చేతిలోనే యుండు నని తమ రెరుగరా, అమాత్య సింహా?" అని రాజపుత్రిక ప్రతిప్రశ్న వేసెను.

"అవును కాని, రాజపుత్రులను రాజపుత్రులు చూచినట్లు చూతు మని వాగ్దానము చేయు మని రాజపుత్రాగ్రణులను కోరుట యుక్తమని నీకు పెద్దలే ఉపదేశించినారా, తల్లీ!" అని నారాయణభట్టు పలికెను.

రాజపుత్రిక యొక్క క్షణ మాలోచించెను.

"నొలంబవాడిలో చోళసైన్యములు దేవాలయములు ధ్వంసముచేసి బ్రాహ్మణుల హింసించి కన్యలనుగూడ చెరపట్టిన వని లోకప్రతీతి మీరు వినలేదా, మహాత్మా? క్షమింపుడు. మరియు యువరాజు—మరియు యువరాజు—బ్రహ్మ....." అర్ధోక్తిలో రాజపుత్రిక విరమించెను.

"యువరాజరాజేంద్రదేవుడు ధనుర్విద్యా ప్రదర్శనములో బ్రహ్మహత్య చేసినాడని కూడ వింటివి గదా, రాజపుత్రీ! అతడు హత్యచేసిన బ్రాహ్మణుడును నేనే! ఇక నొలంబవాడిలో జరిగిన వాస్తవ మేమో నీకు తెలియునా?" అనెను నారాయణభట్టు.

రాజపుత్రిక : సెలవిండు!

నారాయణ : అచ్చటి జైనబ్రాహ్మణులు వారి వసతులలో నెందరో యుద్ధ భటులకు కన్యావేషములతో గూడ నాశ్రయ మిచ్చిరి. ఆ వసతుల నుండియు వారి దేవాలయములనుండియు కుంతలసైనికులు చోళసైన్యములతో యుద్ధముచేసినారు.

రాజపుత్రిక : నా అజ్ఞానము క్షమింపుడు!

నారాయణ : ఐనను చోళసైన్యములు తీవ్రప్రతాపులగు సూర్యవంశరాజులవి. ఇప్పు డిక్కడ చేరినవి సీతాంశువంశజులైన వేంగీ చాళుక్యమహారాజుల సైన్యములు గదా! అది శత్రుమండలము! ఇది సామంతమండలము!

రాజపుత్రి : బండ్లు ఓడల వచ్చును. ఓడలు బండ్లవచ్చును. వీర క్షత్రియులొకప్పుడు సామంతులైనను మరొకప్పుడు స్వతంత్రులగుదురు. అట్టి ప్రయత్నములు క్షత్రియోచితములు కావని యువరాజులైన నందురా?

యువరాజరాజేంద్రదేవుడు కఠినముగా తలప్రక్కకు త్రిప్పుకొని పెద మొగముతో నిట్లనెను :

"మా కెట్టయినను బ్రాహ్మణహంతకుల మని పేరు వచ్చినది. మేము విద్యాభ్యాసము చేసినదికూడ తీవ్రప్రతాపులగు చోళరాజుల యాస్థానపండితుల యొద్దనే! భట్టారకులు సహజముగా నవనీతమనస్కులు గనుక మోమోటపడుచున్నారు. మా సైన్యములుకూడా కన్యాహరణము చేయు నిశ్చయముతోడనే వచ్చినవని మేము దాపరికము చేయము. మా కాప్తుడగు చంద్రాదిత్యదండనాదుడు హృదయమున బాణహతుడై చికిత్స నొందుచున్నాడు. దానికి ముందు రాజపుత్రిక యాతని వరించి నిర్వృతి చెప్పితీరవలెను!"

"రాజపుత్రా, మీ మాటలు నాకర్థమగుట లేదు. బ్రాహ్మణోత్తములు మీరేని వివరింతురా?" అని రాజపుత్రిక ప్రశ్నించెను.

నారా: ఎట్టి వాగ్దానములు కోరకుండ మీ తండ్రి యువరాజుకు వశుడగుటకు సిద్ధముగా నున్నచో నెట్టిచిక్కు లుండవని యువరాజును ద్దేశము."

రాజపుత్రిక: "మా పితృదేవు లందుకు సంసిద్ధులే. కాని కన్యాహరణము, దండనాథులను రాజపుత్రిక వరించుట అని యువరాజులు సెలవిచ్చినది నాకు బోధపడలేదు!

నారా: అదా? ఏ మున్నది? నీవు చంద్రాదిత్యదండనాథులను వివాహ మాడవలెను! నీ కది శోభనము!

వింధ్యవాసిని ముఖము చిట్లించి వినయముగా నిట్లనెను.

"మా పితృదేవులు సర్వాత్మనా, మీకు వశు లగుటకు సమ్మతింతురు గాని నన్ను మీరు కోరిన దండనాథునకు వశపరచుటకు మాత్రము వారికి సంపూర్ణ స్వాతంత్ర్యము లే దని విన్నవించుకొననిండు!"

నారా : నీవు పితృవాక్యము పరిపాలింతు వని యువరాజు తలంచెను. అది పొరపా టందువా?

రాజపుత్రిక : పొరపాటుకాదు కాని, యీ విషయములో మాత్రము మా పితృదేవులు నా ప్రతిజ్ఞ పాలింతురు!

నారా : ఆ ప్రతిజ్ఞ యెట్టిదో వినవచ్చునా?

రాజపుత్రిక : సమాన కుల శీల సంపన్నులలో నన్ను ఖడ్గయుద్ధములో జయించినవానికి గాని న న్నొసంగుటకు వారు సమ్మతింపరు.

యువరాజు పెదమొగముతోడనే నిష్కర్షగా పలికెను :

"అది మాకును సమ్మతమే. వెంటనే నీవు దుర్గములోనికి పోయి దుర్గరక్షకుల నాయుధవిసర్జనము చేయ నాజ్ఞాపించి యట్లు చేయించినచో యుద్ధవిరమణమున కుత్తరువు లిప్పింతుము. నీ కెట్టి వాగ్దానమును జేయుట లేదు సుమా, ముందు!"

"మహాప్రసాద" మని వింధ్యవాసిని యువరాజునొద్ద సెలవు పొంది కోటలోనికి వెడలిపోయెను. అప్పటికి తెల్లవారుచుండెను. ప్రాతర్మందమలయానిలములు రాత్రి యెల్ల యుద్ధపరిశ్రమతో జాగరణము చేసిన యుభయసైన్యములకు నొకింత సుఖ మిచ్చుచు మలయ సాగెను.

ఆ పిమ్మట నల్పకాలముననే దుర్గరక్షకు లాయుధములువిసర్జించిరి. వేంగీ యువరాజాజ్ఞలప్రకారము ఆంధ్రవీరులు యుద్ధము చాలించి యా దుర్గము స్వాధీనము చేసికొనిరి. సూర్యోదయ మగునప్పటికి అన్ని

రంగములందును యుద్ధము ఆగిపోయెను. వేంగీచాళుక్యుల వరాహధ్వజము దుర్గముపై నెగురుచు ముచ్చట కొలిపెను.

ఇన్ని నాళ్ళను యుద్ధములో వేంగివీరులు చూపిన పరాక్రమము నిరుపమానము. కాని యంతకంటెను విజయోత్సాహములో వారు చూపిన ఆత్మసంయమనము ధర్మబుద్ధి శ్లాఘ్యతరముగా నుండెను. ఈ సమయమున మొదటి రెండు దినముల గాయపడినా రనిన కరుణాకరతొండమానుడును జయంగొండరునే సైన్యములనడిపించిరి. వారికి గాయములే లేవు. ఈ రాత్రి యుద్ధప్రయత్నములు సమీచీనములుగా జేయుటకే వారు గాయపడినా రని వార్త ప్రచురించిరి. కాని యది యెరుగక నిజమని నమ్మిన భటులు "ఈ చోళదండనాథులు బాణహతికూడ వెంటనే మాను రాక్షసులా?" అనుకొని యాశ్చర్యపడిరి.

కోటను వశము చేసికొను కార్యములో వారు మిక్కిలి యప్రమత్తులై యుండిరి. సూర్యోదయ మగునప్పటికి బహుసహస్రాధికముగా సురాభాండములు వీరపానమునకు పానశాలలకు చేరెను. ముందు కరుణాకరు డచ్చటి కేగి యా వచ్చిన సుర నంతయు బారబోయించెను. యుద్ధ విరమణమైన పిమ్మట వీరపానము నిషేధము!

వేంగీసైనికులు దుర్గములోని యాయుధములు రాజధనము నంతయు స్వాధీన పరచుకొనిరి. అంతఃపురము చుట్టును భటులను కాపుంచి యంతఃపురమర్యాదలకు భంగము లేకుండ తమ సైన్యములతో వచ్చిన వృద్ధకంచుకులను షండులను నియోగించి యంతఃపురాంతర్భాగమంతయు స్వాధీనము చేసికొనిరి.

ఇక పౌరుల ధన మాన ప్రాణముల కెట్టి విపత్తును వాటిల్లలేదు. జయశ్రీ యా ధర్మసైనికులను శాంతింపజేసెనుగాని మదోన్మత్తుల జేయలేదు వారి శిక్షణ మంతసునిశిత మైనది.

ధారావర్షుని దండనాథులను సైనికులను అందరిని వేంగీసైనికులను దండనాధులును నిరాయుధుల నొనర్చి తమ స్వాధీన మొనర్చుకొనిరి. కాని ధారావర్ష మహారాజును రాజపుత్రిక వింధ్యావాసినిని మాత్రము

నిరాయుధుల జేయలేదు. వారికి యువరాజ రాజేంద్రదేవులు మధ్యాహ్న సమయమున మహాసభలో దర్శన మిత్తురని నివేదించిరి.

ఆ మధ్యాహ్నమునకు పూర్వమే ధారావర్షమహారాజు అమూల్యము లగు రత్నములను సువర్ణములను ధనరాసులను వస్తువాహనములను పరివారముచే పట్టించుకొని యువరాజదర్శనార్థము వింధ్యవాసిని వెంట రా బయలు దేరెను.

# 45

ఆనాడు మధ్యాహ్న వేళకు సరిగా యువరాజ రాజేంద్రదేవుడు పరాజితుడగు ధారావర్షునికి దర్శన మిచ్చుటకు నిండుకొలువుదీరియుండెను. అతని నమాత్య దండనాథ పరివారములు పరివేష్టించి యుండెను. వ్యాఘ్ర చర్మము పరచిన యున్నతాసనమున రాజేంద్రదేవు డుపవేశించెను. అప్పు డాతడు దివ్యాంబరా భరణభూషితుడై వీరవిలాసమూర్తియై చూపట్టెను. యువరాజచిహ్నమగు వజ్రస్థగితకంఠిక యతని కంఠమున వ్రేలుచు మనోజ్ఞమగు నతని దేహకాంతిని దశగుణముగా ప్రజ్వలింప జేయుచు న్నది. యవన స్త్రీ లిరువురు విలాసముగా చామర గ్రాహిణులై వీచుచు నిలిచిరి. రోమక సేవకు డొకడు వెనుక నిలిచి శ్వేతాతపత్రమును దృఢ ముగా పట్టి కదలక యత డా యాతపత్ర స్తంభ భాగమా యనిపించు చుండెను.

యువరాజునకు పూజ్యమగు దక్షిణభాగమున కుశాస్తరణముగల యుచ్చాసనమున నారాయణభట్టు ఉపవిష్టు డయ్యెను. వామభాగమున చంద్రాదిత్య దండనాథుడు గౌరవలాంఛనము లన్నియుధరించి యున్నతా సనమున నుండెను. అతని యురస్థలమున నా క్రిందటి సాయంకాలమున బాణహతిచేనైన గాయమునకు కట్టినకట్టు, అతని శరీరమున ధరించినఇతర భూషణము లన్నిటికంటె నాతని కెక్కువ వీరాలంకారముగా శోభిల్లుచుం డెను. కరుణాకరుడును జయంగొండరును ఇతర దండనాథులును యథో చితముగా నాస్థాన మలంకరించిరి.

వంది మాగధులు చాళుక్యవంశకీర్తన మొనర్చి కైవారము చేసిరి.

యువరాజు రాజరాజనరేంద్రుల యానతి శిరస్సున ధరించి రెండు దినము లలో భ్రమర కోట్యము పట్టుకొని మూడు నాళ్ళలో చక్రకోట్యదుర్గము జయించిన వృత్తాంతము సంక్షేపముగా నాడంబరము కల వాక్కులతో నారాయణభట్టు రచించిన శ్లోకములతో పంది యభివర్ణించెను.

అంతట చక్రకోట్య మండలేశ్వరుడు పుత్రికాద్వితీయుడై యసం ఖ్యాకములగు కానుకలతో దేవదర్శనార్థము వేచియున్నాడని దౌవారికుడు నివేదించెను. యువరాజు గంభీరమగు నొక శిరఃకంపముతో నందు కనుజ్ఞ యీయ నాతడు నిష్క్రమించెను.

మరి కొద్దిసేపటికి దౌవారికుడు ధారావర్షమహారాజును వింధ్యవాసి నిని యువరాజసమక్షమున ప్రవేశపెట్టి వారి నెరుక పరచెను. రాజకుమారి యథా పూర్వముగా వీరపురుషవేషము ధరించియుండెను.

ధారావర్షమహారాజు ఉదాత్తమగు మూర్తితోనిశ్చలముగాముందుకు నడచెను. ముందాతడు శాంతముగా రత్న ఖచితమగు తనఖడ్గమును కోశముతోగూడ తన కటి పార్శ్వమునుండి వేరుచేసి యువరాజు పాద ములముందు ఉంచెను. అంతట శిరస్సుపైనుండి కిరీటము తీసి యదియు ఖడ్గసమీపమున నుంచి యువరాజు కర్పించెను. ఆ పిమ్మట నాతడు వంగి యువరాజు పాదపీఠికి శిరస్సు తగులునట్లు చేర్చి పాదాభివందనము చేసెను.

అప్పు డొక్కమారుగా జయభేరులు మ్రోగెను. ఘంటానాదములు బోరు కలగెను. అశ్వహేషలు గజఘీంకారములు దిక్కుల పిక్కటిల్లెను. సభ్యుల జయ జయ నినాదములతో నా సభాంతరాళము ఒక్కసారి మారు మ్రోగెను.

ఆ విజయోత్సవావసరమున యువరాజరాజేంద్రదేవుని దివ్యమూర్తి తిలకించిన వారి దేహము లానందముతో పులకించెను. ఆతని వయస్సు పదునారేండ్లె! ఆ ఈడునకే అతనిలో రాజరికము మూర్తీభవించినది. సభాసదు లెంతయు నాతని మహిమకు లోలోపల మెచ్చుకొనజొచ్చిరి.

ఇది యాతని ప్రథమవిజయోత్సవము! దీనిచే నాతడు పరవశుడు కాలేదు. ఈవిజయ మాతడు ప్రకృతిసిద్ధముగా రావలసి వచ్చినదిగనే పరి

గణించుచున్నట్లు తోచెను. ఇది భావికాలమున నాతడు పొందనున్న మహా విజయ పరంపరకు నాందీప్రాయముగా చూపట్టుచుండెను. పరాజితుడైన ధారావర్ష మహారాజే యువరాజు తేజస్సుకు ముగ్ధుడైనట్లు చూపరకు కని పించెను.

ధారావర్షుని యనంతరమున వింధ్యవాసినిగూడ తన ఖడ్గమును వీర లాంఛనములును యువరాజు పాదపీఠమం దుంచి యాతని పాదములకు వందన మాచరించెను.

ఆ తర్వాత ధారావర్షుడు తెచ్చిన కానుక లన్నియు యువరాజుకు సమర్పించి ఇట్లు వచించెను :

"యువరాజ మహాదేవా! నీచేత విజితుడ నగుటకూడ మహాభాగ్య ముగా భావించుచున్నాను. ఈ యాత్రలో నీవు చూపిన ప్రజ్ఞ యతిమాను షము! ఇక ముందు నీ యాజ్ఞానువర్తినై యుండగల నని యిదే ప్రతిజ్ఞ చేయుచున్నాను!"

వెంటనే నారాయణభట్టు కనుసన్నతో పరిచారకు డొకడు ధారా వర్షుని ఖడ్గము యువరాజు పాదపీఠికనుండి తీసి యువరాజుచేతి కిచ్చెను. అంతట ధారావర్షుడు యువరాజు నెదుట మోకరింప నాతనికి యువరా జది ప్రసాదించెను. ధారావర్షు డది రెండు చేతులతో మహాప్రసాదమని గ్రహించి కన్నుల కద్దుకొని యది చేతుల నుంచుకొని మరల పూర్వోక్త ప్రతిజ్ఞ చేసెను. ఆ తర్వాత రాజపుత్రికకు గూడ నామె ఖడ్గమును యువ రాజు ప్రసాదింపగా నామెయు తండ్రిచేసిన విధముగా నది స్వీకరించి ప్రతిజ్ఞలు చేసెను.

ఆ పిమ్మట వారి కుభయులకు గౌరవమగు నాసనములపై గూర్చుండ నను‌జ్ఞయైనది. కాని ధారావర్షుని కిరీటముమాత్రము యువరాజు పాదపీఠమున నెకుదురుకొనెను.

సభ రవంత సేపు నిశ్శబ్దముగా నుండెను. అంతట నారాయణభట్టు కంఠము వినవయ్యెను. అతడు ధారావర్షుని సంబోధించి యిట్లనెను :

"మీ పుత్రికగుణసంపద యెంతయు హర్షావహ మగుచున్నది. ఆమెను చంద్రాదిత్యదండనాథున కిచ్చి వివాహము చేయుట మా యందర

కభీప్సితము. వజ్జియ ప్రెగ్గడలు కూడ నదియె వాంఛించిరి. మీ కల్లుడగుటకు చంద్రాదిత్యుడు కుల రూప గుణముల సర్వవిధముల యోగ్యుడు!"

ధారావర్షుడు క్షణము మౌనము వహించెను.

"మాకు ప్రియతముడగు చంద్రాదిత్యుని కల్యాణోత్సవము ఈ విజయోత్సవముతో కలిపి జరుగుట సర్వపక్షములకు శుభప్రదము!" అని యువరాజందుకొనెను.

"బ్రాహ్మణోత్తముల యభీష్టము, యువరాజు నాజ్ఞ నిర్వర్తించుట కంటె నాకు సమ్మతమగు నది మరియొకటి లేదు. నేను ధన్యుడను. కాని ఇది నా చేతిలో లేదు. సంతానము కలుగ దని నిరాశ చేసికొనిన కాలమున మా కులదేవతా ప్రసాదముచే నీ పుత్రిక జన్మించినది. తదాది దీనిని పుత్ర నిర్విశేషముగా పెంచి రణవిద్య నేర్పించినాను. వివాహవయస్సు వచ్చినను వివాహ మాడ నని పట్టు పట్టినది. దౌహిత్రుడైన లేని దీ రాజ్యము నెవ్వరి కప్పగింపవలెనో యని నేను చింతిల్లుచుండుట గమనించి, తుద కిది తన్ను ఖడ్గప్రయోగమున జయించిన కులీనుని మాత్రము వివాహ మాడుటకు సమ్మతించినది. అందుకు నేనును అంగీకరించితిని. ఆ పై మే మిరుపురము నందుగూర్చి ఘోరశపథములు చేసికొంటిమి. మా శపథములు గౌరవింపవలెనని యువరాజులను అమాత్యులను అర్థించుచున్నాము."

ఇట్లు ధారావర్షుడు పలుకగా నా మాటలు విని రాజపుత్రిక ముఖ మెర్రవారెను. చంద్రాదిత్య దండనాథుని ముఖంకూడ నెర్రవారెను. యువరాజు వా రిరువురను గమనించెను. నారాయణభట్టు చిరునవ్వు విరియుచున్న ముఖముతో నిట్లనెను :

"మా వేంగీవీరులు పురుషులతో యుద్ధములు చేయుటకు వెను దీయరు గాని స్త్రీలతో యుద్ధము చేయు సాహసము తక్కువ. వారు స్త్రీ జనమునకు దాసులు. చంద్రాదిత్యదండనాథుని హృదయమున దూరినది రాజపుత్రిక బాణమే, చూచితిరా?"

ఇట్లనుచు భటునిచే నా బాణము తెప్పించి సభాముఖమున జూపించెను. ఆ బాణము చూడగానే ధారావర్షుని ముఖము వికసించెను. నారాయణ భట్టు మరల నందుకొనెను :

"మా దండనాథుని వైఖరి చూచితిరా? ఆ బాణహతి పొందిన దాది యా బాణ ముద్ధరించి దానిని పరదైవతముగా పూజించుచు తగిలిన గాయము కూడ మహాభాగ్యముగా భావించుచు ఆనందించుచున్నాడు."

ఆ మాటలు విన్నంతనే రాజపుత్రిక దేహములో స్త్రీత్వము ఒక్కసారిగా రేకెత్తినది. ఒక్కసారి చంద్రాదిత్యుని ముఖము చూడ తలయెత్తినది. చంద్రాదిత్య దండనాథుడు ఆమెవంకనే చూచుచుండెను. వారి యిరువుర దృష్టు లొక్కసారి కలసినవి. అవి యొక్కక్షణము పెనుగులాడినవి. మరు క్షణములో రాజపుత్రిక తల వంచెను. ఆపై నామె చంద్రాదిత్యుని వంక చూడలేకపోయినది. చంద్రాదిత్యుని చూపు లామె చూపులను జయించినవి.

చంద్రాదిత్యదండనాథుడు లేచి నిలువున నిలుచుండెను. సభ యంతయు వ్యగ్రతతో నతనివైపు దృష్టి మరల్చెను. అతడు నిష్కంప ముగా యువరాజుకు వందన మాచరించి "రాజపుత్రికతో వెంటనే ఖడ్గ యుద్ధము చేయుటకు సిద్ధముగానుంటి" నని విన్నవించెను.

అతనికి ఆ క్రిందటి దినముననే కలిగిన గాయము తీవ్రత యింకను పోలేదు. ఖడ్గయుద్ధములో చతురయగు వింధ్యవాసినితో వెంటనే ద్వంద్వ యుద్ధము చేయుట ప్రమాదకరము. ఈ సంతోషసమయములో తన ప్రధాన దండనాయకున కపాయము సంభవించుట యువరాజు కిష్టములేదు. అస మ్మతి తెలుపు దృష్టితో యువరాజు నారాయణభట్టువంక తిలకించెను.

"యువరాజా, యుద్ధభిక్ష కోరిన రాజపుత్రికను దానము చేయ సిద్ధ మైన మన దండనాథాగ్రణికి ఆటంకము కలిగించుట ధర్మము కాదు. కాని పదనులేని క్రీడోపయోగి ఖడ్గములతో నీ ద్వంద్వయుద్ధము చేయుట కాజ్ఞ యిప్పించిన సర్వము సమీచీనము కాగలదు."

నారాయణభట్టుసూచన కందరు సంతసించిరి. యువరాజు మన స్సులోని కలవరమును చిరునవ్వుతో కప్పిపుచ్చుచు ననుజ్ఞ యిచ్చెను.

వెంటనే వారిద్వంద్వయుద్ధమునకు రంగము ఆయుధములు పరికర ములు సిద్ధము చేసిరి. నారాయణభట్టునే మాధ్యస్థము నెరప యువరాజు

కోరెను. దానికి ధారావర్షుడు సంతోషముతో సమ్మతించెను. అతనికిగూడ చంద్రాదిత్యుడే గెలువవలె నని కోరికగా నుండెను.

రంగస్థలము ఖడ్గాదుల పరీక్ష నారాయణభట్టే స్వయముగా జేసెను. చంద్రాదిత్యుడును వింధ్యవాసినియు ఉభయపక్షముల పంసిద్ధు లైరి. ఉభయులు ఖడ్గములకు నమస్కరించిరి వీరోత్సాహము ప్రకృతిసిద్ధముగా నిండియున్న యా సభాస్తారుల కా క్రీడావిలోకనమందు కల యుత్సుకత నిర్వేల మయ్యెను. వా రెవ్వరును చంద్రాదిత్యుడు గాయపడినవా డనికూడ గమనించుచున్నట్లు లేదు.

వేంగివీరపురుషునికి చక్రకోట్యవీరవనితారత్నమునకు నప్పుడు జరుగనున్న యా యుద్ధమంగళమునకు పురోహితునివలెవారి యిరువురమధ్య నారాయణభట్టు చేరెను. ఇరువురు యుద్ధప్రారంభమున కాతని యనుజ్ఞ కొరకై నిరీక్షించుచుండిరి.

నారాయణుడు మధ్యనుండి ఈవలకు రాబోవుచు ఆగ మని చేయె త్తెను.

"చంద్రాదిత్యుని వక్షస్థలముపై వ్రణబంధ మున్నది. అది నిజమో కాదో మధ్యస్థుడు పరీక్షింపవలెను. ఏదైన నాయుధము రహస్యముగానందు పదిలపరచినాడేమో!" అని నారాయణభట్టు పలికి, చంద్రాదిత్యుని కట్టు విప్ప మని కోరెను. వెంటనే యువరాజు సంజ్ఞచేయ రాజవైద్యుడు వచ్చి యా బంధము తొలగించి లోపల గాయముపై వేసిన పసరు ఇత్యాదిక మందరకు జూపెను. చంద్రాదిత్యుడు చిరునవ్వుతో నిశ్చలుడై నిలుచుండెను. అంతట నారాయణభట్టు సభాసమక్షమున నా బంధము మరల బిగింప జేసెను.

అంతట సిద్ధముగా నుండు డని యా యిద్దరకును సంజ్ఞలు చేసి, నారాయణభట్టు ఈవలకు వచ్చి యుద్ధానుజ్ఞ యిచ్చెను. ఇందులో ఎవరు గెలువగలరో చూడ నందరు వ్యగ్రులైరి.

ఇద్దరును ధీరముగా రంగమధ్యమునకు వచ్చి ఖడ్గములు కలిపిరి. ఆ ఖడ్గములు రెండును పరస్పరానురాగముతో కలసిన రెండు మహానాగముల ననుకరించెను. అంతే! వారి చూపులు రూపములు ఒండొరులను

విజితుల జేయుచుండెను. మూడుపర్యాయములు అప్రయత్నముగా ఖడ్గ భ్రమణములు పూర్తియయ్యెను.

వీ రిద్దరికి ఖడ్గయుద్ధము అభ్యస్తమేనా యని చూపరికు సందేహ ముదయించెను. ఆ యుద్ధ మెవరికిని ఉత్సాహప్రదముగా లేదు. పోరువారి కిరువురకు పోరాటమున నుత్సాహము లేదు

ఆకస్మికముగా వింధ్యవాసిని కరమందలి ఖడ్గము క్రింద పడి పోయెను. చంద్రాదిత్యుని ఖడ్గాగ్రహామునందలి సిందూరము ఆమె ఫాల భాగమున దాకి నొసట సిందూర తిలక ముంచెను.

చంద్రాదిత్యుడు జయించె నని నారాయణభట్టు ప్రకటించి యుద్ధ విరమణము శాసించెను.

పాపము చంద్రాదిత్యుడు జయవార్త వినినవెంటనే అతని కావేశా తిశయము వలన రొమ్ముపై గాయమునుండి రక్తప్రవాహ ముధికి ప్రవ హింపగా స్పృహ తప్పి పడిపోయెను. రాజవైద్యులు వెంటనే రక్త ప్రవాహ మాపి రెండు గడియలలో స్మృతి వచ్చునట్లుచేసిరి. అంతవరకును వింధ్యవాసిని కన్నీరు కార్చుచుండెను.

మరునాడే కార్తాంతికుడు వారి వివాహమునకు శుభముహూర్తము నిశ్చయించెను. వీరవైభవముతో వింధ్యవాసిని చంద్రాదిత్యుల వివాహ మయ్యెను. ఈ విధముగా సింహాలాంఛనుడును కరికాలచోడవంశజుడును, కాశ్యపగోత్రుడు నగు చంద్రాదిత్యునికిని, నాగవ్యాఘ్రలాంఛనులు భగవతీ పురాధీశ్వరులు నగు సైంధవ రాజపుత్రిక యగు వింధ్యవాసినికిని దాంపత్యము సమకూరినది.

ధారావర్షుడు రాజరాజనరేంద్రున కీయవలసిన కప్పము దశగుణ ముగా చెల్లించి యుద్ధవ్యయ మంతయు భరించుట కొప్పుకొనెను. వెను కటి కప్పము ద్విగుణము చేయుచు ముందు చెల్లించుచుండుటకు అంగీకార పత్రిక దేవబ్రాహ్మణ మహాసభా సమక్షమున లిఖించి యువరాజు కర్పిం చెను. అంతట మరల మహారాజ బిరుదమును పూర్వార్పితకిరీటమును యువరాజ రాజేంద్రదేవునిచే నాతడు పొంది కృతార్థుడయ్యెను.

యువరాజు నారాయణభట్టును చోళమిత్రులను ఆలోచించి, వారి యనుమతితో చంద్రాదిత్యదండనాధునే, చక్రకోట్యమండలమున రాజ రాజుపక్షమున విశేషాధికారములతోడను కొంతసైన్యముతోడను రక్షక సామంతుడుగా వరశూరపట్టణము రాజధానిగా నుండ నియమించెను.

అంతలో ధారావర్షునికి సామంతుడగు వాయిరానగరాధీశ్వరుడు తన ప్రభువు కష్టదశ యెరిగి, యుత్తరకోసలులతో చేరి స్వాతంత్ర్యము ప్రకటించెనని వార్తవచ్చెను. వాయిరానగరము వజ్రములకును ఏనుగుల కును ప్రసిద్ధి చెందినది. యువరాజు వాయిరానగరము పట్టుకొని వజ్రములు సంపాదించి నమీపారణ్యములతో గజములు పట్టుకొను క్రీడ చేయవలె నని యుత్సాహము కలవా డయ్యెను. అందుచే ధారావర్షమహారాజు సేనలకు సహాయముగా తన సేనలు కూడ చేర్పనంగీకరించెను. వాయిరా నగర యాత్రానన్నాహములు చేయ దండనాధుల కుత్తరువులిచ్చి ఇంతలో యువరాజు కతిపయసేనలతో నారాయణభట్టునుగూడి పితృదర్శనార్థము శీఘ్రప్రయాణముల రాజమహేంద్రపురమునకు బయలుదేరెను.

రాజరాజనరేంద్రుని బావమరదియగు రాజాధిరాజు ఇప్పుడు చోళ చక్రవర్తి. అతడు రాజ్యమునకు వచ్చినప్పటినుండియు తండ్రియగు గంగైకొండ రాజేంద్రచోళదేవ చక్రవర్తి విస్తరింపజేసిన రాజ్యమును నిలుపుకొనుటకై ఎత్తిన కత్తి దింపకుండ యుద్ధములు చేయుచునే యుండవలసివచ్చెను. అతనికి తరచుగా జయములే ప్రాప్తించెను.

సింహళద్వీపములో కిట్టి యను పేరుగల బుద్ధమహావంశరాజ పుత్రుడు చోళదండనాధుల నెదిరించి దక్షిణమున రోహణమను పర్వత భాగమున ప్రభుత్వము నెరపసాగెను. తూర్పుసముద్రమున దూరపు దీవులును పశ్చిమసముద్రమున సాందిమత్తీవును కప్పము పంపుట నెమ్మదిగా చాలించెను. వారిని శిక్షింప నేగుటకు ఆటంకముగా బలవంతు

లగుచున్న కుంతలచాళుక్యులతో తరచుగా జరుగుచున్న యుద్ధములు వచ్చుచు ఆ ప్రయత్న మాగిపోవుచుండెను.

కుంతల చాళుక్యులతో రాజాధిరాజు బహుయుద్ధములు చేసెను. వారికి ప్రధానముగా వివాదకారణమగుచున్నది, కృష్ణవేణికిని తుంగభద్రకును మధ్యగా నున్న ప్రదేశము. ఈ యుద్ధములలో నెక్కువ భాగము రాజాధిరాజే జయించెను గాని కొన్ని పర్యాయములు పరాజయము గూడ నందెను. చోళప్రభువులు కుంతలరాజ్యమును కృష్ణవరకు తరుమగా నవకాశము చూచుకొని కుంతలులు తుంగభద్రవరకు నాక్రమించుచుండిరి.

ఇప్పటికి నాలుగేళ్ళ క్రిందట రాజాధిరాజు విస్తారమగు సేనలతో కుంతలచాళుక్యులతో తలపడెను. ఆ మహాసైన్యము కట్టతెగిన ప్రవాహమువలె విజృంభించి అహవమల్లుని జయించి రాజధానియగు కల్యాణకటకమునుగూడ పట్టుకొనెను. ఇట్లా సైన్యములు కుంతలరాజ్యహృదయములోనికి చొచ్చుకొనిపోయిన యవకాశముచూచుకొని వెనుకనుండి జైనమతాచార్యులు కుంతల ప్రభువుల సైన్యములకు రహస్యముగా సహాయము చేయును తమ దేవళములను వసతులనువారి కాశ్రయము లిచ్చిరి. ఆ సైనికులు కొందరు స్త్రీ వేషములు ధరించిరి. జైనాలయములును వసతులును గ్రామములును కుంతలసైన్యములకు కేంద్రములయ్యెను. చోళసైన్యములకు వెనుకనుండి సైన్యసహాయమును ఆయుధసామాగ్రియు ఆహారపదార్థములును వచ్చుట కష్టతరమయ్యెను. అది సాగనిచ్చినచో తన సైన్యములకిక అపాయము తప్పదని నిశ్చయించెను.

రాజాధిరాజు క్రోధోగ్రుడై యాలోచించెను. వెంటనే నొలంబవాడి బెల్వోల ఇత్యాది జైనమండలములలో నిరోధాస్పదములగు సమస్త జైనాలయములను జైన వసతులను భూమితో మట్టముచేయ నాజ్ఞాపించెను కొన్ని గ్రామములుకూడ చోళ సైనికులుతగులబెట్టిరి. పలువురు సైనికులు స్త్రీవేషధారులైనందున స్త్రీలుకూడ నిహతలైరి. ఇట్లు చండశాసనము ప్రవర్తింపజేసినందున చోళసైనికులు ఆత్మనిగ్రహము కోల్పోయిరి. వారు విచక్షణ వదలి గ్రామములపైబడి స్త్రీ బాల వృద్ధులనుగూడ

నిష్కారణముగా కత్తులకు గురి చేసిరి. సామాన్య యుద్ధధర్మము లన్నియు మంటగలసిపోయెను. రాజాధిరాజును అతని సైన్యమును నిరపాయముగ చోళరాజధాని చేరుకొనెను. కాని యా చోళ సైన్యము లా దండయాత్రలో చేసిన రాక్షసకృత్యములు చోళచక్రవర్తుల కీర్తిచంద్రికకు శాశ్వతముగా కళంక మాపాదించెను. కుంతలదేశ మంతట రాజాధిరాజుకు 'మహాపాతకచోళు'డని నామము స్థిరముగా పాదుకొనెను.

రాజాధిరాజు కాంచీపురము చేరిన పిమ్మట,'ఆహవమల్లకులాంతక, కల్యాణపురం గొండచోళ' ఇత్యాది బిరుదనామములు ధరించి విజయోత్సవ ములు చేయించెను. కాని తన సైన్యములు కావించిన యా సురకృత్యము లకు అంతరంగమున నా వేదన యారంభించెను. ఆ మహాపాతకమే యాతని నావహించెను.

రాజగురువులగు అధికారిగళ్ పారాశర్యన్ వాసుదేవనారాయణన్ అను ఉళగళందశోళ బ్రహ్మరాయనులను మహాపాతకమునకు నివృత్తి యుపదేశింప బ్రార్థించెను రాజగురువు పరిషత్తు నాహ్వానించి పరిషదభి ప్రాయము తెలుపమని కోరెను. ఆ పరిషత్తుకు సహస్రాధికముగా వేద వేదాంగవిదులును సోమపీథులును చనుదెంచిరి. వారియెదుట రాజాధిరాజు విషయమంతయు వివరించెను. పరిషత్సభ్యులు సమస్తము నాలకించిరి. అవసరమని తోచిన ప్రశ్నలువేసి యుత్తరములు గొనిరి. తుద కా మహాపరిషత్తు ఏకగ్రీవముగా నాతని నశ్వమేధయాగము చేయ నాదేశించెను.

మహాప్రసాద మని రాజాధిరాజు పరుషదనుజ్ఞ నొంది రాజగురు వుల యధ్వర్యమున మహావైభవముతో నశ్వమేధయాగము చెసెను. అతని పట్టమహిషి త్రైలోక్యమ్ ఉదయర్ నంబరాత్తియార్ను ఇతరదేవేరు లును యజ్ఞాయతనమున కపూర్వశోభ ఘటించిరి. సోదరుని యశ్వమేధ దీక్ష తిలకించి రాజరాజ పట్టమహిషి అమ్మంగదేవియు ధన్యమయ్యెను.

ఇప్పటికి మరల రెండు సంవత్సరములనుండి కుంతలచాళుక్యులు కృష్ణానది దాటి చోళదండనాథులను తుంగభద్రాతీరమునకు నెమ్మది

నెమ్మదిగా నెట్టివేయుచుండిరి. పూర్వయుద్ధములో చోళసైన్యములు చేసిన యా సురకృత్యములు వారి బలమునకు ఇప్పుడు ప్రతిబంధకములయ్యెను.

కుంతల ప్రభువగు నాహవమల్లసోమేశ్వరుడు మహాసైన్యముతో చాముండరాయ డను దండనాథుని వేంగీమండలముపైకి పంప మహా సైన్యములు కూర్చుకొని కృష్ణానది దాటి విడిసి తుంగభద్రాతీరమువరకు ప్రభుత్వము స్థిరముచేయ నెంచెను. చాముండరాయుడును వేంగీసరిహద్దుల లోని దుర్గములపై నకస్మాత్తుగా పడి నాలుగు దుర్గములు స్వాధీనపరచుకొని మిగిలిన రెండు దుర్గములనుగూడా ముట్టడించి స్వాధీన మొనర్చుకొనుటకు సిద్ధముగా నుండెను.

ఇంతలో కుంతలరాజసైన్యస్కంధావారమునకు భయంకరమగు నొక వార్తవచ్చెను. చోళచక్రవర్తియగు రాజాధిరాజు మహాసైన్యమును గూర్చుకొని, దానిని రెండుగా విభజించి, యొకటి తనతమ్ముడగు రాజేంద్రునిక్రింద నుంచి, రెండవది తన క్రింద నుంచుకొని, ఇద్దరును రెండు వైపులనుండి కృష్ణాతుంగభద్రామధ్య మండలము ప్రవేశించి కుంతల దండనాథు లాక్రమించిన దేశములు తిరిగి జయించుచు మహామారులవలె విజృంభించుచున్నారని ఆహవమల్లునికి దెలిపెను. వెంటనే యాతడు వివిధ ప్రాంతములకు బంపియున్న సేనల నన్నిటిని పిలిపించుకొనెను. వేంగీ దుర్గములు స్వాధీనము చేసికొన్న చాముండరాయుడును అవి వదలివేసి ప్రభుసమీపము చేరవలసివచ్చెను. వజ్జియప్రెగ్గడ యూహించిన విధముగానే పశ్చిమపుహద్దున నెక్కువ సైన్యములు కూర్చుట యవసరము లేక పోయినది.

ఆహవమల్లుని కుంతలసైన్యములు కొప్పమునొద్ద కృష్ణవేణికి దక్షిణతీరమున విడిసి చోళసైన్యభాగములు రెండు నేకము కాకముందే ఒకసేనను మార్కొనుటకు సిద్ధమగుచుండెను. ఆ మహాసైన్యములో కుంతలవీరాగ్రణు లందరునుండిరి. ఆహవమల్లుని సోదరుడు జయసింహు డందులో నగ్రగణ్యుడు. నన్నియరేవన్, తుత్తాన్, కుందమయన్ ఇత్యాది రాజకుమారులు కలరు. మరియు పులికేశి దశవర్మన్, నన్నినుళంబన్ ఇత్యాది దండనాథులును ఉండిరి.

చోళసైన్యములలో చక్రవర్తి రాజాధిరాజు నడుపుచున్న భాగమే ముందు కొప్పము సమీపించెను. ఆసైన్యములో మహారాజ వాడి సప్త సహస్ర విషయాధిపతి యగు అప్పిమయ్య దండనాయకుడు ప్రధానదండ నాధుడు. అతడు నల్లూరు రాజధానిగా రాజరాజబ్రహ్మాధిరాజనామముతో మహారాజవాడి పాలించుచుండెను. ఆ దండనాధుడు రాజేంద్రుని యాధిపత్యమున నున్న సేనాభాగముకూడ చేరువరకు యుద్ధమునకు తలపడ వద్దని చోళచక్రవర్తికి మంత్ర ముపదేశించెను. కాని యిప్పటికే చాళుక్య సైన్యములు చురుకుగా కదలుచుండెను. వారి యశ్వదళములు చోళసైన్య ములను తాకుచుండసాగెను. తమ్ముని సైన్యమువచ్చు వరకు నాగుటకు కొంత వెనుకకు పోవలసివచ్చును. అదిరాజాధిరాజు కవమానముగాతోచెను. ఆ వీరునికిని కుంతల సైన్యముల కదలిక చూచిన కొలదియు యుద్ధ కండూతి యెక్కువయ్యెను.

వైశాఖ శుద్ధ ఏకాదశీ శనివారమున ఉషఃకాలముననే కుంతల సైన్యములతో తలపడుటకు చోళసైన్యములకు చక్రవర్తి యాజ్ఞాపించెను. కొప్పముక్షేత్రమున మహాయుద్ధయజ్ఞ మారంభ మయ్యెను.

అప్పు డచ్చట యుద్ధము మహాభయంకరముగా నారంభించెను. ఉభయసైన్యములకును ముందు గజబలమును పార్శ్వముల నాశ్వికదళము లును వెనుక పదాతులు, ధానుష్కులు నుండిరి రెండు బలములునుసమాన మైనవి. ఉభయుల పక్షమున వీరాగ్రేసరు లుండిరి. ఉభయుల దండనాధు లును సమర్థులు. ఉభయబలములును సుశిక్షితములు. ఉభయసైన్యములను నడుపు చక్రవర్తులును నిర్భయులు!

రాజాధిరాజు స్వయముగా యుద్ధకోవిదు డైనందున మహోన్నత మగు మదగజమెక్కి యుద్ధభూమిలో వీరవిహారము చేయసాగెను. అతని యున్నతగజము, శ్వేతాతపత్రము, వ్యాఘ్రలాంఛనము, శత్రువులకు సులభముగా గుర్తింపసాధ్యమయ్యెను.

అతని గజమును లాంఛనములును చూడగానే కుంతలసైన్యములో కొందరు దండనాధులకు, వీరులకు, పట్టరాని కోప మావేశించెను. పూర్వ దండయాత్రలో చోళసైన్యముల రాక్షసకృత్యములకు వారియాప్తులు గురి

యైయుండిరి. 'మహాపాతక చోళు'డని వారందరు ఆవేశముతో తిట్టుచు తమ చక్రవర్తి యాహవమల్ల సోమేశ్వరుని సమీపించి నమస్కరించిరి. వచ్చిన పని యేమన, వారు తమకు రాజాధిరాజుపైగల క్రోధము విశదీకరించి, రాజాధిరాజు నానాడు సూర్యాస్తమయములోపల సంహరించుటకు దీక్ష పూన నిశ్చయించిన దెరిగించి, యట్టివారినొక ప్రత్యేక దళముగా నాయత్తము చేసికొన ననుజ్ఞ నర్థించిరి. ఆహవమల్లుడు సంతోషముతో నంగీకరించెను.

వెంటనే యొక ప్రత్యేకదళము రాజాధిరాజును చంపుటకే సిద్ధమయ్యెను. పలువురు జైనులు వీరావేశముతో నా దళమున జేరిరి. వారందరు "ఈ నాడు రాజాధిరాజును మహాపాతకచోళుని ఈ సాయంత్రము సూర్యాస్తమయములోపల చంపెదము. అట్లు చంపక యుద్ధభూమి వదలము. శ్రావణబెలగోలయందు ప్రతిష్ఠితుడగు గోమటీశ్వరుడు సాక్షిగా నీ శపథము చెల్లించెదము. ఈ శపథము తప్పినచో మీ పాదసేవకు తప్పినవారము; మా భార్యల నితరుల కప్పగించిన నీచులము నగుదుము." అని ఘోరప్రతిజ్ఞలు చేసిరి.

ఆహవమల్లుని యంతఃపురముకూడ యుద్ధభూమి కొతని నమగమించి సుగుప్తస్థానమున భద్రముగా నుండెను. వెంటనే రాణివాసము నుండి దాసీజనము రక్తచందనము ఎఱ్ఱమద్దియల రసము తెచ్చి యా వీరుల నలంకరించి మంగళములిచ్చిరి.

'మహాపాతకచోళమహాకాలురు, అని ఆహవమల్లుడు వారికి బిరుదనామ మిచ్చి యుదభూమికి పంపెను. మహాభారతయుద్ధములో నర్జునుని జంప శపథము చేసిన సంశప్తకులవలె వీరును మహాపాతకచోళుని అసభ్యముగా నోట నుచ్చరింపరాని తిట్లు తిట్టుచు వీరనాదములతో యుద్ధభూమి ప్రవేశించిరి.

సమానబలముగల యా యిరువాగులకును సమరముగూడ సమానముగనే జరుగుచుండెను. ఒక రొకమారును రెండవవా రొకమారును ముందుకు వెనుకకు బోవుచుండిరి. ఆ యుద్ధచలనము అంతరిక్షచరులకు ఉయ్యాలయూపువలె దోచుచుండెను.

కాని యింతలో 'మహాపాతకచోళమహాకాలురు' ఒక్క పెట్టున రాజాధిరాజు ఎక్కియున్న మాతంగమును లక్ష్యముగా పెట్టుకొని నిర్భయముగా ముందుకు నడువసాగిరి. వారిలో ధానుష్కుల బాణములన్నియు రాజాధిరాజు వ్యాఘ్రధ్వజమును చించి పేలికలు చేసివైచెను. ఆతని ఛత్రము విరిగిపోయెను. ఛత్రవాహకులు కూలిరి. గజము నడుపుచున్న మావటీండ్రు వరుసగా పదిమంది హతులైరి. అయినను అశ్వమేధావభృథ పవిత్రీ కృతవపువగు రాజాధిరాజు వెన్ను చూపక ముందుకే వచ్చుచుండెను.

ఆ సంశప్తకులు తమ చక్రవర్తినే లక్ష్యముగా నుంచుకొని నడుచుచున్నారని చోళదండనాథులు తెలిసికొనిరి. వెంటనే బహుసైన్యములు వచ్చి వారి కడ్డుపడెను అయినను 'మహాపాతకచోళ మహాకాలురు' అగ్నిపై బడు శలభములవలె చోళసైన్యాగ్నిని చొచ్చి నిర్భయముగ ప్రాణములు విడుచుచుండిరి. ఎందరు మరణించినను వారు లెక్కచేయక ముందుకే పోవుచుండిరి. మిడుతలదండు అగ్నిని గూడ చల్లార్చునట్లే వారును ముందుకు ఒత్తుకొని సాగగలుగుచుండిరి.

చోళదండనాథులు చక్రవర్తిని విశ్రాంతి తీసికొమ్మని ప్రార్థించిరి. వారిమాటలాతడు లెక్కచేయక, యుద్ధములో వెన్ను చూప నను దీక్షతో ముందుకే సాగుచున్నందున, నాతడు, ఆ సంశప్తకుల దృష్టిపథమును తప్పిపోకుండెను.

'మహాపాతకచోళమహాకాలు'రందరు నొక్కుమ్మడి నాతడు కనబడినప్పుడెల్ల బాణములు చక్రవర్తిపై ప్రయోగించుచు, చొచ్చుకొనిముందుకు దూకుచుండిరి. రాజాధిరాజుకు బాణము లెన్నియో తగిలెను. అయినను అతడు లెక్కచేయక వెన్ను త్రిప్పక యుద్ధరంగమున సైన్యముల నడపుచుండెను.

తుద కాతడు బాణపరంపరచే నిహతుడై యుద్ధభూమిలో ఆ పట్టకరివీపు మీదనే, యుద్ధయజ్ఞమున ఏకాదశీపుణ్యకాలమున నాత్మార్పణము చేసికొని వీరస్వర్గ మలంకరించెను. రాజాధిరాజుదేహమున వెనుకభాగమున నొక్క గాయమైన కాలేదు.

రాజాధిరాజు మదకరిపై నొరగుటచూచి, సంశప్తకులు జయ జయ ధ్వానములు చేయుచు నాతని శవము తమపశపరచుకొనుటకు ముందు కొత్తుకొని పోయిరి. ఎంత ప్రయత్నించినను అదిమాత్రము వారికి స్వాధీనము కాలేదు. చోళసైనికులడ్డుపడి యా మదకరిని చక్రవర్తితోపాటు శిబిరమునకు జేర్చిరి.

'మహాపాతకచోళమహాకాలు'రలో హతశేషులు ఆహవమల్లసోమేశ్వర చక్రవర్తికి కార్యసాఫల్య మైనదని నివేదించి యమూల్యములగు బహూకృతు లందిరి.

చోళదండనాథులు రాజాధిరాజుశవము భద్రపరచుకొనగలిగిరి. కాని రాజు మరణించిన పిమ్మట ఆ సైన్యములకు ధైర్యము కలిగించుటెట్లు? కుంతల చాళుక్య సైన్యముల ధాటిముందు ఆ సైన్యములు నిలువజాలక నెమ్మది నెమ్మదిగా వెనుకకు జరుగుచుండెను. సూర్యభగవానుడు పశ్చిమమునకు తిరుగుచుండునప్పటికి సూర్యవంశజులగు చోళప్రభువుల జయశ్రీ కూడ పశ్చిమాభిముఖ యైనట్లు తోచుచుండెను. వెనుదీయుచున్న చోళ సైన్యములు విచ్చిపెన్నిచ్చి పారిపోవునట్లు చేయుట అప్పిమయ్య రాజరాజ బ్రహ్మాధిరాజ దండనాయకునకు బహుకష్టసాధ్యముగా నుండెను. సైన్యబంధ మే క్షణ మైనను చిటిలిపోవునట్లు తోచుచుండెను.

జయలక్ష్మి కరగత మగుచున్నదని సంతోషాతిశయముతో కర్ణాటక సైన్యములు నిర్లక్ష్యముగా ముందుకొత్తుకొని పోవుచుండెను. కాని యీ నియమభంగములచే వారికి నష్ట మేమియు కలుగుట లేదు.

ఇంతలో నొకపార్శ్వమునుండి దూరమున సైన్యకోలాహలమును భేరీ ఢంకా నినాదములును వినవచ్చెను. వెంటనే అప్పిమయ్య తమకు సహాయముగా రాజేంద్రుని చోళ సైన్యము వచ్చుచు సమీపించిన దని సైన్యమందంతట ప్రకటింప జేసెను.

మరియొక గడియలో నిజముగా రాజేంద్రుని సైన్యములే వచ్చి కలసెను. అప్పిమయ్య వెంటనే రాజేంద్రునికి స్థితిగతులు నివేదించి, రాజేంద్రుని సేన చాళుక్య సైన్యముపై బడి యప్పటివరకు యుద్ధమున నలసియున్న ప్రథమసేన విశ్రాంతి తీసికొని వెన్నుదన్ని నిలుచునట్లు చేసెను.

కర్ణాటకసైన్యముల కింతవరకును జయమరచేతిలో నున్నట్లుండెను. జయోన్ముఖులైనందున నశ్రద్ధగా కొంత సాధారణ క్రమభంగము కూడ చేయుచుండిరి. తుదకు ఆహవమల్ల సోమేశ్వరుల రాణివాసజనము కూడ సుగుప్తస్థానము విడిచి నిర్భయముగా రణరంగము నానందముతో తిలకించుచుండెను.

ఇట్టి స్థితిలో రెండవ చోళసైన్యము యుద్ధమునకు తలపడుచున్నదని కర్ణాటక సైన్యములో వార్త తెలియగనే, ఒక్కసారిగా నా సైన్యమున భయ మావేశించెను. అందులో నానాటి భయంకరయుద్ధమున నా బలము ప్రశాంతమై యుండెను.

నూతనముగా తాకిన చోళసైన్యమునగూడ మహాగజ మధిరోహించి రాజాధిరాజు సోదరుడు రాజేంద్రుడును యుద్ధము చేయుచుండెను. అది కాంచి ఆహవ మల్లుడు మరల 'మహాపాతక చోళమహాకాలుర'ను రాజేంద్రునిపైకి గూడ గవియజేసెను. వారును పూర్వజయోన్మత్తులై ఉదయమున రాజాధిరాజుపై గవిసినట్లె రాజేంద్రుని గజముమీదగూడ గవిసిరి. ఈమారుకూడ వారి ప్రయత్నములు పూర్తిగా వృథ కాలేదు.

వారు కురిపించు బాణవర్షముచే రాజేంద్రు డెక్కిన మదకరిఫాలమందు వ్రేలాడుచున్న ముఖపట్టము ఛిన్న మయ్యెను. మరియు బాణఘాతముచే దాని దేహమునుండి రక్తప్రవాహములు ప్రవహింపసాగెను. రాజేంద్రుని రెండు భుజములకు గాయము లయ్యెను. అతని వామోరువుకూడ శత్రుబాణక్షత మయ్యెను.

కాని 'మహాపాతక చోళమహాకాలురు' ఏకాకులైరి. వారికి ఇతర సేనా సహాయము క్షణక్షణము క్షీణింపజొచ్చెను. వారిలో ముఖ్యుడు జయసింహుడు కేవలము కుంతల చక్రవర్తి సోదరుడు. అతడు మృతినొందెను. మరియు పులకేశి, దసపన్మన్, నన్నినులంబన్ అను ప్రసిద్ధ కర్ణాటసేనానులును వీరస్వర్గ మలంకరించిరి.

చాళుక్యసైన్యములు విచ్చి వెన్నిచ్చి పారిపోసాగెను. సైన్యములో

భయము ప్రవేశించిన పిమ్మట దానిని నిలువరించుట ఎవరికిని సాధ్యము కాలేదు.

ఆహవమల్లుని రాణివాసజనము సురక్షితస్థానమును వదలినది. అప్పిమయ్యా రాజరాజబ్రహ్మాది రాజదండనాయకుడు ముందే గమనించి, వారిని బంధించుటకు కొంత సేనను పంపెను. పలాయనము చేయుచున్న రాణివాసజనములో సత్తియవ్వై సాంగవ్వై యను నిరువురు ఆహవ మల్లుని రాణులు వారి పరివారముతో చోళ సైనికుల వశమైరి.

ఆహవమల్ల సోమేశ్వరుడు స్వయముగా యుద్ధభూమినుండి తొలగి ఎట్లో కృష్ణవేణి నుత్తరించి యుత్తరతీరము చేరి, ప్రాణరక్షణ చేసి కొనెను. రాజకుమారులగు నన్నియదేవన్, తుత్తాన్, కుందమయన్ ఇత్యాదులాతనివెంట ననుగమించి యాత్మరక్ష చేసికొనిరి.

ఆ యుద్ధరంగమున ప్రాణములు విడిచిన కర్ణాటకభటులను లెక్కింప వీలులేదు. పలువురు బంధితులైరి. చోళసైన్యములకు అమూల్యములగు బహువస్తువులు ప్రాప్తమయ్యెను.

కర్ణాటక చాళుక్యులకు పవిత్రమగు వరాహలాంఛనము గల రాజ ధ్వజమే చోళులకు హస్తగత మయ్యెను.

ఈ విధముగా నానాడు చోళసైన్యములు జయలక్ష్మి చేకొనెను. కాని చోళసామ్రాజ్యమునకు చక్రవర్తి యా రణభూమికి బలి యయ్యెను. చోళ సామ్రాజ్య లక్ష్మి వైధవ్యమును వెంటనే మాన్పింప రాజేంద్రుడు నిశ్చ యించెను.

రాజేంద్రు డా రణోర్వియందె గొప్పవిజయసభ కావించెను. ఆ సభాముఖమున నా దినమున ధైర్యసాహసములు చూపిన చోళవీరులంద రికి విరివిగా బహుమానము లొసంగెను.

ఆ సభలో మంత్రి పురోహిత సామంత దండనాథు లుండిరి. వందిమాగధులుండిరి. వేదవేదాంగపారగులైన బ్రాహ్మణశ్రేష్ఠు లుండిరి. రాజజ్యోతిషికుడుండెను. రెండు భుజములమీదను వామోరువుమీదను యుద్ధములో నైన గాయముల తోడనే రాజేంద్రు డా సభ కావించుచుం డెను.

ఆ వీరావతారమును జూచి యజ్ఞభూమివలె క్షత్రియులకు పవిత్రమమగు నారణభూమియందె సభాసదు లందరు నేకగ్రీవముగాజయలక్ష్మితో పాటు చోళ సామ్రాజ్య లక్ష్మినిగ్రహింపవలసినదని రాజేంద్రు నర్థించిరి.

రాజేంద్రుడు మహాప్రసాద మని పరిషదాజ్ఞ శిరసా వహించెను. వెంటనే చాళుక్యవీరుల రక్తముతో రంజితమైన కృష్ణవేణీనదీ పవిత్రత వారితో ఆ కొప్పము రణరంగమున రాజేంద్రుడు తన రాణి కిలా నడి గళన్ను గూడి చోళసామ్రాజ్యమునకు చక్రవర్తిగా నభిషిక్తుడయ్యెను.

ఈ రాజేంద్రు డీ విధముగా జయలక్ష్మితోపాటు చోళసామ్రాజ్య లక్ష్మి కర గ్రహణము చేసిన సమయముననే, దూరమున నాతని యల్లుడు వేంగీయువరాజ రాజేంద్రదేవుడు చక్రకోట్యము స్వాధీనము చేసికొని జయిలక్ష్మి గ్రహించి చంద్రాదిత్య దండనాధునికిని,వింధ్యవాసినికిని వివాహ మహోత్సవమునకు ప్రయత్నములు చేయుచుండెను.

కొప్పము యుద్ధరంగములో రాజేంద్రుని యభిషేకానంతరము మరి యొక మహోత్సవము జరిగెను. రాజాధిరాజు శవమునకు అగ్ని సంస్కారము మహాయజ్వలకు జేయునట్లు చేసిరి. రాజాధిరాజు పట్టమహిషి త్రైలోక్యం ఉదయర్ నంబిగార్తియార్ భర్తృమృతికి కంట తడిపెట్టకుండ మహోత్సవముగా పతితో సహగమన మొనర్చెను. యజ్వల దేహ దాహమువరకు జ్ఞాతులకు అశౌచములేదు.

# 47

నాన్నటి దినమున నృసింహజయంతి—రాజమహేంద్ర పట్టణమున మహావైభవముతో జరిగినది. పురమంతయు మామిడిపండ్లతోడను విసన కర్రలతోడను వైశాఖ పూజలతోడను కన్నులపండువ యైనది.

రేపు వైశాఖపూర్ణిమ! అది బుద్ధజయంతి! బౌద్ధులకు మహా పర్వము. ఆనాడే బుద్ధభగవానుడు జనించెను. ఆనాడే భార్యాపుత్రుల విడనాడి సన్యస్తుడయ్యెను ఆ దినముననే బోధివృక్షముక్రింద బుద్ధత్వము ప్రాప్తించెను. ఆనాడే మహాపరి నిర్వాణము పొందెను. బౌద్ధులకు వైశాఖ పూర్ణిమకంటె పవిత్రమగు దిన మింకొక్కటి లేదు.

బుద్ధజయంతి రేపే యైనను ఇప్పటికి వారమునుండియు సారంగ ధరసంఘారామమున ఉత్సవములు బహులోచనానందకరములుగా జరుగు చున్నవి. ప్రతి సంవత్సరముకంటె నీయేట రెండు కారణములచే శోభ యెక్కువయ్యెను.

అందులో నొక విశేషము చీనాపండితుని యాగమనము. మూడు వందల సంవత్సరముల కధికముగా జీవించియున్న యా మహాయోగి అవలంబించిన బౌద్ధమతముకంటె మరొకటి ఎట్లు సత్యమగును? అతనికి దెలియని చికిత్సలు లేవు. మూలికలు మంత్రములు రక్షలు అతనికి తెలి యనివే లేవు. అతనికి చేతకానిది లేదు. సభాముఖమున నతడు శాస్త్రవాద మున నధర్వణాచార్యు లను పండితుని జయించెను. ఇతర పండితులు వాదమునకు పిలిచినను వాదించుటకు సాహసింపకున్నారు. చీనాయాత్రి కుని దర్శనమునకు వచ్చు జనమే బహుళమయ్యెను.

ఇక రెండవకారణము సువర్ణద్వీపయాత్రకై మూగుచున్న జనము, యాత్రికులు వైశాఖపూర్ణిమనాటి యుత్సవముచూచి మరునాడే మోటు పల్లికి బయలుదేరి యచ్చట సిద్ధముగానుండు నావ లెక్కెదరు. సువర్ణద్వీప యాత్రికులు ఐదారు వేల వరకు సంఘారామము చుట్టుప్రక్కల విడిసిరి.

రేపు "బుద్ధజయంతి, చంద్రగ్రహణము!" అందుకుముందునాడు సంఘారామమునుండి బౌద్ధదేవతావిగ్రహములను గజములపై నెక్కించి ఊరేగింపుతో గోదావరీ నదికి తీసికొనిపోయి స్నానము చేయించెదరు. ఉదయముననే ఆ ఉత్సవము బయలుదేరెను.

ముందు వృషభములపై ఢక్కానినాదము చేయుచు కొందరు దారితీయుచుండిరి. ఆ పిమ్మట మంగళతూర్యము లనేకములు ప్రయోగిం చుచు గుంపులు బయలుదేరెను. కొందరు భజన స్తంభములు పెట్టి చుట్టును తిరుగుచు బుద్ధభజన చేయుచు సాగిరి. నాగరాజులు జాతకకథలు చెప్పుచు వెంటనంటిరి. దొమ్మరిసానులు చాకచక్యము చూపుచుండ జనులుగుంపులు కూడి వారి ననుగమించు చుండిరి.

కొందరు పెద్దపులి వేషములు వేసికొని వీరాంగము వేయుచుండిరి. కొందరు కర్రసామును, మరికొందరు కత్తిసామును ప్రదర్శించుచుండిరి.

కొందరు ధనుర్విద్యాపటిమ చూపుచుండిరి. కొందరు ఖడ్గములు ఆవేశముతో త్రిప్పుచుండిరి. కొందరశ్వపరిశ్రమ ప్రకటించుచుండిరి. బుట్టబొమ్మ లెన్నియో గంతులు వేయుచుండెను. ఎవరికి తోచిన విధమున వారు బుద్ధభక్తి వెల్లడించుచుండిరి.

ఆ వెనుక జేతారినాధుడును, చీనాయాత్రికుడును అగ్రేసరులుగా బౌద్ధశ్రమణులు సుత్తపిటకమునుండి సుత్తములు చదువుచు సాగుచుండిరి. వారి వెంట రావియాకులతో నలంకరించిన బంగారు కలశములు ధరించి కొందరు వచ్చుచుండిరి. వారి వెనుక గజములపై బౌద్ధవిగ్రహములుండెను. అన్నిటిలో నత్యున్నతమగు మదకరీంద్రముపై బుద్ధవిగ్రహమును, మిగిలిన గజములపై మంజుశ్రీ ఇత్యాది దేవతావిగ్రహములు నుండెను.

ఈ ఉత్సవమంతయు నర్ధక్రోశము పొడవున సాగుచుండెను. దారి పొడవున నిరువంకల మనోజ్ఞవర్ణచిత్రములగు ధ్వజములను ధరించిన జనులు బారులు తీరియుండిరి.

కొందరు విగ్రహములపై పూలు చల్లుచుండిరి. కొందరు ధూపములతో వాసింపజేయుచుండిరి. కొందరు కర్పూరహారతులు సమర్పించుచుండిరి. వీరకృత్యములకు వినోదలీలలకును భక్తిపారవశ్యమునకును ఆ యుత్సవమున విరోధము లేకుండెను.

ఆ యూరేగింపు కోటగుమ్మముదగ్గరనుండియే గోదావరిరేవుకు పోవు నాచారము. అది కోటగుమ్మమునొద్ద చాలసేపాగును. అప్పుడు రాణివాసము నుండి బుద్ధదేవుని కుపహారము వచ్చు మర్యాదకలదు.

ఈ నాడుగూడ నెప్పటివలెనే కోటగుమ్మమునొద్ద ఉత్సవ మాగినది. ఉత్సవములోని జనములో పలువురు ముందువారును వెనుకవారును గోపుర ద్వారముముందున్న విశాలప్రదేశములో ప్రోగైరి.

ద్వారమున కెదురుగా విగ్రహములు వహించుచున్న గజములు నిలిచెను. రాణి వాసమునుండి యుపహారము తెచ్చు దాసీజనముకు త్రోవ వదలి రెండుపైపులను ఉత్సవములోని యాత్రికులు బారులుతీరి యుండిరి.

ఖడ్గహస్తులెందరో ఖడ్గనైపుణి చూపసాగిరి. ధనుర్విద్యాప్రవీణులు శర లాఘవము చూపుచుండిరి.

ఇంతలో కోటగోపురద్వారము తెరువబడెను. అందుండి రూప లావణ్యవతులగు పరిచారిక లెందరో మనోహరముగా నలంకరించుకొని పసుపు,కుంకుమ,పుష్పములు,నారికేళములు, చూతఫలములు,ఆభరణములు బంగారు పళ్ళెరములలో తెచ్చి బుద్ధవిగ్రహముల కర్పించిరి. అంతట నవరత్న నిర్మితమగు మండతో నివాళి యిచ్చుచుండిరి. సమస్తవాద్యము లొక్కక్షణ మాగిపోయెను.

ఆకస్మికముగా నొక్కసారి తప్పెటల ధ్వని యారంభించెను. ఆ ధ్వని యితర స్థలములలోకూడ చేసిరో, మరి యీ ధ్వనియే ప్రతిధ్వనిం చెనో, కాని రాజమహేంద్రపురము నల్గడలను తప్పెటల ధ్వని మారు మ్రోగెను. ఆ ధ్వనికి హారతీ యిచ్చుచున్న స్త్రీ జనము ఉలిక్కిపడి హారతి క్రింద పడనిచ్చి వెనుదిరిగి కోట గుమ్మమువంక జూచెను.

ఒక్కసారిగా ప్రక్కల నిలిచియున్న యాశ్వికులు విద్యుద్వేగ ముతో తెరచియున్న గోపురద్వారమునుండె లోపల ప్రవేశించిరి. ధనుస్సులు ఖడ్గములు శూలములు కర్రలు ధరించినవారందరు వారివెంట భయంకరనాదములు చేయుచు పరుగుపరుగున కోటలో బ్రవేశించిరి. గజములు కొన్ని గోపురభేదనమున కుపక్రమించెను ఆ ఒత్తిడిలో పూజాద్రవ్యములు తెచ్చిన పరిచారికలు నిష్కరుణముగా మట్టగింపబడిరి.

ఉత్సవములో నున్న చాలమందికి ఆ కోలాహలమునకు కారణ మేదియో ముందు తెలియకపోయెను బౌద్ధవిగ్రహములకు రాజాజ్ఞచే రాజభటు లవమానముచేసిరనుమాట యంతటను పొక్కిపోయెను. భక్తా గ్రేసరులకు గూడ వీరావేశము పెరిగిపోయినది. రాజమహేంద్ర పురము కోటను ఆ ఉత్సవజనము ముట్టడించెను.

జేతారినాధుడును శ్రమణులును, "పోనిండు! బుద్ధుని అవమానము చేయగల మనుష్యులున్నారా? హింస పనికిరాదు!" అని ఆ జనమును వారించుచున్నట్లు పలుకుచుండిరి. వారిమాటలు వినున దెవరు? వా రా సందడిలో నెమ్మదిగా విగ్రహములు తెచ్చుచున్న గజములతో త్వర

త్వరగా గోదావరికి పోయి ఘటములు జలములతో దింపి సందడిలేని మార్గమున సంఘారామమునకు ప్రయాణమైరి.

రాజభటులు విగ్రహముల నవమానించి రనువార్త చిత్రముగా పట్టణమంతట వ్యాపించెను. ఆ యవమాన మెవరు చేసిరి? ఎక్కడచేసిరి? ఎందుకు?—అని యడుగువారు లేరు. ఎవరి యూహకొలది వారే చిలవలు పలవలుచేర్చి యా వార్త పట్టణమంతట జనులు వ్యాపింపజేసిరి.

బౌద్ధభక్తాగ్రణులు చేతికి దొరికిన యాయుధములు— పలుగులు, గొడ్డళ్ళు, కర్రలు, బాడితలు, చువ్వలు— తీసికొని కోటమీదికి లంఘింప సాగిరి. ఒంటరిగా కనబడిన రాజభటులను, రాజోద్యోగులను చూచినవారు చూచినట్లు పొడిచివేయసాగిరి.

వారు చేసిన దాడి యొక కోటమీదనే కాదు. ఆ మహాపట్టణములో ప్రధాన రాజపురుషుల యావాసములుకూడ నా జనసమూహముల క్రోధాగ్నికి గురి యయ్యెను. వా రప్పుడు తగులబెట్టిన యిండ్లకు చంపివేసిన మనుష్యులకు లెక్కలేదు.

పట్టణములో బ్రాహ్మణశ్రేణికి కోటవైపున దండనాథుని మందిరమున ఆవలివైపున వజ్జియప్రెగ్గడ మందిరమును గలవు. ఆ యల్లరి మూకలు సురక్షితమగు నృపకామదండనాథుని మందిరమును సమీపింపనైన లేకపోయెను. కాని యావలివైపునగల వజ్జియప్రెగ్గడ మందిరము పైకి మాత్రము పలుమారు కవిసిరి. కాని దుర్గసమానమై సుశిక్షితులగు భట సమూహములతో నిండియున్న యా మందిరము దుర్భేద్యమయ్యెను. రెండు పార్శ్వములను రక్షించుచున్న యా రెండు మందిరముల చాటుననున్న బ్రాహ్మణశ్రేణి కా నాటి యలజడి యేమియు ప్రాకలేదు. నన్నయభట్టారకుని యవిరళ జపమహోమతర్పణముల కడ్డు కలుగలేదు.

వైశ్యశ్రేణిమాత్ర మంత సుగుప్తముగా లేదు. అది బ్రాహ్మణశ్రేణికి సమీపముననే యుండెను. ఆ ప్రాంతమున నలజడి కలుగలేదు కాని యావలిదరిని కొన్ని యిండ్లు దహనమయ్యెను. శీఘ్రకాలముననే ముప్పరాజను దండనాథుడు భట సమూహముతో వచ్చి మూకలను పార ద్రోలి యగ్ని ప్రాకకుండ నరికట్టెను.

ఆ రెండు వాడలు తప్ప పట్టణమంతయు నల్లకల్లోలముగా నుండెను. ఇది యా మరునాడు సంభవించు నని రాజపురుషు లూహించి దాని నడ్డుకొనుటకు సిద్ధపడుచుండిరి. కాని యొకనాడు ముందుగనే సంభవించినందున వెంటనే అల్లరి అడచుట సాధ్యపడలేదు. అయినను రాజభటు లా తిరుగుబాటును చురుకుగనే ఎదుర్కొన సాగిరి.

ఎట్లయినను విప్లవకారులు అకస్మాత్తుగా కోటలోననే ప్రవేశించినందున వారికి కొంత బలమును, ధైర్యమును చిక్కెను.

లోపలికి చొచ్చుకొని వచ్చిన యాశ్వికులను విప్లవవీరులను అచ్చట నంతకుమున్నె సిద్ధముగా నున్న రాజభటు లెదుర్కొనిరి. అయినను ఆ అకస్మాత్ప్రవేశముచే వారికి ఊపు మెక్కుడై ప్రతిఘటించు రాజభటులను వెనుకకు చెదరగొట్టుచు పోవుట కవకాశము చిక్కెను.

కోటలోపలికి వెళ్ళిన విద్రోహులు ముఖ్యముగా నాలుగు భాగములుగా చీలిరి. అందులో నొక మూక చెరసాలపైకి పోయెను. వారు సులభముగా ద్వారపాలకులను, భటులను చంపివేసి చెరసాల తలుపులు తెరచి బంధితులను వదలించిరి. వారిలో పండితవాదమునాడు బంధితులైన బౌద్ధులు పలువు రుండిరి. పారశీకుల నూనెవర్తకులును, పరిచారకులును, సింధుదేశపు నశ్వశిక్షకుడును ఉండిరి. వారందరు విముక్తులై విప్లవకారులను జేరిరి. వారే కాదు — రాజ శిక్షితుడై యాస్థాన మందిరమున తన్ను తాను పొడుచుకొని పడిపోయిన కామరాజపుత్రుడు నందుండెను! అతనికి ఆ గాయము నయమైనది. ఆ తిరుగుబాటుదారులు అతని బంధములు ఛేదించి కవచమును,శిరస్త్రాణమును, ఖడ్గమును విల్లు నంబులు నిచ్చిరి అవి యాతడు శీఘ్రముగా ధరించి జయశీలమగు నా విప్లవతండమును నడిపించుకొనుచు వచ్చెను.

మరియొక తండము విజయాదిత్యుని భవనముపై బడెను. అతని భటులు వచ్చినవారి నడ్డగించుచుండ విజయాదిత్యుడు కవచము ధరించి ఖడ్గమొక చేతను,డాలు మరియొక చేతను బూని రాజభటుల కుత్సాహము కలిగించుచు స్వయముగా యుద్ధములోనికి లంఘించి విప్లవకారులను ఖండింప సాగెను. కొంత సేపటికి బాణమొకటి బాహుబంధమున నాటినందున

నాతడు పడిపోయెను. భటు లాతని బదిలముగా భవనాంతర్భాగమునకు జేర్చిరి.

విప్లవకారుల మిగిలిన రెండు తండములును ఒకటి రాజరాజనరేంద్రుని హర్మ్యముపైకిని రెండవది రాణివాసము పైకిని బలముగా విజృంభించెను.

ఆ రెండు మందిరములముందును కవచములును శిరస్త్రాణములును చర్మములును దృఢముగా ధరించి శూలహస్తులగు యవనరోమభటులు బారులు తీరి కాపుండిరి. వా రెన్నడు మాట్లాడినట్లే కనపడదు. వారి నోళ్ళలో నాలుక లున్నవో లేవో ఎవరికి నెరుగ నవకాశ మీయరు. వారి చూపులు తీక్షణమైనవి. వారి చేతులలోని శూలములు సూక్ష్మతరమైనవి. వారు నిలిచిన ప్రదేశము ఇనుపగోడవలె దుర్భేద్యమయ్యెను. అశ్వికులు ధానుష్కులు నెంత ప్రయత్నించినను ఆ మనుష్యకుడ్యము చలింపలేదు. అంతట ధానుష్కులు సౌధోపరితలమున గనుపడినవారి నెల్ల గురిచూచి వేయుచుండిరి.

చెరసాలనుండి విడివడిన జనము 'జయ కామరాజమహారాజుకు' అని కేకలు వేయుచు రాణివాసముపై కవియుచున్న జనములో కలసిది. ఆ సమయమున అమ్మంగ మహాదేవి సౌధోపరితలమునకు నిర్భయముగా వచ్చి యుద్ధము నవలోకించుచు భటుల కాజ్ఞాపించుచుండెను. ఆ సమయమున నామె చూడ వ్యాఘ్రలాంఛనులగు చోళుల బిడ్డ యగుటచే కుపితమైనవ్యాఘ్రివలెనే చూపట్టెను.

ఆమె నచ్చట నుపలక్షింపగనే కామరాజపుత్రుడు దృఢముష్టితో ధనస్సున తీక్ష్ణబాణము సంధించి యామెపైకి వదలెను. అది చూచి మెరపు మెరసినట్లు రోమక భటు డొకడు బాణమునకును అమ్మంగదేవికిని మధ్య వచ్చి నిలిచెను. ఆత డా బాణము తగిలి పడిపోయెను.

తనకై పడిపోయిన యా రోమకభటుని లోపలికి చేర్ప సేవకుల కామె యాజ్ఞాపించెను. వా రది నిర్వర్తించువరకు నిర్లక్ష్యముగా నామె లోనికి పోక బాణములు వేయువారివైపు నిశ్చలముగా తిరిగియుండి,

యాతని లోనికి దీసికొని పోయినంతట, గంభీరమందగమనముతో లోనికి బోయెను. ఆమె యట్లుండగా నెన్నియో బాణము లామె మేనికి దాకెను గాని అంతఃకవచావృతమగు నామె మేనికి గాయము కలిగింపలేక పోయెను.

అంతలో రాజభవనములోని పరిచారకులు వచ్చి మహారాజు భవనములో కనిపించుట లేదని తత్తరముతో నామెకు నివేదించిరి. మహాదేవి యెంతమాత్రము సంభ్రమింపక "మహారాజు క్షేమముసంగతి జాగ్రత్తపడ నక్కరలేదు!" అని కఠినముగా వారితో పలుక వారు రాజాన్వేషణ ప్రయత్నమునుండి విరమించిరి.

ఇంతలో కోటలోని సైన్యమును నడిపించుచున్న జననాథుడను దండనాథుడు మహాదేవికి మ్రొక్కి శత్రువుల నందరిను విశ్శేషముగా కోటలోనుండి తరిమివేసితి మనియు, కోట బహిఃప్రదేశమునగూడ సమీపమున నెవ్వరు లేకుండ బారిపోయిరనియు నివేదించెను. వెంటనే యమ్మంగదేవి బయలుదేరి కోటలో కలిగిన నష్టము పరీక్షించి గాయపడిన వారి నందరను చికిత్సకై వైద్యశాలకు చేర్పించి ముందు వారిని కరుణా దృష్టులతో నిర్వ్రణుల జేసెను.

ఆమె యంతట చెరసాలపైపునకు జని పారిపోవగా మిగిలిన బంధితుల నందరను పదిలపరపించి రక్షకభటుల నందు నియమించెను.

కుమారసప్తకములో మిగిలిన యాగ్గురునుగూడ నానాడు బహిరంగముగా విప్లవతండములను నడుపజొచ్చిరి. రాజభటులుకూడ కొందరు వారిలో కలసిరి. పలుతావుల వారు రాజసేనల నెదురించుచుండిరి. ఇంత యాకస్మికముగా నల్లరి ప్రారంభించినను రాజసైన్యములు పరాజుగా నున్నట్లు లేదు.

రాజమందిరముపై నల్లడి ప్రారంభమైన సమయమునకే, నూతనముగా దండనాథుడైన రాజమయ్య యావల నొక యశ్వదళముతో పోయి సారంగధరుని మెట్టసంఘారామమును ముట్టడించి బలవంతముగా లోపల ప్రవేశించి స్వాధీన పరచుకొనెను. అక్కడ నాత డప్పుడు స్వాధీనపరచుకొనిన వస్తువిశేషము లద్భుతమైనవి. ఆ క్రిందటి రాత్రియె వచ్చిన

రెండువేలయశ్వములందు విశ్రాంతి తీసికొనుచుండెను సామానుకొట్లలో నున్నవి పూజాద్రవ్యములు కావు! విండ్లు, బాణములు, ఖడ్గములు, శూలములు, కుంతములు, గదలు, తోమరములు, శక్తులు, ముసలములు, కవచములు—నందున్నవి. అది గొప్ప యాయుధాగారముగనుండెను. విప్లవకారులకు ప్రధానకేంద్రమగు సంఘారామము ముందుగనే వశమైనందున వారి కాధారము లేకపోయినది. బౌద్ధవిగ్రహములతో వచ్చిన శ్రమణులు రాజమయ్యను సంఘారామము వదలిపొమ్మని ముం దాజ్ఞాపించిరి. ఆతడు వినకపోగా రాజరాజుకు చెప్పి దండింపజేయించెద మని బెదరించిరి. అతడదియు నిర్లక్ష్యముచేయగా నాతని పరిపరివిధముల బ్రతిమాలుకొనియు విశేషధనమిచ్చెదమని ప్రలోభపెట్టియు నెన్నియో ప్రయాసలు పడిరి. ఎంతకును నాతడు వినలేదు. విప్లవసైనికు లంత బలవంతముగా నది తమ స్వాధీనముచేసికొనవలె నని మల్లప్ప రాజకుమారుని ప్రోద్బలముతో ప్రయత్నించిరి. రాజమయ్య వారి నందర దరిమివేసి బౌద్ధశ్రమణులను—జేతారినాధుడు, వజ్రకీర్తి, చీనాపండితుడు ఇత్యాదులతో గూడ—నిష్కారణముగా బంధించెను.

ఆరంభశూరత్వముతో చెలరేగిన యా యలజడి తీవ్రత మధ్యాహ్నమునకే తగ్గుచుండెను. సంఘారామములోనికి రాజభటు లంత శీఘ్రముగా ప్రవేశింప సాహసింతు రని వారెన్నడూ నూహింపలేదు. పవిత్రముగా చూచు దేవసదనమును గౌరవింపరా యనుకొనిరి.

ఆనాడు నృపకామదండనాధుడు తన మందిరము వీడి బయటికి రాలేదు. కాని యా వృద్ధదండనాథాగ్రణియే పట్టణమునం దెల్లదు రాజభటులకు శీఘ్రగాములగు నాశ్వికులచే నెప్పటికప్పు డాజ్ఞ లందింపజేయుచు రాజభటసన్నాహమున కంతటికిని సూత్రధారుడై సమర్థతతో నిర్వహించెను.

మధ్యాహ్నమగునప్పటికి రెండు శుభవార్తలు రాజమహేంద్రపురము చేరెను. ఒకటి యువరాజరాజేంద్రదేవుడు చక్రకోట్యదుర్గమును పట్టుకొనినవార్త; రెండవది కొప్పము యుద్ధరంగములో కుంతలచాళుక్యసైన్యములు చోళసైన్యములచే పరాజితమైన వార్త! వెంటనే వివరముగా

నా వార్తలు రెండును నృపకాము దండనాధుడు పట్టణమంతట ప్రకటింప జేసెను.

ఆవార్తలు వినినంతనే విప్లవకారులకు ధైర్యము సడలిపోయెను. ఒక్కసారిగా వారి ప్రాణములు జారిపోయెను. నిస్పృహనొంది యెవరికి దోచినరీతివారు పారిపోసాగిరి. మూడు జాములగునప్పటికి రాజమహేంద్ర వరము శాంతించెను.

కాని యిట్లు రాజమహేంద్రపురములో రగుల్కొనిన విప్లవజ్వాల యా పట్టణముతో నాగిపోలేదు. ఆ దినముననీ విధముగానే వేంగీరాజ్య మం దంతట ననేక ప్రదేశములలో నల్లరులు రేగెను. కొన్నియెడల ప్రజలలోననే కాక సైనికులలో నావికులలోగూడ బ్రసరించెను. కొందరు దండనాధులే తమ సేనలతో నెదురు తిరుగ ప్రయత్నించిరి. కాని వారి యనుచరులే ఆ దండనాధులను నధుయించి దండనాథపదవి స్వీకరించి అప్పటికే తమ కందియున్న రాజముద్రిక గల యాజ్ఞాపత్రములు ధరించి సైనికులను చాలవరకు అదుపులో నుంచుకొనగలిగిరి. కాని యిట్టి పని యంతటను సాధ్యపడలేదు.

భట్టిప్రోలు, ఘంటశాల, అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జున కొండ—ఇత్యాది కృష్ణాతీర ప్రదేశములు బౌద్ధుల పట్టుగొమ్మలుగా నుండెను. అట్లేపూర్వము వేంగీరాజ్యమునకు రాజధానిగా నుండిన కొల్లేరు సమీపమందలి వేంగీపట్టణమును బౌద్ధజనబహుళముగా నుండెను. ఆ పట్టణములన్నియు విప్లవకారుల వశమయ్యెను. కృష్ణవేణిపై నౌకలలోగూడ కొన్ని వారి వశమైనవి.

మోటుపల్లిలో కలవరి ముదయముననే పొడచూపెను. శక్తిశర్మ కఠినశాసనములచే అతిశీఘ్రముగా నచ్చటి యల్లరి యణచి నౌకాబలము నకు ఎంతమాత్ర మపాయము ప్రాకకుండ జేసెను. మోసలపురమున గూడ నట్లేయయ్యెను. కృష్ణవేణిపై నుభయతీరముల నున్న తరులను ఎటువైపున నున్నవాని నటువైపు కదలకుండ నాజ్ఞాపించి నదీతరణము రాజసేనలకు తప్పయితరులకు సంపూర్ణముగా నిషేధించెను. తిరుగుబాటు దారు లెక్కడివా రక్కడనే కాని యొకరితో నొకరు సంబంధము కలుపు

కొనుట కవకాశము లేకపోయినది. అందుచే తాత్కాలికముగా సఫలీకృత పరిశ్రమ మైనయెడలగూడ విద్రోహుల ధైర్యము క్షీణింపజొచ్చెను. రాజ సైన్యము లెప్పటి కప్పుడు పరిస్థితులు తెలిసికొనుచు సులభముగా విప్లవాక్రాంత ప్రదేశములు స్వాధీనపరచుకొని శాంతి నెలకొల్పుట సాధ్యమయ్యెను. కాని యిది జరుగుటకు కొన్ని దినములు పట్టెను.

ఒక్క రాజమహేంద్రవరమున దప్ప గోదావరీతీరమంతయు శాంతముగా నుండెను. గోదావరిపై నావలు యథాప్రకారము ప్రయాణము చేయుచునే యుండెను. రాజమహేంద్రవరము రేవులలో మాత్రము రాజ సైన్యములు నిలిచి విప్లవకారుల నందు జేరకుండ నరికట్టుచుండెను.

ఇంత యలజడి జరుగుచున్నను అనాడు రాజరాజనరేంద్రుడును వజ్జియప్రెగ్గడయు ఎక్కడను గనుపడకుండుట చిత్రముగా నుండెను. అమ్మంగమహాదేవియు చూడనయ్యెను గాని మహారాజు ఎక్కడను లేడు. మహారాజును ప్రెగ్గడయు నా దినమున మారువేషములతో పుర మెల్లెడ సంచారము చేయుచున్నారని పుకారు పుట్టెను. వారిని గుర్తించి సంహరించినచో తాము సులభముగా జయింపగల మని విద్రోహు లాశపడిరి. ఎన్నియో మారులు "ఇదుగో రాజు!— ఇదుగో వజ్జియ!" అని వారు పలువుర మనుష్యులను చంపుచుండిరి. కాని పురల మరల "ఇదుగో రాజు!—ఇదుగో వజ్జియ!" యను కేకలు పట్టణములో నేదో యొకమూల వినవచ్చుచునే యుండెను.

అలజడి తగ్గిన కొలదియు రాజవీధుల నెల్లెడల రాజభటులు నిండిపోయిరి. కఠినముగా వారు పురజనుల నెక్కడ మూగనీయక చెదరగొట్టసాగిరి. కత్తులు, కర్రలు, మరియెట్టి యాయుధములుగాని ధరించిన వారిని వీథిలోనికి రాకుండ జేయుచుండిరి.

అప్పటికి వారము దినములనుండి యిద్దరు విదూషకులు రెండు గుర్రములపై నెక్కి చేతుల కొయ్యకత్తులు ధరించి పురవీధుల నెల్లర నవ్వించుచు తిరుగుచుండిరి. ఈనాడు వారు బ్రాహ్మణశ్రేణిలో నట్లే తిరుగుచుండిరి. పట్టణములో నల్లరి శాంతించుచున్న సమయమున రాజభటు లది యుపలక్షించిరి. వెంటనే వారు విదూషకులను సమీపించి యా

క త్తులు వదల మని కఠినముగా నాజ్ఞాపించిరి. వారు వదలలేదు. రాజభటు లంతట బలవంతముగా నా ఖడ్గములు స్వాధీనపరచుకొని చూడనవికొయ్య కత్తులు కావు; నిజమైన నిశితఖడ్గములు! వా రంతట నా విదూషక వేష ధారులను క్రూరముగా బంధించి నృపకామదండనాథు నెదుట నుంచిరి.

రాజభటు లా విదూషకులను బంధించి నృపకామదండ నాథాగ్రణి యెదుట నుంచగానే దండనాథుడు వారికి ప్రత్యుత్థానము చేసి చిరునవ్వుతో "బుద్ధజయంతి, చంద్రగ్రహణము రేపుగదా!" యని పలుకరించెను.

వృద్ధవిదూషకుడు, "దండనాథా, మీ భటులు తొందరపడి యీ నాడే రాజ చంద్రగ్రహణము చేసినారు. ఏమి చేయగలము!" అని బదులు చెప్పెను

పడుచు విదూషకుడు చిరునవ్వుతో నున్నతాసన మలంకరించెను. అందరు సుఖోపవిష్టులైన పిమ్మట నృపకామదండనాథు డాతని కానాటి వృత్తాంతమంతయు నివేదించెను. అదిచూచి, రాజరాజనరేంద్రుని పజ్జియ ప్రెగ్గడలనే పొరపాటున బంధించి తెచ్చితి మని రాజభటులు గడగడలాడి పోయిరి. అది గమనించి వృద్ధవిదూషక వేషధారియగు పజ్జియ యా భటు లను పిలిపించి చక్కగా బహూకరించెను.

అనాడు నృపకాముని మందిరమునుండి రాజరాజు సర్వాలంకార భూషితుడై పట్టగజముపై పట్టణవీధుల మహావైభవముతో నూరేగెను. అతని కిరుపార్శ్వముల నృపకాముడును పజ్జియయు నుత్తమాశ్వము లధిరోహించి వెడలిరి. ఆ ఊరేగింపుకు రెండు ప్రక్కలను హాస్తికులు ఆశ్వికులు పదాతులు వేనకువేలు నిలిచి రక్షచేయుచుండిరి. చక్రకోట్యము యువరాజు జయించిన వృత్తాంతమును, కొప్పము యుద్ధమున చోళవిజయ మును, రాజమహేంద్రవరమున విద్రోహమర్దనమును పటములపైన ప్రకటించి అనేక విధముల గానము చేయుచు నూరేగిరి. వందిమాగధులు కైవారములు చేయుచు ముందు సాగుచుండిరి. భేరీశంఖకాహళాదివిజయ వాద్యములు ఘోషించుచుండెను. సైనికుల వందనములును పురసువాసిను

లిచ్చు మంగళహారతులును పుష్పాంజలులును గ్రహించుచు వీరమన్మ థాకారముతో రాజరాజనరేంద్రుడు కన్నుల పండువుగా నూరేగెను.

మరునా డుదయముననకే కోటగుమ్మముముందు విశాలమగు పందిరి యొకటి సిద్ధముచేసిరి. అందు వితానముక్రింద సింహాసనమున రాజరా జాసీను డయ్యెను. విద్రోహుల నడచివేయుటలో సామర్థ్యము రాజభక్తి చూపినవారందరకు ముందు అమూల్యములగు బహూకృతులు నూతన బిరుదములు ప్రసాదించిరి. అట్టి గౌరవము లందినవారిలో నగ్రగణ్యులు నృపకామదండనాథుడు, జననాథుడు, రాజమయ్య, ముప్పరాజు! వారి కవి రాజరాజే స్వహస్తములతో సభాముఖమున బహూకరించెను. ధైర్యము చూపిన సమస్త వీరులకును రాజసేవలో ప్రాణములు వదలిన వీరభటుల కుటుంబములకును తగు రీతి బహుమానములను, జీవనములను ప్రసా దించెను. ద్రోహులక్రూరకృత్యములచే నష్టమునొందిన జనమునకు గూడ సహాయము చేసెదనని ప్రతిజ్ఞచేసెను.

అట్లా బహూకరణసభ యుదయమున పూర్తిచేసి మధ్యాహ్నమున ప్రధానాధికరణము ప్రారంభించెను. ఆ యధికరణమున నధికారి స్వయ ముగా రాజరాజనరేంద్రుడే. ఆ నా డిచ్చు తీర్పులకు తిరుగులేదు. చీదమార్యుడు ప్రాడ్వివాకుడు; పావులూరి మల్లన గణకుడు; గండా చార్యుడు లేఖకుడు; దండనాథులే సూచకులు. వారందరు నీలాంబరములు ధరించిరి.

ఆ సభ యమధర్మరాజుసభ ననుకరించుచు నుదాత్తభయంకర ముగా నుండెను. రాజభటు లందరు నీలాంబరములు ధరించి యమ భటులవలెనే యుండ బంధితుల నొక్కరొక్కరినే ప్రవేశపెట్టుచుండిరి.

ముందు కుమారసప్తకములో రాజభటులకు దొరకిన విజయా దిత్యుడు, విమలాదిత్యుడు, విక్రమాదిత్యుడు, విష్ణువర్ధనుడు నను నలుగు రను రాజుముందు రాజమయ్య దండనాథుడు నిలువబెట్టి, వీరు రాజ ద్రోహులలో ప్రధాను లనియు నింత జనక్షయమునకు కారకులనియు నభియోగము చదివెను. దానికి వారు ప్రత్యాఖ్యానము చేయలేదు. శిరశ్ఛేదము

శిక్షవేసి పంపివేసిరి. మల్లప్ప, కాముడు, రాజమహేంద్రుడు పారిపోయిరి. వారును, పారశీకులును, సైంధవులును చిక్కలేదు.

ఆ పిమ్మట సారంగధర మెట్ట సంఘారామమున కధ్యక్షుడగు జేతారినాధుడు నిలువబెట్టబడెను. సంఘారామమును ఆయుధాగారముగా మార్చివేసి రాజభవనముపై నవినయమునకు ముందు పురికొల్పిన దీతడే యని జననాథదండనాధు డభియోగము చదివెను.

జేతారినాధుడు నిలువున నిలుచుండి నిర్లక్ష్యముగా, "సంఘాధ్యక్షుడ నగు నన్ను విచారణచేసి తీర్పు చెప్పుటకు ఏ రాష్ట్రాధిపతికి అధికారము లేదు!" అనిపలికెను.

ఇంతలో రాపర్తి బేతయనాయకుడు లేచి, "మహారాజా, ఈతడు సర్వవిధముల పతితుడై పూజాక్రమమను పేర ముగ్ధులగు స్త్రీలను మోసగించి వారి కాపురములు పాడిచేసినా డని యొక యభియోగమును గలదు. 'సుజాత' అను ఉత్తమురాలగు నుపాసిక సాక్ష్యమీయ గలదు. మరియు నారాయణభట్టు పరిచారకునితడు సంఘారామములో బంధించెను." అని విన్నవించి సుజాతను నిలువబెట్టెను.

కేవలము దుఃఖమూర్తియై సుజాత ప్రమాణముచేసి తన దుఃఖ కధ తెలిపెను :

"ఈ జేతారినాధుడు కల్యాణకటకము వచ్చినప్పుడు మహానుభావుడు వచ్చినాడని పలువురు స్త్రీలనుకొనుచున్నందున నేనును దర్శనమునకు వెళ్ళితిని. సంసారము మోహబంధ మని నాకు బోధింప భర్తను వదలి యాతనివెంట రాజమహేంద్రవరము ఉపచారములు చేయుచు వచ్చితిని. మార్గమధ్యమున మంత్రోపదేశములు చేసి నాచే గుర్వాజ్ఞ దాటనని ఘోర ప్రతిజ్ఞలు చేయించెను. ఆ పిమ్మట నా స్థైర్యము పరీక్షించెదనని కామ భిక్ష వేడెను. నే నది తిరస్కరింపగా సర్వవిధముల నన్ను భయంకర యాతన లనుభవించెద వని భయపెట్టి కొంతకాలమునకు కృతార్థుడయ్యెను. నేను చేసిన ఘోరప్రతిజ్ఞలకు బద్ధనై అతనికి దేహ మప్పగించితిని. నాకు నిజముగా విరక్తి కలిగి పూజాదులందసహ్యము కలిగి రోగగ్రస్తులగు వారి కుపచారములు చేయుచు వారి బాధ కొంత నివారణ చేయుటకు

యత్నించుచున్నాను. ఈమధ్య నాభర్త సీతడు సంఘారామమున కొంత కాలము బంధించినాడు."

ఆ కథ విని రాజరాజే తలవంచెను. జేతారినాథుడు మాత్రము శిరస్సు వాల్పలేదు. "ఈ సభలో నేను ప్రత్యుత్తర మీయ నక్కరలేదు!"

అంతట రాజమహేంద్రవర సభాపతి లేచెను.

"శంకరజయంతి సందర్భమున జగద్గురుస్వాములు కృష్ణశర్మయను బ్రాహ్మణునికి తురీయాశ్రమ్యుపదేశము చేసితి మనియు, నతడు హేయాచారము లవలంబించుచున్నందున నతనిని చాతుర్వర్ణ్య శిష్యబృందము నుండి బహిష్కరించి యాతని హృదయమధ్యమున తప్తముద్ర నంకితము చేసితిమనియు, నతడు మారువేషముతో నిచ్చట నున్నట్లు తెలియవచ్చుచున్న దనియు శ్రీముఖముద్వారా తమరు విని యుంటిరి. ఈ జేతారినాథుడే ఆ కృష్ణశర్మ! వక్షస్థలము పరీక్షింపవచ్చును!"

సభాపతి పలుకులు విని రాజభటు లాతని హృదయభాగమునుండి వల్లెవాటు తొలగింప యథోక్తరీతిగా శ్రీ విద్యాశంకరభారతీముద్ర తప్తమై యందంకింపబడి యుండెను. ఒక్కసారి అందరు హాహాకారము లొనర్చిరి. రాజరాజనరేంద్రుడు ఏమి చేయను నోపక ప్రాడ్వివాకు డగు చీదమార్యునివంక తిలకించెను. చీదమార్యు డిట్లనెను :

"మహారాజా, ఈ కృష్ణశర్మ జేతారినాథుడు చెప్పుదానిలో కొంత నిజమున్నది. ఇతడు ఉత్తమభారతీయతియై పతితుడైనాడు. అందుచే ఆరూఢపతితుడు. ఈ రాజసభ కాని తుదకు దక్షిణదిక్పాలకుడగు నా యమధర్మరాజుకాని యీతని పాపమునకు తగినంత శిక్ష విధింపలేరు. ఇతనికి త్రిలోకాధిపతియగు సురేంద్రుడే తగు శిక్ష విధింపగలడు. ఈ లోకములో వేయదగిన శిక్ష జగద్గురు స్వాములే విధించినారు. వెంటనే దేశమునుండి వెడలగొట్టుటకంటె ఈ రాజసభ వేయదగిన శిక్ష లేదు!"

చీదమార్యుని నిష్కర్ష సభకు తృప్తికలిగింపలేదు. అతనిని ముక్కలు ముక్కలుగా కోసి కాకులకు గ్రద్దలకు వేసినను పాపము లేదని

పలువురు సభాసదులు తలంచుచుండిరి కాని ప్రాడ్వివాకుని ధర్మనిర్ణయము నెవరును ఖండింప సాహసింపలేదు.

"మూడు దినములలో వేంగీమండలము నీవు విడిచిపోవలెను; అట్లు చేయనిచో నిన్ను ఎవరేమి చేసినను వారికి రాజదండన ముండదు!"

రాజభటులు బంధనములు సడలించిరి. అత డూర్ధ్వబాహుడై ఉత్తరాభిముఖముగా వెంటనే బయలుదేరెను

అంతట వజ్రకీర్తిని నిలువబెట్టిరి. రాజముద్ర్యాయాతని విద్రోహ కృత్యములు చదివెను. ఆ పిమ్మట రావర్తి బేతయనాయకు డిట్లనెను:

"ఈ శ్రమణునికి కొంచెము అలౌకికశక్తు లున్నట్లు తోచును. విష చికిత్స భూతవైద్యము కొంత చేయును. ఆ మూలముగా పలువుర భ్రమపెట్టి విద్రోహులలో జేర్చినా డీతడు!"

ఇట్లనుచు పావులూరి మల్లన పరిచారకుని విచారించెను.

వజ్రకీర్తికూడ తన్ను విచారించుట కీ రాజసభకు అధికారము లేదని మాత్రము చెప్పి మౌనము వహించెను. ప్రాడ్వివాకు డేమియు నిర్వచింపలేదు. రాజరాజి ట్లనెను:

"ఇట్టి పాపాత్ముల కెట్టి శిక్ష విధించినను దోషము లేదు. కాని పవిత్రమగు సన్యాసాశ్రమమందు మాకున్న గౌరవముచే నా వేశము ధరించిన యీ దుష్టునికి గూడ నిష్కాసనమే శిక్ష; మూడు దినములలో వేంగీమండలము సరిహద్దులు దాటిపోవలెను."

వజ్రకీర్తియు జేతారినాధు ననుకరించుచు నుత్తరాభిముఖుడై చేతు లెత్తుకొని వెడలిపోయెను.

బౌద్ధశ్రమణుల కందరకు కదియే శిక్ష! వారందరు నట్లే వెడలిపోయిరి.

ఆ పిమ్మట చీనాయాత్రికుని నిలువబెట్టిరి. ముప్పరాజు అతనిపై నభియోగము చదివెను:

"ఇతడే వైశ్యశ్రేణిపై విద్రోహుల తండమును పురికొల్పుచు గృహదాహము చేయించెను. ఇతడు విద్రోహుల కెల్ల మూలకారకుడు. ఇతడు చీనావాడు కాడు. చక్రకోట్యమండలమునుండి వచ్చిన చారుడు.

రాజద్రోహమునకు ధనము వస్తువులు అనేకము తెచ్చిన దితడె. ఇతడు శ్రమణుడుకూడ కాడు. మంత్రములు తంత్రములు నేమియు నెరుగడు. మూడువందల యేండ్లు కాదు; ముప్పదేండ్లుకూడ లేవు!"

"దూతలకు విధించు దండమున కర్హుడ నగుదును రాజా!" అనెను వాడు.

చీదమార్యుడు:"ఇతడు దూత కాడు, చారుడు!చారుడై పరదేశమున పట్టుబడినవానికి మరణదండనము విహితము!" అనెను.

రాజరాజు ఆజ్ఞాపించెను :

"మరణదండనము! ఇతని శిరస్సు సంఘారామము ద్వారమునొద్ద నున్నతస్థలమున వ్రేలగట్టవలెను!"

ఆ పిమ్మట నాగరాజుల ముగురను రాజభటులు తీసికొని వచ్చిరి. "వీరు త్రైలోక్యమల్లుని చారులు. వీరు వేంగీప్రజలయందె కాక రాజభటులలో గూడ ద్రోహము పురికొల్పిరి. రాజమందిరముపై నల్లరిలోస్వయముగా పాల్గొనిరి."

"ఎవ రే కథ చెప్పు మనిన నా కథ చెప్పువారము; మాకు శిక్ష విధించుటేమి, మహారాజా?" అని నాగరాజు లడిగిరి.

రాపర్తి బేతయనాయకుడు ప్రమాణము చేసివారి దుష్కృత్యలన్నియు వివరించెను. నాగ కథ చెప్పుటతో నన్యాపదేశముగా రాజరాజనరేంద్రు లకు విద్రోహము బోధించిరనియు జెప్పెను. వారు ముగ్గురకు మరణశిక్ష విధించి వారి శిరస్సులు కూడ సంఘారామము ముందు నాగ గాథ చెప్పిన చోట నెత్తున వ్రేలాడగట్ట నాజ్ఞాపించెను.

అది యుద్ధభూమిలో జరుగు విచారణ. అక్కడ సామాన్యాధికరణ ములందువలె నెమ్మదిగా విచారించు నవకాశము లేదు. దోషులు చేసిన దుర్మార్గములు బహిరంగముగా జరిగెను. వాని ఋజువుకు దీర్ఘసాక్ష్యము అవసరము లేదు. శిక్ష వెంటనే కఠినముగా విధింపనిచో రాజధర్మము రాజ దండము హాస్యాస్పదమగును! ఆ దినమున మరి యెందరనో రాజభటులు రాజరాజుముందు నిలువబెట్టిరి.

ఆనాడు విధించిన సామాన్యశిక్ష శిరశ్ఛేదము ఆ శిరశ్ఛేదముకు సారంగధరుని మెట్ట సంఘారామముముందే జరుపుట కాజ్ఞ యయ్యెను. ఆ యాజ్ఞలును వెంట వెంటనే నిర్వహింపబడెను. నాగరాజుల నాగ గాథ లతో మారుమ్రోగిన యా మైదాన మానాడు రాజద్రోహుల శిరస్సులు తెగుచున్న శబ్దములతో ప్రతిధ్వనించెను.

శిక్షలు పూర్తియైనపిమ్మట రాజరాజు శాసనమును రాజదూత ఇట్లు ప్రకటించెను :

"సారంగధరుని మెట్ట సంఘారామమును స్థిరచరాస్తులతో కూడ ప్రస్తుతము రాజోద్యోగులే స్వాధీనము చేసికొందురు. ఇక నైదు సంవత్సరములవరకు దాని ఆదాయ మంతయు దాక్షారామ భీమేశ్వరాలయమున ఉత్సవాదులకు వినియోగింతురు. ఆపిమ్మట తగిన బౌద్ధభిక్షువులు లభించు నెడల నా యాస్తి యంతయును సంఘారామమును బౌద్ధసంఘమువశము చేయుదుము. అంతవరకు నందు ప్రతిష్ఠించిన విగ్రహములకు నిత్యనైవేద్యదీపారాధనలు రాజోద్యోగులే ఒక శ్రమణుని బెట్టి చేయించెదరు. బుద్ధభక్తుల కెట్టి బాధయు లేకుండ నచ్చట రాజమయ్య దండనాథుని నధికారిగా నియమించుచున్నాము!

"రాజద్రోహులుగా శిక్షింపబడినవారి సర్వస్వమును మా ఉద్యోగులు స్వాధీనముచేసికొని యది యంతయు విద్రోహులవలన ధనప్రాణములు కోల్పోయిన నిర్దోషులకు నష్టపరిహారముగా నిప్పించెదము. దానికి తోడు మా కోశమునుండి కూడ బహుధనము వెచ్చించుటకు మా కనకాధ్యక్షుల కాజ్ఞాపించుచున్నాము.

"ఇక నిన్నటి దినమున తాత్కాలికవేశముతో గంతులు వేయుచు స్వయముగా దుష్కార్యములు చేయనివారు పలువు రున్నారు. అట్టివారిని సర్వలోకాశ్రయ విష్ణువర్ధన రాజరాజ మహారాజులు కొద్ది తప్పుచేసిన పుత్రులను అపార కృపాతిశయముచే మన్నించు తండ్రివలెనే క్షమించి, యికముందు అట్టివారిని తమ తమ దేహములను మనస్సులను స్వాధీనములో నుంచుకోవలసినదిగా నాజ్ఞాపించుచున్నారు.

"సువర్ణద్వీపయాత్ర చేయదలచినవారికి మోటుపల్లిలో రాజనావలు

సిద్ధమగు చున్నవి. బాట లీ విద్రోహాలవలననుండి నిష్కంటకములైన వని వార్తలు స్థిరముగా వచ్చినవెంటనే వారిని పంపివేయుదుము. అంత వరకు ఆధారము లేనివారందరు మాచే కోటిలింగాల క్షేత్రమున ప్రతిష్ఠాపితమైన ధర్మశాలలో భోజనము సుఖముగా జేయవచ్చును!"

ఆ ప్రకటనము విన్న జనసమూహమున రాజభక్తితో గూడిన యానందబాష్పములు వెల్లివిరిసెను.

రాజరాజు వ్యగ్రుడై యెవరి రాకకొరకో నిరీక్షించుచుండెను. ఆ పిమ్మట స్వల్పకాలముననే రానున్న సోమగ్రహణసమయమున స్నానదానాదికము చేయవలెను!

ఇంతలో గురునాథశ్రేష్ఠి లేచి రాజానుజ్ఞ నొంది రాజరాజు పాదపీఠిక యొద్దకు వచ్చి వందనము చేసి కుమారసప్తకము తనయొద్ద కుదువ యుంచిన వజ్రకంఠిక పాదపీఠికపై నుపహారముగా నుంచి యిట్లు చెప్పెను.

"కుమారసప్తకము నన్ను ఋణ మిమ్మని యడుగగా రాజబంధువులను గౌరవముతో విశేషముగా ఋణ మిచ్చియుంటిని. కాని నిన్నటి దినమున జరిగిన విద్రోహ కాండచే నా ధనములో కొంత యీ జననాశనమున కుపయోగపడియుండవచ్చునని సందేహము కలుగుచున్నది. అజ్ఞానముచే నీ ప్రమాదము చేసితిని. ఐనను దాని నిర్వృతికొరకు వారు నా కడ నాఋణమునకై కుదువ పెట్టిన యమూల్యమగు నీ వజ్రాలకంఠిక విష్ణువర్ధనమహారాజులకు ఉపహారముగా నర్పించుకొన ననుజ్ఞ వేడుచున్నాను."

శాంతముగా రాజరా జిట్లు సెలవిచ్చెను :

"శ్రేష్ఠి! ఆ కంఠికమాత్రమే కాదు. నీకు మేము మున్ను ప్రసాదించిన ఛత్రచామరములును సమస్త బిరుదలాంఛనములుగూడ తిరిగి గ్రహింపదలచినాము."

గురునాథశ్రేష్ఠి దండప్రణామము చేసి నిలువబడి తన కున్న గౌరవచిహ్నములన్నియు నొక్కొక్కటే రాజరాజు పాదపీఠమున సమర్పించెను.

అంతట రాజరాజు గురునాథశ్రేష్ఠి ప్రతిస్పర్థియు ధాన్యశ్రేణి పతియు నగు సిరివిసెట్టిని రమ్మని సంజ్ఞచేసి, యా గౌరవము లన్నియు నాతనికి ప్రసాదించి యలంకరింపజేసెను. ఒక్కసారిగా నా వైశాఖపూర్ణిమా బుధవారమున గురునాథుని శ్రేష్ఠి లక్ష్మి యాతని త్యజించి సిరివిసెట్టిని వరించెను.

వజ్రకంఠికను రాజాజ్ఞచే కనకాధ్యక్షుడును వజ్రపరీక్షకులును తీసి పరీక్షించిరి. వారు అందరు నాలోచించి, "ఇది వేఁగీ చాళుక్యప్రభువులకు కులక్రమాగతముగా కుబ్జవిష్ణువర్ధనులనాటినుండి వచ్చిన యమూల్యకంఠిక. దీనిని నూట యేబది సంవత్సరముల క్రిందట కుంతలచాళుక్యులు హరించిరి. ఇది చక్రవర్తి ధరింపదగినది!" అని యేకగ్రీవముగా నివేదించిరి.

ఇంతలో గోదావరీనదిమీదినుండి జయభేరి వినిపించెను. రాజరాజుకు మంగళములు పాడుచు తూర్యరవములు మ్రోసెను. ఆ ప్రదేశమునకు సమీపమున నున్న రేవున సర్వాలంకారశోభితమగు నొక నావ యాగెను. అందుండి యువరాజ రాజేంద్రదేవుడు జయలక్ష్మి మూర్తీభవించి నట్లవతరించెను. అతనిముందు పురోహితుడు నడచుచుండెను. దక్షిణపార్శ్వమున నారాయణభట్టు ఆనందము విరిసిన ముఖముతో వచ్చుచుండెను.

యువరాజు రాక నివేదింపగనే రాజరాజు పూర్ణకుంభహస్తుల నాతని కెదురంపి వెంటనే తన సన్నిధికి రమ్మని యాజ్ఞాపించెను. యువ రాజరాజేంద్రదేవుడు ఆ సభకు వచ్చి పితృదేవుల పాదములకు అభివందనము చేసి ధారావర్షుని సమ్మతి పత్రము నర్పించెను. రాజరాజనరేంద్రుడు కుమారుని నాశీర్వదించి తన దక్షిణ పార్శ్వమునకు పిలిచి ప్రేమతో నాతని శరీరము స్పృశించెను.

"ఈ వజ్రకంఠిక చక్రవర్తియోగ్యమైన దని వజ్రవిదులు పలుకుచున్నారు. ఇంత శీఘ్రముగా చక్రకోట్యము జయించిన నీవు చక్రవర్తివి కాగలవు!" అని రాజరా జాశీర్వదించుచు నా వజ్రకంఠిక యాతని కంఠమున నలంకరించెను. బ్రాహ్మణబృందము తథాస్తువచనములు పలికెను.

"నారాయణభట్టారకా, మీ రీ రాత్రికి మా యతిథులు. మీ కొరకెంత సేపటి నుండియో నిరీక్షించుచుంటిమి ఈ చంద్రగ్రహణసమయ

మున మిమ్ము గోదావరీ మండలమున బంధించు దానము చేయదలచి నాము. మీ రది స్వీకరింపవలసిన దని మా అభ్యర్థనము!" అనెను రాజ రాజు!

నారాయణభట్టు సమ్మతించెను. కాని యతని ముఖమున విషాదరేఖ యించుక యావేశించినట్లు తోచెను.

"నీ ధర్మపత్నియు కుమార్తెయు క్షేమముగా నున్నారని నిశ్చయ వార్త వచ్చినది. ఈ యలజడులు లేకున్న నిచ్చటి కీపరికె వచ్చి యుందురు!" అనెను వజ్జియ

నారాయణభట్టు ముఖము నిండుగా వికసించెను.

ఆ రాత్రి నాలుగుగడియలు ప్రొద్దు పోవునప్పుడు కేతుగ్రస్త సోమోపరాగము కానవచ్చెను. రాజరాజు కోటిలింగాలక్షేత్రమున అఖండ గోదావరీనదీస్నాన మాచరించి హారితసగోత్రుడును ఆపస్తంబ సూత్రుడును నగునన్ని నారాయణునకు రెండేఱుల నడిమి విషయమున నందమపూడిగ్రామమును అగ్రహారముగా చేసి సర్వకరపరిహారముగా ధారా పూర్వకముగా దానము చేసెను.

ఆ ప్రాడు దినములలో వేంగిరాజ్యమున చెలరేగిన విద్రోహజ్వాల చల్లారెను. మార్గములు నిష్కంటకము లయ్యెను. అల్లరులు చెలరేగుటకు కారణములైన బౌద్ధసంఘారామము లన్నియు రాజభటులు స్వాధీనము చేసి కొనిరి. కాని కొన్ని సంఘారామములలో నల్లరు లేమియు జరుగలేదు. అట్టివానిలోని శ్రమణులను రాజాధీనమైన సంఘారామములలో, పూజాదు లకు నియోగించిరి. దోషము చేసినవారిని కఠినముగా దండించిరి. వ్యాధులు ప్రాకకుండ శవములు తొలగించి యథావిధముగా దహనఖననాదులు చేయించిరి. అయినను కొన్నియెడల మహామారి పొడచూపిన దను వార్త తప్ప మరియెట్టి ప్రమాదమును లేదు. నిర్వాసశిక్ష పొందిన శ్రమణులు వేంగీభూమి వదలిరి. పారశీకులగు నూనె బేహారులును సైంధవులగు నశ్వ వర్తకులును కనపడకుండ పారిపోయిరి.

వైశాఖ బహుళ పంచమినాడు రాజరాజనరేంద్రుడు మహావిజయ సభ చేసెను. ఆ సభకు మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారిక ప్రధానులు వచ్చిరి. రెండేరులనడిమి విషయనావాసులును అచ్చటి రాష్ట్రకూటప్రముఖులును ప్రత్యేకాహ్వానములు పొంది వచ్చిరి. శక్తివర్మయు విజయాదిత్యుడును వచ్చిరి. సోమయాజులు వేదవిదులు సభ నలంకరించిరి. సభలో నుండు పండితులే కాక మూర్ధాగ్రణియు చేదికవియగు కృష్ణ మిశ్రుడును, భోజాస్థానకవులగు క్షేమేంద్రుడు చిత్రపయను నాంధ్రులును, కాశ్మీరపండితుడగు బిల్హాణభట్టును, అధర్వణాచార్యులును, వేములవాడ భీమకవియు—— మరియు నెందరో కవులు పండితులు రసజ్ఞులు నుండిరి.

రాజరాజనరేంద్రుడు సభకు వచ్చుచుండగనే మాగధుడు వందితో కలిసి కైవారము చేయుచు వంశానుకీర్తనము యథాచారముగా పూర్తి చేసెను. రాజరాజు సింహాసనాసీను డైనంత నన్నయభట్టారక రచితనూత్న శ్లోకములతో. వంది రాజరాజప్రశక్తి గానము చేసెను.

"తస్మా ద్విమలాదిత్యా ద్రవికులలక్ష్మ్యశ్చ కుందనా దేవ్యాః
నిజగుణశీకృతాఖిలరాజన్యో రాజరాజవిభు రజని."

* * *

"సంరక్షతి క్షితితలం క్షపితారివర్గే మార్గేన యేన నయశాలిని మానవేన

ప్రీతాః ప్రజా నిజపవిత్ర చరిత్రతోయైః ప్రక్షాళయంతి కలికాలకలంకపంకమ్.

యస్య స్ఫారభుజాకృపాణదళి తారీభేంద్రకుంభస్థల
ప్రోన్ముక్తాఫలవృత్తమౌక్తికచయః సంగ్రామరంగాంతరే,
ధత్తే వీరరసక్రియాభినయనప్రస్తావనాలక్షితాం
వీరశ్రీరచితాంజలిప్రవిసరత్పుష్పోపహారశ్రియమ్."

"స సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజో రాజపరమేశ్వరః పరమ భట్టారకః పరమమాహేశ్వరః పరమబ్రహ్మణ్యః శ్రీ రాజరాజదేవో జయతు జయతు!"

ముందు వెంటనే రెండేఱుల నడిమివిషయ నివాసులను రాష్ట్రకూట ప్రముఖులను కుటుంబినులను రాజదూత పిలువగా వారందరు సభలో లేచిరి. అంతట రాజదూత ఇట్లు చదివెను:

"శ్రీ రాజరాజదేవో రెండేఱుల నడిమి విషయనివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః సమాహూయ మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారిక ప్రధాన సమక్ష మిత్థ మాజ్ఞాపయతి : యథా—

"హారీతగోత్రే హరిమూర్తి రాప స్తంబద్విజశ్రేష్ఠవిభు ర్వినీతః,
సదా పురోడాశపవిత్ర వక్త్రో విద్వా నభూ త్కించెన సోమయాజీ.
తస్య శ్రీమాన్ హిమకరకరప్రస్ఫురత్కీర్తిరాశే
రాసీ త్సూనుః సకలవిదుషా మంచితః కంచెనార్యః,
యం మన్యంతే యమ మరిగణాః కామధేనుం కవీంద్రాః
క్రీడారామం పరమసుహృదో జీవితం బంధువర్గః
తస్యా త్మజో మహాత్మా సమజని శౌచాంజనేయ ఇతి విదితః
ప్రజ్ఞాజితవాచస్పతి రకలంకోశంకనామాత్యః
తస్యాచ సుధర్మపత్న్యా గుణశాలిన్యాచ్చ సామెకాంబాయాః
అభవ దనుష్ఠితజగదుపకరణో నారాయణ స్తనయః.
యః సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషాసు
కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన.
కవీ న్మనీషాలవదుర్విదగ్ధాన్ మనోహరాభి ర్నిజసూక్తిభి ర్యః
కుర్వ న్నగర్వా న్పటుభి ర్బిభర్తి కవిభవజ్రాంకుశనామ సార్థమ్.
తస్మై సకలజగదభిమతగుణశాలినే సరస్వతీకర్ణావతంసాయ
అష్టాదశావధారణ చక్రవర్తినే నన్నినారాయణాయ"

నృపకామదండనాథుడు అది విని, "నారాయణా, ఈ నన్ని బిరుదు నీ పేరులోనే ఉన్నదా? మా రాజమహేంద్రపౌరులు ఇచ్చిన బిరుదా?" యని యడిగెను. రాజరాజనరేంద్రుడును సభయు నవ్విరి.

"క్రొత్త బిరుదు కాదు!"

మరల శాసనము రాజదూత ప్రారంభించెను.

"నన్ని నారాయణాయ భవద్విషయే నందమపూండి నామ గ్రామోగ్రహారీ కృత్య సోమగ్రాహణనిమిత్తే ధారాపూర్వక మస్మాభి స్సర్వకరపరిహారేణ దత్తమితి విదిత మస్తు వః. అస్య సీమానః :

"పూర్వతః ఇయ్యూరియుం బిల్లెమ పెద్దపూండియుం బొలగరుసున పల్లమున కొండియగుంట నడుమసీమా.

"ఆజ్ఞప్తి రస్య కటకాధిరాజః. కావ్యానాం కర్తా నన్నియభట్టః. లేఖకో గండాచార్యః. ద్వాత్రింశత్తమే విజయరాజ్యవర్షే వర్ధమానే కృత మిదం శాసనమ్".

ఈ శాసనము ఐదు రాగిరేకులపై లిఖితమై కడియముతో గ్రుచ్చ బడి వరాహముద్రిక వేసియున్నది. రాజరాజు దానిని యువరాజరాజేంద్ర దేవుని నన్ని నారాయణభట్టుచేతి కిమ్మన నతడు ప్రణామపూర్వకముగా నాతని కిచ్చెను. నారాయణభట్టు దానిని స్వీకరించి కన్నుల కద్దుకొని చక్రవర్తివి కమ్మని యువరాజు నాశీర్వదించెను.

ఆ పిమ్మట కృష్ణమిశ్రుడు ప్రబోధ చంద్రోదయమునుండి మూడవ యంకములోని బౌద్ధజైనకాపాలికవిజయము చదివి ఐదవ యంకమునుండి శ్రద్ధావాక్యములు :

"సౌగతా స్తావత్ సింధు గాంధార మగధాంగపారశీకవంగకళింగా దీన్ మ్లేచ్ఛ ప్రాయాన్ జనపదాన్ ప్రవిష్టాః. పాషండ దిగంబర కాపాలికా దయస్తు పామర బహులేషు పాంచాలమాళవాభీరావర్తసాగరానూపేషు నిగూఢం సంచరంతి. న్యాయాద్యనుగతయా చ మీమాంసయా గాఢప్రహారజర్జరీకృతాః నాస్తికతర్కాః తేషామేవాగమానాం అనుపదం ప్రయాతాః" అని చదివి చాలించెను. పండితులతో నిండియున్న యా సభ యెంతయు నానందించెను.

నావధ్యక్షపదవి సమర్థతతో నిర్వహించిన శక్తివర్మకు ఆ పదవి రాజరాజు స్థిరపరచుచు నాతని శ్లాఘించి బహూకరించి విజయాదిత్యుని క్షేమము తెలిసి కొనెను.

కాశ్మీరమునుండి వచ్చిన బిల్హణకవి యంతట లేచెను. అతడు యువకుడు అతని శిరోజములు బ్రాహ్మణపద్ధతిగా లేక యొక్కించుక క్షత్రియవిధము ననుకరించుచు కత్తిరించి పాయలు తీయబడియున్నవి. అత డు తరీయమును వల్లెవాటుగా వేసికొని మధురమగు కంఠముతో తన శరీరసౌందర్యమును చూచుకొనుచు పరవశుడై ముగ్ధకంఠముతో కొన్ని శ్లోకములు చదివెను. ఆ సభలోని పండితుల కవిరుచింపన ట్లతనికి విదిత మయినది.

భోజరాజాస్థానకవులు క్షేమేంద్రుడును చిత్తపయు స్వబంధు దర్శనమునకై స్వదేశము వచ్చియుండిరి. వారు తమ కావ్యములనుండియు భోజరాజు చంపూ రామాయణమునుండియు భాగములు వినిపించిరి.

పూర్వము రెండేరుల నడిమి విషయమునందలి సోమయాజులు రాజమహేంద్ర వరమున వైశాఖశుద్ధములో యజ్ఞము చేయుటకు వజ్జియ ప్రెగ్గడ యనుమతి నిరాకరించెను వారిని వజ్జియ సభాముఖమున క్షమా పణ కోరుకొని వారి యిచ్ఛ వచ్చిన యెడ యజ్ఞదీక్షలో నుండవచ్చు నని రాజాజ్ఞయైనదని తెలిపి, తాను భూరిదక్షిణ యిచ్చెదనని వాగ్దానముచేసెను. ఆ సోమయాజియు సంతోషించి 'వైశాఖశుద్ధమున ఈబౌద్ధమహాయజ్ఞమున మా యజ్ఞమెట్లు సాగియుండెడిదో కదా!" యనుచు నాశీర్వదించెను.

అంతట నన్నయభట్టు వ్యాసభట్టారకకృత మహాభారతమునుండి చార్వాక నిగ్రహఘట్టము సభలో వినిపించెను. అంతటితో సభ చాలింప నుండిరి. అప్పుడు వజ్జియప్రెగ్గడ లేచి సభ కిట్లు నివేదించెను.

"ఈ విజయసభా సందర్భమున వ్యాసకృతమగు ఈ జయకృతి శ్రవణము నాకొక స్ఫురణ కలిగించినది.

"చంద్రవంశజులగు రాజుల పవిత్రచరిత్రకీర్తనతో నిండియున్న దీ మహాభారతము. అంతే కాదు. ఇందులో వేదశాస్త్రముల సారము సమస్తజనులు తెలిసికొనునట్లు వేదవ్యాసుడు క్రోడీకరించినా డని పెద్దలు చెప్పుదురు. నేడు సామాన్య జనులకు సంస్కృతము తెలియకున్నది. మహాభారతార్థము తెలిసినచో ఈ బౌద్ధాది వ్యామోహములో పడి ఇట్లు సాహసకార్యములు చేయగడంగరుగదా యని నా ప్రెగ్గడబుద్ధికి స్ఫురించు

చున్నది. మహాభారతబద్ధనిరూపితార్థ మేర్పడునట్లు ఇందరు మహాకవు లున్న యీ సభలో తెలుగులో చెప్పగల సమర్థులుండరా!"

వజ్జియమాటలకు రాజరాజు స్పష్టముగా సంతోషము కనబరచెను. కాని యంతవరకు శాంతగంభీరముగా నున్న యా సభాముఖ మంతయు చిత్రముగా మారిపోయెను. నిశ్చలమగు నీరము గల కాసారమధ్యమున నొక్క రాయి వేసినట్లు వజ్జియవాక్యములు సభలో కలవరము కలగించెను.

సంస్కృత విద్వాంసుల కీ సూచన రుచింపలేదు. వారి యభిప్రాయము పంపన భట్టోపాధ్యాయు లిట్లు అనువాదము చేసెను:

"సాక్షాత్తుగా వేదసమ్మితమగు శ్రీ మహాభారతమును తెలుగులో వ్రాయుటకంటె పాపకార్య ముండునా?"

ఆ సంస్కృత పండితవాక్కులు విని నారాయణభట్టు లేచి వినయముతో, "వ్యాసమహాభారతము పురాణప్రవచనము చేయుచున్నారుగదా! అది యే భాషలో చేయుచున్నారు? అప్పు డీ పాపశంక కలుగుచున్నదా?" అని యడిగెను.

అంతట పంపనార్యుని వాదము మరియొక విధముగా చీదమార్యుండందు కొనెను

"వేదవ్యాసకృత మహాభారతమును అంత యుదాత్తముగా, అంత మనోహరముగా తెలుగుభాషలో కావ్యముగా జెప్పుట సాధ్యమా? అట్టిది నేను చేయగల నని చెప్పగలవా రీ సభలో నెవ్వరైన నున్నారా? అది దేవవాక్కు! అందులో కృష్ణద్వైపాయనుని పవిత్రవాక్కు! తెలుగులో దానిని పరివర్తన చేయగల నను సాహసుడుండునా?"

నిజముగా నా సభలో ఈ ప్రశ్నలకు సమాధాన మీయగలవారు లేకపోయిరి. నన్నయభట్టారకుడు తనకు కొంతకాలమునుండి మహాభారతము నాంధ్ర కావ్యముగా వ్రాయవలె నని సంకల్పము కలుగుచున్నను అట్టి సందేహామువలననే ఆ పని కుపక్రమింప సాహసింపలేదని స్పష్టపరచెను.

విద్వాంసు లందరు నన్నయవచనములు శ్లాఘించిరి. నారాయణ భట్టు అందరతో కలసి నన్నయ ఔచిత్యమును పొగడెను. అంత మరల నిట్లు ప్రారంభించెను :

"భారతకథలో ఉపాఖ్యానములు కవిగులగురు వగు కాళిదాసు రెండు నాటకములుగా ప్రయోగించెను. మీమాంసకాగ్రేసరు డగు భవభూతి భట్టు శ్రీమద్రామాయణమును రెండు నాటకములుగా నిర్మించినాడు. ఈ కృష్ణమిశ్రపండితుడు కేవలము ఉపనిషన్మహావాక్యసారమే నాటకముగా చిత్రించినాడు. ఇవి పండితులకు కవులకు సమ్మతమే కదా!"

కాకేమి ! మహాకవి కాళిదాసు కేవలము ఋషి! అతని అభిజ్ఞానశాకుంతలము, రఘువంశము అతని ప్రామాణికత నుద్ఘాటించును. భవభూతి గూడ ఋషికల్పుడు! శ్రీమద్రామాయణకత పండితపామరులకు కన్నులకు కట్టినట్లు మహావీర చరితములో ఉత్తరరామచరితములో చిత్రించినాడు! సభలో రెండు భావములులేవు. నారాయణభట్టుకూడ వారితోపాటు శ్లాఘించి యిట్లనెను:

"వ్యాసవాల్మీకులు వ్రాసిన పవిత్రకథలు ప్రాకృతమిశ్రమైన సంస్కృత నాటకములలో స్వతంత్రించి కొన్ని మార్పులతో చిత్రించుటకు ఈ పరిషత్తుకు ఎట్టి యభ్యంతరమును లేదు. మరి దేశభాషలో వ్యాసభట్టారకుల మూలగ్రంథబద్ధ నిరూపితార్థము ఏర్పడునట్లు, పురాణ ప్రవచనము కంటె హృదయంగమునగు కావ్యరూపముగా రచించుటకు పండితుల కభ్యంతర ముండునా?"

ఆ మాటలతో సభ నిర్వాక్కు అయ్యెను. వజ్జియప్రెగ్గడ పరమానంద మంది, "మహారాజా, పండితపరిషత్తులలో మంత్రిత్వము వహించుట కొక్క నారాయణభట్టుకే అధికారము కలదు!" అనెను.

నన్నయభట్టారకుని కన్నులార్ద్రము లయ్యెను.

ఆపై విద్వత్ప్రకాండుల బాధ తగ్గిపోయెను. కాని భోజరాజాస్థానమునుండి వచ్చిన చిత్తపకవి కొక సందేహము కలిగెను.

ప్రాకృతభాషకు కొంత లక్షణమున్నది. అట్లె తెలుగుకుకూడ నున్నచో తెలుగులో మహాభారతము వ్రాయుట కభ్యంతర ముండదు."

చిత్రప మాటలపై వృద్ధుడగు భీమనభట్టు అందుకొనెను.

"మన నన్నయభట్టారకుడు 'ప్రక్రియాకౌముది'యను నామాంతర ముకల 'ఆంధ్రశబ్దచింతామణి'తో తెలుగు వ్యాకరించి, 'లక్షణసారము' అను చందో గ్రంథముకూడ చేసి శబ్దశాసనుడైనాడు. తెలుగుభాష కిప్పుడు ప్రాకృతభాషలకున్న గౌరవము లేకపోలేదు."

అంతట మహాభారతాంధ్రీకరణమునకు పండితప్రతిఘటన సమసిపోయినది. కాని వ్యాసభట్టారకులు వేదవేదాంగముల సారము మహాభారతములో నిక్షేపించినారే! దానికి భంగము రాకుండ తెలుగులో వ్రాయగల సమర్థుడు దొరకవలె గదా!—అని పెద్దలు పల్కిరి.

నారాయణభట్టు పరిషత్తుకు ఇట్లు మనవిచేసెను :

"మా పూర్వులు ఈ వేంగీమండలములో యజ్ఞయాగాదులు చేసినవారు. మా ప్రపితామహులు కంచెనసోమయాజులు కోనసీమవారే. ఒకానొకప్పుడిక్కడ క్షామము రాగా, దూరపుకొండలు నునుపు అని, వారు కుంతలదేశము వెళ్ళినారు. మా తాతగారు కేవలము కంచెనార్యులే ఐరి. మా తండ్రిగారు శంకనామాత్యులైరి. నేను అమాత్యవృత్తిలో నున్నను మా ప్రపితామహులవలె మరల కొనసీమ చేరి సోమయాజి పదభాజనుడను కావలెనని యున్నాను.

"కుంతలదేశములో పంపాకయను జైనవీరుడు విక్రమార్జునవిజయమను పేర మహాభారతకథ విరుగగొట్టి వికలముచేసి కర్ణాటకభాషలో కావ్యముగా వ్రాసినాడు. అది చదివిన కర్ణాటకులకు పవిత్రమగు వ్యాసమతము రుచించుట లేదు. అందుచే అధికారియైనవాడు వ్యాసమహాభారతము తెలుగుచేసిననే కాని, నాగకులు చొకడు నాగభారతము వ్రాసి తెలుగుదేశములో నధర్మప్రచారము చేయగలడు. పవిత్రమైన యీ వేంగీమండలములో నట్టి యధికారి లేకుండునా యను నాశకూడ నన్ను కుంతలదేశము విడిచి స్వస్థానము చేరుటకు ప్రేరేపించినది."

సభవారు నారాయణభట్టు నాశతో నేకీభవించిరి. అంతట రాజరాజనరేంద్రులు సెలవీయదలచినారని రాజదూత ప్రకటించెను. సభ నిశ్శబ్దమయ్యెను. మహారాజిట్లు సెలవిచ్చెను :

"మాకు మహాభారతకథ ఎన్ని పర్యాయములు విన్నను మరల వినవలెనను నభిలాష తరుగకున్నది. వ్యాసమహర్షి వచనములకు వ్యాఘాతము లేకుండ తెలుగులో వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లము చేయ గలవాడు కావలెను. అందుకు అధికారి లక్షణములు ఈ సభవారు నిర్ణయించిన నట్టి మహామహుని నన్వేషింతుము!"

ముందు వేదవిదులు, 'స్వాధ్యాయవేత్త కానివాడిందుకు తగ'డని నిర్దేశించిరి.

అంతట సోమపీథులు, 'నిత్యనైమిత్తిక కర్మానుష్ఠాతయు అవిరళ జపహోమ తత్పరుడునుగా గూడ నత డుండవలె'నని నిశ్చయించిరి.

పౌరాణికులు, 'బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడు కానిది కేవల మహాభారత పఠనముచేత భారత సంహితా హృదయము బోధపరచుకొనలే'డని నివేదించిరి.

వైయాకరణులు, 'పాణినీయము సభాష్యముగా కరతలామలకము చేసికొననిది దీని కనర్హు'డనిరి.

సంస్కృతకవులు, 'కేవలము తెలుగులోనే కాక సంస్కృతాంధ్రములు రెంటిలో కావ్యరచనాభిశోభితుడు కావలె'నని నిర్ధారణ చేసిరి.

'సద్వినుతావదాత చరితుడు కావలె' నని నీతివిదులు వక్కాణించిరి.

'సత్ప్రతిభాభియోగ్యుడు కావలె'నని మీమాంసకులు నిర్ణయించిరి.

అంతట నృపకామదండనాథుడు చిరునవ్వు నవ్వి యిట్లనెను :

"మహారాజా, ఇందరు విద్వాంసులు అసాధ్యమైన లక్షణములు కోరుచుండగా తమ యాస్థానములో ఎట్టి దుస్సాధ్యమగు గుణములు కలవారైన నుందు రను నిశ్చయముతో మరియొకటిగూడ కావలె నని నేను అర్థించుచున్నాను. అతడు లోకజ్ఞుడు కూడ కావలెను!"

దానికి రాజరాజును సభయు మెచ్చుకొనిరి.

ఇంతవరకు నాస్థానములోని కవు లెవ్వరు మాట్లాడలేదు. నన్నయయు నారాయణభట్టును తప్ప యితరకవు లందరు ఎవరికి వారు తా మా భారతరచనా గౌరవము సంపాదింపవలె నని యాశించుచుండిరి. ఒక్కొక్క

గుణము పరిషత్తు కోరుచున్న కొలదియు వారి కొక్కొక్కరికి ఆశ సన్న గిల్లసాగెను.

కవులలో నారాయణభట్టు ముందు మాట్లాడెను:

"ప్రయత్నపూర్వకముగానే కాక అప్రయత్నముగా కూడ నబద్ధము రాని నిత్యసత్యవచనుడే ఈ భగీరథప్రయత్నమున కర్హుడు!" అనెను.

పండితులు ప్రసంగములు చాలించిరి. వజ్జియ, "మహారాజా, అతడు మత్యమ రాధిపాచార్యుడు గూడ కావలెను" అనెను.

అంతట రాజరా జిట్లు సెల విచ్చెను :

"జనమేజయచక్రవర్తికి వ్యాసభట్టారకులు గురువులు అనురక్తులు. మాకును కులగురువులు,నగు నన్నయభట్టారకులే జనమతకృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారతబద్ధనిరూపి తార్థమేర్పడ ఆధికధీయుక్తితో తెనుగున రచింప నర్హు లని మా యనుమతము!"

అందరును ఆ మాటలు విన్నంతనే నన్నయవంక జూచిరి. అత డింతవరకు చిత్తరువులోని ప్రతిమవలె నిశ్శబ్దముగా ఆలకించుచుండెను. తన మీదనే ఈ భారము పడు నని అతడు కలలోకూడ ననుకొనలేదు. అతని ముఖము సిగ్గుతో నెర్రవారి బాలసూర్యచ్ఛాయ పడిన పద్మమువలె నయ్యెను. ఆ మహాసభలో మహారాజు చూపిన గౌరవ మాతనికి మహా భారముగా కనిపించెను. అతని మనస్సులో వేదవ్యాసుని దివ్యమూర్తి ప్రత్యక్షమయ్యెను. అప్రయత్నముగా నతడీ మంగళశ్లోకము పఠించెను.

"శ్రీ వాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషు యే<br>లోకానాం స్థితి మావహం త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్,<br>తే వేదత్రయమూర్తయః త్రి పురుషా స్సంపూజితా వ స్సురైః<br>భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే."

పండితులు, కవులు, సభాసదులు ఒక్కసారి 'తథాస్తు!' అనిరి.

మహారాజు నాదేశము నన్నయభట్టారకుడు ప్రత్యక్షముగా నంగీక రించినట్లు తెలుపలేదు. అది సభలో రాజగౌరవమునకు కొరతగా భావింప నవకాశము కలదు. వజ్జియ యిట్లనెను :

"మహారాజా, నన్నయభట్టారకునిపై నకస్మాత్తుగా ఈ మహా

భారము దేవర వారుంచినారు. అతని మంగళశ్లోకమే యతని యంగీ
కారము తెలుపుచున్నది. ఐనను మహాభారతరచనకై కవి వివరణమునకు
ప్రత్యేకసభదశమినాడుచేయుటన్యాయము।"

రాజరాజు అంగీకరించెను. సభ ముగిసెను. రాజరాజు ఆసనము
నుండి లేచెను. పండితులు, కవులు, సామంతులు, దండనాథులు ఆద
రముతో నన్నయను సమీపించి యనేకవిధముల నగ్గించిరి.

కాని నన్నయ కది సంతోష విషయముగా లేదు. వ్యాసమహాభారత
భారము ధరింపగల గంగాధరుడేనా తాను? కాని రాజరాజు సమ్మతి,
విద్వజ్జనంబుల యాజ్ఞ, పూజ్యుడగు వజ్జియ ప్రోత్సాహము। ఆప్తమిత్ర
మగు నారాయణభట్టు ఈ భాగము పెట్టుటకు సూత్రధారుడు। అది తలచు
కొని నన్నయ నారాయణునివంక తీక్ష్ణదృష్టి పరపెను.

నారాయణభట్టు నిశ్చలముగా నన్నయను సమీపించి యతనివెన్నుపై
దక్షిణ హస్తముతో చరచి, "హనుమా, నీశక్తి యిందరు పండితులు
కవులు,సరసులు కేవలము మహారాజులు తెలియజెప్పినను నీకు జ్ఞాపకము
రాలేదా! నిజముగా హనుమంతుడవే!" అనెను.

చేరినవా రందరు నవ్విరి. నన్నయ సిగ్గుతో తల వంచుకొనెను.

అథర్వణుడును వేములవాడ భీమకవియు ఆ సభాభారము భరింప
లేక ముందే వెడలిపోయిరి. పావులూరి మల్లన హృదయభార మెట్లో
కుదురుచేసికొని నన్నయ నభినందించి వారివెంట నేగెను. వృద్ధుడగు
భీమనభట్టు తన కుమారుడగు చెట్టన భట్టుకు ఈ గౌరవము ప్రాప్తింప
లేదని మనోవేదనపడుచు నన్నయ కాప్తుడైనందున నతని నాశీర్వదించి
వెళ్ళెను. చెట్టనభట్టు తండ్రి ననుగమించుచు నన్నయకు నమస్క
రించెను.

క్షేమేంద్రుడును చిత్తపయు 'మరల నీనాడు భోజమహారాజు
నాస్థానమున విద్వద్గోష్ఠిలో నున్న ట్లున్న'దని పొగడి సెలవు తీసికొనిరి.

"ఆదిరాజవిభులగు చంద్రవంశరాజుల సభలోనే ఇట్టి వైభవము
సాధ్య" మని శ్లాఘించుచు కృష్ణమిశ్రుడు ఘూర్జరాగ్రణితో కలిసివెళ్ళెను.

పీ యెండ కా గొడుగు పట్టు బిల్హణకవి చేతితో శిరోజములు ఎగదువ్వుకొనుచు అలంకారభూయిష్ఠ మగు నొక సంస్కృత శ్లోకముతో నన్నయభట్టును కీర్తించి వెడలిపోయెను.

వేదవేదాంగవిదులును సోమయాజులును నన్నయ నాదరముతో నాశీర్వదించి వెడలిపోయిరి.

నన్నయ అతిప్రయత్నముతో నిగ్రహించుకొని వారిని ఆశీర్న మస్క్రియాదులతో యధోచితముగా మన్నించుచుండెను.

అతడు నారాయణభట్టుతో నేకాంతమున ప్రసంగించుటకు బ్వరో ద్రిక్తునివలె తహతహలాడుచుండెను.

## 50

"నారాయణా నీవు వేసికోవలసిన భారము నాపై వేసినావేమి?"

"నేను ఉచితజ్ఞుడ నని నీకు విశ్వాస మున్నదా, లేదా?"

"సామాన్యముగా ఉచితజ్ఞత ఉన్నవాడనే కాని యిందులో మాత్రము సందేహింపవలసి వచ్చుచున్నది."

"మంచిది. యువరాజువెంట చక్రకోట్యము నిన్ను పంపమంటినా? చతురంగ క్రీడలో నీవుకూడ నుంటివి కదా!"

"దానికి దీనికి సంబంధ మేమి?"

"లేకేమి? నేనే అర్హుడ నైనచో భారతాంధ్రీకరణ మెన్నడో ప్రారంభించి యుండెడివాడను!"

"నీకు సాధ్యము కానిది నాకు సాధ్య మందువా, నారాయణా?"

"నీకు సాధ్యముకానివి కొన్ని నేను సాధింపగలను. చక్రకోట్య దండయాత్రలో యువరాజుకు నీవు తోడుగా నుండగలిగెడువాడవా?"

"నేను యువరాజు ననుగమింపవలెనని కలలోగూడ ననుకోలేదే!"

"నీవును ఉచితజ్ఞుడవే!"

"నేను కాదనలేదే!"

నన్నయా, మనము కాంచీపట్టణములో వేదాధ్యయనము చేయుచు

అనధ్యయనము దినములలో మహాభారతము వ్యగ్రతతో చదివెడివార, మదిజ్ఞాపకమున్నదా?"

"లేకేమి? అప్పుడందులో నాకు తోపని విశేషము లెన్ని నీవు వివరించెడి వాడవో జ్ఞప్తి ఉన్నదా?"

"నన్నయ్యా, నామీద యాదరముచే నాకు నీ వందులో చూపిన విశేషములు మరతు వేమి?"

"నేనా?"

"అవును, నీవే! జ్ఞప్తికి తెచ్చుకొమ్ము! నాబుద్ధి రాజనీతిలో ప్రసరించినంత సులభముగా ధర్మములో ప్రసరించునది కాదు. నీకు భారతధర్మ మవగతమైనంతగా నా కవగతము కాదు."

"నారాయణా, కించిద్జ్ఞుడనైన నన్నిట్లు పెద్దచేయుటకు కారణము నీకు నాపై గల స్నేహమే!"

"కాదు, కాదు! అందులో ఈ అమాత్యవృత్తి స్వీకరించిన పిమ్మట నా బుద్ధిమలినప్రాయమైనది మహాభారతములోని దండనీతికంటె ధర్మము ప్రకటించుట లోకమున కెక్కువ యవసరము!"

"అందుకు నా కధికార మున్నదని నిజముగా నీ వందువా?"

"అ ట్లెన్నటికీ అనను! సర్వజ్ఞుడగు వ్యాసభగవానుని మహాభారతము తిరిగి వ్రాయుటకు సంపూర్ణాధికార మెవ్వరికిని లేదు. కాని అది ఆంధ్రీకరింప బూనుకొన్నప్పుడు నీ కంటె నుత్తమాధికారిని చూపలేము. నా బోటి యమాత్యులు పూనుకొనుట రెండవ పక్షము!

"నారాయణా, నా యవయవములు శిథిలము లగుచున్నవి. నో రెండిపోవుచున్నది. నా చర్మము విరవిరలాడుచున్నది. చేతులు వడకుచున్నవి. నేను నిలువనే నిలువలేకున్నాను. విపరీతమైన నిమిత్తములు కనపడుచున్నవి."

"నన్నయా, ఈ నిమిత్తములే నీ యధికారమును బలపరచుచున్నవి, నా బుద్ధికి!"

"వ్యామిశ్రములైన వాక్యములతో నా బుద్దిని మోహింపజేయు

చున్నట్లున్నావు, నారాయణా! నన్ను నీ శిష్యునిగా భావించి శాసింపు, నారాయణా!"

నన్నయకు కన్నీళ్ళుకూడ వచ్చునట్లయ్యెను.

"క్షుద్రమైన యీ హృదయదౌర్బల్యము వదలి లేచి యీ దినము ననే వైశ్వదేవము చేసి అగ్నిహోత్రుని సన్నిధిని ప్రారంభించు! పంచమి సోమవారము ఉత్తరాషాఢా నక్షత్రము, బాగున్నది! నీ వలె ముందు మాట్లాడి గాండీవము వదలిన విజయుడే తుదకు భారతయుద్ధములో జయ మందినాడు కాదూ! ఆ పార్థునికి కనపడిన నిమిత్తములే నీకును గోచరించినవి!"

నన్నయభట్టారకునికి మెరపు మెరసినట్లు గీతావాక్యములు స్మృతి పథమున వెలిగినవి. తాను అంతవరకు అప్రయత్నముగా భగవద్గీతా భాగములు అనువాదము చేయుచుంటి నని తెలిసికొని చిరునవ్వు నవ్వుకొనెను.

"ఐతే, మరి, నారాయణా, 'పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణు నట్ల'నీవును నాకు బాసటగా నుందు నని ప్రతిజ్ఞ చేసెదవా?"

"అందుకు ప్రతిజ్ఞకూడ చేయవలెనా? నేను నీ కిందులో ఆజ్ఞానువర్తిని. నీవు రథికుడవు, నేను సారథిని!"

"నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత
స్థితోస్మి గతసందేహః కరిష్యే వచనం తవ!"

అనుచు నన్నయ నవ్వెను.

"పనేకాని మనతో మాటాడవలె నని మా అక్కగారును మీ చెల్లెలును ఎంత ప్రొద్దుగా అక్కడ నిలుచుండి, కలవరపడుచున్న మనల జూచి ఎంత ఆదుర్దాగా నున్నారో చూచినావా, నన్నయా?"

నన్నయ కలవరించుచు, 'ఏమిటి?' అని తల యెత్తి లక్ష్మీపార్వతులవలె ఓరగా నిలుచుండి తమ యిద్దరివంక వ్యగ్రులై చూచుచున్న అరుంధతిని, సోమిదేవిని చూచెను.

"అక్కా, మీరు వింటిరా? రాజసభలో నన్నయ కీ నాడు పెద్ద గండము తప్పినది" అనుచు నారాయణభట్టు అరుంధతితో జెప్పెను.

"అవును. ఇన్ని పాట్లు పడి ఇన్నాళ్ళకు భార్య, పిల్ల కంటపడిన మీకు వారితో మాట్లాడుటకైనను అవకాశ మీయక మీతో ఏకదీక్షగా మాట్లాడుట చూచి నేను భయపడుచునేయున్నాను. రాజస్థానములలో మెలగడము కత్తులతో సాముచంటి దమ్మా!"

"మీ తమ్ముడుగారి చమత్కారములు నీ వెరుగ వమ్మా, తల్లీ!" అని సోమిదేవి అందుకున్నది.

"నన్నయ ఒక్కడే కాదు, నిత్యసత్యవచనుడు! నాకు గూడ అప్పుడప్పుడు నిజమే పలుకు నభ్యాస మున్నది!"

"అదుగో చూచితివా, నేను చెప్పలేదా?" అన్నది సోమిదేవి.

"ఈ నాడు మహారాజు నా స్థానమునకు పేరుమ్రోగిన పండితులు ఎక్కడెక్కడి నుండియో వచ్చినారు. మరి...." ఇట్లనుచు నారాయణభట్టు పరధ్యానముగా అటు నిటు చూడసాగెను.

"కుపమ మీ కొరకెదురు చూచి చూచి మీరు రాకముందే మార్కండేయ స్వామి దర్శనమునకు వెళ్ళినది." అని సోమిదేవి చెప్పెను.

నారాయణ : ఆ పండితసభలో ఏమి జరిగినదో ఎరుగుదురా?

నన్నయ : ఈ నారాయణభట్టు పనికిమాలిన దొంగవలె ప్రవర్తించినాడు!

నారాయణ : ఊరుకో, నన్నయా! లేనిచో నీవే చెప్పుము! వ్యాస మహాభారతము ఆంధ్రీకరింపుమని పరిషదనుజ్ఞతో ఆ మహాసభా సమక్షమున రాజరాజు స్వయముగా ఈ నన్నయ నడిగినాడు.

సోమిదేవి : అం దేమున్నది? అది గౌరవము కాదా?

నారాయణ : తొందరపడక, వినుః సార్థముతో తొందరపడి బయలుదేరి నట్లేనా? రాజరా జట్లడుగ గా నన్నయ బెల్లము కొట్టిన రాయివలె మాట్లాడడే! నే నతనివైపు చూచి సంజ్ఞ చేయుచున్నాను మాట్లాడడే!"

అరుంధతి : మహారాజు కది అవమానము కాదా? అందుచే ప్రమాదమురాలేదు కదా! మా కెందు కీ రాజమహేంద్రపురవాసము?

సోమిదేవి : కుంతల రాజసభలో అట్టిదానికి శిక్ష శిరశ్ఛేదమే!

నారాయణ : ప్రమాదమే అని అంగీకరించినావు గదా! నేను అబద్ధము చెప్పినానా?

సోమి : అప్పుడప్పుడు సత్యము చెప్పెద నని మీరే చెప్పితిరిగదా! మరి చివరికే మైనది?

నారాయణ : పాపము, వజ్జియప్రెగ్గడ అడ్డుపడినాడు. ప్రత్యుత్తరము చెప్పుటకు ఐదు దినములు గడు విప్పించినాడు!

సోమి : ఇంతకూ మా అన్నగారు ఏమందురు? అంతకంటె మహారాజు అన్నగారి కేమి గౌరవము చేయవలె?

నారాయణ : చూచినావా నన్నయా! మీ చెల్లెలుకూడ నే నన్నట్లె అనుచున్నది.

నన్నయ : అనుకూల దాంపత్య మట్లే యుండును. ఇంతకు నన్ను ఒప్పించితివి గదా! రోటిలో తల దూర్చుటకు సిద్ధమైతిని గదా?

దుగ్గవ్వతో కలసి కుపమ వచ్చినది. తండ్రిని చూడగానే కుపమ పరుగెత్తుకొని వచ్చి కౌగిలించుకొన ఏకధారగా కన్నీళ్ళు కార్చినది. నారాయణభట్టుకూడ మనస్సు పట్టలేక కన్నీరు కార్చి కుపమ శిరస్సు తడిపివేసెను. దుగ్గవ్వ అది చూచి బావురమని యేడ్చెను.

"పాపము, ఇన్నాళ్ళు తండ్రికోస మెంత వాచిపోయినదో, పిచ్చి తల్లి!" అని అరుంధతి కంట తడిపెట్టెను.

"పిల్ల తండ్రి నొక్క క్షణము విడిచి ఉండునది కాదు. మేమీ యాత్రలో పడిన కష్టములేనా తల్లీ! వారు దగ్గర ఉంటే, అదొక తీరుగా ఉండెడిది. కాని దానికికూడ నోయకపోతిమి! ఇంతకు ఆ దుర్గాదేవి కటాక్షమువల్లను యజ్ఞేశ్వరుని ప్రసాదమువల్లను మరల మనుష్యులలో పడగలిగినాము!" అనుచు సోమిదేవి కూడ కంట తడిపెట్టసాగినది.

చిరకాలానంతరమున తండ్రియు, బిడ్డయు కలసిన యానందముతో చాలసేపు ఇద్దరు కన్నీళ్ళు విడిచి తుడిచికొనిరి. ఆ ఆవేగము ఉపశమించినది చూచి నన్నయ—

"నారాయణా, పాదప్రక్షాళనము చేసికొని ఆచమింపుము!" అనెను.

తక్కినవా రాశ్చర్యపడిరి. నారాయణభట్టు ముఖము వికసించెను.

"నన్నయా, నీ యీ ధర్మనిశ్చలబుద్ధియే నోయి, నాకు నచ్చినది. ఆనందముతో నైనను కన్నీరు వదలితిని గనుక శౌచము జ్ఞాపకము చేసినావు!" అనుచు అరుంధతి తెచ్చిన జలముతో పాదప్రక్షాళన మాచరించి ఆచమించెను.

"కుపమా, మామగారికి వందనముచేయి!" అని నారాయణభట్టు చెప్పినంతనే కుపమ నన్నయకు పాదాభివందనము చేయగా నాతడు ఆమెను 'శీఘ్రమేవ కళ్యాణ మస్తు!' అని ఆశీర్వదించి శిరము మూర్కొనెను.

"నా కెంత కాలముగానో ఉన్నకోరికలు అన్నియు ఫలోన్ముఖమగుచున్నవి. తగినవాడు మహాభారతము ఆంధ్రీకరింప బూనుకొన్నాడు. నాకు గోదావరీ తీర స్థిరనివాసము ప్రాప్తించినది."–నారాయణభట్టు మాటలకు సోమిదేవి యడ్డువచ్చి 'అదేమి'టని యడిగెను.

నన్నయ : నీకు తెలియదా, తల్లీ! నారాయణభట్టు అగ్రహారికుడైనాడు.

అరుంధతి : చెప్ప మరచితిని, వదినా! చంద్రగ్రహణమునాడు నందమపూడి గ్రామము మహారాజు అగ్రహారముగా నిచ్చినారు.

సోమిదేవి ముఖము వికసించెను. "మాకు మరల నిక్కడ స్థిరవసతి లభించినదన్నమాట!"

అరుంధతి : నందంపూడి ఎంత చక్కని ప్రదేశ మనుకొంటివి! రెండువైపుల గోదావరి. దాని కానుకొనియే తూర్పున మా బిల్లమ పెద్దపూడి! ఎంతైనను సుఖమైన గ్రామము!

నారాయణభట్టు మరల ప్రారంభించెను :

"నా కింక కొక్కటే కొదువ యున్నది. అది తీరుటకూడ నీమీదనే ఆధార పడియున్నది, నన్నయా!"

నన్నయ : నామీదనే ఆధారపడినచో, నన్నాజ్ఞాపించి పనిచేయించుకోవచ్చును.

నారా : అవును. ఈ తలిని ఒకరిచేతిలో పెట్టి నా భారము తీర్చ

కోవలసియున్నది. దీనికి నీ కుమారునికంటె తగిన వరు డుండ డని నా నిశ్చయము!

అరుంధతియు సోమిదేవియు నొకరి ముఖము లొకరు చూచుకొనిరి. కువమ సిగ్గుతో తల్లియొడిలోనికి చేరెను.

నన్నయ : ఇంతసేపటినుండియు కుపమలక్షణములే పరికించు చున్నాను. ఇది ఎవరి యింటనైనను గృహలక్ష్మిగా దీపమువలె వెలుగగల లక్షణములతో కనిపించుచున్నది. కాని....

నారా : నే నమాత్యపదవిలో నున్నందున శిష్టత్వము క్షీణించిన దని నీ సందేహమా? మాప్రపితామహునివరకు అవిచ్ఛిన్నముగా సప్త పురుషాధికముగా సోమయాజు లైనవారు. నేనును త్వరలో యజ్ఞదీక్ష స్వీకరింప నిశ్చయించినాను.

నన్నయ : అది కాదోయి! నీవు స్వయముగా యజ్ఞము చేయక పోయినను నీవు సోమయాజివే! నీ కంటె ఆర్షసంప్రదాయము కావలె నను నంత వెర్రివాడనా! అది కాదు!

నారా : మరి? నాకు యజ్ఞసమయములో అర్షవిధానముగా కన్యా దానము చేయుదునా యనిపించుచున్నది.

నన్నయ : "బ్రాహ్మ కన్యాదానముకంటె ఆర్షకన్యాదానము విశేష మనుకొందువా? ఆ విషయ మాలోచింతము. కాని—" అని సందేహిం చుచు నన్నయ సోమిదేవివంక చూచెను.

నారాయణభట్టు ఒక్కక్షణకాల మాలోచించెను. వెంటనే కారణ మాతని బుద్ధికి స్ఫురించినది.

"ఏమి బుద్ధి నీది నన్నయా? ఇది అభ్రాతృక యనియా నీ సందే హము? అప్పటికి ఔరసుడు కలుగకున్నచో దత్తపుత్రుని నైన ముందు గ్రహించి యా పిమ్మటనే కన్యాదానము చేసెదను. సరియేనా?"

నన్నయ చిరునవ్వుతో, "నా కుమారుని నీవు చూడవద్దా, మరి?" అని యడిగెను.

నారా : నీ కుమారుడు కురూపియైనను నా పిల్ల నీయదలచినాను.

నన్నయ : "అంతకంటె నేను కోరు భాగ్య మున్నదా? తథాస్తు!" నన్నయ స్నానానంతరము వైశ్వదేవము చేసి యగ్నిసన్నిధానమున శ్రీమదాంధ్రమహాభారతరచన కుపక్రమించెను.

# 51

ఆ నాడు నన్నయభట్టారకుడు మహాభారతరచన ప్రారంభించి భోజనము చేసి మరల నగ్నిహోత్రశాల ప్రవేశించి రచనలో నిమగ్నుడయ్యెను. ఈవల గృహమధ్యమున నారాయణభట్టు, సోమిదేవి, కుసుమ, అరుంధతి, దుగ్గవ్వ, పొన్న, నారాయణభట్టు పరిచారకద్వయము సమావిష్టులైరి. అందరు పరమానందముగా నుండిరి. పొన్న మాత్రము మనస్ఫూర్తిగా వారి యానందములో కలియలేకుండెను. పూర్వ కథా శ్రవణముతో వారు కాలక్షేపము చేయుచుండిరి.

సంక్షేపముగా సోమిదేవి కథ యిది :

"సోమిదేవియు కుసుమయు నిద్దరు పరిచారకులతో సుఖముగా అనంతశయనము మీదుగా కన్యాకుమారి దర్శించిరి. ఆ సమీపములో నాగర కోవెలయొద్ద కొట్టరువులో దండనాథుడుగా సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజ చాళుక్య విజయాదిత్య విక్కియన్న యుండెను. అతడు వేంగీ చాళుక్య రాజకుటుంబము లోనివాడైనందున తెలుగువాడు. అతనికి వీరి సంగతి తెలిసి మిక్కిలి యాదరించి రామేశ్వరయాత్రకు సర్వసౌకర్యములు కల్పించెను. ధనుష్కోటియొద్ద సేతుస్నానము చేయువరకు నారాయణభట్టు నొద్దనుండి వార్తలు వారికి సక్రమముగా వచ్చుచుండెను.

"ఇంతలో పాండ్యమండలములో కలవరము రేగినది. అప్పటికే సింహళములో తిరుగుబాటు చేసి కిట్టి యను మహావంశరాజకుమారుడు రోహణ భాగము నాక్రమించెను. చోళసామంతులగు పాండ్యరాజులతో నాకిట్టిరాజ పుత్రుడు కుట్రలు చేయుచుండుట చే నా కల్లోలములు రేగెను. అందుపై చోళ సైన్యము లా భాగమున సంచారము చేయజొచ్చెను. చోళరాజశత్రువగు అహవమల్లునియొద్ద ప్రధానిగా నుండిన నారాయణభట్టు కుటుంబమును సేవకులను అట్టి సమయమున ననుమానింపకుందురా? సేవకులను

రాజభటులు బంధించి సోమిదేవిని క్షమార్హైను మాత్రము స్త్రీ అగుటచే బంధింపక యొకవిధమగు నిర్బంధములో నుంచిరి. సోమిదేవి పంపుకున్న ప్రార్థన పత్రము దండనాథునికి చేరలేదు. కొట్టరువులోని వేంగిచాళుక్య విక్కియన్నకు కర్ణాకర్ణిగా ఈ సంగతి తెలిసి చోళదండనాథునికి వారిని నిర్బంధమునుండి తొలగించి గౌరవాదరములతో తీర్థయాత్రలు చేసికొనిమ్మని వార్తనంపెను ఆ పిమ్మట సైనికులు సేవకులను వదలి, వారి నందర బహువిధముల పరీక్షించి వారి వస్తువులన్నియు వెదకి పరిశీలించి పోనిచ్చిరి.

"ఆ తరువాత వారు దర్భశయనము నవపాషాణము సేవించుకొని మధుర వచ్చిరి పాండ్యమండలమునకు రాజధానియగు మధురలో నప్పటికే యలజడి శాంతించెను. కాని దారిలో కొన్ని యెడల నల్లకల్లోలముగా నున్నందున దొంగలబాధ పడిరి. మధురలో మీనాక్షిని సేవించి తంజాపురము వచ్చిరి. అచ్చట క్రొత్తగా నప్పటికి నలుబదియేండ్లక్రిందటనే ప్రతిష్ఠితమైన రాజరాజేశ్వరాలయ మను బృహదీశ్వరాలయము దర్శించిరి అంత పెద్ద దేవళము చూడ సోమిదేవికి ఆశ్చర్యము మ్మెను కర్ణాటకులు శ్రావణబెలగోలలో నిర్మించిన నలువదివిండ్ల ప్రమాణముగల గోమతీశ్వర దిగంబర విగ్రహము చూచి తెలుగుదేశములో నింత శిల్పచాతురి కనబడునాయని విచారపడెను. తంజాపురాలయ నిర్మాణ మింకను పూర్తి కాలేదు. అక్కడ నెందరో తెలుగు శిల్పు లుండుట చూచి యామె యుప్పొంగెను. అక్కడ మహానంది గాంభీర్యము గోమతీశ్వరునకు ఎంత యెత్తున్నను వచ్చునా? ఈ మహాగోపురము చోళ చక్రవర్తుల యశోధ్వజ మని సంతోషించెను.

"తంజాపురమునుండి గంగైకొండచోళపురము దర్శించిరి. అంతట శ్రీరంగక్షేత్రమున ఆలయము చిన్నదైనను మహత్త్వవిశేషముగల శ్రీరంగనాథస్వామిని, దానికి సమీపముననే జంబుకేశ్వరస్వామిని దర్శించి కావేరి యావలితీరమున కొండపై గణపతిని వారు పూజించిరి.

"అచ్చటినుండి కుంభకోణము వచ్చిరి. అమాయకురా లగు సోమిదేవి యచ్చట మోసపోయి యెంతయో ధనవ్యయము చేసికొనెను అంతట చిదంబరరహస్యము తెలిసికొనిరి.

"తర్వాత కాంచీనగరము వచ్చిరి. వారు చోళప్రభువుల రెండు రాజధానులలో నొకటియగు నా పురమున బహుకాలము గడపిరి. అక్కడ కామాక్షీదేవిని ఏకామ్రనాథుని వరదరాజస్వామిని ఎన్ని మారులేని దర్శించిరి. వా రచ్చట నున్నన్నాళ్ళును నారాయణభట్టు అధ్యయనము చేసిన గురుకులముననే నివసించిరి. నారాయణభట్టు గురువులు వృద్ధులై యింకను అక్కడ శాస్త్రప్రవచనములు చేయుచుండిరి. వారు సోమిదేవిని కుపమను ఎంతయేని ఆదరించిరి. నన్నయభట్టారకుని కుమారుడు సిద్ధాంతము అధ్యయనముచేయుచు వారి నెంతయేని ఆదరించుచుండెను. అప్పటి కెన్నాళ్ళ క్రిందటనో నారాయణభట్టునొద్దనుండి వారిని మోటుపల్లి వచ్చి దూతలకై నిరీక్షింపుడని వచ్చిన వార్తమాత్రము తెలిసెనే కాని మరి వార్త లేదు.

"అచ్చటినుండి తిరుమల తిరుపతి చేరిరి. దిగువ పద్మాక్షిని ఎగువ తిరుపతిలో వరహస్వామిని బాలాంబికను సేవించిరి. చతుర్బాహువులు కలిగి నాగాభరణములతో విలసిల్లు బాలావిగ్రహము పాదమున నెల్లప్పుడు గంగ యూరుచు ప్రవహించుచుండుటచే దానిని నారాయణీశక్తి యని ప్రజలతిభక్తి సేవించుచుండిరి. అక్కడి దేవకైంకర్యములకుబహుధనము వ్యయమయ్యెను.

"ఆ పిమ్మట శ్రీ కాలహస్తీశ్వరుని దర్శించి విక్రమసింహపురమున శ్రీరంగనాయకుల సేవించిరి. అచ్చటికి సమీపమునగల కృష్ణాపట్టణము వెళ్ళి నావ యెక్కి మోటుపల్లి చేరి యక్కడనుండి సార్థముతో ప్రయాణమై వచ్చుచుండ దొంగలు వారిని త్రేపల్లె చేర్చిరి.

"దుగ్గవ్వ సాహాయ్యముతో సోమిదేవియు కుపమయు అమావాస్య చీకటిలో నరణ్యమున వెళ్ళుచుండ వారి ముందు నూరు ధనుస్సుల దూరమున పులి యెగిరి యొక జంతువును వేసి మనుష్యుల యలికిడి విని యాగి బొబ్బవేసెను.

"దానికి వారు తల్లడిల్లిరి కుపమకు మూర్ఛ వచ్చినట్లయ్యెను. దుగ్గవ్వ దీనముగా కేకలు వేసెను. సోమిదేవి సింహవ్యాఘ్రములు గాని వనహస్తులు గాని వెంబడించినపుడు స్మరింపదగిన దుర్గాసప్తశతీమంత్రములు స్ఫురింప నవి జపించుచు నమస్కరించుచు నా పులి కెదురుగా

నిబ్బరము తెచ్చుకొని నిలిచెను. ఎట్లో కుపమ భీమేశ్వరునకు లోహపు దివియ మ్రొక్కుకొనెను. ఆ పులి కొంతవడిగోం(డ్రు)పెట్టి తాను వేసిన యాహారజంతువును తీసికొని వెళ్ళిపోయెను.

"ఇప్పు డేమి చేయవలెను? వేపల్లెకు తిరిగి వెళ్ళిన నెట్టైయిన వారికి ప్రాణములు దక్కవు. సోమిదేవి గుండెనిబ్బరమే వారికిదారితీసెను. దక్షిణమునకు పోవలసినవారు తూర్పుగా పోవుచున్నారని కొంతవడికి సోమిదేవి యాకాశమందలి నక్షత్రములచే తెలిసికొనెను. ఇంతలో కృష్ణవేణీనది దరిసిరి మరి దుగ్గవ్వ వెళ్ళ దలచిన గ్రామ మెట్లు చేరుట?

"ఆ యసహాయస్థితిలో వారుండ నా నదిపై సర్వాలంకృతమగు నొక నావ కనిపించెను. వారికి ప్రాణములు లేచివచ్చెను. దాని దరిసి విచారింపగా నది వజియ ప్రెగ్గడ కుమారుని నావ. దేశములో రహస్యముగా సర్వవృత్తాంతములు తెలిసికొను ముఖ్యోద్యోగమున నత డుండి కొంత కాలమునుండి కృష్ణవేణీతీరమున సంచరించుచుండెను. అతడు వారు నారాయణభట్టు పత్నియు కుమార్తెయు నని తెలిసినవెంటనే ఎంతయు నాదరించి వృత్తాంతమంతయు నెరిగెను. అతడు వెంటనే వేపల్లెకు భటుల బంపి యచ్చటి దొంగలలో ప్రధానులనెల్ల బంధింపజేసి రాజమహేంద్రపురము చేర్చెను. సోమిదేవిని కుపమను అలజడులు పొడచూపు ప్రదేశములు తప్పించి సురక్షితముగా చుట్టుమార్గముల రాజమహేంద్రపురములో నన్నయభట్టారకుని యింటికి చేర్పించెను. వారిని దారిలో గదాహతి బాధ వలన స్వస్థులైన యిద్దరు సేవకులను, నారాయణభట్టు చక్రకోట్యము చనుచు పంపిన పొన్నయు కలిసికొనిరి."

"సంక్షేపముగా నారాయణభట్టు పూర్వకథ యిది:

"ఆహవమల్లసోమేశ్వరునియొద్ద ఏడేండ్లు నారాయణభట్టు ప్రధానిగా నుండెను. వైదికధర్మ ప్రతిష్ఠాపకులగు కుంతల చాళుక్యరాజ్యములో నప్పటికి చాలకాలము నుండియు విస్పృద్ధమగుచున్న జైనప్రవాహముచే ప్రభువులకు వైదికశ్రద్ధ తగ్గిపోసాగెను. నారాయణభట్టు ప్రయత్నము లన్నియు ఎదురీతవలె వ్యర్థములగు చుండెను. చోళమండలములో గాని

వేంగీమండలములో గాని వెళ్ళి స్థిరనివాసము కల్పించుకొన నిశ్చయించి ఉద్యోగము చాలించుకొనెను.

"మూడు సంవత్సరము లాగి యతడు భార్యను క్షమా ర్తెను రామే శ్వరయాత్రకంపెను. వారు కుంతలరాజ్యము దాటిపోయిన పిమ్మట నారా యణభట్టు కుంతల రాజ్యములో తనకున్న యా స్తియంతయు విక్రయింప ప్రయత్నించెను. ఆహవమల్లుని కది తెలిసి యాతని బిలిపించి దేశము విడచిపోవుటకు అనుమతి యీయుననని తెలియ జేసెను. రాజరహస్యము లేమియు నితరులకు తెలుప నని నారాయణభట్టు ప్రతిజ్ఞ చేసినను ఆ చక్ర వర్తి యొప్పుకొనలేదు.

"నారాయణభట్టు ఆ స్తి కొనువారు లేరు. అపై నాతనిపై నిరంత రము భటులు కాపుండ సాగిరి. అక్కడ జీవితము దుర్భరమయ్యెను. అప్పటికి జాగ్రత్తచేసిన స్వల్పధనమును విలువగలకొన్ని ముఖ్యవస్తు వులు మాత్రము వెంట తీసికొని మారువేషము వేసికొని సర్వస్వమును వదలి యొక యర్ధరాత్రమున రహస్యముగా నాతడు కల్యాణకటకము నుండి బయలుదేరెను. అతనివెంట పొన్న యొకదే వచ్చెను.

"నారాయణభట్టు పొన్నతో కుంతలరాజ్యము సరిహద్దు దాటుట కెన్నియేని ఆటంకములు కలిగెను. ఎట్లో చోళరాజ్యము ప్రవేశించి దక్షిణ యాత్రకు వెళ్ళుచున్నవారివలె నటించి వారు వేషములు మార్చుకొని వేంగీ మండలము ప్రవేశించి కోనసీమ చేరుకొనిరి. అప్పటికి వచ్చినను కుంతల చాళుక్యచారుల బాధ పోలేదు. ఆ పిమ్మట వారు రాజమహేంద్రవరము చేరిరి. వారి కక్కడ సాగుచున్న సంతలో రహస్యము లెన్నియో తెలి యును. పొన్న యవి రాజ వర్తి చేతయనాయకున కెరిగించి పారశీకవర్తకు లను పట్టించెను. నారాయణభట్టు సైంధవుని బట్టించెను."

ఈ కథాశ్రవణముతో చీకటి పడుచుండెను. వాకిట దుగ్గవ్వ పొలి కేకలు వేయునప్పటికి నారాయణభట్టు అచ్చటికి పోయి చూచెను. తన పాదములముందు మూర్ఛిల్లి పడియున్న సుజాతకు పొన్న శైత్యోపచార ములు చేయుచు కన్నీరు విడుచుచుండెను.

వాకిట పొన్న దుగ్గవ్వతో మాట్లాడుచుండ సుజాత అకస్మాత్తుగా

వచ్చి యాతని పాదములపై బడె నట! పొన్న ఆవేశముతో నామె నొక తన్ను తన్నెను. సుకుమారగాత్రయగు నామె మూర్ఛపోయినది. అయినను పొన్న బలముగా తన్నుచునేయుండెను. "చంపినావు, చంపినా" వను దుగ్గవ్వ కేకలు విని, పడిపోయిన సుజాతను చూచి తన్నుట చాలించి పొన్న పశ్చాత్తప్తుడై యేడ్చుచు నుపచరింప యత్నించుచుండెను.

ఆది విజయనామ సంవత్సర వైశాఖ బహుళదశమి శనివారము ఆనాడు రాజరాజనరేంద్రుడు సకలభువనలక్ష్మీవిలాసనివాసం బయిన రమ్య హర్మ్యంబున కొలువు తీరెను.

వజ్జియప్రెగ్గడ మంత్రీశ్వరుడును, పురోహితుడును, నృపకామ సేనాపతియు, ముప్పరాజు, జననాథుడు, రాజమయ్య ఇత్యాది దండనాథులును, విజయాదిత్యుడు శక్తివర్మ ఇత్యాదిమహాప్రధాన రాజబంధువులును, నాణ్యదేవుడు మొదలుగాగల సామంతమండలేశ్వరులును పరివేష్టించి యుండిరి. యవనవిలాసినులు చామరములు గ్రహించి వీచుచుండిరి. దౌవారికుడు రావలసిన సభ్యులను రానిచ్చుచుండెను.

యువరాజరాజేంద్రదేవుడు అంతకు పూర్వమే వాయురానగరమునకు ప్రయాణమైయుండుటచే నా సభకు రాలేదు. వేంగీమండల మంతటను శాంతి నెలకొనినందున వజ్జియప్రెగ్గడ కుమారునికి విశ్రాంతి చిక్కినది. అతడు సభ కరుదెంచి వజ్జియ సమీపమున కూరుచుండెను.

ఆ సభలో నపారశబ్దశాస్త్రపారగు లగు వైయాకరణులును, భారత రామాయణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులును, మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచనరచనావిశారదు లయిన నారాయణభట్ట, భీమన భట్ట, చెట్టనభట్ట, ముట్టనభట్ట, కృష్ణమిశ్ర, బిల్హణభట్ట, క్షేమేంద్ర, చిత్తపాది మహాకవులును, వివిధ తర్కవిగాహిత సమస్తశాస్త్ర సాగరగరీయః ప్రతిభులైన చీదమార్య పంపనార్యాది తార్కికులును, నాదినా గలుగు విద్వజ్జనంబులు రాజరాజనరేంద్రుని బరివేష్టించి విద్యావిలాసగోష్ఠికి కొలిచి యుండిరి. నన్నయభట్టారకుడు ప్రత్యేకముగా నున్న తాసనమున నుపవిష్టు

డయ్యెను. మాగధుని వంశానుకీర్తనానంతరము వంది నూతనశ్లోకములు
చదివెను.

సంరక్షతి క్షితితలం క్షపితారివర్గే మార్గేన యేన నయశాలిని మానవేన

ప్రీతాః ప్రజా నిజపవిత్రచరిత్రతోయైః ప్రక్షాలయంతి కలికాలకలంకపంకమ్.

సన్మార్గేణ కులం కలాగమరసజ్ఞానేన కుర్వన్ ధియం
దీనానాథజనార్తి తార్థనివహత్యాగేన లక్ష్మీం స్థిరామ్
సంపూర్ణామలచంద్రి కావిశదయాకీర్త్యా జగద్గీతయా
యో దిచ్చక్ర మలంకరోతి సుతరాం చాళుక్యచూడామణిః

*　*　*

పిత్రో ర్వంశగురూ బభూవతు రలం యస్య స్ఫుర త్తేజసా
సూర్యాచంద్రమసౌ నిర స్తతమసౌ దేవౌ జగచ్చక్షుషీ
దంష్ట్రాకోటిసముద్ధృతాఖిలమహీచక్రం మహత్క్రీడయా
విష్ణో రాదివరాహరూప మభవ ద్యచ్ఛాసనే లాంఛనమ్.

స సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజపరమేశ్వరః
జయతు జయతు! పరమభట్టారకః జయతు జయతు! పరమమహేశ్వరః
జయతు జయతు! పరమబ్రహ్మణ్యః జయతు జయతు! శ్రీరాజరాజదేవో
జయతు జయతేతరామ్!

అంతట మరియొక వంది ముందు నన్నయభట్టారకునికి నమస్కరించి యిట్లు ప్రారంభించెను:

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహం త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రీపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్శ్రేయసే!

అని సకలభువనరక్షణప్రభువులై యాద్యులైన హరిహరహిరణ్యగర్భ పద్మామావాణీపతుల స్తుతియింతు. తత్ప్రసాదసమాసాదితనిత్యప్రవర్ధమానమహామహీ రాజ్యవిభవుండును నిజభుజవిక్రమవిజితారాతి రాజ

వివహంబునను సకలజగజ్జేగీయమాన నానాగుణరత్న రత్నాకరుండును నై పరగుచున్న రాజరాజనరేంద్రుఁడు—

రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్.

విమలాదిత్యసుతనూజుఁడు విమలవిచారుఁడు కుమారవిద్యాధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధాగమవిదితశ్రముఁడు తుహినకరుఁ డుఁడు
కాంతిన్.

ఘనదురితానుబంధకలికాలజదోషతుషారసంహృతిం
దన యుదయప్రభావమున దవ్వఁగ జేసి జగజ్జనానురం
జనమగు రాజ్యసంతతవసంతనితాంతవిభూతి నెంతయుం
దనరఁ జళుక్యమన్మథుఁడు ధర్మదయార్ద్రనిబద్ధబుద్ధియై.

ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషిప
ద్యాశ్రయమత్త్వవిత్త్వమున దానగుణాధికతన్ సమస్తవ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజవిభుదత్యకలంకచరిత్రసంపదన్.

నిజమహీమండలప్రజ ప్రీతి బెంచుచు బరమండలంబుల ధరణీ
పతుల
నదిమి కప్పంబుల ముదముతో గొనుచును బలిమి సేయని భూమి
వలయపతుల
మక్కడగించుచు దిక్కుల దనయాజ్ఞ వెలిగించుచును విప్ర
కులము నెల్ల
బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల నగ్రజన్ములకు ననుగ్రహమున
జారుతరమహాగ్రహారంబు లిచ్చుచు దేవభోగముల మహావిభూతి
దనరఁజేయుచుఁ జిల్లుమనుమార్గుఁడగు విష్ణువర్ధనుండు వంశవర్ధనుండు.

అఖిలజలధివేలావలయవలయితవసుమతీవనితావిభూషణంబైన వేంగిదేశమునకు నాయకరత్నంబునుంబోని యీ రాజమహేంద్రపురంబు

నందు మహేంద్రమహిమతో పరమానందంబున ననవరతమహీరాజ్య
సుఖంబు అనుభవించు!"

వందికీర్తన మైన పిమ్మట రాజరాజు మాట్లాడవలె నన్నట్లు కన పడగానే సభ నిశ్శబ్దమయ్యెను. రాజరా జిట్లనెను :

"నన్నయభట్టారకా, జనమేజయునకు వేదవ్యాసునివలె నీవు మాకు కుల బ్రాహ్మణుడవు, పూజ్యుడవు, అనురక్తుడవు. నీవే సర్వవిధముల శ్రీ మహాభారత సంహిత తెనుగుచేయ నుత్తమాధికారి వని యిన్మహా కార్యమునకు ఈ పరిషన్ముఖమున వరించుచున్నాను. ఈ పరిషత్తు నీ యోగ్యత వివరించుగాక!"

ముందు రాజరాజపురోహితుడు, "నన్నయ యవిరళ జపమహోమతత్పరుడు!" అని వాక్రుచ్చెను.

"బ్రహ్మాండాదినానాపురాణవిజ్ఞాననిరతు"డని పౌరాణికులు నిర్ధారించిరి.

"ఇతదేహాత్ముడు!" అని పంపనభట్టాదిమీమాంసకులు నిర్ణయించిరి.

"సద్వినుతావదాతచరిత్రుడు" అని నీతివిదులు పల్కిరి.

"నన్నయ లోకజ్ఞుడుకూడ"నని వజ్జియప్రెగ్గడ సెలవిచ్చెను.

"ఉభయభాషాకావ్యరచనాభిశోభితు"డని నారాయణభట్టు పొగడెను.

"నిత్యసత్యవచను"డని ప్రాడ్వివాకుడు చీదమార్యుడు సెలవెచ్చెను.

"మత్యసురాధిపాచార్యు"డని నృపకాము డందుకొనెను.

"సుజనుడు నన్నయ" అని సభవారందరు వచించిరి.

రాజరాజు సంతోషించి ఇట్లు మరల పలికెను :

"విమలమతిం బురాణములు వింటి ననేకము అర్థధర్మ శా
స్త్రముల తెరం గెరింగితి నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితి బ్రకాశముగా హృదయంబు భక్తితోన్.

"అయినను ననవరతంబును శ్రీ మహాభారతమునందలి యభిప్రాయంబు విననభిలాష పెద్దయై యుండు.

"ఇవి యేమన్ సతతంబు నాయెడ గరం బిష్టంబులై యుండు బా
యవు భూదేవకులాభితర్పణమహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియు పార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.
"మరి యదియునుం గాక—
"హిమకరు దొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనగా మహి నొప్పిన యస్మదీయ వం
శమున బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్.
"అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమబహువేదవిప్రులకు దానము సేసిన తత్ఫలంబు త
థ్యమ సమకూరు భారతకథాశ్రవణాభిరతిన్, మదీయ చి
త్తము ననిశంబు భారతకథాశ్రవణప్రవణంబ కావునన్.
"జననుతకృష్ణద్వైపాయనమునివృషభాభిహితమహాభారత బ
ద్ధనిరూపితార్థమేర్పడ దెనుగున రచియింపుమధికధీయుక్తిమెయిన్.
"బహుభాషల బహువిధముల బహుజనములవలన వినుచుభారతబద్ధ
స్పృహులగువారికి నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థ
మగున్"

ఇట్లానతిచ్చిన విని యక్కవివరుం డిట్లనియె:
"అమలినతారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషపారము ముదంబున బొందను బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము
ద్రము దరియంగ నీదను విధాతృనకైనను నేర బోలునే!"

నన్నయ భట్టారకు డొక్కక్షణ మాగెను. వజ్జియముఖమున కలత సూచితమయ్యెను. రాజరాజు ముఖము ఆశ్చర్యముతో ప్రశ్నించుచున్నట్లుండెను. సభయంతయు ఉద్వేగము హృదయముల ప్రేరేచుచుండగా నిస్తబ్ధమయ్యెను.

ఇంతలో నన్నయ—

"అయినను, దేవా——" అనెను.

ఆ రెండుమాటలు ననునప్పటికి సభలో నొక్కసారిగా జయజయ నినాదములు వజ్రియయొద్దనుండి దౌవారికునివరకు ప్రసరించెను. రాజరాజు ముఖము ప్రసన్నమై వికసించెను.

"అయినను, దేవా, నీయనుమతంబున విద్వజ్జనంబుల యను గ్రహంబునంజేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద."

"హరిహరాజగజాననార్కషడాస్యమాతృసరస్వతీ
గిరిసుతాదికదేవతాతతికిన్ నమస్కృతి సేసి దు
ర్భరతపోవిభవాధికున్ గురుపద్యవిద్యకు నాద్యు నం
బురుహగర్భనిభుం బ్రచేతసుపుత్త్రు భక్తి దలంచుచున్.
"భారతభారతీశుభగభస్తిచయంబులజేసి ఘోరసం
సారవికారసంతమసజాలవిజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జబోధనరతుండగు దివ్యపరాశరాత్మజాం
భోరుహమిత్త్రు గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.
"పరమవివేకసౌరభవిభాసితసద్గుణపుంజవారిజో
త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో
హరసుచరిత్ర పావనపయఃపరిపూర్ణము లైన సత్సభాం
తరసరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్."
దీనితో సభయంతయు వికసించెను.
"పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్ల వానస ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుడున్ దన కిష్టుడున్ సహా
ధ్యాయుడు నైనవా డభిమతంబుగ దోడయి నిర్వహింపగన్."

ఈ పద్యమునకు రాజరాజు ఆదరముతో నారాయణభట్టువంక దిలకింప సభలో జయజయధ్వానములు చెలరేగెను. అంత నారాయణభట్టు ఇట్లనెను :

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా

భారతసంహితారచనబంధురు డయ్యె జగద్ధితంబునన్."

ఆ మిత్రుల యన్యోన్యప్రేమకు సభ్యులు సంతసించిరి.

అంతట రాజరాజనరేంద్రుడు సింహాసనమునుండి లేచెను. సభ్యులందరు లేచిరి. అంతట విలాసిను లందించు చందనతాంబూలాదిసత్కారముల రాజరాజు నన్నయభట్టారకుని బూజించెను.

ఇంతలో వజ్జియకుమారుడు అసంపూర్ణమగు నొక కోశము తెచ్చి నన్నయభట్టారకుని చేతి కిచ్చెను. అది నన్నయ కన్నుల కద్దుకొని విప్పుచుండెను.

"ఇ దేమి నన్నయా?" అని రాజరా జడిగెను.

"నేను కొంతవరకు వ్రాసిన శ్రీమదాంధ్రమహాభారతము!"

వజ్జియ చిరునవ్వుతో నందుకొనెను: "రహస్యపరిశోధనలలో నిమగ్నుడైన నన్నయ నారాయణుల సహాధ్యాయుడు ఈ విషయము నాకు కూడ చెప్పక రహస్యముగా నుంచినాడు!" అనుచు తనకుమారుని నిర్దేశించెను. అతడు ముసిముసి నవ్వులు నవ్వుచుండెను.

రాజరాజు: అప్పుడే యెప్పు డారంభించితివి నన్నయా?"

నన్నయ : "దేవా, మీ సెలవైననాడే నారాయణభట్టు లగ్నము పెట్టినాడు."

సభకు నారాయణభట్టు ప్రతిభ నుగ్గడింపవలెనో నన్నయ అనసూయా స్వభావమును మెచ్చుకొనవలెనో తెలియలేదు.

రాజరాజు ప్రశ్నించెను: "ఎంతవర కైనది?"

నన్నయ : మూడవ యాశ్వాసములో నాగిపోయినది.

రాజరాజు : మూడవదానిలోనా? కొన్ని భాగములు ఈసభలో వినిపింతువా, భట్టారకా?

నన్నయ : చిత్తము!

సభ యొక్కసారి వ్యగ్రమై నిశ్శబ్దమయ్యెను. నన్నయ విశద స్వరమున మంద్రస్థాయిలో ప్రారంభించెను:

తత్కథాప్రారంభం బెట్టిదనిన.... ........ ....

అక్కథకుండు వెండియు నమ్మౌని సంఘంబునకు నమస్కారంబు

చేసియనేక పురాణపుణ్యకథాకథనదక్షుండు వ్యాసశిష్యుండైన రోమ హర్షణునకు బుత్త్రుండ నావలన నెక్కథ వినవలతు రని నమ్మును లతని కిట్లనిరి:

ఏయది హృద్య మపూర్వం బేయది యెద్దాని వినిన నెరుకసమగ్రం
బై యుండు నఘనిబర్హణ మేయది యక్కథయ వినగనిష్టము మాకున్

* * *

శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును బాండవాది భారతవీరులమహాగుణం బులును దనయిముల విజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుంగు చుండ—

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులు మహాకావ్య మనియు
బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహి గొనియాడు
చుండ

వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు.
ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు నర్థార్థులకు విపులార్థములును
ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తియు వినయార్థులకు మహావిన
యమతియు
బుత్త్రార్థులకు బహుపుత్త్ర సమృద్ధియు సంపదర్థులకిష్టసంపదలును
గావించు నెప్పుడు భావించి వినుచుండువారల కిమ్మహాభారతంబు
భక్తియుక్తులైన భాగవతులకు శ్రీవల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబు లెల్ల బాపి యిష్టార్థ సంసిద్ధి గరుణతోడ జేయునట్లు.

* * *

అమితాఖ్యానకశాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గచతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమనానాగుణకీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యానజా
తమహాభారతపారిజాత మమరున్ ధాత్రీ సురప్రార్థ్యమై.

* *

సాత్యవతేయ విష్ణుపదసంభవ మై విబుధేశ్వరాబ్ధి సం
గత్యుపశోభితం బయి జగద్విదితంబగు భారతీయి భా
రత్యమరాపగౌఘము నిరంతర సంతతపుణ్యసంపదు
న్నత్యభివృద్ధి సేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్.

* * *

తగు నిది తగ దని యెదలో వగవక సాధులకు బేదవారల కెగ్గుల్
మొగి జేయు దుర్వినీతుల కగు ననిమిత్తాగమంబు లయిన భయం
బుల్.

* * *

ఉదంకుండును వానితోడన తగిలి యవ్వివరంబున నురగలోకంబున కరిగి నాగపతుల నెల్ల ని ట్లని స్తుతియించెను:

బహువనపాదపాబ్ధికుల పర్వతపూర్ణసరస్సరిత్
సహితమహామహీభర మజస్రసహస్రఫణాళి దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికి బాయక శయ్యయైన య
య్యహిపతిదుష్కృతాంతకు డనంతుడుమాకు బ్రసన్నుడయ్యెడున్.

* * *

పాతాళైకనికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతో గ్రదహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధినాథమనమున్ భేదిల్లె గల్పాంత సం
జాతప్రోద్గతబాడబానలశిఖాళం కాధికాతంకమై

నరచాపప్రవిముక్తదారుణబృహన్నారాచధారల్ భయం
కరదైతేయని కాయకాయములపై గప్పెన్ దిశల్ నిండ బం
దుర ధాత్రీధరతుంగశృంగతటసందోహంబుపై గప్పు దు
ర్ధరధారాధరముక్తసంతతపయోధారావళిం బోలుచున్.
పతదుర్వీధరధాతునిర్ఝరజలాభంబై మహాదేహ ని
ర్గతసాంద్రారుణపూర మొక్క మొగి నొల్కం బ్రెస్సి నారాయణో
న్నతదోర్దండవిముక్త చక్రనిహతిన్ నాకద్విషన్మస్తక
ప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూభాగంబు కంపింపగన్.

ఆ పద్యములు చదువగానే రాజరాజు సంతోషించి "నరనారాయణు లీ సభలోనే మాకు ప్రత్యక్ష మగుచున్నా"రనెను. అంతఃపురమున నోరణగండ్లనుండి యాలకించుచున్న అమ్మంగమహాదేవి పంపిన బహుమానములు విలాసినులు తెచ్చి నన్నయకు, నారాయణునకు నర్పించిరి. మరల నన్నయ ప్రారంభించెను :

వాలుపయి నడచున ట్లబ్బాలిక నడునడ నడుంగి భయమున నియమా
భీలుడగు పతికి బవళుల్ రేలును నేమరక పరిచరించుచు నుండెన్.

* * *

ఆయుష్యం బితిహాసవస్తుసముదాయం బైహికాముష్మిక
శ్రేయఃప్రాప్తినిమిత్త ముత్తమసభాసేవ్యంబు లోకాగమ
న్యాయై కాంతగృహంబు నా బరగి నానావేదవేదాంతవి
ద్యాయుక్తం బగుదాని జెప్పదొడగెం దద్భారతాఖ్యానమున్.

* * *

ఆ నారాయణపాండవేయగుణమాహాత్మ్యామలజ్యోత్స్న చి
త్తానందం బొనరించుచున్ జనుల కర్ణాంశుప్రకాశంబుతో
మానై సాత్యవతేయధీవనధిజన్మ శ్రీమహాభారతా
ఖ్యానాఖ్యామృతసూతి యొప్పు నిఖిలాఘ ధ్వాంతవిధ్వంసియై.

* * *

తెలుగుభాష యింత యొప్పునా యని చీదమార్యుడును, పంపనభట్టును, క్షేమేంద్రుడును, చిత్తపయు నాశ్చర్యపడుచు ముక్కులపై వ్రేళ్ళుంచుకొని నన్నయ రచనను పొగడిరి. నన్నయ రచనను విద్వాంసులు పొగడినప్పుడెల్ల నారాయణభట్టు పొంగిపోసాగెను.

నన్నయభట్టు కోశము కొంచెము వెనుకకు పోనిచ్చి ఇట్లు చదివి చాలించెను.

రాజమహేంద్రకవీంద్రసురక్ష్మాజ రాజమార్తాండ ధరి
త్రీజననుతచారిత్ర విరాజితగుణరత్న రాజరాజనరేంద్రా!
వీరావతార సుకవిస్తుత నిత్యధర్మ

ప్రారంభ శిష్టపరిపాలనసక్త రాజా
నారాయణాఖ్యకరుణారసపూర్ణవీర
శ్రీరమ్య రాజకులశేఖర విష్ణుమూర్తీ!
జయ జయ నినాదములతో సభ ముగిసెను.

# 53

గోదావరీతీరమున నందమపూడి నివాసము నారాయణభట్టు సోమ యాగముతో ప్రారంభించెను. ఒక్క సంవత్సరంలోపున సోమిదేవి కోరిక ప్రకారము యజ్ఞేశ్వరుడు వారి కంచెన సోమయాజి రూపమున పుత్రుడై యావిర్భవించెను. కుపమ భీమేశ్వరునికి మ్రొక్కిన చోహాపుడివియ మ్రొక్కు తీర్చుకొని శాసనము వ్రాయించెను. ఆ పిమ్మట శీఘ్రకాలముననే. ఆమెను నన్నయకుమారుని కిచ్చి వివాహము చేసిరి.

శ్రీమదాంధ్ర మహాభారతములో నన్నయ యరణ్యపర్వములో శరదృతువు వర్ణన వ్రాయుచుండగా నారాయణభట్టు లోకాంతరగతు డయ్యెను. నన్నయకు సంసారముపై విరక్తి కలిగి సన్యసించి బ్రహ్మీభూతు డయ్యెను. భారతరచన మాగిపోయినది.

ఆంధ్రమహాభారతము పూర్తికాలే దను బాధ నారాయణభట్టుకు పోలేదు. మరల తిక్కన రూపమున జన్మించి సోమయాజియై విరాటపర్వాదిగా భారత రచన పూర్తిచేసెను. ఆ జన్మలో నతని కరణ్యపర్వశేషము పూరింప వీచ్చ కలుగలేదు. మోక్షకాంక్షియైనను అతని కా జన్మలో నది సిద్ధింపలేదు.

మరల నతడు ఎఱ్ఱయమహాకవిగా జన్మించి అరణ్యపర్వ శేషమును నన్నయ పేర పూర్తిచేసి భారతశేషమగు హరివంశమును గూడ సమాప్తముచేసి కృతార్థుడై శంకరసంయమీంద్రుని శిష్యుడై సన్యసించి బ్రహ్మత్వ మనుగమించెను.

కలియుగములో తెలుగుగడ్డపై నరనారాయణు లవతరించిన కథ శ్రద్ధతో పఠించినవారికి విన్నవారికి, ఆయురారోగ్యైశ్వర్యములు ఆ పురాణములే ప్రసాదింతురు!